జటి - సన్న్యాసి
జడిమ - మాంద్యము
జతువు - లక్క
జనత - జనసముదాయము
జనని - తల్లి
జనయిత - తండ్రి
జనయిత్రి - తల్లి
జనువు - పుట్టుక
జనుషాంధుఁడు - పుట్టు గ్రుడ్డి
జన్యము - యుద్ధము
జయవారము - మంగళవారము
జయ్యము - జయింప వీలైనది
జర - ముసలితనము
జలజము - తామర
జలదము - మబ్బు
జలదరము - మేఘము
జలధి - సముద్రము
జలనిధి - సముద్రము
జలనీలి - పాచి
జలాశయము - కొలను
జలూక - జలగ
జల్పాకుఁడు - నిరుపయోగముగామాట్లాడు వాఁడు
జవము - వేగము
జవనిక - తెర

## జా

జాంగలికుఁడు - విషవైద్యుఁడు
జాంబూనదము - బంగారు
జాతకర్మము - బిడ్డపుట్టినప్పుడు చేయుక్రియ
జాతకుఁడు - పుట్టినవాఁడు
జాతరూపము - బంగారము
జాతవేదుఁడు - అగ్ని
జాత్యము - మేలైనది
జానపదము - గ్రామము
జానువు - మోకాలు
జామాత - అల్లుఁడు
జాయ - భార్య
జారిణి - లంజె
జారుఁడు - విటుఁడు
జాహ్నవి - గంగానది

## జి

జిగమిష - పోవనిచ్ఛ
జిగి - చల్లని కాంతి
జిగీష - జయింప నిచ్ఛ
జిఘాంస - చంపవలయునని ఆశ
జిఘృక్ష - గ్రహింప నిచ్ఛ
జిజ్ఞాస - తెలిసికొన నిచ్ఛ
జిడ్డకడలి - పాలసముద్రము
జితకాశి - యుద్ధమునందు జయింప నిచ్ఛఁ గలవాఁడు

జితము - జయింపఁబడినది

జిత్తు - మోసము

జియ్య - దేవుఁడు

జిల - దురద

జిలుఁగు - సన్నని

జిహాసువు - విడువ నిచ్ఛగలవాఁడు

జిహీర్ష - హరింపనిచ్ఛ

జిహ్మగము - పాము

జిహ్వ - నాలుక

## జీ

జీరు - నేలకురాయు

జీవగఱ్ఱ - జీవనౌషధము

జీవచ్ఛవము - బ్రతికియుండియు పీనుఁగు వంటివాఁడు

జీవనీయము - నీరు

జీవాతువు - జీవగఱ్ఱ

జీవి - జీవముకలది

జీవిక - బ్రతుకు తెరువు

## జు

జుష్టము - ఎంగిలి

జుహూరాణము - గుఱ్ఱము

జూర్తి - జ్వరము

జెల - నీటి ఊట

## జే

జేగురు - ఎఱుపు

జేత - జయించువాఁడు

జేపెట్టు - దీవించు

జేయము - జయింపఁదగినది

జైత్రుఁడు - జయించువాఁడు

జొన్నాళము - జొన్న

జ్ఞాత - తెలిసినవాఁడు

జ్ఞాపితము - తెలియఁజేయఁబడినది

జ్ఞేయము - తెలియఁదగినది

జ్యోతిరింగణము - మిణుగురు పురుగు

జ్యోత్స్న - వెన్నెల

జ్యౌతిషికుఁడు - జోస్యుఁడు

జ్వలనము - అగ్ని

జ్వాల - మంట

## ౙ

ౙంకించు - బెదరించు

ౙక్కులతేఁడు - కుబేరుఁడు

ౙగముకన్ను - సూర్యుఁడు

ౙగ్గు - తళతళ

ౙడదారి - ఋషి

ౙడలమెకము - సింహము

ౙడుపు - భయము

ౙతనము - ప్రయత్నము

ౙన్నము - యజ్ఞము

ౙన్నిగట్టు - బ్రాహ్మణుఁడు

జన్నిదము - జండెము

జమలి - జంట

జముఁడు - యముఁడు

జముదాడి - పొడవైనకత్తి

జమున - యమునానది

జలకము - స్నానము

జలతారు - సరిగ

జలదరించు - కంపించు

జలదారి - మురికినీరుపోవు తూము

జల్లిమెకము - చమరి మృగము

జవదాటు - అతిక్రమించు

జవనిక - తెర

జవరాలు - యౌవనవతి

జవ్వనము - యౌవనము

జవ్వాఁడు - చలించు

జళిపించు - ఆడించు

## జా

జాగిలము - వేఁటకుక్క

జాఁగు - ఆలస్యము

జాజా - ఎఱుపు

జాను - అందము

జాబిల్లి - చంద్రుఁడు

జాలము - ఆలస్యము

జాలరి - చేపలఁబట్టువాఁడు

జావడి - చాకలవాఁడు

జావాహిరి - రత్నపు సొమ్ము

జాళువా - అపరంజి

జారు - గుబురు

జుట్టుపిట్ట - నెమలి

జూఁక - తత్తరపాటు

జూటు - మోసము

జొబ్బిల్లు - కాఱు

## జో

జోగము - యోగము

జోదు - భటుఁడు

జోస్యము - జోతిశ్శాస్త్రము

జోస్యుఁడు - దైవజ్ఞుఁడు

జోహారు - నమస్కారము

## ఝ

ఝకటము - జగడము

ఝురము - సెల ఏఱు
ఝల్లరి - పెద్ద డోలు
ఝురుక - ఈల పురుగు
ఝుషము - చేఁప

## ట

టంకము - పదియాఱు డబ్బుల బంగారు నాణెము
టంకశాల - నాణెములు ముద్రించు శాల
టక్కు - మోసము
టాటోటు - మోసము

## టి

టిట్టిభము - తీతువు పిట్ట
టిప్పణము - టీక
టీక - అర్థము
టూకి - సంగ్రహము

## టె

టెంకాయ - కొబ్బరికాయ
టెంకి - స్థానము
టెక్కియము - ధ్వజము
టెక్కు - పడుచుదనమువలనచేయు మదపు చేష్ట

## ఠ

ఠవఠవ - శ్రమము
ఠవర - నేర్పరి

ఠావు - చోటు
ఠింగణా - పిల్లవాఁడు
ఠీవి - అందము
ఠేవ - మాదిరి

## డ

డంబరము - విజృంభణము
డక్కా - ఢక్కా
డగ్గుత్తిక - గద్గదస్వరము
డబ్బాటు - హటాత్తుగా
డహాలువు - నిమ్మచెట్టు

## డా

డాంబికుఁడు - మాయలమారివాఁడు
డాఁగు - దాఁగు
డాపల - ఎడమ భాగము

డింకీలు - మల్లవిద్యా పద్ధతులు
డిండిమము - ఒక వాద్యము
డిండీరము - నురుగు
డింభము - పిల్ల
డిగ్గియ - నడబావి
డిమము - దశవిధ నాటకములలో నొకటి
డుండుభము - రెండు తలల పాము
డెందము - హృదయము
డొక్క - ఎముకల గూడు

డోల - ఉయ్యాల

డోలనము - ఊపుట

## ఢ

ఢక్కా - డక్క

ఢుండి - గణపతి

ఢులి - ఆఁడు తాఁబేలు

## త

తంతియలు - మెట్లు

తంతునాభము - సాలెపురుగు

తంతువాయుఁడు - సాలెవాఁడు

తంతువు - నూలుదారము

తందర - కునికిపాటు

తంపర - తామరగుంపు

తంబళ - శివునిపూజఁజేసి జీవించు కులము

తంబుర - తంత్రీవాద్య విశేషము

తక్రము - మజ్జిగ

తగడు - ఱేకు

తగరు - పొట్టేలు

తగవరి - న్యాయాధికారి

తగులుపడు - చిక్కు

తటాకము - చెఱువు

తటిత్తు - మెఱపు

తటిని - నది

తట్టుముట్టాడు - చుట్టుకొను

తడవ - మాఱు

తతి - సమూహము

తత్తడి - గుఱ్ఱము

తత్పరుఁడు - ఆసక్తిగలవాఁడు

తధ్యము - సత్యము

తదీయము - దాని సంబంధమైనది

తనివి - తృప్తి

తనుత్రాణము - కవచము

తనూజుఁడు - కుమారుఁడు

తన్వి - స్త్రీ

తపనీయము - బంగారు

తపనుఁడు - సూర్యుఁడు

తపస్వి - ముని

తప్తము - కాచఁబడినది

తమగము - మంచె

తమము - మోహము

తమస్విని - రాత్రి

తమిస్ర - చీకటిరేయి

తమ్మి - పద్మము

తమ్మిచూలి - బ్రహ్మ

తమ్ములము - తాంబూలము

తరంగిణి - నది

తరఁగ - తరంగము

తరఘువు - సివంగి

తరపణ్యము - ఓడరేవు

తరలు - ప్రయాణమగు

తరాజు - తక్కెడ

తర్ణకము - అప్పుడుపుట్టినదూడ
తర్పణము - తృప్తి
తఱుగు - తగ్గు
తలఁగు - తొలఁగు
తలచూపు - పొడచూపు
తలపొలము - పొలిమేర
తలపోయు - తలచు
తలవరి - తలారి
తలిరు - చిగురు
తలిరుఁబోడి - ఆఁడుది
తలిరుదిండి - కోకిలము
తలోదరి - ఆఁడుది
తల్లడము - చలనము
తస్కరించు - దొంగిలించు
తళుకొత్తు - మిక్కిలి ప్రకాశించు

## తా

తాండవము - నాట్యము
తాంతము - శ్రమఁజెందినది
తాటంకము - చెవికమ్మ
తాటోటు - మోసము
తాడించు - కొట్టు
తానకము - స్థానము
తాపసుఁడు - ముని
తాపింఛము - చీఁకటిమ్రాను
తామసము - ఆలస్యము
తామసి - రాత్రి
తామ్రచూడము - కోడి
తాయి - తల్లి
తారాపథము - ఆకాశము
తారుణ్యము - యౌవనము
తార్కాణ - దృష్టాంతము
తాలాంకుడు - బలరాముఁడు
తాలి - మంగళసూత్రము
తాలువు - దవుడ
తావి - పరిమళము
తావు - చోటు
తాళవృంతము - విసనకఱ్ఱ

## తి

తింత్రిణి - చింతచెట్టు
తికమక - కలఁత
తిగ - మూఁడు
తిగవంచ - నాలుగు
తిగియు - ఆకర్షించు
తిగ్మము - వేఁడిమి
తిప్పదిమ్మరి - కోఁతి
తిమ్ము - దీవించు
తియ్యము - ప్రియము
తియ్యవిలుకాఁడు - మన్మధుఁడు
తిరము - స్థిరము
తిరస్కరిణి - తెరచీర
తిరిపము - భిక్షము
తిరు - శ్రీప్రదము

తిరోధానము - మఱుఁగుపాటు

తిర్యక్కు - అడ్డముగాఁబోవునది

తిలలు - నువ్వులు

తివుట - కోరిక

## తీ

తీండ్రము - వేఁడిమి

తీఁగసాఁగు - వర్ధిల్లు

తీఁడిరించు - ప్రకాశించు

తీరము - గట్టు

తీఱమి - అక్కఱ

తీఱు - నశించు

## తు

తుంగము - ఎత్తైనది

తుంటరి - దుష్టుఁడు

తుందము - కడుపు

తుచ్ఛము - శోకము

తుటారించు - తిరస్కరించు

తుమురు - పొడి

తుములము - దొమ్మి యుద్ధము

తురంగము } - గుఱ్ఱము
తురగము }

తురీయము - నాల్గవది

తుఱఁగలి - ప్రకాశము

తుఱుము - (కొప్పు) ముడుచు

తులకించు - ప్రకాశించు

తుల్యము - సమానము

తుష్టి - సంతోషము

తుహినము - మంచు

తురాయి - తలపై దాల్చు నొక సొమ్ము

## తూ

తూణము - అమ్ముల పొది

తూణీరము - అమ్ముల పొది

తూపు - బాణము

తూర్యము - వాద్యము

తూఱు - చొచ్చు

## తృ

తృణము - గడ్డి

తృణీకరించు - అలక్ష్యము చేయు

## తె

తెంకాయ - టెంకాయ

తెగించు - సాహసించు

తెగుదెంపు - తీర్పు

తెఁగులు - రోగము

తెన్ను - త్రోవ

తెమ్మెర - గాలి

తెరువరి - బాటసారి

తెలగంటితేఁడు - ఇంద్రుఁడు

తెలనోటి మెకము - సింహము

తెలవ - స్త్రీ

తెలికలు - నువ్వులు
తెలిమెకము - సింహము
తెలిమొదవు - కామధేనువు
తెలుచు - మ్రొక్కు

## తే

తేఁటి - తుమ్మెద
తేగము - త్యాగము
తేజి - గుఱ్ఱము
తేజితము - వాఁడిచేయఁబడినది
తేరకాఁడు - అన్యుఁడు
తేలిక - లఘుత్వము

## తై

తైర్థికుఁడు - తీర్థయాత్ర చేయువాఁడు
తైలము - నూనె
తైలపాయిక - గబ్బిలము

## తొ

తొగవిందు - చంద్రుఁడు
తొగసూడు - సూర్యుఁడు
తొట్టగిల్లు - అతిశయించు
తొట్టికట్టు - లోఁగిలి
తొట్రుపాటు - తడఁబాటు
తొడఁగు - ప్రారంభించు
తొడవు - సొమ్ము
తొడి - తొందర
తొడిఁబడు - చలించు
తొత్తు - లంజె
తొన - రక్షకము
తొరఁగు - కాఱు
తొఱ్ఱు - ఆవు
తొలఁగు - ఒదుగు
తొలకరి - చైత్ర వైశాఖ మాసములందు కురియు వాన
తొలుచదువులు - వేదములు
తొలువేలుపు - రాక్షసుఁడు
తొల్లి - ముందు
తొవ - కలువ పువ్వు

## తో

తోకము - బిడ్డ
తోకాను - తోడుకాను
తోడెము - కొంచెము
తోత్రము - పసులనుతోలు మునికోల
తోమరము - చిల్లకోల
తోయజము - తామర
తోయజాక్షి - ఆఁడుది
తోయదము - మేఘము
తోయధి - సముద్రము
తోరము - అధికము
తోలుదాలుపు - శివుఁడు
తోసిరాజు - లక్ష్యముచేయకుండుట

## తౌ

తౌర్యత్రికము - నృత్యగీత వాద్యములు

తౌల్యము - తుల్యము

## త్యా

త్యక్తము - విడువఁబడినది
త్యజించు - విడుచు

## త్యా

త్యాజ్యము - విడువఁదగినది

## త్ర

త్రంపి - దాలి
త్రపిష్ఠుఁడు - సిగ్గుగలవాఁడు
త్రయము - మూడింటి సమూహము
త్రయీతనువు - సూర్యుఁడు
త్రసరేణువు - ముప్పదిపరమాణువుల పరిమాణము
త్రస్తము - భయపడినది
త్రస్తరి - పరిహాసము
త్రస్తరించు - పరిహాసమాడు
త్రస్నువు - భయపడువాఁడు

## త్రా

త్రాణ - బలము
త్రాత - రక్షించువాఁడు
త్రాసము - భయము

## త్రి

త్రింశత్తు - ముప్పది
త్రికము - మూఁడు
త్రికటుకము-శొంఠి, పిప్పలి, మిరియాలు
త్రిక్కు - తక్కు
త్రితయము - మూఁడు
త్రిదశాలయము - స్వర్గము
త్రిదశుఁడు - దేవత
త్రిదివము - స్వర్గము
త్రిదోషము - వాతపిత్తశ్లేష్మములు
త్రిపథగ - గంగానది
త్రియామ - రాత్రి
త్రిలింగము - శ్రీశైల, కాలేశ్వర, దాక్షారామము అను మూడులింగముల మధ్యదేశము (తెలుఁగుదేశము)
త్రివిక్రముఁడు - విష్ణువు
త్రివిష్టపము - స్వర్గము
త్రివేణి - గంగానది
త్రిశూలము - శివుని ఆయుధము
త్రిస్రోత - గంగానది
త్రిహాయణి - మూడేండ్ల యీడుగల పెయ్య

## త్రు

త్రుటితము - తెగినది

## త్రె

త్రెళ్లు - పడు

## త్రై

త్రైలోక్యము - మూడులోకములు
త్రైవిద్యుఁడు - వేదము చదినవాఁడు

## త్రా

త్రాక్కటము - సంకటము

## త్రో

త్రోపాడు - త్రోయు

## త్ర్య

త్ర్యంబకుఁడు - శివుఁడు

## త్వా

త్వాదృశము - నిన్నుఁబోలినది

## త్వి

త్విషాంపతి - సూర్యుఁడు

## ద

దండధరుఁడు - యముఁడు
దండనము - శిక్ష
దండనాయకుఁడు - సేనానాయకుఁడు
దండయాత్ర - యుద్ధయాత్ర
దండితుఁడు - దండింపఁబడినవాఁడు
దండిమము - దండెము
దండుబాట - రాజమార్గము
దంతావళము - ఏనుఁగు
దంతి - ఏనుఁగు
దందడి - తఱచు
దందశూకము - సర్పము
దంపతులు - భార్యాభర్తలు
దంభోళి - వజ్రాయుధము
దంశి - పెద్దదోమ
దంష్ట్రి - కోఱపన్ను
దక్షాయ్యము - గ్రద్ద
దగ్గఱు - సమీపించు
దగ్ధము - కాల్పఁబడినది
దచ్చి - ఎనిమిది
దడియు - వణకు
దణి - ప్రభువు
దత్తము - ఇవ్వఁబడినది
దధి - పెరుగు
దనుజుఁడు - రాక్షసుఁడు
దప్పళము - పులుసు
దయిత - ప్రియురాలు
దరహాసము - చిఱునవ్వు
దర్పకుఁడు - మన్మధుఁడు
దర్పణము - అద్దము
దర్వీకరము - సర్పము
దర్శకుఁడు - చూపువాఁడు
దవ్వు - దూరము
దశనవాసస్సు - పెదవి
దస్తూరి - వ్రాఁత
దహనుఁడు - అగ్ని
దళవాయి - సేనానాయకుఁడు

## దా

దాంతి - తపమువలన కష్టమునోర్చుట
దాంపత్యము - దంపతులభావము
దాంభికుఁడు - దంభముకలవాఁడు
దాకొను - సమీపించు
దాక్షిణ్యము - మొగమోటము
దాత - ఇచ్చువాఁడు
దాత్రము - కొడవలి
దానవుఁడు - రాక్షసుఁడు
దాపరించు - కలుగు
దాపల - ఎడమభాగము
దాపు - సమీపము
దామోదరుఁడు - విష్ణువు
దాయ - విరోధి
దాయకుఁడు - ఇచ్చువాఁడు
దార - భార్య
దారణము - చీల్చుట
దారుణము - భయంకరము
దార్ఢ్యము - దిటవు
దాశార్హుఁడు - విష్ణువు
దాశుఁడు - పల్లెవాఁడు
దాహకుఁడు - కాల్చువాఁడు

## ది

దిగఁద్రావు - విడుచు
దిగనాఁడు - విడుచు
దిగుదల - క్రిందు
దిగులు - భీతి
దిగువ - క్రిందు
దిటము - దార్ఢ్యము
దిడ్డి - చిన్నవాకిలి
దిదృక్ష - చూడనిచ్ఛ
దివిటీ - చేతికాగడా
దివసము - దినము
దివస్పతి - ఇంద్రుఁడు
దివాంధము - గుడ్లగూబ
దివాకరుఁడు - సూర్యుఁడు
దివిజుఁడు - దేవత
దివిషదుఁడు - దేవత
దిష్టము - అదృష్టము
దిసంతు - నింద

## దీ

దీధితి - కిరణము
దీనారము - బంగారు నాణెము
దీపిక - దీపము
దీప్తి - కాంతి
దీమసము - ధైర్యము
దీర్ఘనిద్ర - మరణము
దీర్ఘము - పొడవైనది
దీర్ఘిక - దిగుడు బావి
దీవి - ద్వీపము
దీవియ - దీపము

## దుం

దుంత - దున్నపోతు
దుక్కి - దున్నుట

దుక్కి-వాలు - నాఁగలి

దుగ - రెండు

దుగులము - వరహాలో పదియాఱవ పాలు

దుత్త - చిన్నమూతిగల కుండ

దుద్దు - తామర పువ్వులోని దిమ్మె

దుప్పటము - సన్నని వెడల్పు వస్త్రము

దుప్పి - జింక

దుమారము - ధూళి

దురత్యయము - నాశము లేనిది

దురధిగమము - కష్టముచే పొందఁబడినది

దురాసదము - పొందశక్యముకానిది

దురితము - పాపము

దురోదరము - జూదము

దుర్గమము - పోరానిది

దుర్ఘటము - చేయరానిది

దుర్దాంతము - అణగింపరానిది

దుర్దినము- మేఘములచేఁగప్పఁబడినదినము

దుర్ధరము - ధరింపఁగూడనిది

దుర్ధర్షుఁడు - తిరస్కరింపఁదగినవాఁడు

దుర్నయము - అన్యాయము

దుర్నివారము - వారింపరానిది

దుర్భరము - భరింపరానిది

దుర్భిక్షము - కఱవు

దుర్వర్ణము - వెండి

దుర్వహము - మోయరానిది

దుర్విదగ్ధుఁడు - గర్వితుఁడు

దుర్వినీతుఁడు - వినయము లేనివాఁడు

దుష్కరము - చేయశక్యముకానిది

దుష్కృతము - పాపము

దుష్టము - చెడ్డది

దుస్త్యజము - విడువరానిది

దుహిత - కూఁతురు

## దూ

దూర్వ - గఱిక

దూఱు - నిందించు

దూష్యము - దూషింపఁదగినది

## దృ

దృక్కు - చూపు

దృతము - ఆదరింపఁబడినది

దృతి - తిత్తి

దృప్తుఁడు - గర్వముకలవాఁడు

దృశ్యము - చూడఁదగినది

దృషత్తు - ఱాయి

దృష్టము - చూడఁబడినది

## దె

దెస - దిక్కు

## దే

దేబె - దీనుఁడు

దేయము - ఈయఁదగినది

దేవఖాతకము - అఖాతము

దేవతరువు - కల్పవృక్షము
దేవమాతృకము - వర్షాధారము వలన పండుప్రదేశము
దేవరుఁడు - మఱఁది
దేవానాంప్రియుఁడు - మూర్ఖుఁడు
దేవురించు - దైన్యముగా నడుగు
దేవళము - దేవాలయము
దేశ్యము - దేశమునకుఁదగినది
దేహళి - గడప
దేహి - శరీరము గలవాఁడు

## దై

దైతేయుఁడు - రాక్షసుఁడు
దైత్యారి - విష్ణువు
దైవజ్ఞుఁడు - జ్యోతిష్కుఁడు
దైవతము - దేవత
దైవాఱు - అతిశయించు
దైవికము - దేవునివలనఁ గలిగినది

## దొ

దొందడి - సందడి
దొందు - జత
దొడ్డ - గొప్ప
దొడ్డపోవుట - కొల్లపోవుట
దొరఁకొను - యత్నించు
దొరకొను - లభించు
దొరవి - తటాకము
దొరయు - పొందు

## దో

దోగ్ధ్రి - ఈనిన ఆవు
దోయి - జత
దోయిడి - శూన్యము
దోయిలి - దోసిలి
దోరము - ద్వారము
దోవతి - మగవారుకట్టువస్త్రము
దోషజ్ఞుఁడు - పండితుఁడు
దోషాకరుఁడు - చంద్రుఁడు
దోహలము - ఉత్సాహము

## దౌ

దౌత్యము - దూతకృత్యము
దౌరు - కాంతి
దౌవారికుఁడు - ద్వారపాలకుఁడు
దౌష్ట్యము - దుష్టస్వభావము
దౌహిత్రుఁడు - కూఁతురికొడుకు
దౌహృదము - చిట్టుములు

## ద్యు

ద్యుతి - వెలుగు
ద్యుమణి - సూర్యుఁడు

## ద్యూ

ద్యూతము - జూదము

## ద్యో

ద్యోతము - ప్రకాశము

## ద్ర

ద్రవించు - కాఱు

## ద్రా

ద్రాఘిష్ఠము - మిక్కిలి దీర్ఘము

ద్రావిడము - ద్రవిడదేశభాష

## ద్రు

ద్రుమము - వృక్షము

ద్రుహిణుఁడు - బ్రహ్మ

## ద్రో

ద్రోవది - ద్రౌపది

## ద్వ

ద్వయము - జత

## ద్వా

ద్వాదశము - పండ్రెండు

ద్వాదశాత్ముఁడు - సూర్యుఁడు

## ద్వి

ద్విజిహ్వుము - పాము

ద్వితయము - రెండు

ద్విపము - ఏనుఁగు

ద్విరసనము - సర్పము

ద్విరదము - ఏనుఁగు

ద్విరేఫము - తుమ్మెద

ద్విషుఁడు - విరోధి

## ద్వీ

ద్వీపవతి - నది

## ద్వే

ద్వేషము - పగ

## ధ

ధట - త్రాసు

ధనదుఁడు - కుబేరుఁడు

ధనుష్మంతుఁడు - విలుకాఁడు

ధన్యుఁడు - పుణ్యుఁడు

ధమ్మిల్లము - కొప్పు

ధరణి - భూమి

ధరణిధరము - పర్వతము

ధరామరుఁడు - బ్రాహ్మణుఁడు

ధర్మాధికరణము - న్యాయస్థానము

ధర్షణము - తిరస్కారము

ధర్షణి - జారిణి

ధవళిమ - తెలుపు

## ధా

ధాటి - దండయాత్ర

ధానుష్కుఁడు - ధనుస్సుగలవాఁడు

ధామనిధి - సూర్యుఁడు

ధారణము - ధరించుట

ధారణి - ధరిత్రి

ధార్ష్ట్యము - దిట్టతనము

ధావళ్యము - తెలుపు

## ధి

ధిక్కారము - తిరస్కారము

ధిషణ - బుద్ధి

## ధీ

ధీ - బుద్ధి

ధీవరుఁడు - జాలరి

## ధు

ధుని - నది

ధుర - భారము

ధురంధరుఁడు - కార్యనిర్వాహకుఁడు

## ధూ

ధూననము - కదలించుట

ధూపము - సువాసనగల పొగ

ధూమము - పొగ

ధూమయోని - మేఘము

ధూర్జటి - శివుఁడు

ధూర్తుఁడు - మోసకాఁడు

ధూర్వహుఁడు - ధురంధరుఁడు

ధూసరము - దుమ్ము

ధూళి - దుమ్ము

## ధృ

ధృతము - ధరింపఁబడినది

ధృష్టుఁడు - దిట్ట

ధేనువు - ఆవు

ధోరణము - వాహనము

ధౌతము - కడుగఁబడినది

ధ్యాతము - ధ్యానింపఁబడినది

ధ్యేయము - ధ్యానము చేయఁదగినది

## ధ్వ

ధ్వంసము - నాశము

ధ్వజిని - సేన

## ధ్వా

ధ్వాంతము - చీఁకటి

ధ్వానము - ధ్వని

## న

నంజుడు - మాంసము

నందకము - విష్ణుమూర్తి ఖడ్గము

నందనుఁడు - కుమారుఁడు

నంది - ఈశ్వరుని వాహనము

నకులము - ముంగిస

నక్తము - రాత్రి

నక్రము - మొసలి

నఖము - గోరు

నఖరాయుధము - కోడి

నగరము - పట్టణము
నగరు - రాజగృహము
నగవైరి - ఇంద్రుఁడు
నగ్నుఁడు - దిగంబరుఁడు
నచ్చిక - నమ్మిక
నట్టువుఁడు - నటుఁడు
నడబావి - దిగుడుబావి
నతి - నమస్కృతి
నదీమాతృకము - నదులవలన పైరగు
ప్రదేశము
నన - పుష్పము
ననఁబోఁడి - స్త్రీ
నప్త - మనుమఁడు
నప్త్రి - మనుమరాలు
నమస్య - పూజ
నమస్సు - నమస్కృతి
నమించు - నమస్కరించు
నమ్మి - నెమిలి
నమ్రము - వంగినది
నయగారము - మృదుత్వము
నయనము - కన్ను
నయించు - పొందించు
నరవాహనుఁడు - కుబేరుఁడు
నర్తించు - ఆడు
నర్మము - పరిహాసము
నర్మిలి - అపేక్ష
నలువ - బ్రహ్మ
నల్లిండ్లు - అగ్రహారము
నవతి - తొంబది
నవనము - స్తోత్రము
నవనీతము - అప్పుడు తీసిన వెన్న
నవల - ఆఁడుది
నవీనము - క్రొత్తది

## నా

నాఁచికోలు - అపహరించుట
నాగపాశము - వరుణుని ఆయుధము
నాగరంగము - నారింజచెట్టు
నాగరకము - సొంటి
నాగరికము - నాణెమైనది
నాగాంతకుఁడు - గరుత్మంతుఁడు
నాడింధముఁడు - అగసాలెవాఁడు
నాఁడు - దేశము
నాతము - బత్తెము
నాతుక - ఆఁడుది
నాథుఁడు - భర్త
నాదము - ధ్వని
నాన - సిగ్గు
నాపితుఁడు - మంగలివాఁడు
నామధేయము - పేరు
నాయకుఁడు - అధిపతి
నారము - నరుల సమూహము

నారసము - నారాచము
నారాచము - ఇనుప బాణము
నారికేళము - కొబ్బెర చెట్టు
నాలి - నీచపు పని
నావికుఁడు - ఓడ నడపువాఁడు
నావ్యము - నావచేఁ దాటఁదగినది
నాస - ముక్కు
నాసీరము - సేనాముఖము
నాస్తికుఁడు - పరలోకము లేదనువాఁడు

## ని

నింగి - ఆకాశము
నిండారు - నిండు
నింద్యుఁడు - నిందింపఁదగినవాఁడు
నింబము - వేఁపచెట్టు
నికటము - సమీపము
నికామము - ఇష్టమువచ్చినట్లు
నికాయ్యము - ఇల్లు
నికుంజము - పొదరిల్లు
నికురుంబము - సమూహము
నికృంతనము - త్రుంచుట
నికృష్టము - నీచమైనది
నికేతనము - గృహము
నిక్కము - నిజము
నిక్కువము - నిజము
నిక్షేపము - నిధి
నిగరణము - మ్రింగుట
నిగూఢము - మఱుగుపఱచఁబడినది
నిఘంటువు - పదముల అర్థము దెలుపు పుస్తకము
నిచయము - గుంపు
నిఘ్నము - అధీనము
నిటలము - నుదురు
నిట్టలము - అధికము
నిడుద - పొడుగు
నితంబిని - స్త్రీ
నితాంతము - అత్యంతము
నిదర్శనము - దృష్టాంతము
నిదిధ్యాసము - మిగుల తలంచుట
నిదేశము - ఆజ్ఞ
నిద్రాణుఁడు - నిద్రపోవువాఁడు
నిధనము - మరణము
నిధి - పాఁతఱ
నినదము - ధ్వని
నినుచు - నిండించు
నిపుణుఁడు - నేర్పరి
నిప్పచ్చు - నాశము
నిబంధము - కూర్పఁబడినది
నిబిడము - దట్టము
నిమంత్రణము - శ్రాద్ధభోజనాదులకు నియమించుట
నిమజ్జనము - స్నానము
నిమురు - తడవు
నిమ్నగ - నది
నిమ్నము - పల్లము
నియంత - నియమించువాఁడు

నియతి - నియమము
నియోగము - ఆజ్ఞాపనము
నిరంతరము - ఎల్లప్పుడు
నిరతి - మిగుల ఆసక్తి
నిరత్యయము - నాశనము లేనిది
నిరపాయము - అపాయము లేనిది
నిరపేక్షము - అపేక్ష లేనిది
నిరయము - దుర్గతి
నిరవధికము - మేర లేనిది
నిరసించు - తిరస్కరించు
నిరస్తము - తిరస్కరింపఁబడినది
నిరాకృతము - తిరస్కరింపఁబడినది
నిరాపనింద - అపనింద
నిరాహారి - ముని
నిరీక్షణము - చూపు
నిరూఢి - ప్రసిద్ధి
నిరోధించు - అడ్డగించు
నిర్గతము - బయలు వెడలినది
నిర్గమించు - వెడలు
నిర్ఘోషము - ధ్వని
నిర్జించు - జయించు
నిర్ఝరిణి - నది
నిర్ణాయకుఁడు - నిర్ణయించువాఁడు
నిర్ణేత - నిర్ణాయకుఁడు
నిర్దేశము - ఆజ్ఞ
నిర్ధారణము - నిశ్చయము

నిర్ధూతము - విడువఁబడినది
నిర్భర్త్సించు - వెలపించు
నిర్మాత - నిర్మించువాఁడు
నిర్మాయి - నిర్మాత
నిర్మాల్యము - ధరించి తీసివేసినది
నిర్యాసము - చెట్టు జిగురు
నిర్వచనము - అర్థము వివరించి చెప్పుట
నిర్వర్తిల్లు - సంభవించు
నిర్వాపితము - వెడలఁగొట్టఁబడినది
నిర్వాహకుఁడు - నిర్వహించువాఁడు
నిర్వేదము - దుఃఖము
నిర్హారి - దూరముగా వ్యాపించునది
నిలయము - గృహము
నిలింపుఁడు - దేవత
నివసనము - ఆలయము
నివహము - గుంపు
నివారణము - అడ్డగింత
నివురు - నిముఱు
నివేశము - ఇల్లు
నివ్వటిల్లు - నెఱవేఱు
నివ్వరి - ఒకవిధమైన ధాన్యము
నివ్వాళి - హారతి
నిశ - రాత్రి
నిశాంతము - ఇల్లు
నిశాకరుఁడు - చంద్రుఁడు
నిశాటుఁడు - రాక్షసుఁడు

నిశాతము - మిగుల పదును గలది
నిశితము - మిక్కిలివాఁడిచేయఁబడినది
నిశీధిని - రాత్రి
నిశ్చాయకుఁడు - నిశ్చయించువాఁడు
నిశ్చితము - నిశ్చయింపఁబడినది
నిశ్రేణి - నిచ్చెన
నిశ్వాసము - నిట్టూర్పు
నిషాదుఁడు - బోయ
నిషిద్ధము - నిషేధింపఁబడినది
నిషూదనము - చంపుట
నిషేధించుట - త్రోసివేయుట
నిష్పాదించు - సిద్ధింపఁజేయు
నిసి - రాత్రి
నిసుఁగు - బిడ్డ
నిస్తంద్రము - చురుకుఁ గలది
నిస్తరించు - దాఁటు
నిష్కృతి - ప్రాయశ్చిత్తము
నిష్క్రాంతము - బయలు వెడలినది
నిష్ఠీవనము - ఉమియుట
నిష్ఠ్యూతము - క్రక్కఁబడినది
నిష్ణాతుఁడు - నేర్పరి
నిష్పన్నము - సిద్ధించినది
నిసి - రాత్రి
నిసుఁగు - బిడ్డ
నిస్తంద్రము - చురుకుగలది
నిస్తరించు - దాఁటు
నిస్పందము - మిగుల కరలునది
నిష్పాదించు - సిద్ధింపఁజేయు

నిస్పృహము - ఆశలేనిది
నిస్వనము - ధ్వని
నిస్సాణము - చర్మవాద్య విశేషము
నిస్యందము - స్రవించుట
నిహంత - చంపెడువాఁడు
నిహతి - చావు
నిహితము - ఉంచఁబడినది
నిహ్నుతి - దాపరికము

## నీ

నీఁగు - నివర్తించు
నీటు - గర్వము
నీడోద్భవము - పక్షి
నీరధి - సముద్రము
నీరము - నీరు
నీరాజనము - హారతి
నీరుకాయ - నీటి బుడగ
నీర్కావి - కొంచెము ఎఱుపు
నీరువట్టు - దప్పి
నీఱు - బూడిద
నీలకంఠుఁడు - శంకరుఁడు
నీలలోహితుఁడు - శివుఁడు
నీలిమ - నలుపు
నీవారము - నివ్వరి
నీహారము - మంచు
నుగ్గాడు - ఖండించు
నుగ్గు - పొడి
నుచ్చిళ్లు - నురుగు
నుడి - మాట

నుడికారము - మాట చమత్కారము
నుడువు - పలుకు
నుతము - స్తుతింపఁబడినది
నుఱిచియాడు - నాశనముచేయు
నుఱుమాడు - ఖండించు
నులి - కొద్ది
నులియు - పొడియగు
నుసి - కొద్ది
నుసుము - ఆకర్షించు
నూచ - పొడి
నూతనము - క్రొత్తది
నూపురము - అందియ
నూయి - చేఁదబావి
నృత్తము - నాట్యము
నృశంసుఁడు - దుర్మార్గుఁడు
నెంజిలి - మనోవ్యాకులము
నెగడి - నిప్పులకుప్ప
నెగడు - వర్ధిల్లు
నెగయు - ఎగయు
నెత్తఱులు - పెద్ద అలలు
నెమకు - వెదకు
నెమరుచు - నెమరువేయుచు
నెయ్యము - స్నేహము
నెయ్యుఁడు - స్నేహితుఁడు
నెరి - వక్రత
నెఱిక - వెంట్రుక
నెఱవాది - నేర్పరి
నెఱియ - చీలిక
నెలఁతుక - స్త్రీ
నెలకువ - చోటు
నెలపులుగు - చకోరపక్షి
నెలఱాయి - చంద్రకాంతమణి
నెసము - నెపము
నెళవు - మర్మము
నేఁడు - ఈదినము
నేటు - నిశ్చయము
నేత - రాజు
నేదిష్ఠము - మిగులదాపు
నేమము - నియమము
నేమి - బండిచక్రము చుట్టు కమ్మి
నేరమి - అజ్ఞానము
నేరిమి - సామర్థ్యము
నేలచూలి - సీత
నేలమాలె - నేలలోపలియిల్లు
నేలవేలుపు - బ్రాహ్మణుఁడు
నేవడము - హారము
నేస్తము - స్నేహము

## నై

నైపుణి - నిపుణత్వము
నైష్ఠికుఁడు - నిష్ఠగలవాఁడు
నైసర్గికము - స్వాభావికము

## నొ

నొచ్చిళ్లు - చొంగ
నొచ్చు - బాధచెందు
నొడుచు - తప్పులుపట్టు
నొవ్వు - బాధ
నొసలు - నుదురు

## నౌ

నౌక - ఓడ

## న్యా

న్యంకువు - ఇఱ్ఱి
న్యక్కారము - తిరస్కారము
న్యగ్రోధము - మఱ్ఱిచెట్టు
న్యస్తము - ఉంచఁబడినది
న్యూనము - తక్కువైనది

## ప

పంకజము - పద్మము
పంకించు - చలించు
పంకిలము - బురదగలది
పంచత్వము - చావు
పంచనఖము - పులి
పంచశాఖము - చెయ్యి
పంచాస్యము - సింహము
పంచితము - గోమూత్రము
పంటించు - జాగుచేయు
పంద - పిఱికి
పక్కణము - బోయపల్లె
పక్కి - పక్షి
పక్ష్మము - ఱెప్పవెండ్రుక
పగతుఁడు - విరోధి
పచనము - వండుట
పచేళిమము - చక్కగా పండినది
పచ్చవిలుతుఁడు - మన్మధుఁడు
పచ్చెకాఁడు - చూచుచుండఁగనే దొంగిలించువాఁడు
పటలి - సమూహము
పటహము - తప్పెట
పటాపంచ - అగోచరము
పటోలి - పొట్ల
పట్టి - పలక
పట్టిక - పలక
పఠితము - చదువఁబడినది
పడఁతి - స్త్రీ
పడయు - పొందు
పడవాలు - సేనాధిపతి
పడియ - నీటిగుంట
పణము - ధనము
పణవము - వాద్యవిశేషము (ఉడుక)
పణాయితము - పొగడఁబడినది
పణితము - పొగడఁబడినది
పణిహారి - ద్వారపాలకుఁడు

పణ్యవీధి - అంగడివీధి
పణ్యాంగన - వేశ్య
పణ్యారము - భక్ష్యము
పతంగుఁడు - సూర్యుఁడు
పతగము - పక్షి
పత్త్రము - ఱెక్క
పత్త్రి - పక్షి
పతాక - టెక్కెము
పతాకిని - సేన
పతింవర - భర్తను తనంతట తాను వరించు స్త్రీ
పత్ని - భార్య
పథము - త్రోవ
పథికుఁడు - బాటసారి
పథ్యము - హితము
పదంపడి - తరువాత
పదడు - బూడిద
పదవి - మార్గము
పదాతి - కాలిబంటు
పదిలము - సురక్షితము
పదుపు - ఒకజాతి ప్రాణిసమూహము
పద్మ - లక్ష్మి
పద్మనాభుఁడు - విష్ణువు
పద్మరాగము - మణివిశేషము
పద్మాకరము - కొలను
పద్మాలయ - లక్ష్మి
పద్య - త్రోవ
పనవు - ప్రలాపించు
పనుపడు - కలుగు
పనుపు - నియోగము
పబువు - ప్రభువు
పమ్మ - అతిశయము
పయనము - ప్రయాణము
పయోధి - సముద్రము
పయ్యెద - పైఁట
పరకీయ - ఇతరునిది
పరభృతము - కోకిల
పరభృత్తు - కాకి
పరమపదము - వైకుంఠము
పరమేష్ఠి - బ్రహ్మ
పరశువు - గండగొడ్డలి
పరశ్శతము - నూటికంటె ఎక్కువైనది
పరాఙ్ముఖుఁడు - పెడమొగము పెట్టినవాఁడు
పరాజయము - ఓటమి
పరాభవించు - అవమానపఱచు
పరామరిక - చక్కఁగా విచారించుట
పరామర్శము - చక్కఁగా విచారించుట
పరాయణుఁడు - ఒకదానియం దాసక్తిగలవాఁడు
పరాస్తము - నిరాకరింపఁబడినది
పరికించు - పరీక్షించు

పరిక్షిప్తము - నాలుగుప్రక్కల జుట్టఁబడినది.
పరిఖ - అగడ్త
పరిగణనము - ఎన్నిక
పరిచరించు - సేవసేయు
పరిచర్య - సేవ
పరిచితము - పరిచయముగలది
పరిజనము - పరివారము
పరిణయము - పెండ్లి
పరిణాహము - వైశాల్యము
పరిణేత - భర్త
పరితోషము - సంతోషము
పరిత్యజించు - బొత్తిగా వదలిపెట్టు
పరిదేవనము - దుఃఖముతోఁగూడిన మాట
పరిధానము - దోవతి
పరిధి - పరివేషము
పరిపంథి - విరోధి
పరిపణము - మూలధనము
పరిపాటి - క్రమము
పరిభూతము - అవమానింపఁబడినది
పరిమళము - వాసన
పరిరంభము - కౌఁగిలింత
పరివృఢుఁడు - రాజు
పరివేషము - సూర్యచంద్రుల చుట్టుగలగుడి
పరివేష్టించు - చుట్టివచ్చు
పరివ్రాజకుఁడు - సన్న్యాసి
పరిశిష్టము - కడపట శేషించినది
పరిశీలన - శోధన
పరిషత్తు - సభ
పరిష్వంగము - కౌఁగిలి
పరిసరము - సమీపము
పరీతము - చుట్టుకొనఁబడినది
పరుజు - కత్తిపిడి
పరువడి - క్రమము
పరువము - యౌవనము
పరుషము - నిష్ఠురము
పరుసు - విధము
పరేతుఁడు - చచ్చినవాఁడు
పరోక్షము-ఇంద్రియగోచరముకానిది
పర్కటి - జువ్విచెట్టు
పర్జన్యము - ఉఱుమెడు మేఘము
పర్ణము - ఆకు
పర్యంకము - మంచము
పర్యటనము - సంచారము
పర్యుషితము - చలిది
పర్యవసితము - ముగిసిపోయినది
పర్వు - వ్యాపించు
పఱతెంచు - పరుగెత్తివచ్చు
పఱివోవు - నశించు
పఱియ - బ్రద్ద
పలలము - మాంసము

పలాండువు - నీరుల్లి
పలాయనము - పారిపోవుట
పలాశము - ఆకు
పలితము - నరిసినది
పలుగు - స్ఫటికము
పలుగాకి - దుష్టుఁడు
పలువ - దుర్మార్గుఁడు
పల్యంకి - పల్లకి
పల్యయనము - గుఱ్ఱపు పల్లము
పల్లవము - చిగురు
పల్లవుఁడు - విటుఁడు
పల్వలము - నీళ్లుగల చిన్నపల్లము
పవమానుఁడు - వాయువు
పవి - వజ్రాయుధము
పశుపతి - శంకరుఁడు
పసదనము - బహుమతి
పసరము - గొడ్డు
పసాపడు - భోజనముచేయు
పసితిండి - పెద్దపులి

## పా

పాంచజన్యము - విష్ణుమూర్తిశంఖము
పాంచాలి - ద్రౌపది
పాంచాలిక - బొమ్మ
పాండితి - పాండిత్యము
పాంథుఁడు - బాటసారి
పాంసనుఁడు - దూషించువాఁడు
పాంసువు - దుమ్ము
పాకశాసనుఁడు - ఇంద్రుఁడు
పాకారి - ఇంద్రుఁడు
పాటచ్చరుఁడు - చోరుఁడు
పాటనము - చీల్చుట
పాటిల్లు - కలుగు
పాఠీనము - వేయికోఱలుకల చేఁప
పార్యము - పరింపఁదగినది
పాణిగ్రహణము - పెండ్లి
పాణిగృహీతి - అగ్ని సాక్షిగాఁబెండ్లాడిన పెండ్లాము
పాణిగృహీత - పెండ్లియాడకుండ నుంచుకొన్న స్త్రీ
పాణిపీడనము - పెండ్లి
పాతకము - మహాపాపము
పాతము - పడుట
పాథస్సు - జలము
పాథేయము - బియ్యములోనగు దారిబత్తెము
పాథోధి - సముద్రము
పాదజుఁడు - శూద్రుఁడు
పాదపము - వృక్షము
పాదుకలు - పావకోళ్లు
పాదుసా - రాజు
పాద్యము - కాళ్లు కడుగుకొనుటకు నీరు
పానవట్టము - లింగపీఠము

పానీయము - నీరు
పామరుఁడు - తెలివిలేనివాఁడు
పారంగతుఁడు - దరిఁజేరినవాఁడు
పారణ - ఉపవాసముండి మఱునాడు భుజించుట
పారతంత్ర్యము - పరాధీనత
పారదము - పాదరసము
పారము - ఆవలి గట్టు
పారాయణము - అంతయుఁజదువుట
పారావతము - పావురము
పారావారము - సముద్రము
పారాశరి - సన్యాసి
పారితోషికము - బహుమతి
పారీణుఁడు - పారము ముట్టినవాఁడు
పార్థివుఁడు - రాజు
పార్ష్ణిగ్రాహుఁడు - దండెత్తిపోవు రాజునకు వెనుకఁ బోవురాజు
పాఱుఁడు - బ్రాహ్మణుఁడు
పాఱుత - బ్రాహ్మణి
పాఱుఁబోతు - పిఱికి
పాలవెల్లి - పాలసముద్రము
పావకుఁడు - అగ్ని
పావలు - పావుకోళ్లు
పాశము - త్రాడు
పాశి - వరుణుఁడు
పాషండుఁడు - వేదబాహ్యమైనవాఁడు
పాషాణము - ఱాయి

## పి

పింఛము - నెమలిపురి
పింజ - బాణము క్రింది చివర
పిండలి - ముద్ద
పిండీకృతము - ముద్దగాఁజేయఁబడినది
పికపికలు - చెల్లాచెదరు
పికము - కోయిల
పిచండిలుఁడు - పెద్దకడుపువాఁడు
పిచుమందము - వేఁపచెట్టు
పిచ్చుకుంటు - (పిచ్చికకుంటు) కుంటివాఁడు
పిచ్ఛిలము - పేరినది
పిట్టపిడుగు - నివారింపరానిది
పిత - తండ్రి
పితాళ్లు - పితరులు
పితృపతి - యముఁడు
పితృవనము - శ్మశానము
పితృవ్యుఁడు - తండ్రితోఁబుట్టినవాఁడు
పిత్ర్యము - తండ్రిది
పిధానము - మఱుఁగు
పినాకి - శివుఁడు
పిపాస - నీరుద్రాగు కోరిక
పిపీలిక - చీమ
పిఱుతివియు - వెనుదీయు

పిలుకుమారు - చచ్చు
పిల్లి - కసవు
పిశితము - మాంసము
పిహితము - కప్పఁబడినది
పిళ్లారి - వినాయకుఁడు

## పీ

పీఁచము - మదము
పీఠము - పీఁట
పీతాంబరుఁడు - విష్ణుమూర్తి
పీనము - బలిసినది
పీనసము - పడిసెము
పీయూషము - అమృతము
పీవము - బలిసినది
పీవరము - బలిసినది

## పు

పుంఖము - బాణముయొక్కములికి
పుంగవము - ఎద్దు
పుంజము - గుంపు
పుంశ్చలి - జారిణి
పుంసవనము - గర్భవతికి పుత్రసంతానము కొఱకు చేయు శుభకర్మము
పుటభేదము - పట్టణము
పుటము - దొప్ప
పుట్టపుట్టువు - వాల్మీకి
పుట్టము - వస్త్రము
పుడమి - భూమి
పుణ్యభూమి - హిమాలయవింధ్య మధ్య ప్రదేశము
పుణ్యాహము - పుణ్యదినము
పుత్తడి - అపరంజి
పునాసలు - పునర్వసు నక్షత్రమందు సూర్యుఁడుండఁగా చల్లినధాన్యము
పునీతుఁడు - పవిత్రుఁడు
పునుక - పుఱ్ఱె
పుమాంసుఁడు - మానవుఁడు
పుయిలోడు - వెనుదీయు
పురందరుఁడు - ఇంద్రుఁడు
పురంధ్రి - ఇల్లాలు
పురస్సరుఁడు - ముందునడచువాఁడు
పురహరుఁడు - శివుఁడు
పురాతనము - ప్రాచీనమైనది
పురికొను - క్రమ్ముకొను
పురీషము - మలము
పురుడించు - పోలు
పురుషాయితము - ఉపరతి
పురుహూతుఁడు - ఇంద్రుఁడు
పురోగామి - ముందుపోవువాఁడు
పురోధసుఁడు - పురోహితుఁడు
పురోభాగి - తప్పులు వెదకువాఁడు
పులకండము - కలకండ
పులాకము - మెతుకు

పులినము - ఇసుక తిన్నె
పులుఁగు - పక్షి
పుల్లావు - కపిలధేనువు
పుల్లు - కసవు
పువ్విలుతుఁడు - కాముఁడు
పుషితము - పోషింపఁబడినది
పుష్కలము - సమృద్ధి
పుష్పంధయము - తుమ్మెద
పుష్పలావిక-పూలదండలు గ్రుచ్చి అమ్ము ఆఁడుది
పుష్పవంతులు - సూర్యచంద్రులు
పుస్తము - పుస్తకము
పుళిందుఁడు - బోయవాఁడు

## పూ

పూ - పూవు
పూజకుఁడు - అర్చకుఁడు
పూతిగంధి - చెడువాసన
పూరము - జలప్రవాహము
పూరి - గడ్డి
పూరితము - నింపఁబడినది
పూర్వదేవుఁడు - రాక్షసుఁడు
పూర్వపక్షము - వాదము

## పృ

పృక్తము - కలిసికొన్నది
పృచ్ఛ - ప్రశ్నము
పృతన - సేన
పృధివి (పృధ్వి) - భూమి
పృధుకము - అడుకులు
పృధురోమము - చేఁప
పృధులము - విరివియైనది
పృషత్కము - బాణము
పృషదంశకము - పిల్లి
పృషదశ్వుఁడు - వాయువు
పృష్టము - అడుగఁబడినది
పృష్ఠము - వెనుకప్రక్క

## పె

పెంచిక - పెంకు
పెందొడ - ఊరుమూలము
పెంపగు - వర్ధిల్లు
పెంపారు - వృద్ధిపొందు
పెక్కు - అనేకము
పెచ్చు - అధికము
పెట్టుఁజెట్టు - కల్పవృక్షము
పెట్టువడు - దెబ్బతిను
పెడతల - తల వెనుక భాగము
పెడదారి - తప్పుత్రోవ
పెడపరము - మూర్ఖము
పెద్దనిద్దుర - మరణము
పెనిమిటి - భర్త
పెనుచు - పెరుగఁజేయు

పెరిమ - ప్రేమ

పెరిమె - పెద్దరికము

పెరుగు - తెగు

పెరుమాళ్లు - విష్ణువు

పెఱ - అన్యము

పెలుకుఱు - భయముచే నంగములు విలవిలపోవు

పెలుచ - అధికము

పెల్లు - అధికము

## పే

పేడి - నపుంసకుఁడు

పేయము - త్రాగఁబడినది

పేర్కొను - చెప్పు

పేలవము - పలుచని

పేషణము - నూఱుట

## పై

పైదలి - ఆఁడుది

పైనము - ప్రయాణము

## పొ

పొంకము - పొందిక

పొంకె - కొఱకు

పొంతనము - గ్రహమైత్రి

పొంతము - స్నేహము

పొందుపడు - సరిపోవు

పొంపిరివోవు - అతిశయించు

పొంపు - ఒప్పు

పొకాలు - వెడలు

పొక్కిలి - బొడ్డు

పొగడిత - స్తుతి

పొచ్చెము - న్యూనత

పొటకరించు - అతిశయించు

పొట్టియ - తేలు

పొడకట్టు - కనఁబడు

పొడగాంచు - చూచు

పొడతెంచు - ఉదయించు

పొడము - పుట్టు

పొడవు - రూపు

పొడువు - ఉన్నతి

పొత్తము - పుస్తకము

పొత్తు - స్నేహము

పొనరారు - ఒప్పు

పొనుఁగుపడు - నశించు

పొన్నారి - మనోజ్ఞము

పొరయు - కలుగు

పొరిగొను - చంపు

పొఱడు - గూను

పొఱయు - పొందు

పొలఁతి - స్త్రీ

పొలకువ - జాడ

పొలయలుక - ప్రణయ కోపము

పొలయు - వ్యాపించు
పొలసు - (పొల) మాంసము
పొలికలను - యుద్ధభూమి
పొలుపారు - ఒప్పారు
పొలుపు - ఒప్పు
పొల్ల - వ్యర్థము
పొసఁగు - అనుకూలించు

## పో

పోఁకముడి - స్త్రీలు మొలను కట్టుకొను కోకముడి
పోఁడి - ఒప్పు
పోఁడిమి - చక్కఁదనము
పోకార్చు - పోఁగొట్టు
పోగండుఁడు - అంగవికలుఁడు
పోటరి - శూరుఁడు
పోతరము - క్రొవ్వు
పోత్రి - పంది
పోరాట - యుద్ధము
పోరామి - సంకటము
పోరితము - యుద్ధము
పోరు - యుద్ధము
పోవుదెంచు - పోవు
పోహణించు - కూర్చు

## పౌ

పౌగండుఁడు - బాలుఁడు
పౌనఃపున్యము - మరల మరల అడుగుట

## ప్ర

ప్రకంపనము - బోరుగాలి
ప్రకరము - సమూహము
ప్రకర్షము - అతిశయము
ప్రకామము - ఇష్టమువచ్చినట్లు
ప్రక్రాంతము - ఆరంభింపఁబడినది
ప్రక్షిప్తము - చేర్చఁబడినది
ప్రగల్భుఁడు - ప్రతిభగలవాఁడు
ప్రగాఢము - అధికము
ప్రచండము - వాఁడిమిగల
ప్రచయము - గుంపు
ప్రచ్ఛన్నము - చక్కఁగాఁ గప్పఁబడినది
ప్రజాపతి - బ్రహ్మ
ప్రజ్ఞ - బుద్ధి
ప్రజ్ఞుఁడు - పండితుఁడు
ప్రణతి - నమస్కారము
ప్రణమిల్లు - నమస్కారము చేయు
ప్రణయకోపము - కారణములేకయే నాయికా నాయకులకు ప్రేమవలన కలుగు కోపము
ప్రణయిని - ప్రియురాలు
ప్రణవము - ఓంకారము
ప్రణామము - నమస్కారము
ప్రణాళి - నీరుపోవు దారి
ప్రతనము - పురాతనము
ప్రతారణము - మోసపుచ్చుట

ప్రతికారము - బదులుచేత
ప్రతిగృహీత - దానముపుచ్చుకొన్నవాఁడు
ప్రతిఘటించు - ఎదిరించు
ప్రతిజ్ఞానము - అంగీకారము
ప్రతినిధి - మాఱు
ప్రతిఫలించు - మాఱురూపము తోఁచు
ప్రతిబంధము - అడ్డగింత
ప్రతిబింబించు - ప్రతి ఫలించు
ప్రతిభ - అప్పటికప్పుడు వికసించుబుద్ధి
ప్రతిభటుఁడు - విరోధి
ప్రతిభువు - పూటకాఁపు
ప్రతియోగి - విరోధి
ప్రతిరోధము - ఎదిరించుట
ప్రతిశ్రవము - అంగీకారము
ప్రతిషేధము - నిషేధము
ప్రతిష్ఠించు - శాశ్వతముగా నిలుపు
ప్రతిహారి - ద్వారపాలకుఁడు
ప్రతీక్షించు - ఎదురుచూచు
ప్రతీచి - పడమర
ప్రతీతి - ప్రసిద్ధి
ప్రతీపుఁడు - పగవాఁడు
ప్రతీహారము - ద్వారము
ప్రత్తోదము - కొరడా
ప్రతోళి - పెద్దవీథి
ప్రత్నము - ప్రాచీనము
ప్రత్యర్థి - విరోధి

ప్రత్యవసానము - భోజనము
ప్రత్యవాయము - పాపము
ప్రత్యాఖ్యాతము - నిరాకరింపఁబడినది
ప్రత్యాలీఢము - విలుకాఁడు ఎడమకాలు ముందుకు కుడికాలు వెనుకకు చాచి నిలుచుట
ప్రత్యుత్థానము - గౌరవార్థము ఎదురుగా బోవుట
ప్రత్యూషము - ఉదయకాలము
ప్రత్యూహము - విఘ్నము
ప్రథ - ప్రఖ్యాతి
ప్రథితుఁడు - కీర్తిశాలి
ప్రదోషము - సాయంకాలము
ప్రదేశిని - చూపుడువ్రేలు
ప్రద్యుమ్నుఁడు - మన్మథుఁడు
ప్రద్యోతనుఁడు - సూర్యుఁడు
ప్రధనము - యుద్ధము
ప్రన్నన - ఇంపు
ప్రప - చలిపందిలి
ప్రపంచించు - వివరించు
ప్రపత్తి - భక్తులుచేయు శరణాగతి
ప్రపితామహుఁడు - ముత్తాత
ప్రపౌత్రుఁడు - మునిమనుమఁడు
ప్రబుద్ధము - విచ్చినది
ప్రభవించు - పుట్టు
ప్రభాతము - ఉదయకాలము

ప్రభృతి - మొదలు
ప్రమథుఁడు - శివభటుఁడు
ప్రమద - ఆఁడుది
ప్రమదావనము - అంతఃపురస్త్రీలు విహరించు ఉద్యాన వనము
ప్రమాదము - ఏమఱుపాటు
ప్రముఖము - ముఖ్యము
ప్రమోదము - సంతసము
ప్రమ్ము - ఆవరించు
ప్రయాసము - శ్రమ
ప్రరోహము - మొలక
ప్రలాపము - అర్థములేని మాట
ప్రవణుఁడు - నేర్పరి
ప్రవరుఁడు - శ్రేష్ఠుఁడు
ప్రవాసము - పరదేశవాసము
ప్రవిదారణము - యుద్ధము
ప్రవీణుఁడు - నేర్పరి
ప్రవృత్తి - నడక
ప్రవేకము - ముఖ్యము
ప్రవ్రజితుఁడు - సన్న్యాసి
ప్రశంస - స్తుతి
ప్రశస్తి - ప్రసిద్ధి
ప్రసభము - బలాత్కారము
ప్రసరించు - వ్యాపించు
ప్రసాధని - దువ్వెన
ప్రసితుఁడు - తత్పరుఁడు
ప్రస్థానము - ప్రయాణము
ప్రహరణము - ఆయుధము
ప్రహరి - ప్రాకారము
ప్రహరించు - కొట్టు
ప్రహారము - దెబ్బ
ప్రహ్లాదము - సంతోషము

## ప్రా

ప్రాంగణము - ముంగిలి
ప్రాంతము - సమీపము
ప్రాంశువు - పొడుగైనది
ప్రాఁజదువులు - వేదము
ప్రాకటము - ప్రసిద్ధమైనది
ప్రాకారము - చుట్టుగోడ
ప్రాకృతుఁడు - పామరుఁడు
ప్రాక్తనము - పురాతనము
ప్రాచి - తూర్పు
ప్రాచీనము - పూర్వకాలమందుఁగలిగినది
ప్రాచేతసుఁడు - వాల్మీకి
ప్రాజ్ఞుఁడు - పండితుఁడు
ప్రాజ్యము - అధికము
ప్రాడ్వివాకుఁడు - తగవరి
ప్రాణగొడ్డము - ప్రాణమును హింసించునది
ప్రాణనాధుఁడు - భర్త
ప్రాథమికుఁడు - మొదటివాఁడు

ప్రాదుర్భవించు - జనించు
ప్రాపు - ఆశ్రయము
ప్రాప్తి - లాభము
ప్రాప్తించు - లభించు
ప్రామినుకులు - వేదములు
ప్రాయము - వయస్సు
ప్రాయశ్చిత్తము - పాప పరిహారార్థము చేసెడు కర్మము
ప్రాయికము - సామాన్యము
ప్రాలంబము - బంగారు హారము
ప్రాలుమాలు - సోమరియగు
ప్రాలేయము - మంచు
ప్రావీణ్యము - నేర్పు
ప్రావృట్టు - వర్షర్తువు
ప్రావృతము - కప్పుకొనఁబడినది
ప్రావేలుపు - రాక్షసుఁడు
ప్రాశనము - భోజనము
ప్రాసము - ఈఁటె

## ప్రి

ప్రియ - ఇష్టురాలు
ప్రియుఁడు - ప్రాణనాయకుఁడు

## ప్రీ

ప్రీతుఁడు - సంతోషించినవాఁడు
ప్రీణనము - తృప్తినొందించుట

## ప్రు

ప్రుష్టము - కాల్పఁబడినది

## ప్రె

ప్రెగ్గడ - మంత్రి

## ప్రే

ప్రేంకణము - మోరటిచెట్టు
ప్రేంఖితము - కదలింపఁబడినది
ప్రేక్షణీయము - చూడఁదగినది
ప్రేముడి - స్నేహము
ప్రేయసి - ప్రియురాలు
ప్రేయసుఁడు - ప్రియుఁడు
ప్రేలరి - వదరుఁబోతు
ప్రేషణము - పంపుట

## ప్రో

ప్రోక్షణము - నీళ్లుచిలుకరించుట
ప్రోతము - కుట్టఁబడినది
ప్రోదిసేయు - పోషించు
ప్రోపు - పోషణము
ప్రోయాలు - ఇల్లాలు
ప్రోలు - పట్టణము
ప్రోషితుఁడు - పరదేశముపోయినవాఁడు

## ప్రౌ

ప్రౌఢ - పదునెనిమిదేండ్లుదాటిన యువతి

ప్రౌఢిమ - నేర్పు

## ప్లీ

ప్లీహము - గుండె ఎడమవైపుననుండు మాంసపుగోళము

## ప్లో

ప్లోషము - కాల్చుట

## ఫ

ఫక్కి - ప్రకారము

ఫణి - పాము

ఫణితము - చెప్పఁబడినది

ఫణితి - మాట

ఫల్గునుఁడు - అర్జునుఁడు

ఫల్గువు - నిస్సారమైనది

## ఫా

ఫాలనేత్రుఁడు - శంకరుఁడు

## ఫు

ఫుల్లము - వికసించినది

## ఫే

ఫేనము - నురుగు

ఫేరవము - నక్క

ఫేరువు - నక్క

## బ

బండారము - బొక్కసము

బంధుజీవకము - మంకెనచెట్టు

బంధురము - ఒప్పిదము

బంభరము - తుమ్మెద

బకదారి - ఒకజాతి పావురము

బకోటము - కొంగ

బగ్గి - బూడిద

బచ్చు - కోమటి

బటువుఁగైదువు - చక్రాయుధము

బట్టు - స్తోత్రపాఠకుఁడు

బడియ - దుడ్డుగఱ్ఱ

బడిశము - గాలము

బత్తి - భక్తి

బదనిక - చెట్టుమీఁద మొలచు నొక యోషధి

బదరి - రేఁగుచెట్టు

బధిరుఁడు - చెవిటివాఁడు

బద్ధము - కట్టఁబడినది

బన్నము - అవమానము

బమ్మ - బ్రహ్మ

బమ్మెర - భ్రమము

బరవసము - ధైర్యము

బరాబరి - హెచ్చరిక
బరికాఁడు - మావటీఁడు
బరువడి - మరల
బర్హి - నెమలి
బర్హిర్ముఖుఁడు - దేవత
బలుసు - గోఁకు
బల్లి - గేదె
బలఁగము - పరిజనము
బలకరము [బళకరము] - కావలి
బలభద్రుఁడు - బలరాముఁడు
బలసూదనుఁడు - ఇంద్రుఁడు
బలారాతి - ఇంద్రుఁడు
బలావాకము - మేఘము
బలియుఁడు - బలశాలి
బలీవర్దము - ఎద్దు
బలె - వలె
బల్లిదము - బలముగలది
బల్లెము - ఈఁటె
బవంతము - కపటము
బవరము - యుద్ధము
బసవఁడు - ఎద్దు
బస్తము - మేఁకపోతు
బహిష్కారము - వెలివేయుట
బహూకృతి - గౌరవము
బళీ - మెప్పును దెలుపునది

## బా

బాఁపఁడు - బ్రాహ్మణుఁడు
బాఁపత - బ్రాహ్మణ స్త్రీ
బాడబుఁడు - బ్రాహ్మణుఁడు
బాడిగె - అద్దె
బాణాసనము - విల్లు
బానసము - వంట ఇల్లు
బానసీఁడు - వంటవాఁడు
బాపురే - బళీ
బారిసమరు - హింసించు
బాలిశము - తలగడ
బాలేయము - గాడిద
బాసట - సహాయము
బాసికము - వివాహకాలమందు వధూవరులకు నొనటఁగట్టెడు మౌక్తికాది హారము
బాహుజుఁడు - క్షత్రియుఁడు
బాహ్యము - వెలుపలిది

## బి

బిందువు - నీటిబొట్టు
బికిరము - భిక్షము
బిజ్జుగు - బొంకు
బిట్టు - శీఘ్రము
బిదారు - వస్తిక సమూహము
బిడాలము - పిల్లి
బిడౌజుఁడు - ఇంద్రుఁడు
బిడ్డకుట్టు - ప్రసవవేదన
బిత్తరి - ఆఁడుది
బిరాన - త్వరగా
బిసము - తామర తూఁడు
బీఁటలు వాఱు - బద్దలగు

## భీ

భీగము - తాళము
భీతు - భీతి
భీరము - పరాక్రమము
భీలు - వ్యర్థము

## బు

బుగ్గి - బూడిద
బుడుక - స్నానము
బుడుత - బాలుఁడు
బుడుగు - పొట్టి
బుత్తి - భుక్తి
బుద్బుదము - నీటి బుడగ
బుభుక్ష - ఆఁకలి
బువ్వము - పెండ్లిండ్లయందు స్త్రీ పురుషులు వేడుకగా భుజించుట

## బూ

బూది - విభూతి
బూమెకాఁడు - మాయలమారి

## బృ

బృందము - గుంపు
బృందారకుఁడు - దేవత
బృందావనము - తులసీవనము
బృంహితము - ఏనుఁగు అఱపు
బృహత్తు - గొప్పది
బృహద్భానువు - అగ్ని
బృహన్మరీచము - మిరపకాయ

## బె

బెండుపడు - బలహీనత నొందు
బెగ్గడిల్లు - భయపడు
బెగ్గలికము - భయము
బెట్టిదము - భయంకరము
బెడఁగు - అందము
బెడిదము - భయంకరము
బెస్త - జాలరి
బెళుకు - తళతళ మెరయు

## బే

బేడిస - ఒకవిధమగు చేప
బేల - మూఢుఁడు
బేలు - మోసము
బేహారము - వర్తక వ్యాపారము

## బై

బైజ - అజ్ఞానము
బైడాలము - కోపము
బైసుక - ప్రతిజ్ఞ

## బొ

బొంకు - అసత్యము
బొంత - గంత

బౌంది - శరీరము

బౌక్కాణము - బూదిసంచి

బౌద్దీక - బరిణెపురుగు

బొప్పఁడు - మూఢుఁడు

బొబ్బమెకము - సింహము

బొమిడికము - కిరీటము

బొమ్మఁడు - బ్రాహ్మణుఁడు

బొరియ - రంధ్రము

## బో

బోఁటి - వంటి

బోటి - ఆఁడుది

బోద - పక్షిపిల్ల

బోధము - తెలివి

బోయ - కిరాతుఁడు

బోరన - వేగముగా

బోరుకాఁడు - స్నానముచేయు

## బ్ర

బ్రదిమి - జీవనము

బ్రధ్నుఁడు - సూర్యుఁడు

బ్రమయు - భ్రమించు

బ్రహ్మణ్యము - బ్రాహ్మణహితము

బ్రహ్మబంధువు - దూషింపఁదగిన వాఁడు

బ్రహ్మయజ్ఞము - వేదపారాయణము

బ్రహ్మసూత్రము - జన్నిదము

## బ్రా

బ్రాహ్మణబ్రువుఁడు - జాతిమాత్రమున బ్రాహ్మణుఁడు

బ్రాహ్మణము - బ్రాహ్మణులసముదాయము

## బ్రు

బ్రుయ్యు - నశించు

బ్రుసి - దర్భాసనము

## భ

భంజకము - విఱుచునది

భండారము - బొక్కసము

భక్తి - పూజ్యులయెడ ప్రేమ

భక్ష్యము - తినఁదగినది

భగవతి - పూజ్యురాలు

భగిని - తోడఁబుట్టినది

భజించు - సేవించు

భద్రాసనము - సింహాసనము

భరణము - భరించుట

భర్గుఁడు - శివుఁడు

భల్లాతకి - జీడిచెట్టు

భల్లుకము - ఎలుగుబంటి

భవదీయము - నీది

భవాదృశుఁడు - నీవంటివాఁడు

భవాని - పార్వతి

భవికము - శుభము
భవిష్యత్తు - జరుగఁబోవునది
భవుఁడు - శివుఁడు
భస్త్రి - కొలిమితిత్తి

## భా

భాండాగారము - ధనాగారము
భాగినేయుఁడు - మేనల్లుఁడు
భాగీరథి - గంగ
భానుఁడు - సూర్యుఁడు
భామ - స్త్రీ
భామిని - ఆఁడుది
భావజుఁడు - మన్మథుఁడు
భావి - కాఁగలది
భావుకము - శుభము
భావుకుఁడు - తోడఁ బుట్టినదానిమగఁడు
భావ్యము - అవశ్యము కాఁదగినది
భాషణము - మాట్లాడుట
భాసమానము - ప్రకాశించునది
భాసిల్లు - ప్రకాశించు
భాసురము - ప్రకాశము

## భి

భిక్షువు - సన్యాసి
భిత్తము - తునుక
భిదురము - వజ్రాయుధము
భిల్లుఁడు - బోయ
భిషక్కు - వైద్యుఁడు
భిస్స - భోజనము

## భీ

భీకరము - భయంకరము
భీతము - భయమొందినది
భీమము - భయంకరమైనది
భీరువు - భయస్థురాలు
భీష్మము - భయంకరము

## భు

భుక్తి - భోజనము
భుజంగము - సర్పము
భుజంగుఁడు - విటుఁడు
భుజగము - సర్పము
భువి - భూమి

## భూ

భూజము - చెట్టు
భూతేశుఁడు - శంకరుఁడు
భూదారము - పంది
భూదేవుఁడు - విప్రుఁడు
భూధరము - పర్వతము
భూపుఁడు - రాజు
భూభుజుఁడు - రాజు
భూమిక - వేషము
భూయస్సు - ఎక్కువ

భూయిష్ఠము - అధికము

భూరిమాయము - నక్క

భూరుహము - చెట్టు

భూవరుఁడు - రాజు

భూషించు - స్తుతించు

భూసురుఁడు - బ్రాహ్మణుఁడు

## భృ

భృంగము - తుమ్మెద

## భే

భేకము - కప్ప

భేషజము - మందు

## భో

భోక్త - భుజించువాఁడు

భోక్తవ్యము - భుజింపఁదగినది

భోజ్యము - తినఁదగినది

## భ్ర

భ్రంశము - జారుట

భ్రమరము - తుమ్మెద

భ్రష్టుఁడు - వెలివేయఁబడ్డవాఁడు

## భ్రా

భ్రాంతము - భ్రాంతినొందినది

భ్రాతృవ్యుఁడు - తోడఁబుట్టినవానికొడుకు

భ్రాజితము - ప్రకాశమునొందినది

భ్రాజిష్ణువు - ప్రకాశించువాఁడు

భ్రాత - తోడఁబుట్టినవాఁడు

భ్రాష్టము - వేయించుకొను మంగలము

## భ్రు

భ్రుకుటి - బొమముడి

## భ్రూ

భ్రూవు - కనుబొమ

## మ

మంగలము - వేఁపుడుచట్టి

మంగళము - శుభము

మంగళదేవత - లక్ష్మి

మంజరి - పూగుత్తి

మంజీరము - కాలియందె

మంజులము మనోజ్ఞమైనది

మంజువు - మనోజ్ఞము

మంజూష - పెట్టె

మండనము - భూషణము

మండలాగ్రము - కరవాలము

మండలి - సముదాయము

మండితుఁడు - అలంకరింపఁబడినవాఁడు

మండూకము - కప్ప

మంతనము - ఆలోచన

మంతవ్యుఁడు - ఆలోచింపఁదగినవాఁడు
మంథదండము - కవ్వము
మంథము - కవ్వము
మంథానము - కవ్వము
మందలింపు - హెచ్చరించుట
మందస - పెట్టె
మందహాసము - చిఱునవ్వు
మందాకిని - గంగానది
మందాక్షము - సిగ్గు
మందిరము - ఇల్లు
మందుర - గుఱ్ఱపుసాల
మకరందము - పూఁదేనె
మకరతోరణము - మొసలిరూపమైన తోరణము.
మకరధ్వజుఁడు - మన్మధుఁడు
మకరాంకుఁడు - మన్మధుఁడు
మకరాలయము - సముద్రము
మకుటము - కిరీటము
మక్కువ - ప్రేమ
మక్షిక - ఈఁగ
మఖము - యాగము
మగపాడి - శౌర్యము
మగఱాయి - మాణిక్యము
మగుడు - మరలు
మగువ - స్త్రీ
మగ్నము - మునిగినది
మఘవంతుఁడు - ఇంద్రుఁడు
మచ్చమాయు - నశించు
మచ్చము - గుఱుతు
మచ్ఛము - చేఁప
మజ్జనము - స్నానము
మట్టగించు - తగ్గించు
మట్టుపెట్టు - చంపు
మడఁతి - ఆఁడుది
మడియఁడు - మూఢుఁడు
మణిబంధము - చేతిమణికట్టు
మతంగజము - ఏనుఁగు
మతకము - మాయ
మతకరి - మాయావి
మత్కుణము - నల్లి
మత్తకాశిని - ఆఁడుది
మత్తుఁడు - మదించినవాఁడు
మత్స్యధాని - చేఁపలబుట్ట
మత్స్యము - చేఁప
మథనము - త్రచ్చుట
మదకలము - మదపుటేనుఁగు
మదనుఁడు - మన్మధుఁడు
మదమడఁచు - చంపు
మదావళము - ఏనుఁగు
మదిరాక్షి - ఆఁడుది
మధుద్రుమము - ఇప్పచెట్టు
మధువ్రతము - తేఁటి

మధుసూదనుఁడు - విష్ణువు
మననము - చింతన
మనవి - విన్నపము
మనసిజుఁడు - మన్మధుఁడు
మనికితము - దుఃఖము
మనీష - బుద్ధి
మనీషి - విద్వాంసుఁడు
మనుగడ - జీవనము
మనుచు - మనఁజేయు
మనుపు - రక్షణము
మనుష్యధర్ముఁడు - కుబేరుఁడు
మనోజ్ఞము - సుందరము
మనోభవుఁడు - మన్మధుఁడు
మనోరధము - కోరిక
మన్నీఁడు - ప్రభువు
మన్నెకాడు - రాజు
మరందము - పూఁదేనె
మరణము - చావు
మరాళము - హంస
మరీచి - కిరణము
మరీచిక - ఎండమావులు
మరుఁడు - మన్మధుఁడు
మరుతేజి - చిలుక
మరుత్వంతుఁడు - ఇంద్రుఁడు
మరులు - మోహము
మర్త్యుఁడు - మనుష్యుఁడు
మర్దలము - మద్దెల

మఱకువ - అజ్ఞానము
మఱుకువ - సంతాపము
మఱుసంజ - సాయంసంధ్య
మలయజము - చందనము
మలికితము - సందేహము
మల్లడిగొను - పెనఁగొను
మల్లిక - మల్లెతీఁగ
మల్లుఁడు - జెట్టి
మశకము - దోమ
మస - విలాసము
మసనము - శ్మశానము
మస్కరి - సన్న్యాసి
మస్తకము - తల
మస్తరించు - లోఁబఱచు
మహతి - నారదుని వీణ
మహనీయుఁడు - గొప్పవాఁడు
మహాంగము - ఒంటె
మహానటుఁడు - శంకరుఁడు
మహానసము - వంటయిల్లు
మహాశయుఁడు - గొప్ప యభిప్రాయము గలవాఁడు
మహితము - గొప్పది
మహిషము - దున్న
మహిళ - స్త్రీ
మహీధ్రము - పర్వతము
మహీరుహము - చెట్టు
మహోత్పలము - పద్మము

## మా

మాంగల్యము - తాళిబొట్టు
మాంత్రికుఁడు - మంత్రగాఁడు
మాంసలుఁడు - బలిసినవాఁడు
మాఁటుమణఁగు - నిశ్శబ్దముగానగు
మాకందము - మామిడిచెట్టు
మాక్షికము - తేనె
మాగధుఁడు - వంశ వీర్యాదులఁ బొగడి జీవించువాఁడు
మాడ - అరవరా
మాడ్కి - విధము
మాణవకుఁడు - పిల్లవాఁడు
మాత - తల్లి
మాతంగము - ఏనుఁగు
మాతులాని - మేనమామ భార్య
మాతులుంగము - మాదీఫలపుచెట్టు
మాతులుఁడు - మేనమామ
మాత్సర్యము - మచ్చరము
మాదృశుఁడు - నావంటివాఁడు
మాధవుఁడు - విష్ణువు
మాధుకరము - బిచ్చమెత్తుట
మానసౌకము - హంస
మానికము - మాణిక్యము
మానిని - స్త్రీ
మానిసి - మనుష్యుఁడు
మామకీనము - నాది
మారకుఁడు - చంపువాఁడు
మారణము - చంపుట
మారుఁడు - మన్మధుఁడు
మార్కొను - ఎదిరించు
మార్జనము - తుడుపు
మార్జాలము (మార్జారము) - పిల్లి
మార్తాండుఁడు - సూర్యుఁడు
మార్దవము - మెత్తన
మాఱుతుఁడు - శత్రువు
మాలిక - మాల
మాలూరము - బిల్వము
మాలెత - చండాల స్త్రీ
మాల్యము - పుష్పమాలిక
మావి - మామిడి చెట్టు
మాహాత్మ్యము - గొప్పతనము

## మి

మిండత - జారిణి
మిక్కుటము - అధికము
మిట్టిపడు - ఎగిరిపడు
మిడిమేలము - మిడిసిపాటు
మిత్తి - మృత్యువు
మిత్తిగొంగ - శంకరుఁడు
మిధము - పరస్పరము
మిధ్య - అసత్యము
మినుచూలు - వాయువు

మినుసిగవేల్పు - శంకరుఁడు
మిన్న - మణి
మిన్నక - ఊరక
మిన్ను - ఆకాశము
మిన్నువాక - ఆకాశగంగ
మిర - మేర
మిఱ్ఱు - ఉన్నతభూమి
మిశ్రమము - కలిసినది
మిశ్రితము - కలిసినది
మిష - నెపము
మిసిమింతుఁడు - అలసినవాఁడు
మిసుకు - కదలు
మిహి - శ్రేష్ఠము
మిహిక - మంచు
మిహిరుఁడు - సూర్యుఁడు
మిళిందము - తుమ్మెద

## మీ

మీగండ్ల మెకము - శరభము
మీనకేతనుఁడు - మన్మధుఁడు
మీనము - చేప
మీఱు - అతిశయంచు
మీలనము - కనుమూయుట
మీసరము - శ్రేష్ఠము

## ము

ముంగమురము - ముంజేతికంకణము
ముంగాలు - పాదాగ్రము
ముంగేలు - ముంజేయి
ముంగోలు - మొదటిది
ముంజికాఁడు - బ్రహ్మచారి
ముండమోపి - విధవ
ముందల - శిరోగ్రభాగము
ముకుందుఁడు - విష్ణువు
ముకుళించు - మొగ్గయగు
ముక్కంటి - శివుఁడు
ముక్కిఁడి - ముక్కుపోయినవాఁడు
ముఖశాల - తలవాకిటి చావడి
ముచ్చిచ్చు - త్రేతాగ్ని
ముచ్చిరు - దుఃఖించు
ముచ్చిలించు - దొంగిలించు
ముచ్చెవాఁడు - మాదిగవాఁడు
ముట్టె - పందిముక్కు
ముడిగిబ్బ - ఆఁబోతు
ముత్తెము - మౌక్తికము
ముత్తో - ముత్తయిదువ
ముదము - సంతోషము
ముదల - ఆజ్ఞ
ముదిత - ఆఁడుది
ముదిమి - ముసలితనము
ముద్గము - పెసలు
ముద్ది - ఆపద
ముద్దియ - ఆఁడుది
ముద్రిక - ముద్దుటుంగరము

మున్నీరు - సముద్రము
ముప్పటిలు - చల్లారు
ముప్పిడి - బాఁకు
ముముక్షువు - ముక్తిపై నిచ్ఛఁగలవాఁడు
ముమూర్షువు - చావఁ నిచ్ఛఁగలవాఁడు
ముమ్మొనవాలు - త్రిశూలము
ముయ్యేఁడు - ఇఱువదొకటి
ముయ్యేఱు - గంగ
మురజము - మృదంగము
మురళి - పిల్లనగ్రోవి
మురుగు - ముంజేతి కంకణము
ముఱియు - గర్వించు
ములుసూపు - ఎక్కువగు
మువ్వన్నెమెకము - పెద్దపులి
ముష్కము - వృషణము
ముష్కరుఁడు - మూర్ఖుఁడు
ముష్టింపచుఁడు - దరిద్రుఁడు
ముసరు - క్రమ్ము
ముసలము - రోఁకలి

## మూ

మూఁపు - భుజము పైభాగము
మూకుఁడు - మూఁగ
మూచూచు - వాసనచూచు
మూదలించు - నిరూపించు
మూరిఁబోవు - అతిశయించు
మూరు - ఎక్కువగు
మూరుతము - ముహూర్తము
మూర్ధము - తల
మూర్ధాభిషిక్తుఁడు - రాజు
మూలతాయి - వజ్రము
మూలతేఁడు - నైరృతి
మూలిక - ఓషధి
మూషితము - దొంగిలింపఁబడినది

## మృ

మృగతృష్ణ - ఎండమావులు
మృగధూర్తము - నక్క
మృగనాభి - కస్తూరి
మృగమదము - కస్తూరి
మృగవ్యము - వేఁట
మృగాంకుఁడు - చంద్రుఁడు
మృగితము - వెదుకఁబడినది
మృడాని - పార్వతి
మృడుఁడు - శంకరుఁడు
మృతి - చావు
మృత్తు - మన్ను
మృధము - యుద్ధము
మృదులము - మెత్తనిది
మృద్వీక - ద్రాక్షతీగ
మృష - అబద్ధము

## మె

మెకము - మృగము
మెకమెకపడు - ఉద్ధతినొందు

మెక్కు - తిను
మెచ్చులచెట్టు - కల్పవృక్షము
మెట్టినిల్లు - అత్తిల్లు
మెదువు - మృదువు
మెయి - శరీరము
మెయికొను - సమ్మతించు
మెఱమెచ్చు - మిక్కిలిమెచ్చు
మెఱుము - పొడుచు
మెలఁత - ఆఁడుది
మెలపు - జాగరూకత
మెలిగొను - పెనఁగొను
మెలుసు - మెలిక
మెసఁగు - తిను

## మే

మేఁకతిండి - తోఁడేలు
మేతాడు - మేఁతమేయు
మేఘద్వారము - ఆకాశము
మేదకుఁడు - కపటము లేనివాఁడు
మేదస్సు - మెదడు
మేదిని - భూమి
మేదించు - మర్దించు
మేదురము - దట్టమైనది
మేధావి - ధారణాశక్తిగల బుద్ధిమంతుఁడు
మేధ్యము - పవిత్రమైనది
మేపరి - తినువాఁడు
మేమఱువు - కవచము
మేలము - పరిహాసము
మేషము - పొట్టేలు
మేషి - గొఱ్ఱె
మేళనము - కూడిక

## మై

మైకము - మత్తు
మైత్రావరుణి - అగస్త్యుఁడు
మైత్రి - చెలిమి
మైథునము - ఆలుమగల కూడిక
మైనికుఁడు - జాలరి
మైమఱుపు - కవచము

## మొ

మొగడ - మొగ్గ
మొగలివాకిలి - తలవాకిలి
మొగులు - మేఘము
మొదవు - ఆవు
మొనరు - ఒప్పు
మొరపము - మ్రోఁత
మొఱ - ఆర్తధ్వని
మొఱకు - మూర్ఖుఁడు
మొఱకుఁడు - మూర్ఖుఁడు
మొలనూలు - కటిసూత్రము
మొహదా - అడ్డకత్తి

మొహరీ - ముప్పది చిన్నముల తూకము గల బంగారు నాణెము

## మో

మోఘము - వ్యర్థము
మోచనము - ముక్తి
మోదకము - ముద్దకుడుము
మోదము - సంతోషము
మోదు - దెబ్బ
మోము - మొగము
మోలకము - మూర్ఖత్వము
మోషకుఁడు - దొంగ
మోసల - మొగసాల
మోహరము - వ్యూహము

## మౌ

మౌక్తికము - ముత్యము
మౌఢ్యము - మూఢత్వము
మౌని - ముని
మౌర్వి - వింటినారి
మౌహూర్తికుఁడు - జ్యోతిష్కుఁడు

## మ్రా

మ్రాఁకు - చెట్టు
మ్రాఁగన్ను - సోలినకన్ను
మ్రానుపడు - నిశ్చేష్టుఁడగు

## మ్రు

మ్రుక్కుడి - నీచము
మ్రుచ్చిలించు - దొంగిలించు
మ్రుచ్చు - దొంగ

## మ్రో

మ్రోఁత - ధ్వని
మ్రోల - ఎదుర
మ్రోయు - ధ్వనించు

## మ్లా

మ్లానము - వాడినది

## మ్లే

మ్లేచ్ఛముఖము - రాగి
మ్లేచ్ఛుఁడు - తురక

## య

యంత - సారథి
యక్ష్మము - క్షయవ్యాధి
యజనము - యాగము
యజ్ఞోపవీతము - జన్నిదము
యతనము - యత్నము
యథేచ్ఛము - ఇచ్ఛవచ్చినట్లు
యదృచ్ఛ - స్వేచ్ఛ

యమకీటము - కుమ్మరపురుగు
యమము - జంట
యమి - ముని
యమించు - అణఁగు
యవలు - ఒకరకమైన ధాన్యము
యవసము - గడ్డి
యవనిక - తెర
యవాగువు - గంజి
యవీయసి - చెల్లెలు
యశస్వి - కీర్తిశాలి
యశస్సు - కీర్తి

## యా

యాచన - అడుగుట
యాజకుఁడు - యజ్ఞముచేయించువాఁడు
యాత - తోడికోడలు
యాతము - పోయినది
యాతన - బాధ
యాతుధానుఁడు - రాక్షసుఁడు
యాదస్సు - జలజంతువు
యాదృచ్ఛికము - తన ఇష్టము చొప్పున కలిగినది.
యానపాత్రము - ఓడ
యామము - జాము
యాయావరము - ఇంటింటికిఁ దిరుగుచు బిచ్చమెత్తుట
యాయి - పోవువాఁడు
యావనాళము - జొన్న

## యి

యియక్షువు - యజ్ఞముచేయుతలంపు కలవాఁడు

## యు

యుగళము - జత
యుగ్మము - జంట
యుతము - కూడినది
యువతి - ఆఁడుది

## యూ

యూకము - పేను
యూథము - సజాతిజంతువుల గుంపు
యూపము - యజ్ఞపశువుభేదనకు పాతిన స్తంభము.
యూషము - పప్పుకట్టు

## యో

యోక్త - కూర్చునతఁడు
యోజనము - ఆమడ
యోధ - యోధుఁడు
యోష - స్త్రీ
యోషిత - ఆఁడుది

## యౌ

యౌతకము - అరణము
యౌవతము - యువతులసమూహము

## ర

రంగవల్లి - ముగ్గు
రంతు - క్రీడ
రంహస్సు - వడి
రక్కసుఁడు - రాక్షసుఁడు
రక్తసంధ్యకము - చెంగలువ
రక్తి - అనురాగము
రక్తిమ - ఎఱుపు
రక్తోత్పలము - ఎఱ్ఱదామర
రచన - నిర్మాణము
రచించు - వ్రాయు
రచ్చగొను - గుంపుగొను
రజకుఁడు - చాకలివాఁడు
రజతము - వెండి
రటనము - మ్రోఁత
రట్టడి - నింద్యము
రణము - యుద్ధము
రతనము - రత్నము
రతిపతి - మన్మదుఁడు
రత్నగర్భ - భూమి
రత్నసానువు - మేరుపర్వతము
రత్నాకరము - సముద్రము
రధకారుఁడు - వడ్రంగి
రథాంగము - చక్రవాకము
రదనచ్ఛదము - పెదవి
రదనము - పల్లు
రమ - లక్ష్మి
రమణి - స్త్రీ
రమ్యము - అందమయినది
రయము - వేగము
రవణము - సొమ్ము
రవము - ధ్వని
రవళి - సద్దు
రశన - పదియాఱుపేటలుగల స్త్రీయొక్క మొలనూలు
రసజ్ఞ - నాలుక
రసజ్ఞుఁడు - రసికుఁడు
రసన - నాలుక
రసవాదము - పాదరసమువలన బంగారు చేయువిద్య
రసాతలము - పాతాళలోకము
రహితము - విడువఁబడినది

## రా

రాగిల్లు - రంజిల్లు
రాజకము - రాజులసముదాయము
రాజన్యుఁడు - రాజశ్రేష్ఠుఁడు
రాజన్వంతము - మంచిరాజుగలదేశము

రాజయక్ష్మము - క్షయవ్యాధి

రాజసూయము - రాజులను జయించి చేయుయజ్ఞము

రాజి - వరుస

రాజితము - ప్రకాశితము

రాణ - అందము

రాణించు - ఒప్పు

రాత్రించరుఁడు - రాక్షసుఁడు

రాపులుఁగు - పక్షి విశేషము

రామరము - ఇంగువ

రామబాణము - తాటియాకు గ్రంధముల కొట్టు పురుగు

రాయంచ - రాజహంస

రాయఁడు - రాజు

రాయబారము - దౌత్యము

రాలుపడు - కంపించు

రావము - ధ్వని

రాసభము - గాడిద

రాసము - ఒక క్రీడ

రాహుంతు - (రాహుత్తుఁడు) గుఱ్ఱపు రౌతు

## రి

రింఖ - గుఱ్ఱపు డెక్క

రింఖణము - జారుట

రింఛోళి - గుంపు

రిక్క - నక్షత్రము

రిక్థము - ధనము

రిత్త - ఊరక

రిత్తవోవు - వ్యర్థమగు

రిపువు - విరోధి

రిరంస - రమింపఁగోరిక

రిరక్షువు - రక్షింపఁ గోరికగలవాఁడు

## రీ

రీఢ - అవమానము

## రు

రుండము - తెగినతల

రుంద్రము - విరివియైనది

రుక్మము - బంగారు

రుగ్ణత - రోగము

రుచించు - ఇష్టమగు

రుచిరము - ఒప్పిదమైనది

రుచ్యము - మనోహరమైనది

రుతము - ధ్వని

రుదితము - రోదనము

రుద్రభూమి - శ్మశానము

రుద్రాణి - పార్వతి

రుధిరము - నెత్తురు

రుద్ధము - అడ్డగింపఁబడినది

రురువు - నల్లచాఱల దుప్పి

రువాణము - కాంతి

రువ్వము - ఆవృత్తి
రుష - కోపము

## రూ

రూఢి - ప్రసిద్ధి
రూపగు - వర్ధిల్లు
రూపించు - నిరూపించు

## రె

రెమ్మ - చిన్నకొమ్మ

## రే

రేకెత్తు - వర్ధిల్లు
రేణువు - దుమ్ము
రేను - రేఁగుచెట్టు
రేపాడి - ఉదయము
రేవడి - బంకమన్ను
రేపుబోయ - పడవనడుపువాఁడు
రేవెలుఁగు - చంద్రుఁడు

## రొ

రొంపి - బురద
రొద - ధ్వని
రొదాళము - ధ్వని

## రో

రోఁజు - నిట్టూర్పు
రోజు - దినము
రోఁత - ఏవగింపు
రోకు - వికాసము
రోచిష్ణువు - ప్రకాశించువాఁడు
రోధస్సు - తీరము
రోపము - బాణము
రోమంథము - నెమరు
రోమము - వెంట్రుక
రోమాంచము - గగుర్పాటు
రోలంబము - తుమ్మెద
రోవెలఁది - వారస్త్రీ

## రౌ

రౌతు - గుఱ్ఱము నెక్కువాఁడు

## ఱ

ఱంకెత - జారిణి
ఱంతు - కలకల ధ్వని
ఱట్టు - నింద
ఱప్ప - చిన్నతాయి
ఱవ్వ - నింద

## ఱా

ఱాఁగ - జారిణి
ఱాతివాలు - వజ్రాయుధము
ఱాపు - రాయిడి

## ఱి

ఱిచ్చ - నిశ్చేష్టత
ఱిమ్ము - చిమ్ము

## ఱె

ఱెక్క - పక్షము
ఱెప్ప - కనుఱెప్ప
ఱెల్లుచూలి - కుమారస్వామి

## ఱే

ఱేఁచు - శునక విశేషము
ఱేయు - అతిశయించు

## ఱో

ఱొచ్చు - బురద

## ల

లంఘనము - దాఁటుట
లంఘించు - దాఁటు
లంజెత - వేశ్య
లంద - పెద్దపొట్టగలవాఁడు
లంపటుఁడు - మిగుల ఆసక్తిగలవాఁడు
లంపతా - దాసీపుత్రుఁడు
లంపు - దొంగమేత
లంబితము - వ్రేలుడు
లంబోదరుఁడు - విఘ్నేశ్వరుఁడు
లకుచము - (లికుచము) గజనిమ్మ
లక్కిమి - లక్ష్మి
లక్ష్మము - గుఱుతు
లఘిమ - చులుకన
లచ్చి - లక్ష్మి
లజ్జ - సిగ్గు
లతాంతము - పూవు
లత్తుక - లాక్షారసము
లపనము - ముఖము
లప్ప - రాశి
లబ్ధవర్ణుఁడు - పండితుఁడు
లబ్ధి - లాభము
లలన - ఆఁడుది
లలాటము - నొసలు
లలామము - శ్రేష్ఠము
లవణి - బిగువు
లవలి - ఒకతీఁగె
లవించు - కోయు
లవిత్రము - కొడవలి
లశునము - వెల్లుల్లి
లస్తకము - ధనుర్మధ్యము
లహరి - పెద్ద అల

## లా

లాంగూలము - తోఁక
లాంఛనము - గుఱుతు
లాఁగ - బిలము
లాఁతి - ఇతరము
లాక్ష - లక్క
లాక్షణికుఁడు - లక్షణము తెలిసినవాఁడు
లాడము - గుఱ్ఱపుడెక్కలకు కొట్టెడి ఇనుపబిళ్ల

లాయము - గుఱ్ఱపుసాల
లాలనము - బుజ్జగము
లావణ్యము - ముఖకాంతి
లాసిక - ఆటకత్తె
లాస్యము - నృత్యము

## లి

లిఖించు - వ్రాయు
లిపి - వ్రాఁత
లిప్స - కోరిక
లిబ్బిపడతి - లక్ష్మి

## లీ

లీఢము - తినఁబడినది
లీనము - లయించినది

## లు

లుంటాకుఁడు - దొంగ
లుంఠనము - పొర్లిక
లుబ్ధకుఁడు - బోయ
లులాయము - దున్నపోఁతు
లులి - తక్కువ
లులితము - చలించినది

## లూ

లూత - సాలెపురుగు
లూనము - కోయఁబడినది
లూలామాలము - మోసము

## లె

లెంక - సేవకుఁడు

## లే

లేఖ - జాబు
లేఖకుఁడు - వ్రాయువాఁడు
లేఖిని - వ్రాసెడు కలము
లేఖ్యము - వ్రాఁత
లేపనము - పూఁత
లేబరము - శూన్యము
లేమ - స్త్రీ
లేమిడి - బీదతనము
లేలిహానము - పాము
లేవడి - పేదరికము
లేశము - కొంచెము
లేహనము - నాకుట

## లొ

లొటారము - రంధ్రము
లొట్టియ - ఒంటె
లొత్త - గుంట

## లో

లోఁకువ - తక్కువ
లోకబాంధవుఁడు - సూర్యుఁడు
లోకమాత - లక్ష్మి
లోకేశుఁడు - బ్రహ్మ

లోచనము - కన్ను
లోభము - పిసినిగొట్టుతనము
లోభి - పిసినారి
లోయ - కొండలసందు
లోలితము - ఊఁచఁబడినది
లోవి - వంటకుండ
లోష్టము - మంటిగడ్డ

# లౌ

లౌకికము - లోకవ్యవహారసిద్ధము
లౌల్యము - లోలత్వము

# వ

వంగసము - వంశము
వంచన - మోసము
వంటు - అనుకూలత
వందనము - నమస్కరించుట
వందటు - ఖండము
వందారువు - మ్రొక్కు స్వభావము కలవాఁడు
వందించు - నుతియించు
వందు - శోకించు
వందురు - దుఃఖించు
వంధ్య - గొడ్రాలు
వకుళము - పొగడచెట్టు
వక్కాణము - సమాచారము
క్కాణించు - వ్యాఖ్యానించు
వక్షము - రొమ్ము
వగపు - దుఃఖము
వగలాఁడి - ఒయ్యారి
వగ్రహము - కఱవు
వచస్సు - మాట
వజీరుఁడు - శూరుఁడు
వజ్జ - ఉపాయము
వజ్రకీటము - సాలగ్రామములను తొలిచెడి పురుగు
వజ్రవల్లి - నల్లేరు
వజ్రి - ఇంద్రుఁడు
వటకము - వడియము
వటారము - నగరము
వటారి - సమర్థము
వట్టు - ఇంకు
వట్రన - గుండ్రము
వడగల్లు - వాన కురియునపుడు పడు రాయి
వణిక్కు (వణిజుఁడు) - వర్తకుఁడు
వతంసము - శిరోభూషణము
వత్త - వరుగు
వత్సము - దూడ
వత్సలుఁడు - దయగలవాఁడు
వదనము - ముఖము
వదాన్యుఁడు - దాత
వదావదుఁడు - వక్త
వధము - చంపుట

వధూటి - స్త్రీ
వధ్యుఁడు - చంపఁదగినవాఁడు
వనచరము - కోఁతి
వనజము - తామర
వనట - శోకము
వనధి - సముద్రము
వనప్రియము - కోయిల
వనమాలి - విష్ణుమూర్తి
వనాటము - వనములోఁదిరుగునది
వనిత - స్త్రీ
వనీపకుఁడు - యాచకుఁడు
వనౌకసము - కోఁతి
వన్యము - అడవియందుఁబుట్టినది
వపువు - దేహము
వమనము - వాంతి
వమ్ము - వ్యర్థము
వయనము - నేయుట
వయస్య - చెలికత్తె
వయస్యుఁడు - చెలికాఁడు
వయాళి - విహారము
వరవ - నీరుదెచ్చుట కేర్పడినకాలువ
వరవుడము - సేవ
వరారోహ - ఉత్తమ స్త్రీ
వరివస్య - సేవ
వరుఁడు - భర్త
వరూధిని - సేన
వరేణ్యుఁడు - శ్రేష్ఠుఁడు
వర్జనీయము - విడువఁదగినది
వర్జించు - విడుచు
వర్జ్యము - విడువఁదగిన చెడ్డకాలము
వర్ణి - బ్రహ్మచారి
వర్తమానము - వృత్తాంతము
వర్తులము - గుండ్రమైనది
వర్త్మము - మార్గము
వర్ధకి - వడ్రంగి
వర్మము - కవచము
వఱ - మేర
వఱడు - నక్క
వఱపు - వానలేకపోవుట
వఱువాత - ప్రొద్దున
వఱ్ఱు - ప్రవాహము
వలను - దిక్కు
వలగొను - ప్రదక్షిణించు
వలగ్నము - నడుము
వలపల - కుడిప్రక్క
వలరాజు - కాముఁడు
వలవంత - మనోవ్యథ
వలస - దేశమును విడిచి ఇతరదేశము నకుఁ బోవుట
వలిపము - సన్నని తెల్లవస్త్రము
వలీకము - ఇంటిచూరు
వలీముఖము - కోఁతి
వలుఁద - లావు
వల్కలము - చెట్టుపై బెరడు

వల్మీకము - పుట్ట
వల్లకి - వీణ
వశవర్తి - విధేయుఁడు
వశ్యము - లోకువైనది
వసివాళ్లు - ఎక్కువగా వాడుట
వసుంధర - భూమి
వసుధ - భూమి
వస్త్వము - ఇల్లు
వహించు - మోయు
వహేళనము - తిరస్కృతి
వళక్షము - తెలుపు

## వా

వాంఛ - కోరిక
వాఁడిమగఁడు - శూరుఁడు
వాక్రుచ్చు - చెప్పు
వాగుర - ఉచ్చు
వాగ్మి - యుక్తియుక్తముగా మాటలాడు వాఁడు
వాచంయముఁడు - మౌని
వాచస్పతి - బృహస్పతి
వాచాలుఁడు - వక్త
వాజి - గుఱ్ఱము
వాతము - గాలి
వాతాయనము - కిటికి
వాతెఱ - పెదవి
వాత్య - సుడిగాలి
వాత్సల్యము - బిడ్డలపై ప్రేమ
వానరము - కోఁతి
వానీరము - ప్రబ్బచెట్టు
వాపి - దిగుడుబావి
వామలూరువు - పుట్ట
వాయిదము - వాద్యము
వాయుసఖుఁడు - అగ్ని
వారకము - నివారించునది
వారణము - ఏనుఁగు
వారస్త్రీ - వేశ్య
వారాన్నిధి - సముద్రము
వారాశి - సముద్రము
వారి - జలము
వారివాహము - మబ్బు
వారువము - గుఱ్ఱము
వార్తాకము - వంగచెట్టు
వాలధి - తోఁక
వాలారు - వాఁడియైనది
వాలుక - ఇసుక
వాలుగడుపు - బొజ్జ
వాలుమగఁడు - శూరుఁడు
వాలుమెకము - అడవిపంది
వావి - చుట్టఱికము
వాసవుఁడు - ఇంద్రుఁడు
వాసుకి - సర్పరాజు
వాస్తవ్యము - నివసింపఁదగినది

వాస్తవ్యుఁడు - గృహస్థుఁడు

వాహ్యాళి - స్వారి

# వి

వింగడించు - విభజించు

వింతవాఁడు - అన్యుఁడు

వింశతి - ఇరువది

వికత్థనము - స్తుతి

వికర్తనుఁడు - సూర్యుఁడు

వికలము - విచ్ఛేదము

వికాసము - తెలివి

వికీర్ణము - చెదరినది

విక్రయము - అమ్మకము

విక్రియ - వికారము

విక్రీడితము - మిగుల ఆడఁబడినది

విక్రేత - విక్రయించువాఁడు

విఖ్యాతి - మిగుల ప్రసిద్ధి

విగతము - బొత్తిగాఁ బోయినది

విగళితము - మిక్కిలి జాఱినది

విగాహము - మునుగుట

విగ్రహించు - కలహించు

విఘ్నము - అడ్డింకి

విచక్షణుఁడు - విద్వాంసుఁడు

విచికిత్స - సందేహము

విజనము - జనులులేనిది

విజిగీష - మిగుల జయింప నిచ్ఛ

విజ్ఞుఁడు - నేర్పరి

విటపి - చెట్టు

విట్టు - మలము

విడిముడి - డబ్బు

విడియము - తాంబూలము

విడ్డూరము - మూర్ఖము

వితండము - స్వపక్షపాతమైన వాదము

వితథము - అబద్ధమైన మాట

వితము - మాదిరి

వితరణము - ఈవి

వితర్ది - అరుగు

వితాకు - నిశ్చేష్టత

వితీర్ణి - ఈవి

విదరము - చీల్చుట

విదారించు - చీల్చు

విదులు - రాలు

విదుషి - విద్వాంసురాలు

విద్యమానము - ఉన్నట్టిది

విద్రుతము - కరఁగఁబడినది

విద్వేషము - విరోధము

విధాత - బ్రహ్మ

విధాయి - విధించువాఁడు

విధుంతుదుఁడు - రాహువు

విధూననము - చలించుట

విధేయుఁడు - వినయముగలవాఁడు

వినమితము - మిగుల వంగినది

వినికి - వినుట

వినిర్గతము - బయలువెడలినది

వినీతుఁడు - వినయము గలవాఁడు
వినుకలి - వినికి
వినుచూలి - వాయువు
విన్న - వివర్ణమైనది
విన్నపము - విజ్ఞాపనము
విన్నాణము - నేర్పు
విన్ను - ఆకాశము
విన్యాసము - ఉంచుట
విపణము - అమ్మకము
విపణి - అంగడివీధి
విపథము - చెడుత్రోవ
విపరయము - వ్యత్యాసము
విపర్యాసము - వ్యత్యాసము
విపశ్చితుఁడు - పండితుఁడు
విపినము - అడవి
విప్రకృష్టము - దూరము
విప్రయోగము - వియోగము
విప్రుఁడు - బ్రాహ్మణుఁడు
విప్రుషము - నీటిబొట్టు
విప్లవము - దేశోపద్రవము
విభాకరుఁడు - సూర్యుఁడు
విభాతము - వేకువ
విభావసుఁడు - సూర్యుఁడు
విభీషణము - మిక్కిలి భయంకరమైనది
విమలము - నిర్మలము
విముక్తము - విడువఁబడినది
విమోచము - మిక్కిలి విడుపు
వియచ్చరుడు - ఖేచరుఁడు
వియత్తు - ఆకాశము
వియోగము - ఎడఁబాటు
విరక్తి - విరాగము
విరతి - విశ్రాంతి
విరహము - ఎడఁబాటు
విరసము - రసములేనిది
విరావము - ధ్వని
విరించి - బ్రహ్మ
విరివాయు - చీలు
విరూపాక్షుఁడు - శివుఁడు
వితివి - విస్తారము
విలయము - నాశము
విలాతి - దేశము
విలాపము - దుఃఖముతోఁగూడినమాట
వివక్ష - చెప్పుటకునిచ్ఛ
వివ్వచ్చుఁడు - అర్జునుఁడు
విశాఖుఁడు - కుమారస్వామి
విశృంఖలము - అడ్డులేనిది
విశ్రుతి - ప్రసిద్ధి
విశ్లేషము - ఎడఁబాటు
విశ్వంభర - భూమి
విశ్వంభరుఁడు - విష్ణువు
విశ్వజనీనము - సర్వజనులకు హితమైనది
విశ్వస్త - విధవ
విషాదము - శోకము
విషూచి - కలరా వ్యాధి

విష్టరము - ఆసనము
విష్టరశ్రవుఁడు - విష్ణువు
విష్ఠ - మలము
విష్ణుపదము - ఆకాశము
విసరము - సమూహము
విసర్పణము - ప్రసరణము
విసారము - చేఁప
విసుమానము - ఆశ్చర్యము
విసృష్టము - విడువఁబడినది
వి స్తరిల్లు - విరివియగు
విస్మరణము - మఱపు
విస్మితుఁడు - ఆశ్చర్యమొందినవాఁడు
విస్మృతి - మఱపు
విస్రము - పచ్చివాసన గలది
విహంగము } - పక్షి
విహగము }
విహితము - విధింపఁబడినది
వీక్షించు - చూచు
వీటిఁబోవు - వ్యర్థమగు
వీడియము - తాంబూలము
వీతిఁడి - అవివేకి

## వృ

వృకము - తోఁడేలు
వృకోదరుఁడు - భీముఁడు
వృథ - వ్యర్థము
వృశ్చికము - తేలు
వృద్ధశ్రవుఁడు - ఇంద్రుడు
వృషభము - ఎద్దు
వృష్టి - వర్షము

## వె

వెంగలి - మూఢుఁడు
వెంబరవిత్తు - దుష్టాగ్రేసరుఁడు
వెగ్గలము - అధికము
వెజ్జు - వైద్యుఁడు
వెడఁద - విశాలము
వెడవింటి - మన్మధుఁడు
వెత - దుఃఖము
వెనకయ్య - వినాయకుఁడు
వెన్నడి - వెంబడి
వెన్నుఁడు - విష్ణుఁడు
వెన్నెలపులుఁగు - చకోరము
వెరవు - ఉపాయము
వెరపి - లెక్కమొత్తము
వెఱచు - భయపడు
వెట్టిపీళ్లు - మద్యము
వెలఁదుక - స్త్రీ
వెలయాలు - వేశ్య
వెలరు - తెల్లన
వెలిగిడ్డి - కామధేనువు
వెలిగుల్ల - శంఖము

వెలివాడ - చండాలవాటిక

వెల్లఁకి - గడ్డ

వెల్లివాడుచు - ప్రవహించు

వెస - వేగము

వెసల - వంటకుండ

వే

వేఁకి - జ్వరము

వేఁపి - కుక్క

వేడము - మండలాగ్రము

వేతసము - ప్రబ్బచెట్టు

వేదండము - ఏనుఁగు

వేత్త - తెలిసినవాఁడు

వేత్రము - బెత్తము

వేదండము - ఏనుఁగు

వేదిక - తిన్నె

వేద్యము - తెలియఁదగినది

వేపథువు - కంపము

వేపనము - వణఁకుట

వేరము - పగ

వేఱఁడి - తెలివిలేనివాఁడు

వేఱువిత్తు - నాశనముచేయునది

వేలిమి - హోమము

వేలుపుసాని - సోదెచెప్పునది

వేల్లితము - కదలింపఁబడినది

వేశంతము - నీళ్లుగల చిన్నపల్లము

వేశ్మము - ఇల్లు

వేసట - అలసట

వేసడము - కంచరగాడిద

వేసరి - బాధించువాఁడు

వై

వైకృతము - వికృతియైనది

వైజయంతి - విష్ణుమాలిక

వైతరణి - నరకలోకమందలి నది

వైదగ్ధ్యము - నేర్పు

వైదికుఁడు - వేదము తెలిసిన బ్రాహ్మణుఁడు

వైధేయుఁడు - మూర్ఖుఁడు

వైనము - విధము

వైభవము - విభవము

వైయాత్యము - దిట్టతనము

వైరము - విరోధము

వైరాగి - బైరాగి

వైవసము - కీడు

వైశ్యుఁడు - కోమటి

వైశ్రవణుఁడు - కుబేరుఁడు

వైశ్వానరుఁడు - అగ్ని

వైశము - శీఘ్రము

## వ్య

వ్యంసకుఁడు - మోసగాఁడు
వ్య_క్తి - జాతిలో ప్రత్యేకమైన ఆకారము
వ్యజనము - విసనకఱ్ఱ
వ్యత్యయము - వ్యత్యాసము
వ్యథ - బాధ
వ్యపదేశము - మిక్కిలి కపటము
వ్యపేతము - మిగుల తొలగినది
వ్యవధి - మేర
వ్యష్టి - ఒంటరితనము
వ్యళీకము - అప్రియము

## వ్యా

వ్యాకీర్ణము - చెదరినది
వ్యాకులము - కలఁతనొందినది
వ్యాకోచము - వికసించినది
వ్యాఘ్రము - పులి
వ్యాఘ్రాటము - గుడ్లగూబ
వ్యాపకుఁడు - వ్యాపించువాఁడు
వ్యాప్యము - వ్యాపింపఁదగినది
వ్యాలోలము - మిగుల చలించునది
వ్యాహతము - పలుకఁబడినది
వ్యాహారము - మాట
వ్యాళగ్రాహి - పాములవాఁడు

## వ్యు

వ్యుత్ప_త్తి - శబ్దము పుట్టిన పద్ధతి
వ్యుషితము - చద్ది

## వ్యో

వ్యోమకేశుఁడు - శంకరుఁడు
వ్యోమయానము - విమానము

## వ్ర

వ్రక్క - తునుక
వ్రచ్చు - చీల్చు
వ్రణము - పుండు
వ్రయ్య - తునుక

## వ్రా

వ్రాతము - సముదాయము
వ్రాయసకాఁడు - లేఖకుఁడు
వ్రాయి - అక్షరము

## వ్రీ

వ్రీడ - సిగ్గు
వ్రీలు - పగులు

## వ్రే

వ్రేఁకము - భారము
వ్రేఁకటి - గర్భము
వ్రేఁడు - గొల్లవాఁడు
వ్రేత - గొల్లది
వ్రేపల్లె - గొల్లపల్లె
వ్రేలుమిడి - చిటిక

శంకరుఁడు - శివుఁడు
శంకుల - ఉలి
శంఖనఖము - నత్త
శంబము - వజ్రాయుధము
శంబరారి మన్మథుఁడు
శకటము - బండి
శకలము - ఖండము
శకుంతము - పక్షి
శకుంతి - పక్షి
శకులి - చేఁప
శకృత్తు - పురీషము
శక్తిధరుఁడు - కుమారస్వామి
శక్యము - సాధ్యము
శక్రధనువు - ఇంద్రాయుధము
శక్రుఁడు - ఇంద్రుఁడు
శతకోటి - వజ్రాయుధము
శతపత్రము - తామరపూవు
శతమన్యువు - ఇంద్రుఁడు
శతమానము - నూటికొలఁది
శతము - వంద
శతాంగము - రథము
శతానందము - విష్ణురథము
శతారము - వజ్రాయుధము
శనైశ్చరుఁడు - శని
శపథము - ఒట్టు
శఫరి - చేఁప
శబరి - బోయెత
శబరుఁడు - బోయవాఁడు
శబ్దము - ధ్వని
శబ్దశాస్త్రము - వ్యాకరణము
శమంతకము - ఒక మణి
శమనస్వస - యమునానది
శమనుఁడు - యముఁడు
శయనించు - పరుండు
శయితుఁడు - నిద్రపోతు
శయ్య - పడుక
శరజన్ముఁడు - కుమారస్వామి
శరణ్యుఁడు - వాయువు
శరనిధి - సముద్రము
శరావము - మూఁకుడు
శరాసనము - విల్లు
శర్మము - సంతోషము
శర్వాణి - పార్వతి
శర్వుఁడు - శంకరుఁడు
శలకము - సాలెపురుగు
శలభము - మిడుత
శలము - ఏదుపంది
శలాటువు - పచ్చికాయ
శశధరుఁడు - చంద్రుఁడు
శశము - కుందేలు
శశాంకుఁడు - చంద్రుఁడు

శశాదనము - డేగ
శశి - చందమామ

## శా

శాంభవి-పార్వతి
శాక్యముని - బుద్ధుఁడు
శాఖానగరము - పేట
శాఖామృగము - కోఁతి
శాణము - సానరాయి
శాత్రవుఁడు - విరోధి
శాద్వలము - లేఁబచ్చిక
శాబకము - బిడ్డ
శారిక - గోరువంక
శార్కరము - పాలనురుగు
శార్ఙ్గి - విష్ణువు
శార్దూలము - పులి
శార్వరి - రాత్రి
శాలి - వరి
శాలికుఁడు - సాలెవాఁడు
శాలూరము - కప్ప
శాస్తి - శిక్ష
శాస్త్రము - శాసించుగ్రంథము
శిఖావళము - నెమిలి
శిఖివాహనుఁడు - కుమారస్వామి
శితికంఠుఁడు - శివుఁడు
శిబిక - పల్లకి
శిబిరము - పల్లకిదిగినచోట
శిరస్త్రాణము - కిరీటము
శిరీషము - దిరిసెనపు చెట్టు
శిరోజము - తలవెంట్రుక
శిరోరుహము - తలవెంట్రుక
శిలోచ్చయము - పర్వతము
శిల్పి - నగిషీపనివాఁడు
శివుఁడు - శంకరుఁడు
శిశువు - బిడ్డ

## శీ

శీర్షము - తల
శీర్షకము - కిరీటము
శీలము - మంచినడత

## శు

శుంఠి - సొంటి
శుంఠుఁడు - మూర్ఖుఁడు
శుండాలము - ఏనుఁగు
శుకవాహనుఁడు - మరుఁడు
శుక్లము - తెల్లనిది
శుద్ధాంతము - అంతఃపురము
శునకము - కుక్క
శుభంయువు - శుభముతోకూడుకొనిన వాఁడు.
శూన్యము - సున్న

శూర్పము - చేట
శూలి - శంకరుఁడు

## శృ

శృంఖల - సంకెల
శృంగబేరము - అల్లము
శృంగాటకము - నాలుగు త్రోవలు కలియుచోటు
శృంగారయోని - మన్మథుఁడు

## శే

శేముషి - బుద్ధి
శేవధి - నిధి
శేషుఁడు - వేయిపడగలుగల సర్పము

## శై

శైనేయుఁడు - సాత్యకి
శైలూషుఁడు - నటుఁడు
శైవలిని - నది
శైవాలము - నాచు

## శో

శోచనము - దుఃఖము
శోచనీయము - శోకింపఁదగినది
శోచిష్కేశుఁడు - అగ్ని
శోణితము - నెత్తురు
శోణిమ - ఎఱుపు
శోధని - చీపురుకట్ట
శోభ - కాంతి
శోభనము - సుందరము
శోభితము - ప్రకాశమొందినది
శౌండికుఁడు - కల్లు అమ్మువాఁడు
శౌక్తికేయము - ముత్యము
శౌచము - శుచిత్వము
శ్మశానము - శవముల నశింపఁజేయు చోటు
శ్మశ్రువు - గడ్డము
శ్రద్ధాళువు - వేవిళ్లుఁగల ఆఁడుది
శ్రయణము - ఆశ్రయించుట
శ్రవము - చెవి
శ్రవ్యము - వినఁదగినది

## శ్రా

శ్రాంతి - విశ్రాంతి
శ్రావ్యము - తప్పక వినఁదగినది

## శ్రీ

శ్రీకంఠుఁడు - శంకరుఁడు
శ్రీఖండము - చందనము
శ్రీచూర్ణము - తిరుచూర్ణము
శ్రీదుఁడు - కుబేరుఁడు
శ్రీఫలము - మారేడు

శ్రీముఖము - మతగురువు వ్రాసిపంపెడు పత్రిక
శ్రీసంజ్ఞము - లవంగము

## శ్రో

శ్రోణిఫలకము - మొల
శ్రోత - వినువాఁడు
శ్రోతవ్యము - వినఁదగినది
శ్రోత్రము - చెవి
శ్రోత్రియము - కొద్దిగా పన్ను కట్టి యిచ్చుపొలము.
శ్రోత్రియుఁడు - వేదము చదివిన బ్రాహ్మణుఁడు
శ్లాఘనీయము - పొగడఁదగినది
శ్లిష్టము - కలసినది
శ్లథము - శిథిలమైనది
శ్లేష - కూడిక
శ్లేష్మము - కఫము

## శ్వ

శ్వపచుఁడు - చండాలుఁడు
శ్వభ్రము - రంధ్రము
శ్వయథువు - వాపు
శ్వశురుఁడు - మామ
శ్వశ్రువు - అత్త
శ్వశ్రేయసము - శుభము
శ్వసితము - శ్వాసము
శ్వానము - కుక్క
శ్వావిధము - ఏదుపంది
శ్విత్రము - తెల్లకుష్ఠము

## శ్వే

శ్వేతము - తెలుపు
శ్వేతగరుత్తు - హంస
శ్వేతపత్రము - హంస

## ష

షండుఁడు - నపుంసకుఁడు
షట్కము - ఆఱు
షట్కర్ముఁడు - విప్రుఁడు
షట్పదము - తుమ్మెద
షడాననుఁడు - కుమారస్వామి
షడ్డకుఁడు - తోడల్లుఁడు
షష్టి - అఱువది
షష్ఠము - ఆఱవది
షష్ఠి - ఆఱవది

## షా

షాణ్మాతురుఁడు - కుమారస్వామి

## షో

షోడశము - పదియాఱు

# స

సంకటము - ఇఱుకు
సంకర్షణుఁడు - బలరాముఁడు
సంకలనము - అంకెలకూడిక
సంకలితము - కూర్పుచేయఁబడినది
సంకుచితము - సంకోచము
సంకుమదము - జవ్వాజి
సంకువు - జవ్వాజిపిల్లి
సంక్రందనుఁడు - ఇంద్రుఁడు
సంక్రమించు - ప్రవేశించు
సంక్షేపము - సంగ్రహము
సంఖ్యాతము - లెక్కపెట్టఁబడినది
సంఖ్యావంతుఁడు - విద్వాంసుఁడు
సంఖ్యేయము - లెక్కపెట్టఁదగినది
సంగడీఁడు - స్నేహితుఁడు
సంగమము - కూడిక
సంగము - చేరిక
సంగాతము - స్నేహము
సంగ్రామము - యుద్ధము
సంఘము - సమూహము
సంఘాతము - సముదాయము
సంజ - సంధ్య
సంతతము - ఎల్లప్పుడు
సంతప్తము - తాపమునొందినది
సంతమసము - దట్టమైన చీఁకటి
సంతరించు - రచించు
సంతసము - సంతోషము
సందరము, సంద్రము - సముద్రము
సందిగ్ధము - సందేహము
సందిలి - దండచేయి
సందె - సంధ్య
సందేశము - సమాచారము
సందోహము - సముదాయము
సంధాత - సంధాయకుఁడు
సంధానకరణి - ఓషధివిశేషము
సంధానము - కూర్చుట
సంధాయకుఁడు - సంధానముచేయు వతఁడు
సంధిల్లు - కూడు
సంపఁగె - చంపకము
సంపర్కము - కలయిక
సంపాతము - చక్కఁగా పడుట
సంపృక్తము - సంయుక్తము
సంప్రతించు - లెక్కమొదలయిన వానిని సరిచూచు
సంప్రహారము - యుద్ధము
సంప్రేషణము - ఆనతి
సంప్రదాయము - గురుపారంపర్యము
సంఫుల్లము - వికసించినది
సంబళి - తొలఁగుము
సంభావనీయము - సంభావింపఁదగినది
సంభావించు - సమ్మానించు
సంభూతము - పుట్టినది

సంభోగము - మంచి సుఖము
సంభ్రమించు - తొందరపడు
సంయమము - హింసాదులవలన విర మించుట
సంయుక్తము - కూడుకొన్నది
సంయుగము - యుద్ధము
సంయోగము - చేరిక
సంరంభించు - తొందరపడు
సంరావము - శబ్దము
సంరూఢము - పెరిగినది
సంలాపము - అన్యోన్యసంభాషణము
సంవసథము - గ్రామము
సంవాహకుఁడు - శరీరము పిసుకువాఁడు
సంవృతము - చుట్టుకొనఁబడినది
సంశప్తకుఁడు - తిరుగనని శపథముచేసి యుద్ధము చేయువాఁడు
సంశయిత - సందేహించువాఁడు
సంశ్రయము - ఆశ్రయము
సంశ్రవము - అంగీకారము
సంశ్రుతము - అంగీకరింపఁబడినది
సంశ్లిష్టము - కౌఁగిలింపఁబడినది
సంశ్లేషము - కౌఁగిలింత
సంసక్తము - చేరినది
సంసత్తు - సభ
సంసృతి - సంసారము
సంహతి - సముదాయము
సంహననము - శరీరము
సంహరించు - చంపు
సంహర్త - చంపువాఁడు
సంహూతి - పెక్కుమందిచేరి పిలుచుట
సక్తము - ఒకదానియందు తగిలినది
సక్తువు - పేలపిండి
సక్థి - తొడ
సఖ్యము - స్నేహము
సగుటు - సరాసరి
సగ్ధి - బంతికుడుపు
సజ్జితము - కవచము తొడిగినది
సడి - నింద
సతతము - ఎల్లపుడు
సతము - శాశ్వతము
సత్కృతి - సత్కారము
సత్తి - శక్తి
సత్యానృతము - వర్తకము
సదమదము - నలఁగినది
సదస్సు - సభ
సదా - ఎల్లప్పుడు
సదావృత్తి - వైరాగులకిచ్చు భోజన సామగ్రి
సదృక్షము - సమానము
సదేశము - సమీపము
సద్యము - అప్పుడు
సనాథము - కూడినది
సన్నసన - సులభము

సన్నికర్షము - దాఁపు
సన్నిభము - సమానము
సన్నిహితము - సమీపించినది
సన్నుతి - స్తోత్రము
సన్మానము - గౌరవము
సపత్ని - సవతి
సపర్య - పూజ
సపిండుఁడు - ఏఁడుతరములలోని జ్ఞాతి
సప్తకము - ఏఁడు
సప్తతంతువు - యజ్ఞము
సప్తతి - డెబ్బది
సప్తమము - ఏడవది
సప్తార్చి - అగ్ని
సప్తాశ్వుఁడు - సూర్యుఁడు
సప్తి - గుఱ్ఱము
సప్పము - పాము
సభావము - స్వభావము
సభాసదుఁడు - సభయందుండు ధర్మజ్ఞుఁడు
సమ - సంవత్సరము
సమంజసము - న్యాయముతోఁగూడినది
సమక్షము - ఎదుటిది
సమగ్రము - సమస్తము
సమజ్ఞ - కీర్తి
సమధిగమము - చక్కగా చదువుట
సమన్వితము - కూడినది
సమరధుఁడు - ఒక్కవిలుకానితో సరిగా నిల్చిపోరు యోధుఁడు
సమరము - యుద్ధము
సమయు - నశించు
సమవర్తి - యముఁడు
సమవేతము - కూడిన సంబంధము నొందినది
సమష్టి - మొత్తము
సమసనము - సంక్షేపము
సమస్య - పద్యముయొక్క అంశము
సమాఘాతము - యుద్ధము
సమాజము - సమూహము
సమాప్తము - ముగించునది
సమాపనము - ముగించుట
సమాహృతము - సంగ్రహింపఁబడినది
సమాహృతి - సంగ్రహము
సమిత్తు - యుద్ధము
సమీకము - యుద్ధము
సమీకరణము - ఒకటిగాఁజేయుట
సమీక్ష్యకారి - చక్కగా నాలోచించి చేయు వాఁడు
సమీచీనము - సత్యము
సమీరణము - వాయువు
సమీరుఁడు - వాయువు
సమీహితము - కోరఁబడినది
సముఖము - ఎదురు

సముజ్ఝితము - విడువఁబడినది
సముద్ధతుఁడు - అణఁకువ లేనివాఁడు
సమేతము - కూడినది
సమ్మదము - సంతోషము
సమ్మానము - గౌరవము, గౌరవించుట
సమ్మార్జని - చీఁపురు
సమ్ముదము - సంతోషము
సరకట్టు - వీణెమెట్టు
సరగ - శీఘ్రము
సరగు - వేగము
సరఘ - తేనెటీఁగ
సరటము - తొండ
సరదు - సమభాగముగా పంచు
సరవి - క్రమము
సరసర - తొందర
సరసి - సరస్సు
సరసిజము - పద్మము
సరిచేయు - చంపు
సరిత్తు - నది
సరిహద్దు - పొలిమేర
సరీసృపము - పాము
సరోజము - పద్మము
సరోరుహము - తామరపూవు
సర్జము - మద్దిచెట్టు
సర్పము - పాము
సర్వంసహ - భూమి

సర్వజనీనము - సమస్త జనులకు హితమైనది
సర్వత్ర - ఎల్లెడ
సర్వదా - ఎల్లపుడు
సర్వభక్షకుఁడు - అగ్ని
సర్వమంగళ - పార్వతి
సర్షపము - ఆవాలు
సలిలము - నీరు
సలుగు - ఏదుపంది
సల్లాపము - పరస్పర సంభాషణము
సవరిల్లు - ఒప్పు
సవిత - సూర్యుఁడు
సవిధము - దాపు
సవ్యేష్ఠుఁడు - సారథి
సవ్వడి - జాడ
సహకారము - తియ్యమామిడిచెట్టు
సహకారి - సహాయముచేయువాఁడు
సహచరము - కూడఁదిరుగునది
సహచరుఁడు - మిత్రుఁడు
సహధర్మిణి - అగ్నిసాక్షిగాఁ బెండ్లాడినది
సహనము - ఓర్పు
సహదంష్ట్రము - వేయికోఱలుగల చేఁప
సహస్రపత్రము - పద్మము
సహస్రము - వేయి
సహస్రవేధి - ఇంగువ
సహస్రాక్షుఁడు - ఇంద్రుఁడు

సహాధ్యాయుఁడు - సహపాఠి
సహించు - ఓర్చు
సహితము - కూడుకొన్నది
సహిష్ణువు - ఓర్చువాఁడు
సళువు - భారమైనది

## సా

సాంకవము - జవాది
సాంఖ్యము - యోగవిశేషము
సాంగత్యము - కూడిక
సాంత్వనము - ఓదార్చుట
సాంయాత్రికుఁడు - ఒడనడపువాఁడు
సాంవత్సరుఁడు - జోస్యుఁడు
సాకతము - అనుగ్రహము
సాకిరి - సాక్షి
సాజము - సహజము
సాదము - అన్నము
సాదృశ్యము - పోలిక
సాధనీయము - సాధింపఁదగినది
సాధిష్ఠము - మిగులమంచిది
సాధ్యుఁడు - ఒకదేవత
సాధ్వసము - భయము
సాధ్వి - పతివ్రత
సానుమంతము - పర్వతము
సాపడు - భుజించు
సాపాటు - భోజనము
సాప్తపదీనము - స్నేహము
సామజము - ఏనుఁగు
సామాజికుఁడు - సభయందుండువాఁడు
సామిధేని - సమిధ
సామ్యము - పోలిక
సామ్రాజ్యము - మండలాధిపత్యము
సాయంతనము - సాయంకాలము
సాయుజ్యము - సహయోగము
సారణము - దేగ
సారమేయము - కుక్క
సారసము - తామర
సారస్యము - సరసత్వము
సారూప్యము - సమాన రూపము కలుగుట
సారెకు - మాటిమాటికి
సార్ద్రము - తడిసినది
సార్థకము - సఫలము
సార్థవాహుఁడు - వర్తకుఁడు
సార్వభౌముఁడు - చక్రవర్తి
సాసువులు - ఆవాలు
సాహసికుఁడు - సాహసము కలవాఁడు
సాహిణము - గుఱ్ఱపుశాల
సాహిణి - గుఱ్ఱపువాఁడు
సాళువము - ఒకజాతి డేగ

## సి

సింగారము - శృంగారము
సింగి - ఎఱుకుది
సిందువారము - వావిలిచెట్టు

సింధురము - ఏనుఁగు
సింహసంహననుఁడు - సర్వాంగ సుందరుఁడు
సికతిలము - ఇసుకనేల
సిక్తము - తడిసినది
సిగరము - శిఖరము
సితాభము - కర్పూరము
సిద్ధార్థము - తెల్లావాలు
సిద్ధార్థుఁడు - బుద్ధుఁడు
సిబ్బితి - సిగ్గు
సిలుగు - ఉపద్రవము
సివము - దేవతావేశము
సిస్తు - చక్కఁదనము

## సీ

సీతువు - చలి
సీత్యము - ఒకసారి దున్నిన నేల
సీమంతము - పాపట
సీమంతిని - ఆఁడుది
సీరపాణి - బలరాముఁడు
సీరము - నాఁగలి

## సు

సుంత - కొంచెము
సుకరము - సులభము
సుకుమారము - కోమలము
సుగతుఁడు - బుద్ధదేవుఁడు
సుగుడి - సరసుఁడు
సుడిగట్టు - చక్రవాళ పర్వతము
సుడిగొట్టు - గాలి
సుడివాలు - చక్రాయుధము
సుత్రాముఁడు - ఇంద్రుఁడు
సుధర్మ - దేవసభ
సుధాంశువు - చంద్రుఁడు
సుధి - పండితుఁడు
సునాసీరుఁడు - ఇంద్రుఁడు
సుపర్వుఁడు - దేవత
సుప్తుఁడు - నిద్రించినవాఁడు
సుప్రలాపము - మంచిమాట
సుమంగలి - ముత్తైదువ
సుమము - పువ్వు
సుమేరువు - మేరుపర్వతము
సురంగము - కన్నము
సురటి - వంకర విసనకఱ్ఱ
సురగవి - కామధేనువు
సురతము - సంభోగము
సురదీర్ఘిక - ఆకాశగంగ
సురభిళము - మంచివాసనగలది
సురవర్త్మము - ఆకాశము
సురాలయము - మేరుపర్వతము
సురిగ - ఉపశాఖ
సురియ - చురకత్తి
సువారము - వంట

సువాసిని - ముత్తైదువ
సుషమ - మిక్కిలిశోభ
సుషి - బెజ్జము
సుషుప్తి - ఒడలెఱుఁగని నిద్ర
సుహృదుఁడు - మిత్రుఁడు
సూకరము - పంది
సూచకుఁడు - కొండెము చెప్పువాఁడు
సూచి - సూది
సూటిపడు - సరిపడు
సూడిద - కానుక
సూతిక - బాలెంతరాలు
సూత్రపడు - జతపడు
సూదనము - చంపుట
సూరుఁడు - వంటవాఁడు
సూపకారుఁడు - వంటవాఁడు
సూరెలు - పార్శ్వము
సూర్యకాంతము - సూర్యరశ్మితగులగనే మండెడు ఱాయి
సూర్యతనయ - యమునానది

## సృ

సృగాలము - నక్క
సృజన - సృష్టి
సృణి - అంకుశము

## సె

సెజ్జ - పాన్పు
సెబ్బర - చెడుగు
సెరగు - ఆపద
సెలగ - ఉపశాఖ
సెలగత్తి - కల్లుగీయువాని కత్తి
సెలగు - ఖండించు
సెలగొమ్మ - ఉపశాఖ
సెలగోల - గొల్లవాఁడు పసుల మేపు కోల
సెలపంది - ముండ్లపంది
సెలయేఱు - కొండకాల్వ
సెలవి - పెదవిమూల
సెల్లా - అంచులు కమ్ములులేని పైకండువా

## సే

సేకరించు - తెప్పిరిల్లు
సేతువు - నీటికట్ట
సేద - బడలిక
సేమంతిక - చేమంతిచెట్టు
సేవితుఁడు - సేవింపఁబడినవాఁడు

## సై

సైంధవము - గుఱ్ఱము
సైఁపు - ఓర్పు
సైగ - సంజ్ఞ
సైతము - కూడ
సైదోడు - తోడఁబుట్టువు
సైరణ - సహనము

## సొ

సొంతము - స్వంతము
సొగియు - ఇంపగు

సొత్తు - సొమ్ము
సొన్నారి - అగసాలెవాఁడు
సొబగు - చక్కఁదనము
సొమ్మ - మూర్ఛ
సొమ్మసిల్లు - మూర్ఛిల్లు
సొలు - అనుగుచెట్టు

# సో

సోకుదయ్యము - వాయువు
సోగ - పొడవు
సోడు - బ్రహ్మరంధ్రము
సోఢము - ఓర్వఁబడినది
సోణము - ముక్కుమొదలు
సోదర్యుఁడు - తోఁడబుట్టినవాఁడు
సోద్దెము - ఆశ్చర్యము
సోన - చిన్నవాన
సోమాసి - సోమయాజి
సోమించు - సరిపోలు
సోమిదమ్మ - సోమయాజిభార్య

# సౌ

సౌచికుఁడు - కుట్రపువాఁడు
సౌభ్రాత్రము - మంచి సోదరులుగా నుండుట
సౌరభేయము - ఎద్దు
సౌరభేయి - ఆవు
సౌరి - శని
సౌరు - అందము
సౌవిదల్లుఁడు - కంచుకి
సౌవిదుఁడు - ,,
సౌహార్దము - స్నేహము

# స్క

స్కందుఁడు - కుమారస్వామి
స్కన్నము - జాఱినది

# స్ఖ

స్ఖలనము - జారుట

# స్త

స్తంబేరము - ఏనుఁగు
స్తనంధయుఁడు - పాలుద్రాగెడు బిడ్డ
స్తనము - చన్ను
స్తనితము - ఉఱుము
స్తన్యము - చనుఁబాలు
స్తబకము - పూలగుత్తి
స్తేయము - దొంగతనము
స్తేయి - దొంగ

# స్థా

స్థాత - ఉండువాఁడు
స్థానీయము - పట్టణము

స్థాయి - ఉండునది
స్థాలి - వంటకుండ
స్థావరము - కదలక యుండునది
స్థావిరము - ముసలితనము

## స్థే

స్థేమము - శరీరబలము

## స్న

స్నపనము - స్నానము
స్నస - సన్నని నరము

## స్ని

స్నిగ్ధుఁడు - స్నేహితుఁడు

## స్ను

స్నుష - కోడలు

## స్ప

స్పందము - కొంచెము కదలునది
స్పర్శనము - తాఁకుట
స్పర్శవేధి - పరుసవేది

## స్పృ

స్పృశించు - తాఁకు
స్పృశ్యము - తాకఁదగినది
స్పృహ - కోరిక

## స్ఫ

స్ఫట - పాముపడగ

## స్ఫా

స్ఫాతి - అభివృద్ధి
స్ఫారము - కదలిక

## స్ఫీ

స్ఫీతము - ఎక్కువైనది

## స్ఫు

స్ఫుటనము - భేదించు
స్ఫులింగము - అగ్నికణము

## స్ఫే

స్ఫేష్ఠము - మిగుల ఎక్కువైనది

## స్ఫో

స్ఫోటకము - బొబ్బలుపొక్కు రోగము

## స్మ

స్మరహరుఁడు - శంకరుఁడు
స్మరుఁడు - మన్మధుఁడు
స్మర్త - స్మరించువాఁడు

## స్మి

స్మితము - చిఱునవ్వు

## స్మృ

స్మృతము - తలంపఁబడినది

## స్య

స్యందనము - రథము
స్యందము - కాఱుట
స్యంది - కాఱినది

## స్యా

స్యాలిక - భార్య తోఁబుట్టువు

## స్ర

స్రంసనము - జాఱిపడుట
స్రగ్వి - పూలదండ గలవాఁడు
స్రజము - పూలదండ
స్రవంతి - నది
స్రవణము - కాఱుట
స్రష్ట - బ్రహ్మ
స్రస్తము - జాఱినది

## స్రా

స్రావకము - కాఱునది
స్రావణము - అగసాలెవాని పనిముట్టు

## స్రు

స్రుక్కఁబడు - దుఃఖించు
స్రుతము - కాఱినది

## స్రో

స్రోతస్విని - నది

## స్వ

స్వకము - స్వకీయము
స్వకీయము - తనది
స్వచ్ఛందము - తనది
స్వనము - మ్రోఁత
స్వర్ణది - ఆకాశగంగ
స్వర్ణము - బంగారు
స్వర్భానువు - రాహువు
స్వస - తోడఁబుట్టినది
స్వస్తి - శుభము
స్వస్థము - నెమ్మది

## స్వా

స్వాదనము - పానము
స్వాద్వి - ద్రాక్షచెట్టు
స్వానము - శబ్దము
స్వాపతేయము - డబ్బు
స్వామ్యము - సొంతము

స్వారాజ్యము - స్వర్గలోకపు దొరతనము
స్వారి - విహారము
స్వాస్థ్యము - నెమ్మది
స్వాహా - అగ్నిభార్య

## స్వి

స్విన్నము - చెమటతోఁ గూడినది

## స్వీ

స్వీకారము - అంగీకారము
స్వీకృతము - పైకొనఁబడినది

## స్వే

స్వేదము - చెమట
స్వేదని - పెనము

## స్వై

స్వైరి - స్వతంత్రుఁడు
స్వైరిణి - జారిణి

## హ

హంకారము - అహంకారము
హంత - హింసించువాఁడు
హంవీరుఁడు - క్షత్రియుఁడు
హంసకము - కాలియందె
హజారము - ఆస్థానము
హట్టము - బజారు వీధి
హతి - దెబ్బ
హత్తి - ఏనుఁగు
హత్తు - కలుగు
హత్య - చంపుట
హననము - చంపుట
హనుమఁడు - హనుమంతుఁడు
హనువు - చెక్కిలిమీది భాగము
హయము - గుఱ్ఱము
హరిణము - జింక
హరిదశ్వుఁడు - సూర్యుఁడు
హరిద్ర - పసుపు
హరిన్మణి - మరకతము
హరివాసరము - ఏకాదశి
హరిహయుఁడు - ఇంద్రుఁడు
హరుఁడు - శంకరుఁడు
హరుసము - హర్షము
హర్త - హరించువాఁడు
హర్మ్యము - మిద్దెటిల్లు
హర్యక్షము - సింహము
హర్షము - సంతోషము
హలము - నాగలి
హలాహలము - విషము
హలికుఁడు - రైతు
హలిప్రియ - కల్లు
హల్లకము - చెంగలువ

హావణిక - అలంకారము
హావణు - ఒప్పిదము
హావనము - హోమము
హావ్యము - దేవతలకీయఁదగిన అన్నము
హావ్యవాహనుఁడు - అగ్నిహోత్రుఁడు
హాసని - కుంపటి
హాస్తి - ఏనుఁగు
హాస్తిపకుఁడు - మావటివాఁడు

## హో

హోటకము - బంగారు
హోర్యము - హరింపఁదగినది
హోలికుఁడు - సేద్యగాఁడు
హోవడి - ఉపద్రవము
హోళి - ఆసక్తి

## హి

హింగుళము - ఇంగిలీకము
హిక్క - ఎక్కిలి
హితవు - ఇతవు
హిమకరుఁడు - చంద్రుఁడు
హిమవాలుక - కర్పూరము
హిమాంబువు - పన్నీరు
హిమాంశువు - చంద్రుఁడు
హిరణ్యగర్భుఁడు - బ్రహ్మదేవుఁడు

## హీ

హీనము - తక్కువైనది

## హు

హుటాహుటి - వేగముగలది
హుడుక్కము - ఉడుక
హుతభుక్కు - అగ్ని
హుతవహుఁడు - అగ్ని
హుమాయి - గుఱ్ఱము
హుసారు - జాగ్రత్త
హుళక్కి - అభావము

## హూ

హూణులు - హూణదేశస్థులు
హూతము - పిలువఁదగినది

## హృ

హృతి - హరణము
హృదయంగమము - మనోహరమైనది
హృషీకము - ఇంద్రియము
హృషీకేశుఁడు - విష్ణువు
హృష్టి - సంతోషము
హృష్టుఁడు - సంతోషించినవాఁడు

## హె

హెగ్గడి - అంతఃపురపు కావలివాఁడు
హెచ్చరించు - ఎచ్చరించు
హెచ్చిల్లు - వర్ధిల్లు

## హే

హేమంతము - మంచుకాలము
హేమాహేమీలు - అధికులు
హేయము - విడువఁదగినది
హేరామి - హింసపెట్టుట
హేరాళము - అధికము
హేల - తిరస్కారము
హేష - సకిలింత
హేషితము - గుఱ్ఱము సకిలింత
హేళనము - తిరస్కరించుట

## హొ

హొంత - పరిశ్రమము
హొన్ను - బంగారము
హొయలు - విలాసము
హొరంగు - విలాసము

## హో

హోడము - ఓడ
హోత - ఋగ్వేదము తెలిసిన ఋత్విజుఁడు
హోత్రి - హోత
హోరాట - ఆటోపము
హోరాహోరి - అవిరామము
హోళిపండుగ - కాముని పండుగ

## హ్ర

హ్రదము - పల్లము
హ్రసిష్ఠము - అన్నిటిలో పొట్టిదైనది
హ్రస్వము - పొట్టిది

## హ్రీ

హ్రీ - సిగ్గు
హ్రీణము - సిగ్గునొందినది

## హ్రే

హ్రేష - గుఱ్ఱము సకిలింత
హ్లాదనము - సంతోషము

—(౦)—

# వ్యుత్పత్త్యర్థ పరిచ్ఛేదము

— ం —

అంగదము - అంగమును గాపాడునది-బాహుపురి

అంజనము - కాటుక రంగు కలది - అష్ట దిగ్గజములలో నొక్కటి

అంజలి - భక్తిని వ్యక్తపఱచునది - దోసిలి

అండజము - గ్రుడ్డువలనఁ బుట్టినది - పాము, చేఁప, పక్షి

అంతఃపురము - లోపలి గృహము - రాజకాంతలుండు గృహము

అంతకుఁడు - అంతము కలిగించువాఁడు - యముఁడు

అంతము - జీవితమును ముగించునది - చావు

అంతరిక్షము - తనలోపల నక్షత్రములు గలది - ఆకాశము

అంధకరిపువు - అంధకుఁడను రాక్షసునకు విరోధి - శివుఁడు

అంధకారము - గ్రుడ్డితనము కలిగించునది-చీఁకటి

అంధుఁడు - చెడిన కనుచూపుగలవాఁడు - గ్రుడ్డివాఁడు

అంబిక - ప్రపంచమునకు మాత - పార్వతి

అంబుధి - జలమును ధరించునది - సముద్రము

అంబుభృత్తు - జలమును భరించునది - మేఘము

అంభోరుహము - నీటివలనఁ బుట్టినది - పద్మము

అంశుకము - తంతువులచేఁ గట్టఁబడినది - కోక

అంశుమాలి - కిరణములగుంపు గలవాఁడు- సూర్యుఁడు

అగస్త్యుఁడు - కొండను అడఁచినవాఁడు - ఒక ముని

అగ్ని - ఊర్ధ్వముగను వక్రముగను జ్వలించువాఁడు - అగ్నిదేవుఁడు

అగ్నిభువు - అగ్నివలనఁ బుట్టినవాఁడు - కుమారస్వామి

అఘమర్షణము - సకల పాపములఁబోఁగొట్టునది - ఒక మంత్రము

అచలము - చలనము నొందనిది -పర్వతము

అచ్యుతుఁడు - తనచోటినుండి జారని వాఁడు - విష్ణువు

అజగరము - మేఁకను మ్రింగునది - కొండ చిలువ

అజాగళ స్తనము - మేక మెడక్రింద నుండు స్తనములు - ఉపయోగము లేనివి

అజాత శత్రువు - శత్రువులు లేనివాఁడు - ధర్మరాజు

అజా యుద్ధము - మేకల యుద్ధము - ఆరంభ శూరత్వము

అతిథి - కాల నిర్ణయములేక ఇంటికి భోజ నమునకు వచ్చువాఁడు

అతిరథుఁడు - పెక్కు విలుకాండ్రతో యుద్ధముచేయువాఁడు - ఒక వీరుఁడు

అద్రి - ఫలమూలాదుల ద్వారమున నరు లచే భక్షింపఁబడునది - కొండ

అద్వైతము - ఆత్మ, పరమాత్మల కభేద మును జెప్పునది - ఒక మతము

అధమర్ణుఁడు - నీచమగు అప్పు పుచ్చు కొన్నవాఁడు - అప్పుకలవాఁడు

అధరము - ముఖము క్రింది భాగమున నుండునది - క్రింది పెదవి

అధోక్షజుఁడు - ఇంద్రియములను అధః కరించి జనించినవాఁడు - విష్ణువు

అధ్యాపకుఁడు - వేదమును జదివించు వాఁడు - ఉపాధ్యాయుఁడు

అధ్వరము - వైదిక మార్గము కలిగించు నది - యజ్ఞము

అధ్వర్యుఁడు - యజ్ఞమును అనుభవించు వాఁడు

అనంగుఁడు - శరీరము లేనివాఁడు - మన్మధుఁడు

అనన్యజుఁడు - మనస్సుగాక వేఱు స్థల మందు బుట్టనివాఁడు-మన్మధుఁడు

అనలుఁడు - లోకములు జీవింపఁజేయు వాడు - అగ్నిదేవుఁడు

అనామిక - ప్రసిద్ధమైన పేరులేనిది - దర్భ వ్రేలు

అనిరుద్ధుఁడు - ఇతరులచే నడ్డగింపఁబడని వాఁడు - ఉషయొక్క భర్త

అనిలుఁడు - జీవముల బ్రతికించువాఁడు- వాయుదేవుఁడు

అనీకిని - 2187 రథములు, 2187 గజ ములు, 6561 గుఱ్ఱములు, 10935 పదాతి సైన్యము - సేనా సమూహము

అనుపానము - మందుతోఁ గలియునది - త్రాగు పదార్థము

అనృతము - ఋతము కానిది - అసత్యము

అనేకపము - తొండము తోను, నోటి తోను నీరు త్రాగునది - ఏనుఁగు

అన్వయము - సంబంధింపఁబడునది - కులము

అన్వవాయము - పూర్వాపర్వముల నన్వయింపఁబడునది - వంశము

అపన్థ - మార్గము కానిది - దుర్మార్గము

అపర్ణ - ఆకులనైనతిని తపము చేసినది - పార్వతి

అపవర్గము - దుఃఖాదులను విడుచుట - మోక్షము

అపశబ్దము - దుష్టమైన శబ్దము - చెడ్డ మాట

అపాంపతి - నీటికి అధిపతి - సముద్రము

అపానము - విణ్మూత్రాదులు అధోముఖములై జీవుల బ్రతికించునది - శరీరములో నొక వాయువు

అప్పతి - నీటికి అధిపతి - వరుణుఁడు

అప్సరసలు - నీటియందు బుట్టినవారు - రంభ మొదలైనవారు

అపాంనప్త్రేయుఁడు - వరుసలో నుండఁదగనివాఁడు - నీచుఁడు

అబల - అల్ప బలము కలది - స్త్రీ

అబ్జము - నీటియందుఁ బుట్టినది - తామర, శంఖము

అబ్జుఁడు - నీటియందు బుట్టినవాఁడు - చంద్రుఁడు

అభిజ్ఞుఁడు - వస్తుతత్వము నెఱింగినవాఁడు - నేర్పరి

అభిచారము - ఇతరులచేఁ దిరస్కరించు కొఱకు ఆచరింపఁబడునది - ఒక కర్మ

అబ్ధి - నీటిని ధరించునది - సముద్రము

అభినయము - దీనిచే భావము అభిముఖముగా సూచించఁబడును - హస్త విన్యాసాదికము

అభిసారిక - ప్రియుని గూర్చి సంకేత స్థలమునకుఁ బోవునది - స్త్రీ

అభీప్సితము - పొందుటకు నిశ్చయింపఁబడినది, ఇంపైనది

అమరావతి - దేవతల నివాసస్థానము - ఇంద్రుని ముఖ్య పట్టణము

అమరులు - చావులేనివారు - దేవతలు

అమర్త్యులు - మర్త్యులు కానివారు - (మరణము లేనివారు) దేవతలు

అమాత్యుఁడు - మంత్రాలోచనతోఁ గూడియుండువాఁడు - మంత్రి

అమావాస్య - దీయందు సూర్య చంద్రులు చేరియుందురు - మిగుల చీఁకటిగల రాత్రి

అమృతము - చావును గలిగింపనిది - పానీయము (మోక్షము)

అమృతాంధసులు - అమృతము అన్నముగాఁ గలవారు - దేవతలు

అయోధ్య - యోధులకేని జయింపరానిది - దశరథుని పట్టణము

అరణి - దీనిని మథించి అగ్ని పుట్టింపఁబడును -, అగ్నిని బుట్టించు దారువు

అరవిందము - కేసరములు కలది - తామర పువ్వు

అరాతి - చంపువాఁడు - శత్రువు
అరిష్టము - మంత్రాదులచే రక్షింపఁబడి, పిశాచాదులఁ జొరనివ్వని పిల్లలుకల చోటు - పురిటిల్లు
అర్ఘ్యము - పూజకుఁ దగినది - నీరు మొదలైనవి
అర్జునుఁడు - జయశాలి - ధర్మరాజు తమ్ముఁడు
అలంకరిష్ణువు - అలంకరించుకొను స్వభావము కలవాఁడు - వ్యక్తి
అలంకారము - అందము కలిగించునది - సొమ్ము
అలక - స్వస్థానము నలంకరించునది - కుబేరుని పట్టణము
అలరుమల్లుఁడు - పూవును వింటియందుఁ బాణముగాఁ గలవాఁడు - మన్మథుఁడు
అవభృతము - వ్రతదీక్షను నిర్వహింపఁ బడినది - ఒక విధమైన స్నానము
అవరోధము - ఇందు రాజస్త్రీలు నిరోధింపఁబడుదురు - అంతఃపురము
అవాచి - మధ్యాహ్న కాలమున సూర్యుఁడు దీని ననుసరించును - పడమర.
అశని - ముల్లోకములు దీనిచే భుజింపఁ బడును - వజ్రాయుధము
అశ్లీలము - ఒప్పిదముకాని మాట - పామరుల మాట
అశ్వము - గమనముచే వ్యాపించునది - గుఱ్ఱము.
అశ్వమేధము - గుఱ్ఱమును బలిగాఁజేయు యజ్ఞము - ఒక యజ్ఞము
అషడక్షీణము - ఆఱు కన్నులులేనిది - ఇరువురికంటె ఇతరు లెఱుఁగనిది - మంత్రము
అష్టమూర్తి - పంచభూతములు, సూర్యచంద్రులు, పురుషుఁడు తనయందు మూర్తీభవించిన వాఁడు - శివుఁడు
అష్టాపదము - ఎనిమిది లోహములందు ఉనికి గలది - బంగారము
అసురులు - సురలు కానివారు - రాక్షసులు
అస్త్రము - మంత్రముచేఁ బ్రయోగింపఁ బడునది - ఆయుధము
అహిభుక్కు - పాములను తినువాఁడు - గరుత్మంతుఁడు
అళి - పూవుల నలంకరించునది - తుమ్మెద

## ఆ

ఆంగిరసుఁడు - అంగిరసుని కొడుకు - బృహస్పతి
ఆంజనేయుడు - అంజనాదేవి కుమారుడు - మారుతి
ఆకాంక్ష - అన్వయముకొఱకు క్రియాపద సహాయమున జేయఁబడునది - ఒక ప్రశ్నము
ఆకాశము - దీనియందంతటను సూర్యచంద్రాదులు ప్రకాశింతురు - ఆకసము

ఆఖండలుఁడు - కొండల తెక్కల ఖండిం చినవాఁడు - ఇంద్రుఁడు

ఆఖుభుక్కు - ఎలుకలను దినునది - పిల్లి

ఆఖ్యాయికుఁడు - విషయమును వివర ముగాఁ జెప్పువాఁడు

ఆత్మజుఁడు - తనవలన జనించిన వాఁడు - కొమారుఁడు

ఆత్మభువు - మనస్సునఁ బుట్టినవాఁడు - బ్రహ్మ

ఆదర్శము - నీడను ప్రతిఫలింపఁజేయునది అద్దము

ఆదితేయులు - అదితి కుమారులు- దేవతలు

ఆదిత్యుఁడు - అదితి కుమారుఁడు - సూర్యుఁడు

ఆదిత్యులు - అదితి కుమారులు - దేవతలు

ఆచమనము - నీరు

ఆజ్యము - అన్నాదులయం దుపయోగింపఁ బడునది - నేయి

ఆపగ - నీటిచేఁ బాఱునది - నది

ఆభరణము - శోభకై భరింపఁబడునది - సొమ్ము

ఆమోదము - విశేషముగా ఆమోదింపఁబడి నది - సంతోషము

ఆయుధము - యుద్ధమున కుపయోగింపఁ బడునది - ఖడ్గాదులు

ఆయుష్మంతుఁడు - ఎక్కువ ఆయువు కల వాఁడు - దీర్ఘాయుష్మంతుఁడు

ఆరఘట్టము - బావినీరు పైకిఁ దెప్పించు సాధనము - ఒక యంత్రము

ఆర్తవము - ఋతువునందు జనించునది - రజోబిందువు

ఆర్య - శ్రేష్ఠురాలు, పూజ్యురాలు-పార్వతి

ఆర్షము - ధర్మార్థముగా వరుని వలన గోమిథునము తీసికొని కన్యను ఇచ్చి పెండ్లి చేయుట - ఒక విధమైన వివా హము

ఆశ్రయాశుఁడు - తన ఆశ్రయమునే కాల్చువాఁడు - అగ్నిదేవుఁడు

ఆశ్వినేయులు - అశ్వరూపధారిణి సంజ్ఞా దేవికిని, సూర్యునకును గలిగినవారు - సుందరులైన దేవలోక వైద్యులు

ఆసారము - అంతటఁబడునది - జడివాన

ఆస్తికుఁడు - దేవుఁడున్నాఁడని నమ్ము వాఁడు - ఒక మతస్థుఁడు

ఆహితాగ్ని - అగ్ని నుంచుకొనువాఁడు - సోమయాజి

## ఇ

ఇందిందిరము - పద్మ సంపదతోఁ గూడి నది - తుమ్మెద

ఇందిర - పరమైశ్వర్యము గలది - లక్ష్మీ దేవి

ఇందీవరము - ఐశ్వర్యవతి లక్ష్మీదేవిచే వరింపఁబడినది - నల్లగలువ

ఇందువు - కిరణములతో మంచు గురియు వాఁడు - చంద్రుఁడు
ఇంద్రాణి - ఇంద్రుని భార్య - శచీదేవి
ఇంద్రాయుధము - అనేక రంగులు గలిగి ధనురాకారము కలిగిన మేఘపంక్తి - ఇంద్ర ధనుస్సు
ఇంద్రావరజుఁడు - ఇంద్రుని తమ్ముఁడు - విష్ణువు
ఇంద్రుఁడు - మిగుల ఐశ్వర్యము కల వాఁడు - దేవతల రాజు
ఇక్షుసాయకుఁడు - చెఱకువింటివాఁడు - మన్మథుఁడు
ఇభము - మదమును బొందునది - ఏనుఁగు
ఇతిహాసము - పూర్వరాజుల చరిత్ర - భారతము

## ఈ

ఈశానుఁడు - ఐశ్వర్యము కలవాఁడు - శివుఁడు
ఈశ్వరుఁడు - ఐశ్వర్యము కలవాఁడు - శివుఁడు
ఈశ్వరి-ఈశ్వరుని భార్య-పార్వతి

## ఉ

క్తి - పలుకఁబడునది - వాక్కు
ఉచ్చైశ్శ్రవము - ఉన్నతములైన చెవులు కలది - ఇంద్రుని గుఱ్ఱము
ఉచ్ఛిష్టుఁడు - భోజనము చేసిన తరువాత ముఖము మొదలైనవి కడుగుకొనని వాఁడు - అనాచారి
ఉంఛవృత్తి - త్రోళ్ల దగ్గఱ పడినగింజలను ఏఱుకొని జీవించుట - బీదతనము
ఉదంతము - నిశ్చయమైనది-వృత్తాంతము
ఉదకము - ద్రవమైనది - నీరు
ఉదధి - ఉదకమును ధరించునది - సముద్రము
ఉదానము - కంఠమందుండి, మాట్లాడుటను గలిగించు వాయువు - ఒక వాయువు
ఉపధానము - దీనిమీఁద తల ఉంచఁబడును-దిండు
ఉపరసము - మందులోఁ జేర్చి త్రాగఁబడునది - అనుపానరసము
ఉపవీతము - ఎడమ భుజము దీనిచేఁ గప్పఁబడును - జందెము
ఉపాధ్యాయుఁడు - వేదమును జదివించు వాఁడు - గురువు
ఉపేంద్రుఁడు - ఇంద్రుని తమ్ముఁడు - విష్ణువు
ఉపోద్ఘాతము - మిగుల సమీపమునందు తెలియఁజేయఁబడునది - పీఠిక
ఉమా - ఓ బిడ్డా! వద్దని తల్లిచేఁ దపము నుండి నిషేధింపఁబడినది - పార్వతి
ఉమాపతి - పార్వతికి భర్త - ఈశ్వరుఁడు
ఉరగము - ఉరముచే పోవునది - పాము

ఉర్వి - పర్వతములచేఁ గప్పఁబడినది - భూమి

ఉలూకము - నయనకాంతిచే కాకులను దహించునది - గుడ్లగూబ

ఉల్క - మంటలేని నిప్పు - నిప్పుకణము

## ఊ

ఊధస్యము - పొదుగునందుఁ బుట్టినది - పాలు

ఊర్వశి - మిగుల ప్రకాశించునది

## ఋ

ఋతుమతి - ఋతువును అనుసరించునది - బహిష్టు అయిన స్త్రీ

ఋషభము - ఋషభమువంటి స్వరమును పలుకునది - స్వర విశేషము

## ఏ

ఏకదంతుఁడు - ఒక దంతముకలవాఁడు - వినాయకుఁడు

## ఐ

ఐంద్రజాలికుఁడు - ఇంద్రజాల విద్యనేర్చిన వాఁడు - మాంత్రికుఁడు

ఐరావతము - సముద్రమునఁ బుట్టినది - ఏనుఁగు

ఐశ్వర్యము - ఈశ్వరుని భావము - సంపద

## ఓ

ఓషధీశుఁడు - ఓషధులకురాజు - చంద్రుఁడు

## ఔ

ఔరసుఁడు - తనకు ధర్మపత్నియందుఁ బుట్టినవాఁడు - కుమారుఁడు

ఔర్వము - ఉర్వుఁడనుమౌనికిఁ బుట్టినది - బడబాగ్ని

ఔషధము - ఓషధులచే తయారుచేయఁ బడునది - మందు

## క

కంకణము - మ్రోఁగునది - కడియము

కంచుకము - శరీరమును గప్పునది - కుబుసము, రవికె

కంఠము - పలుకునది - గొంతు

కంఠేకాలుఁడు - కంఠమందు నలుపు గల వాఁడు - ఈశ్వరుఁడు

కందర్పుఁడు - కుత్సితమైన దర్పము గల వాఁడు - మన్మథుఁడు

కందుకము - పీడింపఁబడినది - బంతి

కంబళము - చలిగలిగిన వారిచేఁ గోరఁ బడునది - కంబళి

కంసారాతి - కంసునకు విరోధి - కృష్ణుఁడు

కక్షము - చెమటచేఁ బీడింపఁబడునది - చంక

కచ్ఛపము - తోకచే త్రాగునది - తాఁబేలు
కటకము - పర్వతము చుట్టు నావరించి యుండునది - కొండనెత్తము
కటము - వస్త్రాదులచేఁ గప్పఁబడునది - మొల
కటాక్షము - కన్నుల చివఱ భాగమందు వ్యాపించునది - కడగంటిచూపు
కడలివెన్న - సముద్రమందుఁ బుట్టినది - చంద్రుఁడు
కదంబము - కుత్సితముగా మ్రోగునది - గుంపు
కనకము - ప్రకాశించునది - బంగారు
కనీయుఁడు - కొద్ది వయస్సు గలవాఁడు - తమ్ముఁడు
కన్య - కోరఁబడునది - పెండ్లి కాని బాలిక
కపర్దము - సుఖముచే నిండించునది - శివుని జడల గుంపు
కపర్ది - జడల గుంపు గలవాఁడు - శివుఁడు
కపాలభృత్తు - పుఱ్ఱెను చేతిలో ధరించిన వాఁడు - శివుఁడు
కపాలమోక్షము - సన్న్యాసులు మరణించునపుడు వారి శిరస్సు పగులుటను - చావు భేదము
కపాలి - పుఱ్ఱెను భిక్షా పాత్రముగా గలవాఁడు - శివుఁడు
కపోలము - నమలునపుడు కదలునది - చెక్కిలి
కమండలువు - నీటిని గ్రహించునది - సన్న్యాసుల పాత్ర
కమఠము - నీటియందు వసించునది - తాఁబేలు
కమల - కమలమును హస్తమందు గలది - లక్ష్మి
కమలము - జలమును అలంకరించునది - పద్మము
కమలము - దప్పిగొన్నవారిచేఁ గోరఁబడునది - నీరు
కమలాకరము - పద్మములకు ఉనికి - కొలను
కమలాసనుఁడు - కమలమందు ఆసనము గలవాఁడు - బ్రహ్మ
కమ్మవిలుకాఁడు - ఇంపైన విల్లు కలవాఁడు - మన్మథుఁడు
కరతలామలకము - అరచేతియందలి ఉసిరికవంటిది - విశదము
కరరుహము - చేతియందు బుట్టునది - గోరు
కరి - తొండము గలది - ఏనుగు
కర్ణిక - చెవుల సొమ్ము - పోగు
కర్పూరము - సుఖమును గలిగించునది - రసవస్తువు
కర్షకుఁడు - దున్నువాఁడు - రైతు
కఱివేల్పు - నల్లని దేవుఁడు - విష్ణువు
కవ్వినెచ్చెలి - అర్జునకు స్నేహితుఁడు - కృష్ణుఁడు

కలభము - నీటిని గోరునది - ఏనుఁగు గున్న

కలశము - నీటిని గ్రహించునది - కడవ

కలహాకంఠి - కలహము కంఠమునందు కలది - పోట్లాడు స్వభావము కలది

కలహము - ఇందు వికలురైనవారు హింసింపఁ బడుదురు - జగడము

కలుపతేఁడు - కలువలకు రాజు-చంద్రుఁడు

కలుషము - మనస్సును బీడించునది - పాపము

కల్పము - లోకనాశనము గలిగించునది - ప్రళయము

కల్పవృక్షము - కోరినకోరికల నిచ్చు చెట్టు-దేవవృక్షములలో నొకటి

కల్లరీఁడు - అబద్ధము లాడువాఁడు-చెడ్డ వాఁడు

కవి - చాతుర్యముగా వర్ణించువాఁడు - శుక్రాచార్యుఁడు, పండితుఁడు

కవ్యము - పితృదేవతల కీయఁదగినది - అన్నము

కళ - చంద్రుని $\frac{1}{16}$ వ భాగము - కాంతి చిహ్నము

కళానిధి - కాంతులకు స్థానమైన వాఁడు-చంద్రుఁడు

## కా

కాంత - కోరఁబడునది - స్త్రీ

కాంతారము - ఎవ్వరిచేతను తరింప శక్యము కానిది - అడవి

కాంతి - కోరఁబడునది - కళ

కాందిశీకుఁడు - భయముచే దిక్కులు దెలియక పరుగెత్తినవాఁడు - భయశాలి

కాకోదరము - కాకి పొట్టవంటి పొట్టగలది-పాము

కాకోలము - కాకులలో స్థూలమైనది - మాలకాకి

కాత్యాయిని - మోక్షమునకై కత్యయనుని గోత్రమునఁ బుట్టినది - పార్వతి

కాదంబరి - గోమంత పర్వతమందు గడప చెట్టు తొఱ్ఱలోఁ బుట్టినది - కల్లు

కాదంబిని - కదలికచే కడప చెట్లను పుష్పింపఁజేయునది - మేఘపంక్తి

కామపాలుఁడు - భక్తుల కోరికలను దీర్చు వాఁడు - బలరాముఁడు

కామిని - మిగుల కామము కలది - స్త్రీ

కాముకుఁడు - కామించు స్వభావము కల వాఁడు - వ్యసనపరుఁడు

కాముఁడు - స్త్రీ పురుషులకు కోరిక గలిగించువాఁడు - మన్మథుఁడు

కాయము - అవయవములచేఁ గూర్పఁబడినది - శరీరము

కార్తికేయుఁడు - షట్కృత్తికల కుమారుఁడు - కుమారస్వామి

కార్ముకము - యుద్ధకర్మకు తగినది - విల్లు

కాలకంఠుఁడు - నల్లని కంఠము కలవాఁడు-శివుఁడు

కాలకేయులు - కలకయందు మారీచునకుఁ గలిగిన సంతానము - రాక్షసులు

కాలుఁడు - ధర్మాధర్మములను ఆయువును లెక్కపెట్టువాఁడు - యముఁడు

కావ్యము - కవియొక్క కర్మ - గ్రంథము

కావ్యుఁడు - కవియను ఋషి కుమారుఁడు - శుక్రుఁడు

కాశ్యపుఁడు - కశ్యపబ్రహ్మ పుత్రుఁడు - కణ్వమహాఋషి

కాశ్యపి - యాగదక్షిణగా కశ్యపునకుఁ బరశురామునిచే నివ్వఁబడినది - భూమి

కాసారము - జలమును బ్రవేశింపఁ జేసి కొనునది - కొలను

కాళి - నీలవర్ణము కలది - పార్వతి

కాళింది - కళింద పర్వతమునఁ బుట్టినది - యమునానది

## కి

కింకిణి - కొద్దిగా పలుకునది - చిఱుగంట

కింపురుషుఁడు - కొంచెము పురుషాకృతి గలవాఁడు - దేవతలలో నొకజాతి (కిన్నరుఁడు)

కింవదంతి - సత్యాసత్య నిరూపణకైన వాదము - పుకారు

కిటి - ఇష్టముకొలది సంచరించునది - పంది

కిన్నరులు - గుఱ్ఱపు ముఖము కలవారు - దేవతలలో నొకజాతివారు

కిన్నరేశుఁడు - కిన్నరులకు రాజు - కుబేరుఁడు

కిరాతుఁడు - నెమిలి పింఛము దాల్చు మ్లేచ్ఛుఁడు - అడవి జాతివాఁడు

## కీ

కీరము - కీయను ధ్వనిని గలిగించునది - చిలుక

## కు

కుండకీటుఁడు - చెడిన బ్రాహ్మణ స్త్రీ కుమారుఁడు - సంకరుఁడు

కుండలము - కుండవలె గుండ్రముగా నుండునది - చెవి సొమ్ము

కుంభసంభవుఁడు - కడవలోఁ బుట్టినవాఁడు - అగస్త్యుఁడు, ద్రోణుఁడు

కుంభీనసము - విషజ్వాలలు గ్రక్కు పాము - విషసర్పము

కుడ్యము - పడునప్పుడు మ్రోఁగునది - గోడ

కుతపము - భూమిని తపింపఁజేయునది - దినముయొక్క పగటిలో 15 భాగములలో 8-వ భాగము - 2 గడియల కాలము

కుధరము - భూమిని ధరించునది - కొండ

కుబేరుఁడు - కుత్సితమైన శరీరము కల వాఁడు - యక్షుల రాజు

కుమారుఁడు - కుత్సితులను సంహరించు వాఁడు - కుమారస్వామి

కుముదబాంధవుఁడు - కలువలకు చుట్టమైన వాఁడు - చంద్రుఁడు

కుముదము - భూమిని సంతోషింపఁజేయు నది - తెల్ల కలువ

కుముద్వతి - కలువలు కలది-కొలను

కులపాలిక - కులమును గాపాడునది -పతి వ్రత

కులము - బంధువర్గమును సమకూర్చునది- వంశము

కులాయము - పక్షులు సాయంకాలము చేరు ప్రదేశము - గూడు

కులిశము - కొండ తెక్కలను ఖండించి స్వల్పముగాఁ జేసినది - వజ్రా యుధము

కుశలము - సజ్జనులందు కూడియుండునది- శుభము

కుశేశయము - నీటియం దుండునది - తామరపూవు

కుసుమేషుఁడు - పూవులను బాణములుగాఁ గలవాఁడు - మన్మధుఁడు

కుహూవు - చంద్రుని కళ కనఁబడనిది - అమావాస్య

## కృ

కృతఘ్నుఁడు - చేసినమేలు మఱచిన వాఁడు - దుర్మార్గుఁడు

కృతజ్ఞుఁడు - చేసినమేలు మఱువనివాఁడు- సజ్జనుఁడు

కృతాంతుఁడు - నాశనము చేయువాఁడు యముఁడు

కృతి - మంచిపని చేయువాఁడు - నేర్పరి

కృపణుఁడు - ఒకనికిఁ బెట్టక తాను దినక ధనము గూర్చువాఁడు - లోభి

కృపీటయోని - నీటియందు స్థానము గల వాఁడు - అగ్ని

కృశానుఁడు - తన్ను తాకిన వానిని నాశ నము చేయువాఁడు - అగ్ని

కృషీవలుఁడు - భూమినిదున్ని బ్రతుకు వాఁడు - రైతు

కృష్ణవర్త్మ - నల్లనిజాడ కలవాఁడు - అగ్ని

కృష్ణుఁడు - నల్లనిఛాయ గలవాఁడు -విష్ణువు

## కే

కేకి - కేకారము గలది - నెమలి

కేయూరము - భుజాగ్రమందుండునది - బాహుపురి

కేశవుఁడు - మంచి వెంట్రుకలు కలవాఁడు (లేక) కేశియను రాక్షసుని జంపిన వాఁడు - విష్ణువు

కేసరి - జూలుకలది - సింహము

## కై

కైటభజిత్తు - కైటభుఁడను రాక్షసుని జయించినవాఁడు - విష్ణువు

కైరవము - హంసకుఁ బ్రియమైనది- తెల్ల కలువ

కైలాసము - స్ఫటికములతోఁ గూడు కొన్నది - కుబేరుని దేశము

కైవర్తుఁడు - చేపలు మొదలగువానిని హింసించువాఁడు - జాలరి

కైవల్యము - ఆత్మ శరీరేంద్రియముల విడిచి అపవర్గమును పొందుట - మోక్షము

## కొ

కొక్కురౌతు - మూషక వాహనము నెక్కు వాఁడు - వినాయకుఁడు

## కో

కోకిలము - ఆకర్షణీయమైన పలుకు కలది- కోయిల

కోదండము - వేటాడ సమర్థమైనది- విల్లు

కోవిదుఁడు - ఇది యదియని కాక సమస్తము నెఱింగిన వాఁడు - విద్వాంసుఁడు

కోశకారుఁడు - నిఘంటువులను వ్రాయువాఁడు - మహాపండితుఁడు

## కౌ

కౌణపుఁడు - పీనుఁగును భక్షించు వాఁడు - నిరృతి

కౌమారము - బాల్యమునకు తరు వాతిమెట్టు - వయోవస్థా విశేషము

కౌముది - కలువలు విచ్చుటకుఁ గార ణమైనది - వెన్నెల

కౌమోదకి - భూమిని సంతోషింపఁ జేయునది - విష్ణుమూర్తి గద

కౌశికుఁడు - కుశికముని కుమారుఁడు - విశ్వామిత్రుఁడు

కౌస్తుభము - సముద్రమందు జనించి నది - విష్ణు వక్షస్థలమందలి ఒక మణి

## క్ర

క్రతుభుక్కులు - యజ్ఞభాగమును భుజించువారు - దేవతలు

క్రతువు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులచేఁ జేయఁబడునది - యాగము

క్రవ్యాదుఁడు-నెత్తురు త్రాగువాఁడు-
రాక్షసుఁడు

క్రూరుఁడు-ఇతరుల బాధించువాఁడు-
క్రౌర్యము కలవాఁడు

క్రౌంచదారణుఁడు - క్రౌంచ పర్వ
తమును పగులగొట్టినవాఁడు- కుమార
స్వామి

## క్ష

క్షపాకరుఁడు - రాత్రిని గలిగించు
వాఁడు - చంద్రుఁడు

క్షత్రియుఁడు-క్షతమునుండి కాపాడు
వాఁడు - రాజు

## క్షి

క్షితి - దీనియందు ఎల్లరు వసింతురు -
భూమి

## క్షే

క్షేమము - అశుభమును బోఁగొట్టు
నది - శుభము

## క్షో

క్షోణి - ధ్వని కలిగించునది - భూమి

## క్ష్మా

క్ష్మాభృత్తు-భూమిని భరించువాఁడు-
రాజు (భరించునది) కొండ

## ఖ

ఖండపరశువు - ఖండించు గండ్ర
గొడ్డలి కలవాఁడు - శివుఁడు

ఖంజనము - భాద్రపదము మొదలు
ఆఱు నెలలవఱకు కనఁబడకుండు
నది - కాటుక పిట్ట

ఖగేశ్వరుఁడు - పక్షులకు రాజు -
గరుత్మంతుఁడు

ఖద్యోతము - ఆకాశమందు వెలుఁగు
నది - మిణుగురు పురుగు

ఖర్వుఁడు - వికలాంగులలో శ్రేష్ఠుఁడు-
గుజ్జరి (పొట్టి)

ఖలుఁడు-ధర్మమువలన కదలువాఁడు-
నీచుఁడు.

## గ

గంగ-హరశిరస్సువలనభూమినిబొందినది-
గంగానది

గంగాధరుఁడు - గంగను ధరించిన
వాఁడు - శంకరుఁడు.

గండము - కూడుకొని యున్నది -
చెక్కిలి

గంధమూషి-వాసనగల చిన్న ఎలుక-
చుంచు

గంధర్వులు - గానము ధర్మముగాఁ గల
వారు - దేవతలలో నొక జాతి

గంధవహుఁడు - గంధమును వహిం
చువాఁడు - వాయువు

గంధసారము - గంధముచే శ్రేష్ఠ
మైనది - చందనము

గజాననుఁడు - ఏనుఁగు మొగము కల
వాఁడు - వినాయకుఁడు

గట్టువిల్తుఁడు - మేరు పర్వతము
విల్లుగాఁ గలవాఁడు - శివుఁడు

గణాధిపుఁడు - ప్రమథ గణమునకు
నాయకుఁడు - విఘ్నేశ్వరుఁడు

గణిక - ధనవంతుల గణించునది-
వేశ్య

గరళకంఠుఁడు - విషము కంఠమందుఁ
గలవాఁడు - శివుఁడు

గరళము - ప్రాణమును హరించునది -
విషము

గరుడధ్వజుఁడు - గరుత్మంతుని ధ్వజ
ముగాఁ గలవాఁడు - విష్ణువు

గరుడుఁడు - రెక్కలచే గాలిలో
నెగురువాఁడు - గరుత్మంతుఁడు

గరుత్మంతుఁడు- ప్రశస్తమయిన రెక్కలు
కలవాఁడు - గరుడుఁడు

గవాక్షము - కిరణముల వ్యాపింపఁ
జేయునది - కిటికి

గళము - మ్రింగుటకు సాధనమైనది-
గొంతు

గర్భశత్రువు- పైకి శత్రువుగాఁ గనఁ
బడనివాఁడు - విరోధి

గాంగేయుఁడు - గంగ కొడుకు -
భీష్ముఁడు

గాంధర్వము - గంధర్వుల విద్య -
సంగీతము

గాంధారము - గాంధార దేశస్థులచేఁ
బాడఁబడునది - రాగము (సంగీతము)

గాత్రము - నశించునది - శరీరము

గాములతేడు - గ్రహ రాజు-
సూర్యుఁడు

గిరి - కాలముచేఁ జెరుపఁబడినది-
కొండ

## గి

గిరిజ - (హిమవంతుఁడను) పర్వతరాజు
నకుఁ బుట్టినది - పార్వతి

గిరిశుఁడు - కైలాసమందు శయనించు
వాఁడు - శివుఁడు

గిరీశుఁడు - కైలాసమునకు అధిపతి -
శివుఁడు

## గి

గీర్వాణులు - వేదవాక్కును జెప్పు వారు - దేవతలు

గీష్పతి-వాక్కులకు అధిపతి-బృహస్పతి

## గు

గుదెతాల్పు-గదను ధరించువాఁడు-యముఁడు

గురువు - అజ్ఞానాంధకారమును వొలఁగించువాఁడు - ఉపాధ్యాయుఁడు

గుహుఁడు - తన సేనను గాపాడు వాఁడు - కుమారస్వామి

గుహ్యకులు - నిధులను గాపాడు వారు - దేవతలలో నొకజాతి

గుహ్యకేశ్వరుఁడు - గుహ్యకులకు రాజు - కుబేరుఁడు

## గృ

గృహము-పురుషునిచే సంపాదింపఁబడి ధనాదులను గ్రహించునది - ఇల్లు

## గో

గోత్రభిత్తు - పర్వతములను భేదించు వాఁడు - ఇంద్రుఁడు

గోత్రము - గార్గ్య, వసిష్ఠ, కాశ్యప అని పలుకఁబడునది - వంశము

గోత్రము - భూమిని గాపాడునది-పర్వతము

గోపాలుఁడు - గోవులను గాపాడు వాఁడు - గొల్లవాఁడు

గోరోజనము - ఆవుల ఉదరమునుండి గ్రహింపఁబడునది - ఔషధవస్తువు

గోవిందుఁడు - గోవులు మున్నగు వానికి సంతోషముగలిగించువాఁడు-విష్ణువు

## గౌ

గౌరి - గౌరవర్ణముగలది - పార్వతి

## గ్రా

గ్రాహము - ప్రాణులను గ్రహించునది - మొసలి

## ఘ

ఘటము - నీరు గ్రహింపఁదగినది-కుండ

ఘనము - తాపమును బోఁగొట్టునది-మబ్బు

ఘనసారము - మేఘమువలె చల్లనైనది - కర్పూరము

## ఘా

ఘాతుకుఁడు - చంపు స్వభావము కల వాఁడు - దుర్మార్గుఁడు

# ఘృ

ఘృతము - కరఁగునది - నెయ్యి

# ఘో

ఘోటకము - భూమిమీదఁ బొర్లాడునది - గుఱ్ఱము
ఘోణి - పెద్ద మోరకలది - పంది
ఘోషము - గోవులచే ఘోషింపఁబడునది - గొల్లపల్లె
ఘ్రాణము - వాసన గ్రహించునది - ముక్కు

# చ

చంచరీకము - పూవులలో చరించునది - తుమ్మెద
చండశాసనుఁడు - తీవ్రమైన ఆజ్ఞ కలవాఁడు - రాజు
చండాంశువు - తీవ్రమైన కిరణములు కలవాఁడు - సూర్యుఁడు
చండాలుఁడు - కోపగించుకొను స్వభావము కలవాఁడు - మాలవాఁడు
చండిక - చండాసురుని ఖండించినది - పార్వతి
చంద్రముఁడు - శీతలత్వాదిగుణములచే కర్పూరముతో సమానుఁడు - చంద్రుఁడు
చంద్రశేఖరుఁడు - చంద్రుని శిరస్సునందు గలవాఁడు - శివుఁడు
చంద్రుఁడు - సంతోషింపఁ జేయువాఁడు - చందమామ
చకోరకము - వెన్నెలను త్రాగి సంతోషపడునది - వెన్నెలపులుగు
చక్కెరవింటివాఁడు - చెఱకును విల్లుగాఁ గలవాఁడు - మన్మథుఁడు
చక్రపాణి - సుదర్శన చక్రమును చేతియందుఁ గలవాఁడు - విష్ణువు
చక్రవర్తి - భూచక్రమును పాలించువాఁడు - రాజు
చక్రి - సుదర్శన చక్రమును ఆయుధముగాఁ గలవాఁడు - విష్ణువు
చక్షుశ్శ్రవము - కన్నులే చెవులుగాఁ గలది - పాము
చతురాననుఁడు - నాలుగు మొగములు కలవాఁడు - బ్రహ్మ
చతురుఁడు - ప్రయోజనమును గోరువాఁడు - నేర్పరి
చతుర్భుజుఁడు - నాలుగు భుజములు కలవాఁడు - విష్ణువు
చమువు - శత్రువులను నాశనము చేయునది - సేన
చలివెలుఁగు - చల్లని ప్రకాశముగలవాఁడు - చంద్రుఁడు

చలువలతేఁడు - చల్లఁదనమునకు
రాజు - చంద్రుఁడు

## చా

చాంద్రాయణము - చంద్రుని కళల యొక్క వృద్ధి క్షయములనుబట్టి అన్న కబళములను భుజించు ఒక వ్రతము

చాతుర్మాస్యము - ఆషాఢ శుద్ధము మొదలు కార్తీక శుద్ధమువఱకు నాలుగు నెలలు యతు లాచరించు వ్రతము - వ్రత విశేషము

చామీకరము - చమీకరము అను గనిలోఁ బుట్టినది - బంగారు

చాయ మగఁడు - ఛాయాదేవి భర్త - సూర్యుఁడు

## చి

చింతామణి - కోరిన కోర్కెలు ఇచ్చునది - దేవలోకపు ఒక మణి

చిత్తజుఁడు - చిత్తమందుఁ బుట్టువాఁడు - మన్మథుఁడు

చిత్రభానుఁడు - చిత్రకాంతుల కిరణములు కలవాఁడు - సూర్యుఁడు

చిరంజీవి - చాలకాలము బ్రదుకునది - కాకి

## చీ

చీఁకటిగొంగ - చీఁకటికి శత్రువు - సూర్యుఁడు, చంద్రుఁడు

చీకటివేరువిత్తు - చీఁకటిని బోఁగొట్టు వాఁడు - చంద్రుఁడు

## చు

చుక్కలదొర - చుక్కలరాజు - చంద్రుఁడు

## చూ

చూడామణి - తలపైనుండు ఆభరణము - శిరోభూషణము

## చె

చెఱకువిల్కాఁడు - చెఱకు గడను విల్లుగాఁ గలవాఁడు - మన్మథుఁడు

## చై

చైత్రరధము - చిత్రరధుఁడు అనుగంధర్వునిచే నిర్మింపఁబడినది - కుబేరుని ఉద్యానవనము

## చౌ

చౌదంతి - నాలుగు దంతముల కలది - ఏనుఁగు

## ఛ

ఛవి - చీఁకటిని బోఁగొట్టునది - కాంతి

## ఛా

ఛాందసుఁడు - ఛందోరూపమగు వేదమును జదివినవాఁడు - విప్రుఁడు

## జ

జంటమోములసామి (వేల్పు) - రెండు మోములుగల దేవుఁడు - అగ్ని

జంభభేది - జంభాసురుని సంహరించినవాఁడు - ఇంద్రుఁడు

జంభారి - జంభాసురునకు విరోధి - ఇంద్రుఁడు

జక్కవలఱేఁడు - చక్రవాకముల రాజు - సూర్యుఁడు

జగత్ప్రాణుఁడు - జగత్తునకు ప్రాణము వంటివాఁడు - వాయుదేవుఁడు

జడుఁడు - ఇష్టానిష్ట సుఖముల నెఱుంగనివాఁడు - స్తబ్ధుఁడు

జనకుఁడు - పుట్టుటకుఁ గారణమైనవాఁడు - తండ్రి

జనయిత్రి - బిడ్డలను గనునది - తల్లి

జనార్దనుఁడు - ప్రళయ కాలమందు జనుల బాధించువాఁడు - విష్ణువు

జయంతుఁడు - సౌందర్యముచే నితరుల జయించువాఁడు - ఇంద్రుని కుమారుఁడు

జరద్గవము - ముసలితనము నొందినది - ముసలి యెద్దు

జలదము - నీటిని ఇచ్చునది - మేఘము

జలధరము - నీటిని ధరించునది - మేఘము

జలనిధి - నీటికి నిధియైనది - సముద్రము

జలాశయము - నీటికి ఉనికిపట్టు అయినది - కొలను

## జా

జాంబూనదము - మేరువు దాపున నేరేడు పండ్ల రసముతోఁ బ్రవహించిన నదిలోఁ బుట్టినది - బంగారము

జాతవేదుఁడు - ఇతనివలననే వేదములు పుట్టినవి - అగ్ని

జానకి - జనకుని పుత్రిక - సీత

జాబాలుఁడు - మేకలను గాచువాఁడు - గొల్లవాఁడు

జామాత - భార్యను వివాహార్థము గౌరవించువాఁడు - అల్లుఁడు

జాయ - ఈమెయందు భర్త పుత్రరూపమున జనించును - భార్య

జారుఁడు - పర స్త్రీల యౌవనమును హరించువాఁడు - విటుఁడు

జాలము - కిటికీవలె నుండునది - వల

జాహ్నవి - జహ్నుమహాముని చెవినుండి పుట్టినది - గంగ

## జి

జిఘాంసువు - చంప నిచ్ఛగించువాఁడు - ఘాతుకుఁడు

జిజ్ఞాసువు - తెలియనిచ్ఛగించు వాఁడు - జ్ఞాని

జిష్ణుఁడు - జయింప నిష్టముగలవాఁడు- ఇంద్రుఁడు

జిహ్మగము - వంకరగాఁబోవునది-పాము

## జీ

జీమూతము - నీటిచే బంధింపఁబడునది - మేఘము

జీవదుఁడు - జీవము నిచ్చువాఁడు-వైద్యుఁడు

జీవన్మృతుఁడు - జీవించియు జచ్చిన వానితో సమానుఁడు-నిరుపయోగుఁడు

జీవుఁడు - దేవతలను బ్రదికించువాఁడు- బృహస్పతి

## జై

జైవాతృకుఁడు - పైరులను బ్రదికించు వాఁడు - చంద్రుఁడు

## జ్యో

జ్యోతిష్కుఁడు - నక్షత్రములను గ్రహము లనుదెలుపు శాస్త్రమును దెలిసినవాఁడు- జోస్యుఁడు

## జ్వ

జ్వలనుఁడు-కాల్చు స్వభావము కలవాఁడు- అగ్ని

## జ్వా

జ్వాలాజిహ్వుఁడు - మంటలు అను నాలు కలు గలవాఁడు-అగ్ని

## ఝ

ఝషకేతుఁడు-చేఁప ధ్వజముగాఁగల వాఁడు- మన్మథుఁడు

## త

తంతువాయము - నాభియందలి నూలుచే గూడు నేయునది-సాలెపురుగు

తటాకము - గట్టు వంకరగా గలది-చెఱువు

తటిత్వంతము - మెఱపులు కలది-మేఘము

తటిత్తు - కాంతులఁ గన్నులను మూయించునది - మెఱపు

తత్సమము - సంస్కృతప్రాకృతములతో సమానమై తెనుఁగు విభక్తి ప్రత్యయములతోఁగూడిన పదము - భాషాభేదము

తథ్యము - ఆ పద్ధతిగా మంచిది - నిజము

తద్భవము - సంస్కృత ప్రాకృతముల నుండి పుట్టినది - వికృతి

తనయుఁడు - కులమును సంతోషింపఁ జేయువాఁడు - కొడుకు

తనువు - అన్నాదులచే విస్తారము చేయఁ బడినది - శరీరము

తనూజుఁడు - శరీరమునుండి పుట్టువాఁడు - కుమారుఁడు

తనూరుహము - శరీరమునుండి పుట్టినది- వెంట్రుక-లేక ఱెక్క

తపనీయము - కాచుటకు తగినది - బంగారము

తమస్విని - చీకఁటి కలది - రాత్రి

తమ్మికంటి - పద్మములవంటి కన్నులు కలవాఁడు - విష్ణువు

తమ్మిచూలి-తామరయందుఁ బుట్టినవాఁడు- బ్రహ్మ

తరంగిణి - అలలు కలది - నది

తరక్షువు - పైకిమికి చంపునది - సివంగి

తరణి - అంధకారమునుండి తరింపఁజేయువాఁడు - సూర్యుఁడు

తరణి - దాటచేయునది - ఓడ

తరుణి - ముప్పది యేండ్లకు లోఁబడిన వయస్సు కలది - యౌవనవతి

తర్పణము - పితృ దేవతలను తృప్తిపఱచునది - ఉదకదానము

తలఁబ్రాలు - పెండ్లివేళ వధూవరు లొండొరులు ప్రేమతో తలలపైఁ బోసికొను ధాన్యము - బియ్యము

తలమానికము - అందముగా శిరస్సుపై ధరించెదు రత్నము - జడబిళ్ల

## తా

తాండవము - తండువు అను ఋషిచే బోధింపఁబడినది - నాట్యము

తాంత్రికుఁడు - మతధర్మము విస్తరింప నెఱింగినవాఁడు - తెలిసినవాఁడు

తాఁటదమ్మఁడు-బ్రతుకు దెఱువున కైసన్యాసి వేషము వేసినవాఁడు - బైరాగి

తాత - కులమును విస్తరింపఁ జేయువాఁడు - తండ్రి, తండ్రి తండ్రి

తామరసము - నీటియందుండునది - తామర పువ్వు

తార-నావికులఁ దరింపఁ జేయునది-చుక్క

తారకము - చీఁకటినుండి తరింపఁ జేయునది - కంటి నల్ల గ్రుడ్డు

తారకము - సంసారబంధమునుండితరింపఁ జేయు మంత్రము - రామ నామము

తారకజిత్తు - తారకుఁడను రాక్షసుని జయించినవాఁడు - కుమారస్వామి

తారకేశ్వరుఁడు - నక్షత్రములకు రాజు- చంద్రుఁడు

తారుణ్యము - నడిమి వయస్సు - ప్రాయము

తారేయుఁడు - తారయొక్క కుమారుఁడు- బుధుఁడు లేక అంగదుఁడు

తార్కికుఁడు తర్క శాస్త్రమును దెలిసిన వాఁడు - విద్వాంసుఁడు

తార్క్ష్యుఁడు - తృక్షుఁడను ముని కుమారుఁడు - గరుత్మంతుఁడు

తాలువు - తినిన వస్తు భాగమును తన యందు నిలుపుకొనునది - దౌడ

తాళవృంతకము - తాటి తొడిమవంటి తొడిమకలది - విసనకఱ్ఱ

## తి

తితిక్షువు-సహజముగా ఓర్చుకొనువాఁడు - ఓర్పుశాలి

తిమింగిలము - తిమి అను చేఁపను మ్రింగు పెద్ద చేప - మత్స్యవిశేషము

తిలకము - మెఱుఁగుగా నుండునది - బొట్టు

## తు

తుంటవిలుకాఁడు - చెఱకు గడను విల్లుగా గలవాఁడు - మన్మథుఁడు

తురంగము - వేగముగాఁ బోవునది - గుఱ్ఱము

తురంగవదనుఁడు - గుఱ్ఱపు ముఖము వంటి ముఖము కలవాఁడు - కిన్నరుఁడు

తుషారము - తాపము నొందినవారిని సంతోషపెట్టునది - మంచు

తుహినము - పద్మమును పీడించునది - మంచు

## తూ

తూణము - (తూణీరము) బాణములచే నింపఁబడునది - అమ్ములపొది

తూలము - తూచఁబడునది - దూది

తోయజము - నీటియందుఁ బుట్టినది - తామర

## తో

తోయజాక్షి - కమలములవంటి కన్నులు కల స్త్రీ - సౌందర్యవతి

తోయము - రక్షించునది - నీరు

తోయరుహము - నీటియందుఁ బుట్టినది - కమలము, కలువ

తోరణము - మంగళ కార్యములకు దీనికై త్వరపడుదురు - పత్రమాలిక

తోలువాలుపు - చర్మమును ధరించువాఁడు - శివుఁడు

## త్యా

త్యాగము - ఇచ్చుట - దానము

త్యాజ్యము - విడువఁదగినది - దోషయుక్తమైన కాలము

## త్రి

త్రయి - ఋగ్యజుస్సామములను మూఁటి సమూహము గలది - వేదము

## త్రి

త్రిదశాలయము - దేవతలకు నివాసస్థానము - స్వర్గము

త్రిదశులు - ఎప్పటికిని ముప్పదేండ్ల వయస్సుగలవారు - దేవతలు

త్రిదివము - బ్రహ్మ విష్ణు మహేశ్వరుల క్రీడాస్థానము - స్వర్గము

త్రిదివేశుఁడు - స్వర్గమునకు రాజు - ఇంద్రుఁడు

త్రినయనుఁడు - మూఁడు కన్నులు కలవాఁడు - ఈశ్వరుఁడు

త్రిపథగ - స్వర్గ మర్త్య పాతాళ లోకములందుఁ బ్రవహించునది - గంగానది

త్రిపురాంతకుఁడు - మూడు పురములు నాశనము చేసినవాఁడు - శివుఁడు

త్రియామ - మూఁడు జాములు కలది - రాత్రి

త్రిలింగము - శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వరములను త్రిలింగ క్షేత్రముల మధ్యదేశము - ఆంధ్రదేశము

త్రిలోచనుఁడు - మూడు కన్నులు కలవాఁడు - శివుఁడు

త్రివిక్రముఁడు - మూఁడు లోకములు నాక్రమించినవాఁడు - విష్ణువు

త్రివిష్టపము - మూఁడవలోకము - స్వర్గము

## త్ర్య

త్ర్యంబకసఖుఁడు - శివుని స్నేహితుఁడు - కుబేరుఁడు

త్ర్యంబకుఁడు - మూఁడు కన్నులు కలవాఁడు - శివుఁడు

## ద

దండధరుఁడు - కాలదండమును ధరించినవాఁడు - యముఁడు

దండపాణి - కాలదండమును ధరించినవాఁడు - యముఁడు

దండప్రణామము - దండమువలె చక్కఁగా భూమిపై వ్రాలి నమస్కరించుట - నమస్కారము

దండపాశికుఁడు - చోర భయమునుండి పట్టణమును గాపాడువాఁడు - అధికారి

దంతము - భక్ష్యములు దీనిచే భక్షింపఁబడును - పల్లు

దంతి - దంతములు కలది - ఏనుఁగు

దంష్ట్రి - వాఁడి దంతములు కలది - అడవిపంది

దక్కినంపుసామి - దక్షిణ దిశ కధిపతి - యముఁడు

దనుజులు - కశ్యపునకు దనువను భార్యయందుఁ బుట్టినవారు - రాక్షసులు

దమము - బ్రహ్మచర్యాది క్లేశముల నోర్చుట - సుగుణములలో నొకటి

దమయంతి తన-చక్కఁదనముచే నితరుల (దమించు) నణఁచునది - నలునిభార్య

దరిద్రుఁడు - దుర్గతిని బొందువాఁడు - పేద

దర్పకుఁడు - గర్వింపఁజేయువాఁడు - మన్మథుఁడు

దర్పణము - దీనిచే వేషాభిమానము కలిగి గర్వపడుదురు - అద్దము

దర్శము - అమావాస్యనాడు చేయఁబడు నది - పితృకార్యము

దశకంఠుఁడు - పదికంఠములు కలవాఁడు - రావణుఁడు

దశనము - కొఱుకుటకు నుపయోగపడు నది - పల్లు

దశరథుఁడు - పది రథములు కలవాఁడు - అయోధ్య రాజు

దశాహము - చనిపోయినవారికి పదియవ రోజు చేయు కర్మ - పితృకర్మ

దహనుఁడు - అన్నిటిని గాల్చువాఁడు - అగ్ని

## దా

దాక్షాయణి - దక్షుని కొమార్తె - (శివుని భార్య) - పార్వతి

దాంతి-బ్రహ్మచర్యాది క్లేశముల నోర్చుట-సుగుణములలో నొకటి

దామోదరుఁడు - తులసి మాలికను ఉదరముపైఁ గలవాఁడు - విష్ణువు

దార్ష్టాంతికము - దృష్టాంతముతోఁగూడినది-ఉదాహరణము

## ది

దిగంబరుఁడు - దిసమొలవాఁడు - శివుఁడు

దినకరుఁడు - దినమును గలిగించువాఁడు - సూర్యుఁడు

దివము - ఇందు దేవతలు క్రీడింతురు - స్వర్గము

దివస్పతి - స్వర్గమునకు రాజు - ఇంద్రుఁడు

దివాంధము - పగలు కన్నులు కనఁబడ నిది - గుడ్లగూబ

దివాకరుఁడు - దినమును గలుగఁజేయుఁ వాఁడు - సూర్యుఁడు

దివాభీతి - కారణములేకయే భయపడు వాఁడు - భయశాలి

దివిషదులు - స్వర్గమందుండువారు - దేవతలు

దివౌకసులు-స్వర్గమందు నివసించువారు - దేవతలు

దిశ - తూర్పు, దక్షిణము మున్నగుభేదము లచే గుర్తింపఁబడునది-దిక్కు

## దీ

దీక్షితుఁడు - యజ్ఞమందు దీక్షగలవాఁడు - ఆచారవంతుఁడు

దీర్ఘదర్శి - దూరమైన చూపు గలవాఁడు - విద్వాంసుఁడు, గ్రద్ద,

దీర్ఘాయువు - చాలకాలము బ్రతుకువాఁడు - మార్కండేయుఁడు, (కాకి, బూరుగు చెట్టు)

దీపావళి - దీపముల సమూహము-హిందువుల పండుగ

## దు

దుకూలము - కట్టుకొనుటకును మీఁదవేసి కొనుటకును రెండు విధములుగాఁ ఉపయోగింపఁబడునది-విలువఁగల పట్టు వస్త్రము

దుఃఖము - ఇంద్రియములచెడ్డవిగాఁ జేయునది - శోకము (శరీరపీడ)

దురాచారుఁడు - చెడ్డవర్తన గలవాఁడు - దుర్మార్గుఁడు

దురాత్ముఁడు - చెడ్డ ఆత్మకలవాఁడు - దుర్మార్గుఁడు

దుర్గ - [illegible] దుర్గము నివాసముగాఁగలది - పార్వతి

దుర్గము - ప్రయాసముచేఁ బోఁదగినది - కోట

దుర్దినము - మేఘ మావరించి, సూర్య బింబము గనుపింపరానిది- చెడదినము

## దూ

దూతి-విటీవిటకుల కన్యోన్య విషయములఁ దెలుపునది - తార్పుకత్తె

దూత్యము - దూత స్వభావము - దూత ధర్మము

దూరదర్శి - దూరముగా (ఆలోచించు) చూచువాఁడు - విద్వాంసుడు, గ్రద్ద

## దృ

దృగాయుధుఁడు - చూపు ఆయుధముగా గలవాఁడు - శివుఁడు

## దే

దేవలుఁడు - దేవతలను బూజించువాఁడు - అర్చకుఁడు

దేవి - క్రీడించునది - పార్వతి

దేవులు - ఎల్లప్పుడు క్రీడించువారు - దేవతలు

## దై

దైతేయులు - కశ్యపునకు దితియందుఁ గలిగిన సమూహము - రాక్షసులు

దైత్యులు - కశ్యపునకు దితియందుఁ బుట్టినవారు - రాక్షసులు

దైవజ్ఞుఁడు - కలుగఁబోవు శుభాశుభముల నెఱిఁగినవాఁడు - జోస్యుఁడు

## దో

దోషజ్ఞుఁడు - దోషము నెఱిఁగినవాఁడు - పండితుఁడు

దోహదము - అకాలమందు పుష్పాదులు జనింపఁ జేయుటకు స్త్రీలుచేయు పాద తాడనాదికము - అలంకార క్రియ

## ద్యు

ద్యుమణి - ఆకాశమందలిమణి-సూర్యుఁడు

## ద్వి

ద్విజరాజు - బ్రాహ్మణులకు రాజు - చంద్రుఁడు

ద్విజము - గర్భమునుండి గ్రుడ్డునుండి పుట్టునవి - పక్షి, పాము, కప్ప, బల్లి మొదలైనవి

ద్విజుఁడు - జననము ఉపనయనము అను రెండు పుట్టుకలు కలవాఁడు - బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు

ద్విపము - తొండము, నోరు - ఈ రెంటిచేత త్రాగునది - ఏనుఁగు

ద్విరదము - రెండు దంతములు కలది - ఏనుఁగు

ద్విరేఫము - భ్రమరము - ఈ పదమందు రెండు రేఫములు కలది - తుమ్మెద

## ద్వీ

ద్వీపము - ఇరుప్రక్కల జలము ప్రవహించుట కలది - దీవి

## ద్వై

ద్వైతము - జీవాత్మపరమాత్మలకు భేదము కల్పించునది - ఒక మతము

ద్వైపాయనుఁడు - ద్వీపము నివాసముగాఁ గలవాఁడు - వ్యాసుఁడు

## ద్ర

ద్రవిణము - వ్యయమగునది - ధనము

ద్రవ్యము - పొందఁబడునది - ధనము

## ద్రా

ద్రావకము - యంత్ర సహాయమునఁ రస గంధకముల ద్రవముగాఁ జేయుట - రస విశేషము

## ధ

ధనంజయుఁడు - ధనమును జయించిన వాఁడు-అర్జునుఁడు - అగ్ని

ధనదుఁడు - ధనము నిచ్చువాఁడు - కుబేరుఁడు

ధనము - సంతోషము గలిగించునది - విత్తము

ధనాధిపుఁడు - ధనమునకు అధికారి - కుబేరుఁడు

ధనుష్మంతుఁడు - ధనువు కలవాఁడు - విలుకాఁడు

ధమనుఁడు - కొలిమి తిత్తుల నూదు వాఁడు - కమ్మరి

ధరణీ ధరము - భూమిని ధరించునది - పర్వతము

ధరణి - శైలకాననాదులఁ దాల్చినది - భూమి

ధరిత్రి - అంతయు ధరించినది - భూమి

ధర్మకర్త - దేవాలయ, సత్రములందు ధర్మ కార్యములు చేయించువాఁడు - ధర్మ కార్యాధికారి

ధర్మపత్ని - అగ్నిసాక్షిగాఁ బెండ్లాడినది - భార్య

ధర్మరాజు - ధర్మముల ననుసరించువాఁడు - బుద్ధుడు, పాండురాజు కుమారుఁడు

ధర్మరాజు - అపరాధులను న్యాయముగా శిక్షించువాఁడు - యముఁడు

ధర్మధ్వజ తంసికుఁడు - దాతననిపించుకొను టకు, అన్యాయార్జిత ధనము దానమిచ్చు వాఁడు - మెఱమెచ్చుల దాత

ధర్మాసనము - న్యాయాధికారి కూర్చుండు చోటు - అధ్యక్ష పీఠము

ధవుఁడు - స్త్రీని గదల్చువాఁడు - భర్త

## ధా

ధాత - సర్వమును ధరించినవాఁడు - బ్రహ్మ

ధానుష్కుఁడు - విల్లును దాల్చిన వాఁడు - విలుకాఁడు

ధారాదత్తము - మంత్ర॥ పూర్వక। ప్రజల ధారతో నిచ్చునది - దానము

ధారాధరము - నీటిధారను ధరించునది మేఘము

## ధి

ధిషణుఁడు - బుద్ధిశాలి - బృహస్పతి

## ధీ

ధీమంతుఁడు - బుద్ధిమంతుఁడు - పండితుఁడు

ధీర - వ్యంగ్యముగాఁ గోపమును బ్రకాశింపఁ జేయునది - నాయిక

ధీరాధీర - వ్యంగ్యా వ్యంగముగాఁ గోపము బ్రకటించునది - నాయిక

ధీవరుఁడు - చేపలను బట్టువాఁడు - జాలరి

## ధూ

ధూమయోని - పొగను కారణముగాఁ గల వాఁడు - అగ్ని

ధూర్జటి - బరువైన జడలు కలవాఁడు - శివుఁడు

## ధే

ధేనువు - దూడకు పాలు కుడుపునది - ఆవు

## ధై

ధైవతము - బుద్ధిమంతులచేఁ బాడఁబడు నది - ఒక స్వరము

# న

నందకము - దేవతలను సంతోషపఱచు నది - విష్ణుని ఖడ్గము
నందనము - సంతోషము కలిగించునది - ఇంద్రుని ఉద్యానవనము
నందనుఁడు - తలిదండ్రులకు సంతోషము గలిగించువాఁడు - కుమారుఁడు
నక్తంచరుఁడు - రాత్రి చరించువాఁడు - రాక్షసుఁడు
నక్రము - భూమిమీఁదఁ బాదము పెట్టనిది - మొసలి
నక్షత్రము - నాశము పొందనిది - చుక్క
నఖము - స్పర్శజ్ఞానములేని ఇంద్రియము - గోరు
నగము - గమనములేనిది - పర్వతము
నటి - నాట్యముచేయు స్త్రీ - నాట్యకర్త్రి
నవఁబోఁడి - తీగవంటి శరీరముకలది - స్త్రీ
నముచిసూదనుఁడు - నముచి అను రాక్షసుని చంపినవాఁడు - ఇంద్రుఁడు
నరకము - నరులను మొఱపెట్టించునది - ఒక లోకము
నరవాహనుఁడు - మనుష్యుఁడు వాహనముగాఁగలవాఁడు - కుబేరుఁడు
నరుఁడు - అన్నిటిని దన వశము గావించుకొనువాఁడు - మనుష్యుఁడు
నర్తకి - నాట్యముచేయునది - నటనకర్త్రి
నర్మద - క్రీడను ఇచ్చునది - ఒక నది
నలకూబరుఁడు - కమలముచేఁ గీర్తింపఁబడువాఁడు - కుబేరుని పుత్రుఁడు
నలువ - నాలుగు నోళ్లుగలవాఁడు - బ్రహ్మ

# నా

నాకము - దుఃఖములేని లోకము - స్వర్గము
నాగము - పర్వతమందుఁబుట్టినది - ఏనుఁగు, సీసము
నాగరుఁడు - నగరమందు కాపురముండువాఁడు - నగరవాసి
నాగాంతకుఁడు - పాములను జంపువాఁడు - గరుత్మంతుఁడు
నాట్యము - నటుని కర్మ - ఆట
నాభిజన్ముఁడు - బొడ్డునందుఁబుట్టినవాఁడు - బ్రహ్మ
నామధేయము - దీనిచేఁ బలుకఁబడినది - పేరు
నారదుఁడు - కలహముచే జనుల భేదించువాఁడు - దేవర్షి
నారాయణుఁడు - నీటియందు స్థానముగాఁ గలవాఁడు విష్ణువు
నారి - నరుని తన వశముచేసికొనునది - స్త్రీ
నాశము - నశించుట - చావు
నాస - ధ్వనిచేయునది - ముక్కు
నాస్తికుఁడు - ఈ లోకమే కాని పరలోకము లేదనువాఁడు - దేవుఁడు లేఁడని వాదించువాఁడు

# ని

నికేతనము - దీనియందు నివసింతురు - ఇల్లు

నిఘంటువు - పదముల అర్థమును దెలియఁజేయు గ్రంథము - ప్రమాణ గ్రంథము

నితంబము - సురత ఘట్టనచే కష్టపడునది - పిఱుదు

నితంబిని - గొప్ప పిఱుదులు కలది - స్త్రీ

నిధనము - ధన సంబంధము దీనియందు పోవును - చావు

నిధీశుఁడు - నవనిధులకు అధికారి - కుబేరుఁడు

నిపానము - పశువులు నీరు త్రాగుటకై నిర్మితమగునది - నీటి తొట్టి

నిమ్నగ - పల్లమును గూర్చి పోవునది - నది

నిరాకారుఁడు - ఆకారము లేనివాఁడు - దేవుఁడు

నిర్ఘృణుఁడు - దయలేనివాఁడు - నిర్దయుఁడు

నిర్జరులు - ముసలితనము లేనివారు - దేవతలు

నిర్భాగ్యుఁడు - భాగ్యము లేనివాఁడు - అదృష్టహీనుఁడు

నిర్వచనము - అర్థమును వివరించిచెప్పుట - వివరము

నిర్వాణము - దుఃఖాది క్లేశములు లేనిది - మోక్షము

నివాపము - పితృదేవతలకై చేయునది - జలాది దానము

నిశ - వ్యాపారములు దీనియందు మందముగా నగును - రాత్రి

నిశాటుఁడు - రాత్రివేళ చరించువాఁడు - రాక్షసుఁడు

నిశాపతి - రాత్రికి అధిపతి - చంద్రుఁడు

నిశీథిని - నడిరేయి కలది - రాత్రి

నిషాదుఁడు - పాపము కలవాఁడు - మాలవాఁడు

నిస్సంగుఁడు - కుటుంబ సంబందము లేనివాఁడు - ఋషి

నీచుఁడు - తక్కువను బొందువాఁడు - నీచుఁడు

నీడము - గడ్డి పోచలు మున్నగునవి దీనియందుంచఁబడును - గూడు

నీరజభవుఁడు - కమలమందుఁ బుట్టినవాఁడు - బ్రహ్మ

నీరజము - నీటియందుఁ బుట్టినది - కమలము

నీరదము - నీటిని ఇచ్చునది - మేఘము

నీరాటము - నీటియందు సంచరించునది మొసలి, తిమింగలము

నీలకంఠము - నల్లని మెడకలది - నెమ

నీలకంఠుఁడు - నల్లని కంఠము కలవాఁడు- శివుఁడు

నీలలోహితుఁడు - కంఠము నలుపుగను, వెంట్రుకలు ఎఱుపుగను గలవాఁడు - ఈశ్వరుఁడు

నీలాంబరుఁడు - నల్లనివస్త్రము కలవాఁడు- బలరాముఁడు

నీళ్లరాయఁడు - నీటికి అధిపతి - వరుణుఁడు

నీహారము - నిప్పుచే హరింపఁబడునది - మంచు

## నృ

నృత్తము - అంగ విక్షేపముచేయుట - ఆట

నృత్యము - నర్తించుట - ఆట

నృపుఁడు - నరులను పాలించువాఁడు-రాజు

నృశంసుఁడు - నరులను బాధించువాఁడు - దుర్మార్గుఁడు

## నే

నేపథ్యము - నాట్య రంగమందలి శ్రోత్ర దేశము - నాట్య రంగస్థల భాగము

## నై

నైచికి - రూపము చక్కఁగానుండి, పాలు ఎక్కువగానిచ్చు ఆవు - ధేనువు

నైవేద్యము - భగవంతునకు నివేదింపఁ దగినవి - ఆహార ఫలాదులు

## ప

పంకజము - బురదలోఁ బుట్టినది - పద్మము

పంక్తి కంఠుఁడు - వరుసగా కంఠములు కలవాఁడు లేక పది కంఠములు కల వాఁడు - రావణుఁడు

పంక్తి కంధరుఁడు - వరుసగా కంఠములు కలవాఁడు, లేక పది కంఠములు కల వాఁడు - రావణుఁడు

పంచజనుఁడు - పంచ భూతములవలనఁ బుట్టినవాఁడు - మనుష్యుఁడు

పంచమము - నాభి, ఉరము, హృదయము, కంఠము, శిరము - అను ఐదు స్థానము లందుఁ బుట్టినది - ఒక స్వరము

పంచలక్షణము - ఐదు లక్షణములు గల గ్రంథము - పురాణము

పంచశరుఁడు - ఉన్మాదన, తాపన, శోషణ స్తంభన, సమ్మోహనములను ఐదు బాణములు కలవాఁడు - మన్మథుఁడు

పంచాంగము - తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములను అయిదంగములఁ జూపు గ్రంథము - సాంవత్సరిక గ్రంథము

పంచాంగము - ఐదు అంగములు కలది - తాఁబేలు

పంచామృతము - పాలు, పెరుగు, వెన్న, తేనె, నీరు - వీని మిశ్రమము-పవిత్ర తీర్థము

పంచాస్యము - వెడల్పయిన ముఖము కలది - సింహము

పంచాస్యుఁడు - ఈశానము, తత్పురుషము, వామదేవము, సద్యోజాతము, అఘోరము అను ఐదు ముఖములు కలవాఁడు - శివుఁడు

పండితంమన్యుఁడు - పండితుఁడనని అనుకొనువాఁడు - పామరుఁడు

పండితపుత్రుఁడు - పండితుని కుమారుఁడు - శుంఠ

పండితుఁడు - బుద్ధిశాలి - విద్వాంసుఁడు

పచ్చవిల్తుఁడు - పచ్చని విల్లు కలవాఁడు - మన్మథుఁడు

పడమటి దొర - పశ్చిమ దిక్కునకు అధిపతి - వరుణుఁడు

పణము - వ్యవహరింపఁబడునది - జూదము

పతగము - ఎగురుచుఁబోవునది - పక్షి

పతత్రము - క్రిందఁ బడనీక కాపాడునది - రెక్క

పతత్రి - రెక్కలు కలది - పక్షి

పతి - కాపాడువాఁడు - భర్త

పతివ్రత - పతిసేవయే వ్రతముగాఁ గలది - సాధ్వి

పత్ని - పతితో యోగము కలది - భార్య

పదచ్ఛేదము - పదములను విభజించుట - పదవిభాగము

పద్మ - తామరను చేతియందుఁ గలది - లక్ష్మి

పద్మరాగము - తామర యొక్క ఎఱుపు వంటి ఎఱుపు కలది - కెంపు

పద్మాలయ - తామరను గృహముగాఁగలది - లక్ష్మి

పద్మి - శరీరమందు చుక్కలు గలది - ఏనుఁగు

పద్మిని - తామరను గలది - తామర తీఁగ, లక్ష్మి, తటాకము

పద్మినీవల్లభుఁడు - పద్మములకు భర్త - సూర్యుఁడు

పన్నగము - పాదములు లేకయే పోవునది - పాము

పన్నగాశనుఁడు - పాములను ఆహారముగాఁగలవాఁడు - గరుత్మంతుఁడు

పయోజము - నీటియందుఁ బుట్టినది - తామర

పయోదము - నీటిని ఇచ్చునది - మేఘము

పరంతపుఁడు - వైరులను తపింపఁజేయువాఁడు - వీరుఁడు

పరభృతము - పరులచేఁ (కాకులచే) బెంపఁబడునది - కోకిల

పరమహంస - ఉత్తమస్థితిని బొందిన సన్యాసి

పరమాన్నము - పాలు, బెల్లము - (పంచ

దార)తో వండిన అన్నము - పాయసము

పరమేష్ఠి - ఉత్కృష్టమైన పదవియం దుండువాఁడు - బ్రహ్మ

పరశురాముఁడు - గండ్రగొడ్డలిని ఆయుధముగాఁ గల రాముఁడు - రేణుకా జమదగ్నుల కుమారుఁడు

పరాధీనుఁడు - ఇతరుల వశమైనవాఁడు - పరతంత్రుఁడు

పరిపంథి - బంధించువాఁడు - విరోధి

పరిధానము - ధరింపఁబడినది - వస్త్రము

పరిమళము - సుగంధ మిశ్రితము - గంధ విశేషము

పరిష్వంగము - శరీరమంతట గలిగినది - కౌఁగిలి

పరేతరాట్టు - చనిపోయిన వారికి రాజు - యముఁడు

పర్యంకము - దీనిపై మనుష్యుఁడు భోగమందును - శయ్య

పర్వతము - అనేక సంధులు కలది - కొండ

పలుకువెలఁది మగఁడు - సరస్వతికి భర్త - బ్రహ్మ

పవనము - పరిశుభ్రము చేయునది - గాలి

పవనాశనము - గాలి ఆహారముగాఁ గలది - పాము

పవనుఁడు - ఎల్లప్పుడు సంచరించువాఁడు - వాయుదేవుఁడు

పవమానుఁడు - పావనము చేయువాఁడు - వాయుదేవుఁడు

పశుపతి - ప్రమధ గణమునకు, జంతువులకు భర్త - శివుఁడు

## పా

పాంచజన్యము - సముద్రమందు తిమిరూపమునను్న పంచజనుఁడను రాక్షసుని ఎముకవలనఁ బుట్టినది - విష్ణుమూర్తి శంఖము

పాండవులు - పాండురాజు కుమారులు - ధర్మరాజు మొదలైనవారు

పాంసుల - దుష్టవర్తన గలది - అంకులాఁడి

పాకశాసనుఁడు - పాకుఁడు అను రాక్షసుని జంపినవాఁడు - ఇంద్రుఁడు

పాకశాసని - పాకశాసనుని (ఇంద్రుని) కుమారుఁడు - జయంతుఁడు

పాణిగృహీత - వివాహము కాక ముందు ఉంచుకొనఁబడినది - ఉంపుడుగత్తె

పాణిగృహీతి - అగ్నిసాక్షిగాఁ బెండ్లియాడిన స్త్రీ - భార్య

పాతాళము - పాపులు చెందులోకము - అధోలోకము

పాదపము - వ్రేళ్లతో నీరు త్రాగునది - చెట్టు

పాద్యము - కాళ్లు గడుగుకొనుట కగు నీరు - నీరు

పానీయము - త్రాగఁదగినది - మంచినీరు

పాపజందెముల మేటి - పాములను జన్ని దములుగాఁ గలవాఁడు - వినాయకుఁడు

పామరుఁడు - పాపము గలవాఁడు - నీచుఁడు

పారణ - ఉపవాస ముండి మఱునాఁడు భుజించుట - భోజనము

పారదము - రోగమును అంతము చేయు నది - పాదరసము

పారావారము - అంతులేని తీరముగలది - సముద్రము

పారిజాతము - సముద్ర మథనమునఁ బుట్టి నది - దేవవృక్షములలో నొకటి

పార్థివుఁడు - పృథివికి ప్రభువు - రాజు

పార్థుఁడు - పృథ (కుంతి) కుమారుఁడు - అర్జునుఁడు

పార్వతి - హిమవంతుఁడను. పర్వతునకు కొమార్తె - శివుని భార్య

పాలకడలల్లుఁడు - పాల సముద్రమునకు అల్లుఁడు - విష్ణువు

పావకుఁడు - పావనము చేయువాఁడు - అగ్ని

పాశి - పాశము ఆయుధముగాఁగలవాఁడు - వరుణుఁడు

## పి

పికము - చాటున నుండి కూయునది - కోకిల

పిత - కాపాడువాఁడు - తండ్రి

పితామహుఁడు - తండ్రులను బుట్టించు వాఁడు - బ్రహ్మ, తాత

పితృపతి - పితృ దేవతలకు రాజు - యముఁడు

పినాకము - త్రిపురములను దహించు నప్పుడు బాణ జ్వాలలు స్వర్గమును గప్పినది - శివుని విల్లు

పినాకి - పినాక మను విల్లు కలవాఁడు - శివుఁడు

పిశునుఁడు - అబద్ధమే అవయవముగాఁ గల వాఁడు - కొండెములు చెప్పువాఁడు

## పీ

పీతాంబరుఁడు - పచ్చని వస్త్రము కల వాఁడు - విష్ణువు

పీయూషము - పానముచేయ శ్రేష్ఠమైనది - అమృతము

## పు

పుంజుదాలుపు - కోడిపుంజును ధ్వజముగా ధరించినవాఁడు - కుమారస్వామి

పుండరీకము - ప్రకాశించునది, మంగళకర మైనది, శుభము కలుగఁ జేయునది - అష్టదిగ్గజములలో నొకటి, తెల్లదామర, తెల్లని గొడుగు

పుండరీకాక్షుఁడు - తెల్ల దామరల వంటి కన్నులు కలవాఁడు - విష్ణువు

పుంశ్చలి - తనభర్తను వీడునది- అంకు లాఁడి

పుంశ్చలీయుఁడు - పుంశ్చలి కుమారుఁడు

పుంసవనము - గర్భవతికిఁ బుత్రోదయము కావలెనని చేయు కార్యము - శుభకర్మ విశేషము

పుక్కిటి పురాణము - పనికిరాని పూర్వపు కథ - నిరుపయోగమైనది

పుట్టచూలు - పుట్టయందుఁ బుట్టినవాఁడు- వాల్మీకి

పుడమి తాలుపు - భూమిని ధరించిన వాఁడు - రాజు, ఆదిశేషుఁడు, పర్వ తము

పుణ్య భూమి - వింధ్య హిమాలయముల మధ్య దేశము - పవిత్ర ప్రదేశము

పుత్రకామేష్టి - పుత్రుల కొఱకుఁ జేయు యజ్ఞము - ఒక యాగము

పుత్రుఁడు - పున్నామ నరకము నుండి తల్లిదండ్రులను రక్షించువాఁడు-కుమా రుఁడు

పునుకదాల్పు - బ్రహ్మ కపాలమును దాల్చినవాఁడు - శివుఁడు

పురంధరుఁడు - శత్రు పురములను భేదిం చినవాఁడు - ఇంద్రుఁడు

పురంధ్రి - గృహమును ధరించునది - ఇల్లాలు

పురాకృతము - పూర్వ జన్మమునఁ జేయఁ బడినది - కర్మము

పురాణము - సర్గము, ప్రతి సర్గము, వంశము, మన్వంతరము, వంశాను చరితము - అను ఐదు లక్షణములు కలది - పురాతన చరిత్ర

పురుషుఁడు - ప్రాణులలో శ్రేష్ఠుఁడు మనుష్యుఁడు

పురుషోత్తముఁడు-పురుషులలో శ్రేష్ఠుఁడు, విష్ణువు

పురుహూతుఁడు - యజ్ఞములందు ప్రకట మైన పిలుపు గలవాఁడు - ఇంద్రుఁడు

పురోభాగి - దోషములు స్వభావముగా గ్రహించువాఁడు - దోషములను వెదకు వాఁడు

పురోహితుఁడు - శాంతిక పౌష్టికాది కర్మల యందు ముందుగా నుండువాఁడు, లేక పురముయొక్క క్షేమాభివృద్ధిని గోరు వాడు - శుభా శుభములు చేయించు విప్రుఁడు

పులోమజ - పులోమునకుఁ బుట్టినది - శచీదేవి

పులోమజిత్తు - పులోముని జయించిన వాఁడు - ఇంద్రుఁడు

పుష్కరము - పోషించునది - నీరు

పుష్పకము - పుష్పాకారముగా నుండు విమానము - కుబేరుని విమానము

పుష్పదంతము - పుష్పాకారముగా నుండు దంతములు కలది - అష్టదిగ్గజములలో నొకటి

పుష్పవంతులు - పుష్పమువలె కాంతిగల వారు - సూర్య చంద్రులు

పుష్పవతి - ఋతుమతి-బహిష్ఠయైనది

పుళిందుఁడు-తన భాషకంటె నితర భాష నెఱుఁగనివాఁడు - చండాలురలో నొక జాతివాఁడు

పూఁబోడి - పూవువలె మృదువైన శరీరము కలది-స్త్రీ

పూలముడుపు - గర్భిణికిఁ జేయించు నొక శుభకార్యము-పుష్పధారణము

పూర్వదేవులు-పూర్వమందు దేవపదవియందున్నవారు - రక్కసులు

## పృ

పృధివి - పృధు చక్రవర్తిచేఁ జక్కఁగాఁ జేయఁబడినది - భూమి

పృషదశ్వుఁడు - జల బిందువులను వాహనముగా గలవాఁడు - వాయుదేవుఁడు

## పే

పేశలుఁడు - అన్నిటియందు సమర్థుఁడైన వాఁడు - నేర్పరి

## పౌ

పౌనర్భవుఁడు - మాఱుమనువుదాని కుమారుఁడు - పుత్రభేదము

పౌలస్త్యుఁడు-పులస్త్యుని వంశమందు జనించినవాఁడు-కుబేరుఁడు, రావణుఁడు

పౌలోములు - మారీచునకు పులోమకు జనించినవారు - రాక్షసులు

## ప్ర

ప్రకంపనుఁడు - మిగుల కదలించువాఁడు-వాయుదేవుఁడు

ప్రచేతసుఁడు - మంచి మనస్సు కలవాఁడు-వరుణుఁడు

ప్రజాపతి - ప్రజలకు రాజు - బ్రహ్మ

ప్రతీచి - సూర్యుఁడు అస్తమించు దిక్కు - పడమర

ప్రత్యర్థి - ప్రతికూలము చేయువాఁడు-శత్రువు

ప్రత్యూషము - రాత్రిని బోఁదోలునది-ఉదయము

ప్రద్యుమ్నుఁడు - ఎక్కువ బలశాలి - మన్మధుఁడు

ప్రద్యోతనుఁడు - మిగుల ప్రకాశించువాఁడు - సూర్యుఁడు

ప్రపౌత్రుఁడు - మనుమని కుమారుఁడు - ముని మనుమఁడు

ప్రవీణుఁడు - అన్నిటిని దెలిసినవాఁడు - నేర్పరి

ప్రళయము - జగము దీనియందు అంతమొందును - యుగసంధి

ప్రాకృతుఁడు - పుట్టినప్పటి యట్ల నుండువాఁడు - అల్పుఁడు

ప్రాచి - సూర్యుఁ డుదయించు దిక్కు - తూర్పు

ప్రాజ్ఞుఁడు - మిగుల ప్రజ్ఞ కలవాఁడు - బుద్ధిశాలి

ప్రాణము - జీవింపఁజేయునది - దేహమందలి ఒక వాయువు

ప్రాయశ్చిత్తము - పాపము వోవుటకు చేయు నొక కర్మము - శిక్షాభేదము

ప్రాలేయము - శరత్కాలాంత మందు వచ్చునది - మంచు

## ప్రి

ప్రియుఁడు - ప్రేమించువాఁడు - భర్త (మగఁడు)

## ఫ

ఫణి - పడగ గలది - పాము

## ఫా

ఫాలనేత్రుఁడు - నొసటఁ గన్ను గలవాఁడు - శివుఁడు

## బ

బంభరము - "భం" అను ధ్వని భరించునది - తుమ్మెద

బకధ్యానము - కొంగ కొలని యొద్దున మత్స్యాదులు పట్టుకొనుటకై చేయు జపము - దొంగ జపము, కపటము

బర్హిర్ముఖులు - అగ్నియే ముఖముగాఁ గలవారు - దేవతలు

బర్హిశ్శుష్మ - దర్పబలముగా గలవాఁడు - అగ్ని దేవుఁడు

బలభద్రుఁడు - బలముచే శ్రేష్ఠమైనవాఁడు - బలరాముఁడు

బలసూదనుఁడు - బలుఁడను రాక్షసునకు విరోధి - ఇంద్రుఁడు

బలాహకము - బలము వీడునది, మబ్బు

బలిధ్వంసి - బలిచక్రవర్తిని ధ్వంసము చేసినవాఁడు - విష్ణువు

బలుఁడు - బలశాలి - బలరాముఁడు

## బా

బాడబము - ఆడుగుఱ్ఱము ముఖమం దుండునది - బడబాగ్ని

బాదరాయణుఁడు - రేగు వనమునం దుండువాఁడు - వ్యాసుఁడు

బాధ - దీనిచేఁ గలఁత పెట్టఁబడుదురు - శరీరబాధ

బాలతంత్రము - స్త్రీ గర్భ విషయమగు నది - ఒక శాస్త్రము

బాలిశుఁడు - తన గౌరవమును బోఁగొట్టు కొనువాఁడు - బుద్ధిహీనుఁడు

బాహుజుఁడు - బ్రహ్మ భుజములందుఁ బుట్టినవాఁడు - క్షత్రియుఁడు

బాహులేయుఁడు - ఆర్గురు తల్లుల కుమా రుఁడు - కుమారస్వామి

## బి

బిడాలము - మూషికములను భేదించునది- పిల్లి

బిత్తరి జింక తాల్పు - అందమగు జింకను దాల్చినవాఁడు - చంద్రుఁడు

## బు

బుధుఁడు - అన్నిటిని దెలిసినవాఁడు - పండితుఁడు

బుద్ధి - దీనిచే మంచి చెడ్డలు తెలియ నగును - తెలివి

## బృ

బృందము - కూర్చఁబడినది - గుంపు

బృందారకులు - మంచి సముదాయము కలవారు - దేవతలు

బృహద్భానుఁడు - గొప్పకిరణములు కల వాఁడు - సూర్యుఁడు

బృహస్పతి - దేవతలకు మంత్రములకు ప్రభువు - గురువు

## బ్ర

బ్రహ్మ - ప్రజలను బుట్టించువాఁడు - సృష్టికర్త

## బ్రా

బ్రాహ్మి - బ్రహ్మ భార్య - సరస్వతి

## భ

భగిని - పెండ్లికాలమందు శ్రేయస్సు కలది - తోడఁబుట్టిన స్త్రీ

భద్రాసనము - మణులు, రత్నములు తాపిన రాజాసనము - సింహాసనము

భరద్వాజము - భరద్వాజమహర్షిచే సృజింపఁ బడినది - పక్షి

భర్గుఁడు - మన్మథుని జయించినవాఁడు- శివుఁడు

భర్త - భరించువాఁడు - మగఁడు

భల్లూకము - పురుగులను జంపునది - ఎలుఁగుగొడ్డు

భవనము - బిడ్డలు దీనియందు జనింతురు - గృహము

భవాని - ఈశ్వరుని భార్య - పార్వతి

భాగినేయుఁడు - తోఁబుట్టువు కొడుకు - మేనల్లుఁడు

## భా

భాగీరథి - భగీరథునిచే భూమికిఁ గొనిరాఁబడినది - గంగానది

భానుఁడు - ప్రకాశించువాఁడు - సూర్యుఁడు

భానుమంతుఁడు - కిరణములు కలవాఁడు - సూర్యుఁడు

భారతి - భూమికి భరతమునిచేఁ దేఁబడినది - సరస్వతి

భార్గవుఁడు - భృగు సంతతియందుఁ బుట్టినవాఁడు - శుక్రుఁడు

భార్య - భరింపఁబడునది - ఆలు

భావుకుఁడు - తోడబుట్టువు మగఁడు - బావమఱఁది

భాస్కరుఁడు - కాంతి గలిగించువాఁడు - సూర్యుఁడు

## భి

భిత్తి - భేదింపఁబడునది - గోడ

## భీ

భీముడు - భయము గలిగించువాఁడు - ధర్మరాజుయొక్క తమ్ముఁడు

భీముఁడు - లోకములకు భీతి గలిగించువాఁడు - శివుఁడు

భీష్మసువు - భీష్మునిగన్న తల్లి - గంగానది

## భు

భుజంగభుక్కు - పాములను భుజించునది - నెమలి

భుజగము - వంకరగాఁ బోవునది - పాము

భువనము - అన్నిటిని గలిగించునది - నీరు

## భూ

భూజము - భూమియందుఁ బుట్టినది - వృక్షము

భూజాని - భూమిని భార్యగాఁ గలవాఁడు - రాజు

భూతి - విస్తారముగాఁ గలిగించునది - ఐశ్వర్యము

భూతేశుఁడు - ప్రమథ గణమునకు అధిపతి - శివుఁడు

భూదేవుఁడు - బ్రహ్మ వర్చసముచేఁ బ్రకాశించుచు భూమికి దేవతవలె నుండువాఁడు - బ్రాహ్మణుఁడు

భూధరము - భూమిని ధరించునది - పర్వతము

భూమి - నీటివలన జనించినది - ధరణి

## భే

భేకము - పామువలన భయము నొందునది - కప్ప

## భై

భైషజ్యము - దీనిచేత చికిత్సఁ జేయుదురు - మందు

## భో

భోగి - పడగ గలది - పాము

## భౌ

భౌముఁడు - భూమియందుఁ బుట్టినవాఁడు- నరకాసురుఁడు - అంగారకుఁడు

## భ్ర

భ్రమరము - ఎల్లపుడు తిరుగుచుండునది - తుమ్మెద

## భ్రా

భ్రాతృవ్యుఁడు - తోడఁబుట్టినవాని కుమారుఁడు - కుమారుఁడు

## భ్రు

భ్రుకుంశుఁడు - స్త్రీ పాత్రనుదాల్చి ఆడెడువాఁడు - నటకుఁడు

## మ

మండనము - దీనిచే నలంకరింపఁబడును- సొమ్ము

మండూకము - చెఱువులందు శోభిల్లునది- కప్ప

మండోదరి - పలుచని పొట్టకలది - రావణుని భార్య

మంత్రి - రహస్యముగా నాలోచనముఁ జెప్పువాఁడు - రాజతంత్రజ్ఞుఁడు

మందాకిని - మందముగా,వంకరగాఁ బ్రవహించునది - గంగానది

మందారము - స్తుతింపఁబడునది - దేవలోకపు చెట్టు

మందిరము - సంతోషమును, నిద్రాది సౌఖ్యమును గలిగించునది - గృహము

మంద్రము - మెల్లగాఁ బలుకఁ బడునది - ఒక స్వరము

మకరధ్వజుఁడు - మొసలి ధ్వజముగాఁ గలవాఁడు - మన్మధుఁడు

మఘవుఁడు - యజ్ఞములందు పూజింపఁబడువాఁడు - ఇంద్రుఁడు

మతంగజము - మతంగుడను ఋషివలన జనించినది - ఏనుఁగు

మత్తకాశిని - మదము లేకయే మదమున్నట్లు ప్రకాశించునది - స్త్రీ

మదనుఁడు - మదము గలిగించువాఁడు - మన్మధుఁడు

మదిర - మదము కలిగించునది - కల్లు

మద్యము - మత్తు (మదము) గలిగించునది - కల్లు

మధుకరము - పూదేనెను గలిగించునది - తుమ్మెద

మధువు - తీపికలది - తేనె

మధుపము - తేనెను త్రాగునది - తుమ్మెద

మధురిపువు - మధువు అను రాక్షసునకు విరోధి - విష్ణువు

మధువ్రతము - పూదేనెను మాత్రము త్రాగుటయే వ్రతముగాఁగలది - తుమ్మెద

మధుసూదనుఁడు - మధువను రాక్షసుని జంపినవాఁడు - విష్ణువు

మధ్యమ - నడి వయస్సు గలది - యౌవనవతి

మధ్యమము - ఏడు స్వరములకు మధ్యనుండునది - ఒక స్వరము

మనసిజుఁడు - మనస్సునందు ఉదయించువాఁడు - మన్మధుఁడు

మనీష - అన్నిటిని తెలిసికొను బుద్ధి - తెలివి

మనీషి - మనీష (బుద్ధి) గలవాఁడు - పండితుఁడు

మనుజులు - మనువువలనఁ బుట్టినవారు మనుష్యులు

మనుష్యధర్ముఁడు - మనుష్యాచారములు కలవాఁడు - కుబేరుఁడు

మనోరమము - మనస్సునకు ఇష్టమగునది - ఇష్ట వస్తువు

మనోహరము - మనస్సును హరించునది - మనస్సునకు ఇష్టమైనది

మన్మధుఁడు - మనస్సును గలచువాఁడు - మన్మధుఁడు

మయువు - కామరూపము గలవాఁడు - కిన్నరుఁడు

మయూఖము - చీఁకటిని బోఁగొట్టునది - కిరణము

మయూరము - పాములను హింసించునది - నెమలి

మరుతేజి - మన్మధుని వాహనము - చిలుక

మరుత్తు - ఇతనిచే లోకము మృతిపొందును వాయుదేవుఁడు

మరుత్వంతుఁడు - దేవతలు కలవాఁడు - ఇంద్రుఁడు

మరుత్సఖుఁడు - వాయుదేవుని స్నేహితుఁడు - అగ్నిదేవుఁడు

మర్త్యులు - మృతిని బొందువారు - నరులు

మహానసము - ఎక్కువ ఉపకరణములు కలది - వంటయిల్లు

మహాశయుఁడు-గొప్ప మనస్సు కలవాఁడు-ఉదారుఁడు

మహాసేనుఁడు - గొప్ప సేనగలవాఁడు - కుమారస్వామి

మహిష వాహనుఁడు - దున్నపోతు వాహనముగా గలవాఁడు - యముడు

మహిషి - పూజాస్థ్హరాలు - పట్టపుదేవి

మహిళ - ఆదరింపఁబడునది - స్త్రీ.

మహీధ్రము - భూమిని ధరించునది - పర్వతము

## మా

మాగధుఁడు - వంశ వీర్యాదుల పొగడి జీవించువాఁడు - సేవకుఁడు

మాతంగము - మతంగ ఋషివలనఁ బుట్టినది - ఏనుఁగు

మాతంగుఁడు - మతంగ సంతతిలోనివాఁడు - మాలవాఁడు

మాత - గర్భము ఈమె యందుండును - తల్లి.

మాతలి - సారథ్యముల నెఱింగినవాఁడు-ఇంద్రుని సారధి

మాతామహుఁడు - తల్లి తండ్రి - తాత

మాతులాని - మేనమామ భార్య - అత్త

మాతులుడు - తల్లితోఁబుట్టినవాఁడు - మేనమామ

మాతులేయుఁడు - మేనమామకు కుమారుఁడు - బావమరది

మాతృష్వసేయుఁడు - తల్లితోబుట్టు కుమారుఁడు

మాధవుఁడు - లక్ష్మీదేవిభర్త - విష్ణుమూర్తి

మాధుకరము - పూవులందలి తేనెను తుమ్మెదలు గ్రహించునట్లు గృహస్థులిండ్లలో వటువులు భిక్షమెత్తుట - భిక్షము

మానవుఁడు - మనువు సంతతివాఁడు - నరుఁడు

మానిని - ప్రణయ కోపముకలది - స్త్రీ

మానుషుఁడు - మనువు సంతతివాఁడు - నరుఁడు

మామమామ - మామయగు సముద్రునకు మామ - విష్ణువు

మారుఁడు - విరహుల బాధించువాఁడు - మన్మధుఁడు

మారుతము - జగతిని మృతి బొందించువాఁడు - వాయుదేవుఁడు

మారుతి - వాయుదేవుని కుమారుఁడు - భీముఁడు - హనుమంతుఁడు

మార్జాలము - ఎలుకలఁబట్టుచు, నిల్లు పరిశుభ్రముచేయునది - పిల్లి

## మి

మింటిచూలి - ఆకాశమున బుట్టినవాఁడు - వాయుదేవుఁడు

మిత్రుఁడు - సర్వ ప్రాణులయెడ స్నేహ స్వభావుఁడు- స్నేహితుఁడు, సూర్యుఁడు

మిధునము - కూడియుండుట - స్త్రీ పురుషుల జంట

మీనకేతనుఁడు-చేప టెక్కెము కలవాఁడు- మన్మధుఁడు

## ము

ముక్కంటి - మూఁడు కన్నులు కలవాఁడు- శివుఁడు

ముకురము - అలంకరించుకొనుటకు దగినది - అద్దము

ముక్తి - ఆత్మను శరీరేంద్రియములనుండి విడిపించునది - మోక్షము

ముగ్ధ - యౌవనము కలది - 16 ఏండ్లకు మించని స్త్రీ

ముదిరము - దీనివలన రైతులు పైరు పెట్టి సంతోషింతురు - మేఘము

ముముక్షువు - ముక్తినొంద ఇచ్ఛ గలవాఁడు (ముక్తుఁడు)

ముమూర్షువు - మరణింప నిచ్ఛగలవాఁడు

మురారి - మురుఁడను రాక్షసునికి విరోధి- విష్ణువు

ముసలి - రోఁకలిని ఆయుధముగా గలవాఁడు - బలరాముఁడు

## మూ

మూకుఁడు - వాగ్వ్యాపారము వీనిచే బద్ధమైయుండునది - మూఁగవాఁడు

మూర్ధము - శరీరావయవములలో ఎత్తైనది - తల

మూలభేఁడు - కోణమందుండెడు రాజు - నిర్‌ృతి

మూషికము - అన్నాదులను దొంగిలించునది - ఎలుక

## మృ

మృగయ - మృగములను వెదకుట - వేఁట

మృగాంకుఁడు - లేఁడిని గుర్తుగా గలవాఁడు - చంద్రుఁడు

మృగేంద్రము - మృగములలో శ్రేష్ఠమైనది - సింహము

మృడాని - మృడునిభార్య - పార్వతి

మృడుఁడు - భక్తులను సంతోషపెట్టువాఁడు - శంకరుఁడు

మృణాళము - భక్షింపఁ బడునది - తామర తూడు

మృత్యుంజయుఁడు - యముని జయించిన వాఁడు - శివుఁడు

మృదంగము - మట్టి అంగముగా గలది మద్దెల

## మే

మేఖల - మొలయందుంచఁబడునది - మొలనూలు

మేఘము - తడుపునది - మబ్బు

మేఘవాహనుఁడు - మేఘములు వాహనములుగాఁ గలవాఁడు - ఇంద్రుఁడు

మేదిని - మధుకైటభుల మేదస్సుచేఁ దడుపఁబడినది - భూమి

మేధ - అనుభవింపఁదగినవి, సంగతము లగునవి - ధారణాశక్తిగలబుద్ధి

మేధస్సు - మెఱుఁగై యుండునది - మెదడు

మేనకాత్మజ - మేనకయొక్క కొమార్తె - పార్వతి, శకుంతల

మేషము - ఎదుటి పొట్టేలుతో పోట్లాడునది - గొఱ్ఱె

## మై

మైథునము - ఆలుమగల కూడిక - రతి

## మో

మోక్షము - జీవుని శరీరాంగములు విడిచి పెట్టుట - ముక్తి

## య

యక్షరాట్టు - యక్షులకు రాజు. కుబేరుఁడు

యజ్ఞము - దేవతల పూజించుట - యాగము

యక్షుఁడు - పూజనీయుఁడు - కుబేరుఁడు

యమున - యమునితోఁబుట్టువు - ఒక నది. [సూర్యుని పుత్రిక]

యశస్సు - దిక్కులకు వ్యాపించునది - కీర్తి

## యా

యాగము - దేవతలఁబూజించుట - యజ్ఞము

యాచకుఁడు - అడిగికొనువాఁడు - అర్థి

యామిని - జాములు కలది - రాత్రి

## యు

యుగళము - ఒకటితో నొకటి చేరియుండుట - జంట

యుద్ధము - యోధులచేఁబోరఁ బడునది పోరు

యువతి - ముప్పదేండ్లకు లోబడినది యౌవనవతి

## యూ

యూపము - యాగపశువును జెక్కుటకు నాటినకొయ్య - కొఱత కొయ్య

## యో

యోష - పురుషునితోఁ గలియునది - స్త్రీ

## ర

రంభోరు - అరఁటి తూండ్ల వంటి తొడలు కలది - సౌందర్యవతియగు స్త్రీ

రజకుఁడు - వస్త్రములకు వన్నెగలిగించు వాఁడు - చాఁకలి

రజస్వల - రజస్సుకలది - బహిష్ఠయైనది

రజతము - రాగిని రంజింపఁజేయునది - వెండి

రతిస్కరుఁడు - స్త్రీలను రహస్యముగాఁ జెఱచువాఁడు - జారుఁడు

రత్నగర్భుఁడు - రత్నములు గర్భమందుఁ గలవాఁడు - సముద్రుఁడు, కుబేరుఁడు

రత్నాకరము - రత్నములకు ఉనికి పట్టు - సముద్రము

రదనము - దీనిచే భక్ష్యములు నమలఁ బడును - దంతము

రమ - రమింపఁజేయునది - లక్ష్మి

రమణి - నాథుని రమింపఁజేయునది - స్త్రీ

రవి - స్తుతింపఁబడువాఁడు - సూర్యుఁడు

రసన - దీనిచే రుచి చూడఁబడును - నాలుక

రసవాదము - పాదరసమును గట్టి బంగారు చేయు విద్య - రససిద్ధి

రసాతలము - అధోలోకము - పాతాళము

రక్షస్సులు - జంతువులను రక్షించువారు - విభీషణాదులు

## రా

రాఘవుఁడు - రఘువంశీయుఁడు - శ్రీరాముఁడు

రాచిలుకనెక్కు రాయరౌతు - చిలుక వాహనముగాగల రాజు - మన్మథుఁడు

రాజరాజు - యక్షులకు రాజు - కుబేరుఁడు

రాజరాజు - రాజులకు రాజు - దుర్యోధనుఁడు

రాజన్యుఁడు - రాజుయొక్క సంతతిలోని వాఁడు - క్షత్రియుఁడు

రాజన్వద్రరము - మంచి రాజుగల దేశము

రాజసము - రజోగుణమువలనఁ గలిగినది - అహంకారము

రాజహంస - ఎఱ్ఱని ముక్కు, కాళ్లుకలిగి, తెల్లగానుండునది - హంసలలో శ్రేష్ఠమైనది

రాజీవము - రాజును(చంద్రుని) అనుసరించి జీవించునది - తామర

రాజ్యము - పరిపాలనకు లోబడినది - రాష్ట్రము

రాట్టు - ప్రకాశించువాఁడు - భూమిని పరిపాలించువాఁడు - రాజు

రాత్రించరుఁడు - రాత్రులందు సంచరించువాఁడు - రాక్షసుఁడు

రాత్రి - సౌఖ్యము గూర్చునది - రేయి

రామ - గీతాదులయందు నేర్పుగలదై రమించునది - స్త్రీ

రామాయణము - శ్రీరామునిచరిత్ర దెలుపునది - పవిత్ర గ్రంథము

రావణుఁడు - ప్రజలను మొఱపెట్టించువాఁడు - లంకకు రాజు

రాష్ట్రియుఁడు - రాజు భార్య తోఁబుట్టువు - రాజు బావమఱఁది

## రి

రిపుఁడు - సేనలనుగూర్చుకొని దండెత్తువాఁడు - విరోధి

## రు

రుద్రాణి - రుద్రుని భార్య - పార్వతి

రుద్రుఁడు - విరోధుల దుఃఖపెట్టువాఁడు - ఈశ్వరుఁడు

## రూ

రూపాజీవ - రూపముతో జీవనముగడుపుకొనునది - వేశ్య

## రే

రేశేఁడు - రాత్రికి అధిపతి - చంద్రుఁడు

రేవ - గంతులతోఁ బ్రవహించునది - నర్మదా నది

## రో

రోమంథము - గొడ్ల చర్వితచరణము - నెమరువేయుట

రోమశుఁడు - దేహముపై నిడుపైన వెండ్రుకలు కలవాఁడు - ఒకముని

రోలంబము - పూవులదాపున మ్రోఁతపెట్టునది - తుమ్మెద

## రౌ

రౌహిణేయుఁడు - రోహిణీదేవి కుమారుఁడు - బలరాముఁడు

## ఱై

ఱైల్లుచూలి - ఱైలునందు జనించినవాఁడు - కుమారస్వామి

## ల

లంబోదరుఁడు - వ్రేలాడు పొట్టగలవాఁడు- వినాయకుఁడు

లక్ష్మి - సర్వము జూచునది - విష్ణుని భార్య

లయ - నృత్తగీతాదులు కలది - తాళము

లలాటము - దీనిపై ముంగురులు వ్రేలాడు చుండును - నొసలు

లవణాకరము - ఉప్పునకు ఉనికిపట్టు - సముద్రము

## లా

లాస్యము - క్రీడించునది - ఆఁట

## లి

లిపికారుఁడు - వ్రాఁతనుజేయువాఁడు - లేఖకుఁడు

## లీ

లీలామనుష్యుఁడు - మనుష్యాకారముతోఁ గనఁబడువాఁడు - దేవుఁడు

## లో

లోకబాంధవుఁడు - ప్రపంచమునకు బంధువు - సూర్యుఁడు

లోకమాత - లోకములకన్నిటికి తల్లి - లక్ష్మి

లోకేశుఁడు - పదునాల్గు లోకములకు అధిపతి - బ్రహ్మ

లోహితాశ్వుఁడు - ఎఱ్ఱని గుఱ్ఱములు గలవాఁడు - అగ్నిదేవుఁడు

## వ

వంద్యుఁడు - నమస్కారముఁ జేయఁదగినవాఁడు - పూజ్యుఁడు

వంశము - అందఱిచే ప్రశంసింపఁబడునది - కులము

వంశము - అందఱిచే నాశ్రయింపబడునది- వెదురు

వచనము - పలుకఁబడినది - పదములు - పలుకు

వజ్రి - వజ్రాయుధము కలవాఁడు - ఇంద్రుఁడు

వత్సలుఁడు - ప్రేమకలవాఁడు - దయాశాలి

వధువు - పురుషునిచే వహింపఁబడునది-స్త్రీ

వనజము - నీటిలోఁబుట్టినది - తామర

వననిధి - నీటికి ఉనికిపట్టు - సముద్రము

వనమాలి - పుష్పమాలికగలవాఁడు - విష్ణువు

వనరుహము - నీటియందు బుట్టినది - తామర
వనిత - పురుషునిబొందునది - స్త్రీ
వనీపకుఁడు - యాచించువాఁడు - యాచకుఁడు
వప్రక్రీడ - ఏనుఁగులు భూమిని దంతములతో గోరాడెడి ఆట - క్రీడావిశేషము
వరవర్ణిని - శ్రేష్ఠమైన రూపసంపదకలది - ఉత్తమ స్త్రీ
వరాహము - శ్రేష్ఠమైన పైరును జెఱచునది - అడవిపంది
వరుణుఁడు - ఒనులచే వరములు కోరఁబడువాఁడు - పడమటిదొర
వర్జ్యము - విడువదగినది - దోషమగు కాలము
వర్షాభువు - వర్షాకాలమందుఁ బుట్టునది - కప్ప
వర్షాశనము - ప్రభువులు కవులకు పండితులకు సంవత్సరమునకొకసారి ఇచ్చు ధనము - బహుమానద్రవ్యము
వలరాజు - వలపులకు రాజు - మన్మథుఁడు
వలిమొలక - గాలికొడుకు - ఆంజనేయుఁడు
వల్లవుఁడు - ధైర్యమును వదలినవాఁడు - గొల్లవాఁడు
వల్లెత్రాడుదాల్పు - పాశమును ధరించినవాఁడు - వరుణుఁడు
వశీకరణము - మందుమాకులచే నితరుల స్వాధీనముచేసికొనుట - తంత్రము
వషట్కృతము - అగ్నియందు వేల్వఁబడినది - హవిస్సు
వసుంధర - ద్రవ్యమును ధరించినది - ధరణి
వసుదేవుఁడు - ధనముచేఁ బ్రకాశించువాఁడు - కృష్ణుని తండ్రి
వసుధ - ద్రవ్యాదులను ధరించునది - భూమి
వసుమతి - ధనము దీనియందుఁగలదు - భూమి
వసువు - ప్రభులిండ్లయందుండునది - ధనము
వసువులు - ఎల్లప్పుడు కూడుకొనియుండు గణదేవతలు - అష్టవసువులు
వస్త్రయోనులు - వస్త్రము ఉత్పత్తికి గారణములు - నార, కాయ, పురుగు, వెండ్రుకలు (ఉన్ని) మున్నగునవి
వహ్ని - దేవతలకు హవ్యమునుబొందించువాఁడు - అగ్నిదేవుఁడు

## వా

వాఁకతాలుపు - గంగను ధరించినవాఁడు - శివుఁడు

వాక్యము - పలుకుటకుఁ దగినది - పదముల సముదాయము

వాగీశుఁడు - వాక్కులకు ప్రభువు - బృహస్పతి

వాగ్మి - చాతుర్యముగా మాట్లాడువాఁడు - వక్త

వాఙ్మూలము - వాక్కు ద్వారా సాక్షులు చెప్పినది - సాక్ష్యము

వాచంయముఁడు - వాక్కు నియమముగాఁ బలుకువాఁడు - ముని

వాచస్పతి - వాక్కులకు పతి - బృహస్పతి

వాచాటుఁడు (వాచాలుఁడు) - నిరుపయోగముగా మాట్లాడువాఁడు - వదరుబోతు

వాజపేయము - సురత్రాగఁబడు యజ్ఞము - యాగ విశేషము

వాజి - వేగముకలది - గుఱ్ఱము

వాణి - చక్కగాఁబలుకునది - సరస్వతి

వాతాయనము - గాలివచ్చుటకు మార్గము - కిటికి

వాతిబియ్యము - పీనుగు నోటిలో వేయు బియ్యము - దహనసంస్కారవిశేషము

వాతుఁడు - ఎల్లపుడు వీచువాఁడు - వాయుదేవుఁడు

వాత్సల్యము - పుత్రాదుల యెడ దయ - వత్సలత

వానరము - నరుని ఆకృతిగా నుండునది - కోఁతి

వామ - రమ్యమైనది - కాంత

వామదేవుఁడు - వామభాగమందు భార్యను గలవాఁడు - శివుఁడు

వామనము - అందముగా పొట్టిగా నుండునది - దిగ్గజములలో నొకటి

వామనుఁడు - పొట్టివాఁడు - గుజ్జారి

వామలోచన - అందమగు కన్నులుకలది - స్త్రీ

వాయసారాతి - కాకికి విరోధి - గుడ్లగూబ

వాయువు - ఎల్లపుడు వీచునది - వాయుదేవుఁడు

వాయుసఖుఁడు - గాలికి స్నేహితుఁడు - అగ్నిదేవుఁడు

వారణము - ఇతర బలమును వారించునది - ఏనుఁగు

వారస్త్రీ - ఎల్లరకు స్వాధీనురాలై యుండునది - వేశ్య

వారిజము - నీటియందుఁ బుట్టినది - పద్మము

వారిదము - నీటిని ఇచ్చునది - మేఘము

వార్తావహుఁడు - వృత్తాంతమును దీసికొని పోవువాఁడు - సందేశహరుఁడు

వార్ధకము - వృద్ధభావము - ముసలితనము

వార్ధి - నీటికి స్థానము - సముద్రము

వాలుఁగంటి - పొడవైన కన్నులు కలది - స్త్రీ

వాల్లభ్యము - భర్తయెడఁ జూపునది - భావ విశేషము

వాసవుఁడు - రత్నములు కలవాఁడు - ఇంద్రుఁడు

వాసకసజ్జిక - అలంకరించుకొని, పడక టింటి దగ్గఱ భర్తకై వేచియుండు నది - నాయికాభేదము

వాసుకి - రత్నము శిరస్సుపైఁ గలవాఁడు - సర్పరాజు

వాసుదేవుఁడు - వసుదేవుని కుమారుఁడు - విష్ణువు

వాహిని - వాహములు [గుఱ్ఱములు] కలది - సైన్యము

వాహిని - ప్రవహించునది - నది

## వి

వికస్వరము - వికసించు స్వభావము కలది - వికాసము

విక్లబుఁడు - భయముచే కాళ్లుసేతులు వణకించువాఁడు - పిఱికిపంద

విగ్రహము - విశేషముగా నాత్మచే గ్రహింపఁబడునది - శరీరము

విఘ్నరాజు - విఘ్నములకు రాజు - వినాయకుఁడు

విఘ్నేశ్వరుఁడు - విఘ్నములకు అధిపతి - వినాయకుఁడు

విచక్షణుఁడు - విశేషముగా బరిశీలించువాఁడు - విద్వాంసుఁడు

విజిగీషుఁడు - జయింప నిచ్ఛగలవాఁడు - జయేచ్ఛఁగలవాఁడు

వితరణము - దీనివలన నరకమును దరింతురు - దానము

విత్తము - పొందఁబడునది - ధనము

విదూషకుఁడు - ఇతరులను విశేషముగా దూషించువాఁడు - శృంగార నాయక మిత్రులలో నొకఁడు

విద్యాధరులు - అంజనాది విద్యలు నేర్చినవారు - దేవతా భేదము

విద్వాంసుఁడు - అన్నియు నెఱింగినవాఁడు - పండితుఁడు

విధాత - సర్వము గలిగించువాఁడు - బ్రహ్మ

విధి - అన్నిటిని విధించు వాఁడు - బ్రహ్మ

విధువు - విరోధులను బాధించువాఁడు - విష్ణువు

విధువు - చీకటిని బోఁగొట్టువాఁడు - చంద్రుఁడు

వినాయకుఁడు - తనకు నిరత ప్రభువులేని వాఁడు - విఘ్నేశ్వరుఁడు

వినాయకుఁడు - పక్షులకు నాయకుఁడు - గరుత్మంతుఁడు

విపణి - వస్తువుల విక్రయ స్థలము - అంగడి

విప్రలబ్ధ - సంకేత స్థలమున నాయకుని గానకపోయి చింతించిన నాయిక - నాయికాభేదము

విప్రుఁడు - తన్ను ఇతరుని విశేషముగాఁ బాపమునుండి రక్షించువాఁడు - బ్రాహ్మణుఁడు

విబుధులు - చాల నెఱింగినవారు - దేవతలు

విభావరి - సూర్యకాంతిని గప్పునది - రాత్రి

విభావసుఁడు - ప్రకాశము ధనముగా గలవాఁడు - అగ్నిదేవుఁడు

విభూతి - విస్తారముగాఁ గలిగించునది - ఐశ్వర్యము

విభూషణము - అలంకరింపఁబడునది - ఆభరణము

విభ్రమము - స్త్రీల వచన భూషణ విపర్యాసరూపమైనది - శృంగార చేష్టావిశేషము

విమానము - ఆకాశమున బోవునది, గమనమందు పక్షి ననుసరించునది - దేవతారథము

వియత్తు - ఎడతెగనిది - ఆకాశము

విరించి - భూతముల సృజించువాఁడు - బ్రహ్మ

విరూపాక్షుఁడు - సూర్యచంద్రాగ్నులను విరూప నేత్రములు కలవాఁడు - శివుఁడు

విలాసము - స్త్రీ ప్రియుని జూచి నప్పుడు చేయునది - శృంగార చేష్టావిశేషము

విశల్యకరణి - విఱిఁగిన ఎముకలను అతికించునది - ఓషధీ విశేషము

విశాఖుఁడు - విశాఖా నక్షత్రమందుఁ బుట్టినవాఁడు - కుమారస్వామి

విశ్వంభర - సమస్తమును భరించునది - భూమి

విశ్వంభరుఁడు - సమస్తమును భరించువాఁడు - దేవుఁడు

విశ్వకేతుఁడు - అంతట వ్యాపించు ప్రకాశముగల టెక్కెము కలవాఁడు - మన్మథుఁడు

విశ్వామిత్రుఁడు - ప్రపంచమునకు మిత్రుఁడు - ఒక రాజర్షి

విషధరము - విషమును ధరించినది - పాము

విషధరము - నీటిని ధరించినది - మేఘము

విష్టరశ్రవుఁడు - దర్భ ముడివంటి చెవులు కలవాఁడు - విష్ణువు

విష్ణుపదము - విష్ణునకు స్థానము - ఆకాశము

విష్ణుపది - విష్ణుపాదమునఁబుట్టినది - గంగానది

విష్ణువు - విశ్వమునందంతటను వ్యాపించువాఁడు - విష్ణుమూర్తి

విష్వక్సేనుఁడు - అంతటను వ్యాపించిన సేనగలవాఁడు - విష్ణువు

విహంగమము [విహంగము] ఆకాశమునఁ బోవునది - పక్షి

విహాయసము - దీనియందు విశేషముగా నన్నియు సంచరించును - ఆకాశము

విహ్వలుఁడు - భయ శోకాదులచే తన యవయవములవణకించువాఁడు - పిఱికి

## వీ

వీణ - దీనియందు స్వరము పుట్టును - వాద్యవిశేషము

వీతిహోత్రుఁడు - హవిస్సు అన్నముగా గలవాఁడు - అగ్నిదేవుఁడు

వీరభద్రపళ్లెరము - మిగుల విశాలమైనది - మిక్కిలి పెద్ద పళ్లెము

వీరముష్టి - వైశ్యుల యాచించుచు జీవించునొక తెగవాఁడు - భిక్షుకుఁడు

వీరమాత - వీరునిగన్నది - వీరవనిత

## వృ

వృకోదరుఁడు - తోఁడేలు వంటి పొట్ట కలవాఁడు - భీముఁడు

వృత్తాంతము - అనువర్తించుచు వచ్చు వృత్తాంతము కలది - విషయము

వృద్ధశ్రవుఁడు - వృద్ధులగు బృహస్పతి మున్నగు వారివలన వినువాఁడు - ఇంద్రుఁడు

వృద్ధ్యాజీవుఁడు - వడ్డివలన జీవించువాఁడు - వ్యాపారి

వృషధ్వజుఁడు - ఎద్దు ధ్వజము కలవాఁడు - శివుఁడు

వృత్రహుఁడు - వృత్రాసురుని సంహరించినవాఁడు - ఇంద్రుఁడు

వృష్టి - తడుపునది - వాన

వృషభవాహనుఁడు - ఎద్దు వాహనముగాఁ గలవాఁడు - శివుఁడు

## వె

వెడవిల్తుఁడు - తేలిక విల్లుకలవాఁడు - మన్మధుఁడు

వెన్నుఁడు - అంతట వ్యాపించినవాఁడు - విష్ణుఁడు

వెన్నునివలకన్ను - విష్ణునియొక్క దక్షిణ నేత్రము - సూర్యుఁడు

## వే

వేత్రధరుఁడు - బెత్తమును ధరించిన వాఁడు - భటుఁడు

వేఁడి వెలుఁగు - వెచ్చని కాంతిఁగల వాఁడు - సూర్యుఁడు

వేగరి - సమాచారము దెలుపువాఁడు - వేగులవాఁడు

వేదండము - వేదమువలనఁ బుట్టినది - ఏనుఁగు

వేదము - ధర్మాధర్మములను విశదపఱచు నది - ఆగమము

వేధ - జీవులను పుట్టించువాఁడు - బ్రహ్మ

వేయి చేతులయెకిమీఁడు - వేయి చేతులు గల రాజు - కార్తవీర్యార్జునుఁడు

వేల్పుపెద్ద - దేవతలలోఁబెద్ద - బ్రహ్మ

వేశ్మ - దీనియందుఁ బ్రవేశింతురు - గృహము

వేశ్య - భూషణములచేఁ బ్రకాశించునది - వెలయాలు

## వై

వైకుంఠుఁడు - వికుంఠయను తల్లియం దవతరించినవాఁడు - విష్ణువు

వైడూర్యము - విడూర దేశమందుఁ బుట్టినది - రత్నవిశేషము

వైతరణి - గోదానాదులచే దాటఁబడునది - నరకమందలి నిప్పులయేఱు

వైతాళికుఁడు - వేకువను రాజులను మేలు కొల్పువాఁడు - ప్రబోధకుఁడు

వైదికుఁడు - వేదము తెలిసినవాఁడు - బ్రాహ్మణుఁడు

వైధాత్రుఁడు - విధాతకుమారుఁడు - సన త్కుమారుఁడు

వైనతేయుఁడు - వినతయొక్క కుమా రుఁడు - గరుత్మంతుఁడు

వైన్యుఁడు - వేనుఁడను రాజపుత్రుఁడు - పృథుచక్రవర్తి

వైయాకరణుఁడు - వ్యాకరణ శాస్త్రము దెలిసినవాఁడు - పండితుఁడు

వైరి - వైరము కలవాఁడు - విరోధి

వైవస్వతుఁడు - సూర్యునకు సంజ్ఞాదేవి వలన కలిగిన పుత్రుఁడు - యముడు

వైవస్వతుఁడు - సూర్యునకు ఛాయాదేవి వలన గలిగిన కుమారుఁడు - శని

వైశ్వానసుఁడు - వైశ్వానరుఁడను ముని కుమారుఁడు - అగ్ని

వైష్ణవుఁడు - విష్ణువునందు మాత్రమే భక్తిగలవాఁడు - విష్ణుభక్తుఁడు

## వ్య

వ్యథ - ఇది జనుల భయపెట్టును - దుఃఖము

## వ్యా

వ్యాధుఁడు - జంతువులను జంపువాఁడు - బోయవాఁడు

వ్యానము - శరీరము నందంతటనుండునది - ఒక వాయువు

వ్యాసఘట్టము - వ్యాస రచితమగు భారత భాగమునందు కష్టమయిన భాగము

వ్యాళము - కఱువ నుద్యమించునది - సర్పము

## వ్యు

వ్యుత్పత్తి - శబ్ద సంభవ పద్ధతి - పుట్టుక

## వ్యో

వ్యోమకేశుఁడు - ఆకాశమున నిండియున్న కేశములుకలవాఁడు - శివుఁడు

వ్యోమయానము - ఆకాశ గమనమునకు ఆధారమైనది - విమానము

## శ

శంకరుఁడు - సుఖమును గలిగించువాఁడు - శివుఁడు

శంబరారి - శంబరుఁడను రాక్షసునకు విరోధి - మన్మధుఁడు

శంభువు - సౌఖ్యమునకుఁ గారణమైన వాఁడు - శివుఁడు

శకుంతల - పక్షులచేఁ బోషింపఁబడినది - దుష్యంతుని భార్య

శక్తిధరుఁడు - శక్తి అను ఆయుధమును ధరించినవాఁడు - కుమారస్వామి

శక్రుఁడు - జయమున శక్తిగలవాఁడు - ఇంద్రుఁడు

శచి - హంస గమనమువంటి నడకగలది- ఇంద్రుని భార్య

శచీపతి - శచియొక్కభర్త - ఇంద్రుఁడు

శఠుఁడు - కపటముగలవాఁడు - చతుర్విధ శృంగారనాయకులలో నొకఁడు

శతకము - నూరు పద్యములుగలది - ఒక గ్రంథము

శతకోటి - నూఱు అంచులుకలది - వజ్రాయుధము

శతఘ్ని - నూర్గురను జంపునది - ఫిరంగి

శతపత్రము - నూఱు రేకులుకలది - తామర పువ్వు

శతమన్యుఁడు - నూఱుయజ్ఞములు చేసినవాఁడు - ఇంద్రుఁడు

శబరుఁడు - ఆకులు కట్టుకొనువాఁడు - బోయ

శమనుఁడు - ప్రాణులను శమింపఁజేయువాఁడు - యముఁడు

శరజన్ముఁడు - రెల్లునందు జన్మించినవాఁడు - కుమారస్వామి

శరభము - సింహమునుసైతము జంపునది - మృగవిశేషము

శరాసనము - బాణములను జిమ్మునది - విల్లు

శరీరము - నశించునది - దేహము

శర్వరి - దినమునుజెఱచునది - రాత్రి

శర్వాణి - ఈశ్వరుని భార్య - పార్వతి

శర్వుఁడు - ప్రళయకాలమున సమస్తభూతములకు క్షోభ గలిగించువాడు - శివుఁడు

శశధరుఁడు - కుందేటిని ధరించినవాఁడు - చంద్రుడు

శశము - దాఁటుచుఁ బోవునది - కుందేలు

శశవిషాణప్రాయము - కుందేటి కొమ్ము వలె లోకమున లభింపనిది - దుర్లభమైనది

శస్త్రము - దీనిచేత హింసింతురు - ఆయుధము

శస్త్రజీవుఁడు - ఆయుధములచే జీవించువాఁడు - వీరుఁడు

## శా

శాంబరి - శంబరుఁడను రాక్షసునకు సంబంధించినది - ఇంద్రజాలవిద్య

శాఖి - కొమ్మలుకలది - చెట్టు

శాతోదరి - కృశించిన కడుపుగలది - భాగ్యవతి [స్త్రీ]

శాత్రవుఁడు - కృశింపఁజేయువాఁడు - విరోధి

శాబ్దికుఁడు - శబ్దశాస్త్రమును ఎఱిఁగినవాఁడు - పండితుఁడు

శార్ఙ్గము - శృంగమునకు సంబంధించినది - విష్ణువు ధనుస్సు

శార్ఙ్గి - శార్ఙ్గమను ధనుస్సుగలవాఁడు - విష్ణువు

శార్దూలము - హింసించునది - పెద్దపులి

# శి

శిఖావరుణుఁడు - జ్వాలలుకలవాఁడు - అగ్నిదేవుఁడు

శిఖి - సిగకలది - నెమిలి

శిఖివాహనుఁడు - నెమిలివాహనుఁడు - కుమారస్వామి

శితికంఠుఁడు - నల్లని కంఠముగలవాఁడు - శివుఁడు

శిబిక - సుఖకరమైనది - పల్లకి

శిలాక్షరము - ఱాతిపైఁజెక్కినది - శాశ్వతమైనది

శిలీముఖము - ములికి చివరఁగలది - బాణము

శివ - శుభమునిచ్చునది - పార్వతి

శివుఁడు - మంగళము గలిగించువాఁడు - శివుఁడు

# శీ

శీకరము - శీతమునుగలిగించునది

# శు

శుకము - వసించునది - చిలుక

శుక్రుఁడు - తెల్లనివన్నెకలవాఁడు - శుక్రాచార్యుఁడు

శుచి - శుద్ధిగలవాఁడు - అగ్నిదేవుఁడు

శుద్ధాంతము - పరిశుద్ధమైభవములు దాపునగలది - రాజస్త్రీలుండు గృహము

శుభ్రాంశువు - తెల్లని కిరణములు కలవాఁడు - చంద్రుఁడు

శుష్మ - నీటిని ఇంకింపఁ జేయువాఁడు - అగ్ని

# శూ

శూరుఁడు - శౌర్యముకలవాఁడు - వీరుఁడు

శూర్పణఖ - చేటలవంటి గోళ్లుకలది - రావణుని చెల్లెలు

శూలపాణి - శూలమును చేతియందుఁ గలవాఁడు - శివుఁడు

శూలి - శూలము గలవాఁడు - శివుఁడు

శేముషి - మోహమును నశింపఁజేయునది - బుద్ధి

శేషశయనుఁడు - ఆదిశేషుని శయనముగాఁ గలవాఁడు - విష్ణువు

## శై

శైలధన్వుఁడు - పర్వతమును విల్లుగాఁ గలవాఁడు - శివుఁడు

శైలము - శిలలనుగలది - పర్వతము

శైవము - శివుఁడే దేవుఁడనునది - ఒక మతము

శైశవము - శిశువుయొక్క భావము - పసితనము

## శో

శోణితము - ఎఱ్ఱని రంగుగలది - రక్తము

## శౌ

శౌరి - శూరుఁడనువాని వంశమునఁ బుట్టినవాఁడు - కృష్ణుఁడు

## శ్మ

శ్మశానము - శవములయొక్క శయనము - వల్లకాఁడు

శ్మశ్రువు - ముఖమును ఆశ్రయించినది - మీసములు, గడ్డము

## శ్రా

శ్రాద్ధదేవుఁడు - పితృకర్మమునకుదేవుఁడు - యముఁడు

శ్రాద్ధము - శ్రద్ధగాఁ బితృదేవతలకుఁజేయు కర్మము - తద్దినము

## శ్రీ

శ్రీ - విష్ణువు నాశ్రయించునది - లక్ష్మి

శ్రీకంఠుఁడు - విషమును కంఠమందు గలవాఁడు - శివుఁడు

శ్రీపతి - లక్ష్మీదేవిభర్త - విష్ణువు

శ్రీమంతుఁడు - సంపదగలవాఁడు - ధనికుఁడు

శ్రీముఖము - శ్రీకారమును ముఖమందుఁ గలది - పెద్దలవేఁ బంపబడు పత్రిక

శ్రీవత్సలాంఛనుఁడు - శ్రీవత్సమనుగుఱుతు వక్షమునందుఁ గలవాఁడు - విష్ణువు

## శ్రో

శ్రోత్రియుఁడు - వేదమును జదివిన బ్రాహ్మణుఁడు - విప్రుఁడు

## శ్వ

శ్వపచుఁడు - కుక్కమాంసమును దిను వాఁడు - మాలవాఁడు

శ్వసనుఁడు - శ్వతనిచే ప్రాణులు జీవింతురు - వాయుదేవుఁడు

శ్వశురుఁడు - భార్యయొక్కగాని, భర్త యొక్కగాని తండ్రి - మామ

## శ్వే

శ్వేతవాహనుఁడు - తెల్లని గుఱ్ఱములు కల వాఁడు - అర్జునుఁడు

## ష

షట్కర్ముఁడు - యజన, యాజన, అధ్యయనాధ్యాపన దాన, ప్రతిగ్రహము లను షట్కర్మలు కలవాఁడు - బ్రాహ్మణుఁడు

షట్పదము - ఆఱుపాదములు కలది - తుమ్మెద

షడాననుఁడు - ఆఱుముఖములు కలవాఁడు- కుమారస్వామి

షడ్జము - ముక్కు, గొంతు, వక్షము, తాలువు, నాలుక, దంతము - అను ఆఱు స్థానములనుండి వచ్చునది - ఒకస్వరము

షణ్ముఖుఁడు - ఆఱుముఖములు కలవాఁడు - కుమారస్వామి

## షా

షాణ్మాతురుఁడు - ఆర్గురు తల్లులు కల వాఁడు - కుమారస్వామి

## స

సంకర్షణుఁడు - శత్రువుల నేడ్పించువాఁడు బలరాముఁడు

సంక్రందనుఁడు - శత్రువులను మొఱ పెట్టించువాఁడు - ఇంద్రుఁడు

సంక్రమణము - సూర్యుఁడు ఒక రాశి నుండి మఱొక రాశికి ప్రవేశించుట - రాశి ప్రవేశము

సంగ్రహము - దీనిచే నర్థము క్షిప్తముగా తెలియఁబడును - సారాంశ గ్రంథము

సంఘాతము - ఎక్కువగాఁ గలిగినది - గుంపు

సంచయనము - శవ దహనమైన మఱు నాడు శ్మశానమందు ఎమ్ములు ఏఱు పని - ప్రేత కర్మము

సంజీవకరణి - మరల జీంవిపఁ జేయునది - ఓషధీ విశేషము

సంతానము - ఎక్కువగాఁ గోరునది - దేవ వృక్షములలో నొక్కటి

సందుదోషము - నెలల సంధులలో పసి బిడ్డలకు గలుగు బాలగ్రహ దోషములు - ఒక విధమైన జన్ని

సందోహము - విశేషముగా గలిగినది - గుంపు

సంధ్య - సూర్యోదయమునకు ముందు 5 గడియల కాలము, సూర్యాస్తమయమునకు 3 గడియలు వెనుకకాలము - సంజ

సంయమము - హింసాదులను విరమించుట

సంలాపము - ప్రీతితోగూడిన భాషణము - ప్రియ సంభాషణము

సంధ్యావందనము - ప్రాతస్సాయంసంధ్యలయందుఁ జేయఁదగినది - భగవత్ప్రార్థనము

సంవర్తము - దీనియందు జగము నాశనమగును - ప్రళయము

సంస్కృతము - వ్యాకరణాది శాస్త్రములచేఁ జక్కఁగా సంస్కరింపఁబడినది - దేవభాష

సంశప్తకుఁడు - తిరుగనని యొట్టుపెట్టుకొని యుద్ధముచేయువాఁడు - యుద్ధవీరుడు

సంహతి - చక్కఁగా పొందఁబడినది - గుంపు

సతి - దర్శనమాత్రముననే సర్వపాపములు నాశనముజేయునది - పతివ్రత

సత్యము - సత్పురుషులయందుఁబుట్టునది - నిజము

సదనము - దీనియందుండుదురు - గృహము

సదాగతి - ఎల్లప్పుడు సంచరించువాఁడు - వాయుదేవుఁడు

సన్న్యాసము - కామ్యకర్మములు విడుచుట - ఒక ఆశ్రమము

సపత్నుఁడు - సమాన పతిత్వము కలవాఁడు - విరోధి

సపిండీకరణము - మరణించిన పండ్రెండవదినమందుఁ గావించునది - పితృకర్మ

సప్తజిహ్వుఁడు - ఏడువిధములైన అగ్ని జ్వాలలుకలవాఁడు - అగ్నిదేవుఁడు

సప్తార్చి - ఏఁడు జ్వాలలు కలవాఁడు - అగ్నిహోత్రుఁడు

సప్తతంతువు - ఏఁడు ఛందస్సులచే వ్యాపింపఁబడునది - యజ్ఞము

సప్తాశ్వుఁడు - ఏఁడు గుఱ్ఱములు కలవాఁడు - సూర్యుఁడు

సభాసదులు - సభయందు ధర్మము తెలిసిన వారు - సభ్యులు

సభాస్తారులు - సభయందుండువారు - సభ్యులు

సభికుు - జూదమాడువారు - జూదగాండ్రు

సభ్యులు - సభాస్తారుు

సమరము - మరణముతోఁగూడినది - యుద్ధము

సమవర్తి - పక్షపాతములేక వర్తించువాఁడు - యమధర్మరాజు

సమానము - శరీరమందు నెత్తుకు గలిగించునది - ఒకవాయువు

సమాసము - సమర్థములగు పదముల పొందిక-ఏకీభావము

సమీరుఁడు - విశేషముగా సంచరించువాఁడు - వాయుదేవుఁడు

సమ్రాట్టు - రాజసూయము చేసినవాఁడు - దేవమానవులలో ప్రకాశించువాఁడు

సముదాయము - విశేషముగా గలిగినది - గుంపు

సముద్రము - చంద్రోదయమువలన వృద్ధి పొందునది - సాగరము

సమూహము - ఎక్కువగా నున్నది - గుంపు

సరసీరుహము - సరస్సునందుఁ బుట్టినది - తామర

సరస్వతి - అంతటను వ్యాపించునది - వాణి

సరిత్తు - పాఱునది - నది

సరిత్పతి - నదులకు రాజు - సముద్రుఁడు

సరీసృపము - నదివలె వంకరగాఁ బోవుచున్నది - పాము

సరోరుహము - సరస్సులోఁబుట్టినది తామర

సరోజము - సరస్సునందుఁ బుట్టినది తామరపువ్వు

సర్వంసహ - సర్వమును సహించునది భూమి

సర్వజ్ఞుఁడు - సమస్తము దెలిసినవాడు శివుఁడు - బుద్ధుడు, పండితుఁడు

సర్వతోముఖము - ప్రవహించునపుడు అంతటను ముఖముగలది - నీరు

సర్వభక్షకుఁడు - సర్వము భక్షించువాఁడు - అగ్నిదేవుఁడు

సర్వమంగళ - సర్వవిధములైన శుభముల కలది - పార్వతి

సవిత - నిద్రించువారిని ప్రేరేపించువాఁడు - సూర్యుఁడు

సహగమనము - భర్తమరణింపగాఁ భార్య గూడ చితిలోఁజొచ్చి కాలిపోవుట - సతీధర్మము

సహధర్మచారిణి - భర్తతో దాన యజ్ఞాది ధర్మములు చేయగలుగునది - శీలవతి

సహస్రపాదుఁడు - వేయికిరణములు కల వాఁడు - సూర్యుఁడు
సహస్రపత్రము - వేయిపత్రములుకలది - తామర
సహస్రబాహుఁవు - వేయి బాహువులు కల వాఁడు - కార్తవీర్యార్జునుఁడు
సహస్రాంశుఁడు - వేయి కిరణములు కల వాఁడు - సూర్యుఁడు
సహస్రాక్షుఁడు - వేయి కన్నులు కల వాఁడు - ఇంద్రుఁడు
సహృదయుఁడు - మంచి మనస్సు గల వాఁడు - స్నేహితుఁడు
సహోఢుఁడు - చౌర్యవస్తువులతోఁ బట్టు బడినవాఁడు - దొంగ
సహోదరుఁడు - తోడఁబుట్టినవాఁడు - అన్న లేక తమ్ముఁడు

## సా

సాంబ్రాణి - సంబరేను చెట్టువలన కలిగి నది - ధూపద్రవ్యము
సాగరము - సగరపుత్రులచేఁ ద్రవ్వబడి నది - సముద్రము
సాత్యవతేయుఁడు - పరాశరునకు సత్యవతి యందు బుట్టినవాఁడు - వ్యాసుఁడు
సాధ్యులు - ధర్మునిభార్య సాధ్యకు జన్మిం చినవారు - దేవయోనిసంభూతులు
సాధ్వి - సాధుస్వభావముకలది - పతివ్రత
సాప్తపదీనము - ఒకనితోడ ఏడడుగులు నడచుటచేగాని ఏడు మాటలచేతగాని యేర్పడునది - స్నేహము
సామాజికులు - సమూహముగా నుండు వారు - సభ్యులు
సాముద్రికము - దేహ లక్షణములవలన భాగ్యమును సూచింమనది - ఒక శాస్త్రము
సారథి - రథమునడుపువాఁడు - చోదకుఁడు
సారసము - సరస్సులోఁబుట్టినది - తామర పువ్వు
సార్థవాహులు - జంతువులుమున్నగువాటిని గొనిపోవువారు - వర్తకులు
సార్వభౌమము - సర్వదేశమందు నెఱుంగ బడినది - ఉత్తరదిక్కున నుండు ఏనుఁగు
సార్వభౌముఁడు - సర్వభూమండలము పాలించువాఁడు - చక్రవర్తి
సాలగ్రామము - విష్ణుచిహ్నముకలది - శిలావిశేషము
సాలభంజిక - వస్త్రము, దంతము కొయ్య, మున్నగువానిచే తయారుచేయఁబడి నది - బొమ్మ
సాలెపురుగు - నాభియందలి నూలుతోఁ గూడునల్లునది - కీటకవిశేషము

సాష్టాంగము - 2 చేతులు, 2 పాదములు, 2 భుజాగ్రములు, 1 రొమ్ము, 1 నొసలు అను 8 అంగములు భూమికి తగులునట్లు చేయు నమస్కారము - నమస్కారవిశేషము

# సి

సింగినాదము - దుప్పి కొమ్ముతో చేయబడిన వాద్యము - సుషిరవాద్య విశేషము [నిరుపయోగపు మాటకి పదముపయోగపడును]

సింహనాదము - ఏనుగులు భయపడుటకై వీరులు చేయుధ్వని - ధ్వనివిశేషము

సింహము - ఏనుగులు మున్నగు జంతువుల హింసించునది - మృగరాజు

సింహాసనము - సింహాకృతిగా జేయబడిన ఉన్నత పీఠము - రాజుయొక్క ఆసనము

సిద్ధులు - అణిమ, మొదలైన అష్టసిద్ధులు కలవారు - విశ్వావసువు మున్నగువారు

సినీవాలి - చంద్రకళ కనఁబడు అమావాస్య - తిధివిశేషము

# సీ

సీత - నాగేటిచాలునందు బుట్టినది - జానకి

సీత్కారము-చలివలన గలుగు ధ్వని-ధ్వనివిశేషము

సీమంతిని - పాపటగలది - స్త్రీ

సీరధ్వజుఁడు - నాఁగలి గుఱుతుఁగా గలవాఁడు - జనకరాజు

సీరపాణి - నాగలిని చేతియందుగలవాఁడు - బలరాముఁడు

# సు

సుందరి - రూపలావణ్యములు కలది - అందకత్తె

సుగ్రీవుఁడు - మంచికంఠము కలవాఁడు - వానరరాజు

సుతుఁడు - తల్లి వీనిని కనినది - కుమారుఁడు

సుత్రాముఁడు - చక్కఁగా రక్షించువాఁడు - ఇంద్రుఁడు

సుదతి - చక్కని పలువరుసగలది - స్త్రీ

సుదర్శనము - మంచిదర్శనముకలది - విష్ణు చక్రము

సుధ - సుఖముగా బానఁజేయఁదగినది - అమృతము

సుధర్మ - మంచి ధర్మముకలది - దేవసభ

సుధాంశువు - అమృత కిరణములు కలవాఁడు - చంద్రుఁడు

సుధీ - మంచి బుద్ధి గలవాఁడు - విద్వాంసుఁడు

సుపర్ణుఁడు - మంచిఱెక్కలు కలవాఁడు - గరుత్మంతుఁడు

సుపర్వాణులు - శుభకరములైన ఉత్సవములుకలవారు - దేవతలు

సుప్రతీకము-మంచి అవయవములు

సుమనస్సులు - చక్కఁగా నెఱిఁగినవారు - దేవతలు

సుమేరువు - ఉన్నత శిఖరములు కలది - మేరుపర్వతము

సురజ్యేష్ఠుఁడు - దేవతలలో బెద్దవాఁడు - బ్రహ్మదేవుఁడు

సురదీర్ఘిక - దేవతల నడబావి - ఆకాశగంగ

సురద్విషుడు - దేవతలను ద్వేషించువాఁడు - రాక్షసుఁడు

సురనిమ్నగ - దేవతలనది - గంగానది

సురపతి - దేవతలరాజు - ఇంద్రుఁడు

సురలు - అమృతముగలవారు, మిక్కిలి ప్రకాశించువారు - దేవతలు

సురాచార్యుఁడు - దేవతలగురువు - బృహస్పతి

సువర్ణము - మంచి వన్నెకలది - బంగారము

సువాసిని - చక్కఁగా నివసించునది - ముత్తైదువ

## సూ

సూకరము - చాలపిల్లల నీనునది - పంది

సూచీముఖము - సూదిమొన ఆకారము కలది - అభినయహస్త విశేషము

సూతుఁడు - బ్రాహ్మణ స్త్రీకి రాజువలన బుట్టినవాఁడు - రథచోదకుఁడు

సూదుఁడు - బియ్యమును పక్వముచేయువాఁడు - వంటవాఁడు

సూపకారుఁడు - పప్పుమున్నగునవి వండువాఁడు - వంటవాఁడు

సూనుఁడు - తల్లి వీనిని ప్రసవించును - పుత్రుఁడు

సూరసూతుఁడు - సూర్యుని సారథి - అనూరుఁడు

సూరుఁడు - సంచరించు వాఁడు-సూర్యుఁడు

సూర్యుఁడు - వ్యాపారమందు బ్రేరేపించువాఁడు - భానుఁడు

## సే

సేన - రాజుతోఁగూడినది - సైన్యము

సేనాని - దండును నడిపించువాఁడు - దళవాయి, సైన్యాధిపతి

## సై

సైంధవము - సింధు దేశమందుబుట్టినది- గుఱ్ఱము

సైంధవము - సముద్రమువలన బుట్టినది - ఉప్పు

సైకతము - ఇసుక కలిగినది - ఇసుక తిన్నె

సైన్యము - రాజుతోఁ జేరియుండునది - సేన

సైరంధ్రి - పరగృహమునందు గంధ లేపనాది కార్యములుచేసి జీవించునది - స్వతంత్రురాలు [రాజగృహదాసి]

## సో

సోపానము - ఎక్కునపుడు, దిగునపుడు కొంచెము పంగునది - మెట్టు

సోపప్లవుడు - రాహువుచే గ్రహింపబడిన వాఁడు - చంద్రుఁడు, సూర్యుఁడు

సోమపీథి - యాగమునందు సోమరసము పానము చేసినవాఁడు - సోమయాజి

సోమయాజి - యాగముచేసి, సోమరసము పానము చేసినవాఁడు - సోమ పీథి

సోముఁడు - ప్రతిపక్షమున బుట్టువాఁడు చంద్రుఁడు

## సౌ

సౌగంధికుఁడు - సుగంధ ద్రవ్యవ్యాపారము చేయువాఁడు - వర్తకుడు

సౌదామని - దండవలె దీర్ఘాకారము కలది - మెఱుపు

సౌధము - సున్నముతో నిర్మింపబడినది - మేడ

సౌనికుఁడు - మృగపక్ష్యాదులను జంపి విక్రయించువాఁడు - కటికవాఁడు

సౌప్తికము - నిద్రించునపుడు విరోధుల జంపుట - హననోపాయము

సౌమనస్యము - సుమనోభావము - సుజనత్వము

సౌరసేయులు - కశ్యపునకు సురసయందు జనించినవారు - సహస్ర సంఖ్య సర్పములు

సౌవర్ణకరణి - క్రొత్తపన్నె గలిగించునది - ఓషధీ విశేషము

## స్క

స్కందుఁడు - శత్రువులను శోషింపజేయువాఁడు - కుమారస్వామి

## స్త

స్తనము - దీనికై బిడ్డ మొఱపెట్టును - కుచము

స్తనితము - మ్రోయునది - గర్జన, ఉఱుము

## స్థా

స్థాణువు - ప్రళయ కాలమునందుండు వాఁడు - శివుఁడు

స్థావరము - స్వభావముగా గదలకుండు నది - కొండ, చెట్టు మున్నగునవి

## స్నా

స్నాతకము - పెండ్లికి ముందు బ్రహ్మచారి చేసికొనునది - వ్రతవిశేషము

## స్ప

స్పర్శనుఁడు - స్పృశించువాఁడు - వాయుదేవుఁడు

## స్మ

స్మరహరుఁడు - మన్మథుని సంహరించినవాఁడు - శివుఁడు

స్మరుఁడు - కాముకులను తొందర పెట్టువాఁడు. - మన్మథుఁడు

## స్ర

స్రష్ట - జీవులను సృజించువాడు - బ్రహ్మ

## స్రో

స్రోతస్విని - తనంతటఁ బ్రవహించునది - నది

## స్వ

స్వభువు - తనంతట తానె పుట్టినవాడు - బ్రహ్మ, విష్ణు, శివుఁడు

స్వయంభువు - తనంతట తానె పుట్టినవాఁడు - బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుఁడు

స్వర్గము - సౌఖ్యము లెస్సగా గూర్చునది - దేవలోకము

స్వయంవరము - కన్నె వరుని తాను స్వయముగా గోరుకొనుట - అష్టవిధ వివాహములలో నొకటి

స్వర్ణది - దేవలోకపు నది - ఆకాశ గంగ

స్వర్ణము - చక్కఁగా బ్రకాశించునది - బంగారము

## స్వా

స్వాధీనపతిక - భర్తను స్వాధీనపఱచుకొన్న స్త్రీ - నాయికా భేదము

స్వారాట్టు - స్వర్గమందు ప్రకాశించువాఁడు - ఇంద్రుఁడు

## స్వై

స్వైరిణి - ఇచ్చవచ్చినట్లు సంచరించునది - అంకులాఁడి

## హం

హంసవాహనుఁడు - హంసను వాహనముగా గలవాఁడు - బ్రహ్మ
హనుమంతుఁడు - చెక్కిళ్ల పొడవుగాగలవాఁడు - ఆంజనేయుఁడు
హనువు - భక్ష్యమును నమలునది - పైపొర
హరి - పీకటినిఁ బోగొట్టువాఁడు - సూర్యుఁడు
హరి - భక్తులను తనపంకకు నాకర్షించువాఁడు - విష్ణువు
హరి - ఏనుఁగుబు మున్నగువానిని హరించునది - సింహము
హరిచందనము - ఇంద్రుని సంతోషపెట్టునది - దెవవృక్షములలో నొకటి
హరిచందనము - పసుపువన్నెగల గంధము - శ్రీగంధము
హరిప్రియ - విష్ణువునకు ప్రియురాలు - లక్ష్మీదేవి
హరిహయుఁడు - పచ్చని గుఱ్ఱములు కలవాఁడు - ఇంద్రుఁడు
హరుఁడు - భక్తుల బాధలను హరించువాఁడు - శివుఁడు
హర్మ్యము - మనస్సునకు సంతోషకరమైనది - ధనికుని గృహము
హర్యక్షము - కపిలరంగు కన్నులుకలది - సింహము
హలాయుధుఁడు - నాగలి ఆయుధముగా గలవాఁడు - బలరాముఁడు
హలి - నాగలి ఆయుధముగాగలవాఁడు - బలరాముఁడు
హవిస్సు - అగ్నిలో వేల్వఁబడునవి - అన్నము, నెయ్యి
హవ్యము - దేవతల కీయఁదగినది - అన్నాదులు
హవ్యవాహనుఁడు - హవిస్సునుమోయువాఁడు - అగ్నిదేవుఁడు
హస్తి - తొండముకలది - ఏనుఁగు

## హా

హాటకగర్భుఁడు - బంగారు గర్భమున కలవాడు - బ్రహ్మ
హాటకము - ప్రకాశించునది - బంగారము
హాలికుఁడు - నాగలిచే దున్నువాఁడు - రైతు
హావము - భ్రూనేత్రాదివికారములచేనించుక తెలియఁదగినది - మనోవికారము

హిమము - తాపమును బోగొట్టునది - మంచు

హిమవంతము - మంచు కలది - పర్వత రాజము

హిమకరుఁడు - చల్లని కిరణములు కల వాఁడు - చంద్రుఁడు

హిమవాలుక - మంచువలె చల్లగనుండి ఇసుకవంటి ఆకారముకలది - కర్పూ రము

హిమధాముఁడు - చల్లని కాంతిగలవాఁడు - చంద్రుఁడు

హిరణ్యకశ్యపుఁడు - బంగారువికారమైన అన్నవస్త్రములుకలవాఁడు - ఒక రాక్ష సుఁడు

హిరణ్యగర్భుఁడు - గర్భమున బంగారు కలవాఁడు - బ్రహ్మ

హిరణ్యము - పోవునది - ధనము

---

# 2. నానార్థ పరిచ్ఛేదము

## అ

అంకము – నాటకములో నొక భాగము, తొడ

అంకిలి - ఆపద, క్షోభము

అంకాపొంకములు - కోపము, విరోధము

అంకణము – నలుచదురపుచోటు, లోఁగిలి

అంకురము - మొలక, వెంట్రుక, నీరు, రక్తము

అంగజ – కూతురు, రక్తము, వెంట్రుక, మన్మథుఁడు, కుమారుఁడు

అంగద – ఆకలి, ఆపద

అంగారకము – నిప్పు, గుంటగలగర మొక్క

అంగారము – నిప్పు, బొగ్గు

అంగారికి – చెఱకుగడ, మోదుగు మొలక

అంగిక – చొక్కాయ, రవికె

అంగుళము – ఆఱు యవల ప్రమాణము, బొటనవ్రేలు

అంగుళి - వ్రేలు, తొండములచివఱ

అంగుళిత్రము – అత్తెము, హస్తకవచము

అంగుష్ఠము - బొటనవ్రేలు, అంగుళము

అంఘ్రి – కాలు, వేరు

అండజము - పాము, చేఁప, పక్షి, తొండ, కస్తూరి

అండము – ముష్కము, గ్రుడ్డు

అంతము – నాశము, చివఱ, నిశ్చయము, తుద, స్వరూపము, మధ్యము

అంతరము – మేర, తెఱపి, నడిమిచోటు, మఱుఁగు, భేదము, పరమాత్మ, కట్టు వస్త్రము, రంధ్రము

అంతరించు – వెడిపోవు, చచ్చు

అంతర్యామి - పరమాత్మ, జీవాత్మ

అంతావసాయి – మాల, మంగలి

అంతిమము - తుది, సమీపించినది

అంతేవాసి – శిష్యుఁడు, మాలవాఁడు

అందుకము - ఏనుఁగు సంకెల, అందె

అందువు - ఏనుఁగుకాలిగొలుసు, బారి

అంధిక - చీఁకటి, జూదము

అంబ - అమ్మ, కాశిరాజు కూతురు

అంబకము - బాణము, కన్ను

అంబరము - ఆకాశము, వస్త్రము

అంబరీషము - యుద్ధము, వేపుఁడు మంగలము, ఒక చెట్టు

అంబిక - పార్వతి, తల్లి, మేనత్త, ధృతరాష్ట్రుని తల్లి
అంబుజము - వానకోయిల, కమలము, ఎఱ్ఱ గన్నేరు
అంశుమంతుఁడు - సూర్యుఁడు, సూర్యవంశపు రాజు, ధనశాలి
అంశువు - కిరణము, కాంతి
అంసము - మూపు, అంశము
అంహతి - తెలుగు, వితరణము, విడుపు
అకము - పాపము, దుఃఖము
అక్తము - పోయినది, చేరినది, విశదమైనది
అక్షమాల - రుద్రాక్ష జపమాల, అరుంధతి
అక్షము - బండికన్ను, ఇంద్రియము పాచిక, వ్యవహారము, బండి, జూదము ఎనుఁబది గురివెంద గింజల ఎత్తు, తాండ్ర చెట్టు
అక్షరము - అకారాది వర్ణములలో నొకటి, ప్రణవము, ధర్మము, తపస్సు, ముక్తి, ప్రకృతి, యజ్ఞము, పరబ్రహ్మము, [డు] బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు
అక్షరచణుఁడు - లిపికాఁడు, వ్రాయసకాఁడు
అక్షవతి - కైతవము, జూదము
అక్షాంతి - ఓర్వలేని తనము, ఈరసము
అక్షీబము - సముద్రపు టుప్పు, మునగ చెట్టు
అక్షోబము - కలతలేమి, ఏనుఁగును కటు కంబము
అఖండము - సమస్తము, ఖండముకానిది
అగడుపడు - తొట్రుపడు, దూఱుపడు
అగమము - కొండ, చెట్టు
అగము - పర్వతము, చెట్టు, పాము, నాభి
అగలు - ఛేదిల్లు, అగరువు
అగస్తి - అగస్త్యుఁడు, [స్త్రీ] అగిసె చెట్టు
అగాడీ - ముందు, గుఱ్ఱము ముందు కాళ్ళకు గట్టుత్రాడు
అగాధము - అసాధ్యము, లోఁతు
అగురువు - ఇరుగుడి చెట్టు, అగలు, చిన్నది
అగౌకసము - పక్షి, సింహము, శరభము
అగ్గము - అధీనము, కనఁబడినది
అగ్నికణము - నిప్పుక, మిడుగురు
అగ్నిజ్వాల - ఆరెవెట్టు, మంట
అగ్నిముఖుఁడు - బ్రాహ్మణుఁడు, వేలుపు
అగ్నిశిఖ - మంట, కుంకుమపువ్వు, వెన్నవెదురుకూర
అగ్నిహోత్రము - అగ్ని, ఆహితాగ్నులు, హవిస్సు
అగ్రజన్ముఁడు - అన్న, బ్రాహ్మణుఁడు, బ్రహ్మ
అగ్రము - చివర, ఎదురుదాపు, ముఖ్యము
అఘము - పాపము, దుఃఖము, వ్యసనము
అచల - కొండ, భూమి, మేకు
అచ్ఛము - పటికప్పురాయి, ఎలుఁగుగొడు

అజ - ప్రకృతి, ఆఁడుమేక
అజిరము - శరీరము, ముంగిలి
అజుఁడు - బ్రహ్మ, విష్ణువు, శివుఁడు మన్మథుఁడు, సూర్యవంశపురాజు
అట్టము - అన్నము, ప్రవాహము
అట్టాలకము - నగరు, కోటబురుజు
అణిమ - అణుత్వము, ఐశ్వర్యములలో నొకటి
అణుకుఁడు - నీచుఁడు, నేర్పరి
అణువు - చిఱువస్తు, లేశము
అత్యయము - చావు, సోకము, దోషము
అత్యాహితము - భయము గలిగించునది, బ్రతుకుగోరని పని
అద్రి - పర్వతము, వృక్షము, సూర్యుఁడు
అద్వైతము - అభేదము, జీవమునకు పరమాత్మకు ఐక్యము చెప్పు మతము
అధరము - క్రింది పెదవి, తక్కువైనది
అధర్యుఁడు - బ్రాహ్మణుఁడు, పురోహితుఁడు
అధికరించు - అధికారము కలిగించు చదువు
అధిక్షేపము - వెదకించుట, నిందించుట
అధిగతము - పొందబడినది, చదువఁబడినది
అధిగమము - చక్కఁగా జనువుట, పొందుట
అధివిన్న - మొదటి పెండ్లాము, సవతి తనముచేత దుఃఖించునది
అధిష్ఠానము - ఒకపట్టణము, ప్రభావము, ఆక్రమించుట
అధీతి - అధ్యయనము, అధ్యయనము చేసినవాఁడు
అవటు - గర్వము, పొగరు
అధ్యవసాయము - ఆరోపణము, ఉత్సాహము
అధ్యాత్మము జ్ఞానము, ఆత్మయందలిది
అధ్వగ - ఆకాశగంగ, బాటసారి, సూర్యుఁడు
అనందము [డు] - హృదయము, మన్మథుఁడు, ఆకాశము
అనంత - పార్వతి, భూమి, గఱిక, తిప్ప తీఁగ, పౌర్ణమి
అనలము - నిప్పు, జఠరాగ్ని
అనిలుఁడు - గాలి, ఒక వస్తువు
అనీకము - యుద్ధము, సేన
అనీకస్థము - గుఱుతు, వీరమర్దళము
అనుగతము - పొందబడినది, వెంబడింపఁబడినది
అనుతర్షము - కోరిక, కల్లుత్రాగెడు గిన్నె
అనుతాపము - తగవు, పశ్చాత్తాపము
అనుపానము - మందుతో చేర్చెడు వస్తువు, భోజనముతో చేర్చుకూర, పప్పు మొదలైనవి
అనుబంధము - కట్టు, తప్పులు బయలు పఱచు.

అనుబోధము - అత్తరు, ప్రబోధము
అనుభావము - నిశ్చయము, ప్రభావము
అనుమతి - ఇష్టము, ఒక కళ తక్కువైన చంద్రునికల పౌర్ణమి
అనుమానము - ఊహించుట, సందేహము.
అనుమోదము - సమ్మతి, సంతోషము
అనుయోగము - ప్రశ్న, అడుగుట
అనువిద్ధము - సంబంధించినది, కూడినది
అనువు - ఉపాయము, విధము, అవకాశము
అనుశయము - అనుబంధము, పశ్చాత్తాపము
అనుషంగము - కలయిక, తగులు
అనుష్టుప్పు - ఒక చంధస్సు, సరస్వతి
అనుష్ణుఁడు - వేడిమి లేనివాఁడు, సోమరి
అనూకము - కులము, శీలము
అనూపము - ఎనుఁబోతు, జవుకు గల నేల
అన్నెము - అన్యాయము, ఇతరము
అన్నెము - వెఱ్ఱైనది, సరిలేనిది
అన్వయము - కులము, పొందిక
అపఘనము - అవయవము, శరీరము
అపచయము - పూజ, తగ్గిపోయినది
అపదేశము - కపటము, ప్రసిద్ధి, నిమిత్తము
అపనయము - తొలగించుట, కీడు
అపభ్రంశము - అపశబ్దము, ఏడ్పుట
అపర - మాపి, వెనుకటిది, మీఁది
అపరాజిత - పార్వతి, విష్ణుక్రాంతము
అపలాపము - మఱుగు, మాట ప్రేమము
అపవర్గము - మోక్షము, ఈవి, ఈడేరుట
అపవర్జనము - ఈవి, మోక్షము
అపవాదము - అపనింద, నమ్మకము
అపసవ్యము - దక్షిణము, ప్రతికూలము
అపహారము - తగ్గుదల, విహరించుట
అపహ్నవము - స్నేహము, మఱుగుమాట, ఒక అలంకారము
అపాంగము - కడకన్ను, తిలకము
అపోగండుఁడు - శిశువు, పలుటకలవాఁడు
అప్ప - తల్లి, తండ్రి, అక్క
అప్పన - అనుమతి, ఆజ్ఞ
అప్పళము - అప్పడము, బాలక్రీడ
అప్పళించు - గ్రహించు, యత్నించు, ఆక్రమించు
అప్పు - ఋణము, నీరు
అబ్జము - తామర, ఉప్పు, శంఖము, ఎఱ్ఱగన్నేరు
అబ్జుఁడు - చంద్రుఁడు, ధన్వంతరి
అబ్దము - సంవత్సరము, మేఘము అద్దము
అబ్ధి - సరస్సు, సముద్రము

అభయ - భయములేనిది, వట్టివేరు
అభావము - లేమి, చావు
అభిఖ్య - కాంతి, కీర్తి, పేరు
అభిగ్రహము - పగకు ఎదిరించుట, గౌరవము
అభిజనము - ప్రసిద్ధి, కులము, జన్మభూమి
అభిజాతుఁడు - సత్కులుండు పండితుఁడు, బ్రాహ్మణుఁడు
అభిధేయము - పేరు, అర్థము
అభినివేశము - పట్టుదల, గౌరవ
అభిరూపుఁడు - విజ్ఞాని, భూపతి
అభిషంగము - తిట్టు, శాపము, అవమానము
అభ్యంతరము - నడిమిచోటు, అన్ని దిక్కుల మధ్య చోటు
అభ్రము - స్వర్గము, మేఘము, బంగారము, ఆకాశము
అమృతము - నీరు పాలు, నెయ్యి, అన్నము, సుధ, ఆకాశము, రుచి కలది, నాశనములేనిది
అయనము - సూర్యుని దక్షిణోత్తర దిక్కుల సంచారము, మార్గము
అయము - మేలు, మేలుచేయు దేవుఁడు
ఆయోధనము - వధము, యుద్ధము
అరి - శత్రువు, చక్రము
అరిష్టము - అశుభము, మరణచిహ్నము కాకి, పురుటిల్లు, రాగి, వెల్లుల్లి, కుంకుఁడు చెట్టు, వేపచెట్టు
అమ్లీక - చింత, పులుసు, త్రేపు
అయోగము - ఎడఁబాటు, మానని యత్నము
అరతి - విరామము, మన్మథావస్థ
అరుణ - తెల్లతెగడ, అతివస, కపిల వర్ణము, కుష్ఠుభేదము, సంధ్యారాగము, కొలఁది ఎరుపు
అరుణుఁడు - సూర్యుఁడు, అనూరుఁడు
అర్కము - జిల్లేడు, పటికము, రాగి
అర్కుఁడు - సూర్యుఁడు, ఇంద్రుఁడు అన్న
అర్ఘ్యము - వెల, పూజించుట
అర్జునము - బంగారు, కసవు, నేత్ర రోగము, నెమిలి, తెలుపు, మద్ది చెట్టు
అర్జుని - ఆవు, బాణాసురుని కూతురు
ఆర్తి - దుఃఖము, వింటికోపు
అర్థము - శబ్దార్థము, ధనము, వస్తువు, కారణము, ప్రయోజనము, సగము, న్యాయము
అర్ధ్యము - సిలాజిత్తు, తెలివికలది
అర్థి - యాచకుఁడు, ధనశాలి
అర్బుదము - నేత్రరోగము, దశకోటి

అర్భకుఁడు - బాలుఁడు, మూర్ఖుఁడు
అర్యుఁడు - కోమటి, ప్రభువు
అర్వము - గుఱ్ఱము, అధమము
అఱ - గది, సగము, కొఱత, భేదము వంచన, కీడు
అఱు - నశియించు, అఱ్ఱు, దాపు
అలంకారము - సొమ్ము, ఉపమాద్య లంకారము
అలఁగు - వెనుదీయు, సందేహించు
అలఁతి - తేలిక, సూక్ష్మము
అలముకొను - కవియు, పైకొను, వ్యాపించు
అలరు - వికసించు, పూవు, సంతోషించు
అలుఁగు - చెఱువునీరు పోవుట కేర్పఱచిన దారి, ఖడ్గము, బాణపు ములికి
అవంతి - ఒక పట్టణము, అక్క-
అవకాశము - తెఱపి, ఎడము
అవగతము - తెలియఁబడినది పొందఁ బడినది
అవగాహము - ఆకళింత, మునక
అవగీతము - దూఱు, చెప్పఁబడినది
అవగ్రహణము - అనాదరణ, అడ్డుబాటు
అవగ్రహము - అనావృష్టి, అడ్డుపాటు, ఏనుఁగునొసలు
అవటము - రంధ్రము, నూయి, గొయ్యి
అవదాతము - తెల్లనిది, పచ్చనిది, శ్రేష్ఠమైనది
అవధి - మేర, బిలము, వేళ, ఎడము
అవరోధము - అంతఃపురము, మఱుఁగు
అవలేపము - పొఁత, గర్వము, ఆభరణము
అవశ్యాయము - గర్వము, మంచు
అవసాయము - శేషము, నిశ్చయము
అశని - పిడుగు, వజ్రాయుధము, మెరుపు
అవి - బహిష్టుస్త్రీ, ఎఱుక, కంబళి, కొండ, గొఱ్ఱె, సూర్యుఁడు, అవి — బ. వ.
అశ్మంతము — చావు, ప్రొయ్యి, కీడు
అశ్వతరము — కంచర గాడిదె, సర్ప విశేషము
అష్టాపదము — శరభము, బంగారు, సాలె పురుగు, వెండికొండ, జూదమాడెడు పలక
అసలు — బురద, మూలధనము
అసము — కీర్తి, దర్పము
అసితుఁడు — శనిగ్రహము, నల్లనివాఁడు
అసిపత్రము — కత్తి ఒఱచెఱకు, నరక విశేషము
అసుర — రాత్రి, వేశ్య. (పుం) రాక్షసుఁడు
అస్రప — జలగ, పిశాచి

అస్రము — నెత్తురు, కన్నీరు, వెండ్రుక, శోకము

అస్త్రము — విల్లు, కత్తి, బాణము

అహి — పాము, వృత్రాసురుఁడు

అహిభుక్కు — నెమిలి, గరుత్మంతుఁడు

అహిద్విషుఁడు — ఇంద్రుఁడు, గరుత్మంతుఁడు

అహిఫేనము - అఫని, విషము

అళి - తుమ్మెద, తేలు, సారాయము

అళీకము - అసత్యము, అప్రియము, నొసలు

# ఆ

ఆంగీరస - ఒక సంవత్సరము, (డు) బృహస్పతి

ఆఖువు - పందికొక్కు, ఎలుక

ఆగము - పాపము, తప్పిదము

ఆచితము - కప్పబడినది, గ్రహింపబడినది

ఆగ్రహము - కోపము, ఆసక్తి

ఆచ్ఛాదనము - కప్పుట, వస్త్రము

ఆజి - యుద్ధము, క్షణకాలము

ఆతంకము - ఆరాటము, వెఱపు, రోగము, మృదంగనాదము

ఆత్మ - జీవుఁడు, బ్రహ్మము, బుద్ధి, మనస్సు, శరీరము, స్వభావము, ధీరత్వము, ప్రయత్నము

ఆత్మభువు - మారుఁడు, బ్రహ్మ

ఆదర్శము - టీక, అద్దము, ప్రతియైన పుస్తకము

ఆదాయము - రాఁబడిధనము, లాభము

ఆదిత్యుఁడు - వేల్పు, సూర్యుఁడు

ఆధానము - కప్పుట, ఉంచుట, భరించుట

ఆననము - నోరు, ముఖము

ఆభాసము - కాంతి, ప్రతిఫలించుట

ఆభోగము - వైశాల్యము, యత్నము

ఆమంత్రణము - పిలుపు, శ్రార్ధములకు దాయాదుల నాహ్వానించుట

ఆమిషము - మాంసము, లంచము, లాభము

ఆమ్నాయము - వేదము, ఉపదేశము, సంప్రదాయము

ఆయతనము - గృహము, దేవాలయము

ఆర్తి - శోకము, వింటికొప్పు

ఆలి - వరుస, చెలికత్తె

ఆలేఖ్యము - వ్రాఁత, చిత్తరువు

ఆలోకము - ఎండ, చూపు

ఆవర్తము - నీటియందలి సుడి, గుఱ్ఱపు సుడి

ఆవాపము - ఆవము, విత్తనములు నాటుట, పాదు

ఆశయము - మనస్సు, ఆధారము, అభిప్రాయము

ఆశరుఁడు - రాక్షసుఁడు, నిప్పు - [అగ్ని]
ఆశ్వ - ముఖము, నోరు, ఉండుతావు
ఆట - నింద, క్రీడ
ఆటవెలఁది - నాట్యకత్తె, పద్యభేదము
ఆవి - మందము, అల్పము
ఆయస్తము - వాడియైనది, కొట్టబడినది
ఆయోగము - తెలివి, వ్యాపారము
ఆయోధనము - యుద్ధము, చంపుట
ఆరంభము - వధ, త్వర, గర్వము, ప్రయత్నము
ఆరభటి - కార్యవృత్తి, క్రౌర్యత
ఆశీస్సు - ఆశీర్వాదము, పాముకోర
ఆశువు - వేగము, వడ్లు
ఆశ్రయము - ఇల్లు, అండ, ఆధారము
ఆశ్లేషము - ఆలింగనము, ఒక నక్షత్రము
ఆశ్వాసము - ఊరట, పరిచ్ఛేదము
ఆసారము - మిత్రబలము, జడివాన
ఆస్తరణము - పఱపు, [చాప మొదలైన] ఆసనము
ఆస్థానము - రాజు కొలువు, యత్నము
ఆరు - కలుగు, నిండు
ఆరుఁడు - శని, అంగారకుఁడు
ఆరోహణము - ఎక్కుట, మొలక
ఆర్చు - కూయు, ఆడించు
ఆర్తవము - స్త్రీఋతువు, పుష్పము
ఆర్యుఁడు - మంచివాఁడు, పూజ్యుఁడు, పెనిమిటి
ఆలు - ఎండు, నశించు, ఐదు ఒకటి
ఆశ - దిక్కు, కోరిక
ఆశుగము - బాణము, గాలి
ఆషాఢము - ఒకనెల, మలయపర్వతము
ఆసవము - కల్లుతేట, తేనె
ఆస్కందనము - యుద్ధము, ఇంకుట
ఆస్ఫోటనము - వీలిక, పోటు
ఆస్రము - అశ్రువులు, రక్తము, వెంట్రుక
ఆహారము - భోజనము, అపహరించుట
ఆహ్వ - పేరు, పిలుపు
ఆళి - పంక్తి, తేలు, చెలికత్తె

## ఇ

ఇంగము - ఆశ్చర్యము, అభిప్రాయము
ఇచ్ఛ - చిత్తము, అభీష్టము
ఇజ్య - పూజ, ఈవి, యాగము, కూడిక
ఇడ - ఒక నాడి, ఆవు, మాట, బుధగ్రహము, భార్య
ఇడము - ఆపద, క్లేశము
ఇత్వరుఁడు - బీద, క్రూరుఁడు, బాటసారి
ఇద్ధము - ప్రకాశము, పరిశుద్ధము
ఇనుఁడు - రాజు, సూర్యుఁడు, భర్త
ఇమ్ము - స్థానము, సుఖము, అనుకూలము; ఇంపు.

ఇర - నీరు, కల్లు, మాట, నేల.

ఇల - నేల, ఆవు, మాట.

ఇషీక - కుంచె, ముండ్లదుబ్బు

ఇష్టము - కోరఁబడినది, ప్రియమైనది, యజ్ఞకర్మము.

ఇష్టి - కోరిక, యజ్ఞము, కత్తి.

ఇంద్రాణి - ఇంద్రుని భార్య, వావిలి,

ఇంద్రుఁడు - అంతరాత్మ, వేల్పు ఱేఁడు.

ఇక్కువ - ఉనికి, జాడ,

ఇక్షుగంధ - గొలిమిడి, పల్లేరు

ఇంధనము - వంటచెఱకు, చిదుగు

ఇంపు - ఇష్టము, ఆనందము.

ఇండె - చీలిక, ఎముకకీలు.

ఇరుపుట్టువు - పక్షి, బ్రాహ్మణుఁడు

ఇళ - ఆవు, మాట, బుధుని భార్య

## ఈ

ఈఁత - ఈదుట, ఈనుట

ఈక్షణము - చూపు, కన్ను.

ఈతి - ఉపద్రవము, ఊరువిడిచి పోవుట

ఈరస - కోపము, ఈర్ష్య

ఈల - చిమ్మటకూఁత, పిగ్గ.

ఈట - వ్యర్థము, శూన్యము.

ఈతువు - ఆకర్షము, విలంబనము

ఈవల - ఇటుపిమ్మట, ఈ ప్రక్క.

ఈస - కోపము, ఈర్ష్య

ఈశుఁడు - రాజు, శివుడు, ధనశాలి, మన్మధుఁడు

ఈడేరు - వర్ధిల్లు, సిద్ధించు

ఈహామృగము - నాటకవిశేషము, తోడేలు.

ఈశిక - కత్తి పీఁట, చురకత్తి

## ఉ

ఉండు - వసించు, వర్తించు, మిగులు

ఉందురము - ఎలుక, వర్తించు, మిగులు

ఉందురము - ఎలుక, పందికొక్కు

ఉక్తి - సరస్వతి, మాట

ఉగ్గు - పిల్లలకుపోయు కారము, ముదుత.

ఉగ్రుఁడు - శివుఁడు, భయంకరుఁడు

ఉచితము - తగినది, ఎరుగబడినది,

ఉచ్ఛ్రయము - పోకముడి, గుంపు,

ఉచ్చాటనము - ఒకవిద్య, వ్రేళ్ళతో బెఱకుట

ఉచ్ఛ్వాసము-ఊపిరివెలికిపుచ్చుట,కలుఁజు, ఊరట, పరిచ్ఛేదము

ఉజ్జ్వలము - ప్రకాశము, వెలుఁగునది

ఉడ్ల - నాలుగు, రాశి
ఉడుపుష్పము - తామర, అశోకము.
ఉత్కటము - లవంగపు పట్ట, అధిక మైనది
ఉత్కలిక - ఉత్కంఠ, పెద్దఅల
ఉతక్కాతము - గజక్రీడ పెల్లగింపఁబడినది
ఉత్త్రస్తము - కదలినది, కావఁబడినది.
ఉత్తర - ఒకనక్షత్రము, విరాటుని కూతురు, ఒక అలంకారము, వెలిది.
ఉత్తలపడు - త్వరపడు, కలఁతపడు
ఉత్తంసము - వెవిప్రోగు, జడబిల్ల
ఉత్తాలము - పొడవైనది, మేలైనది
ఉత్థము - పుట్టినది, నిలిచినది.
ఉత్థానము - కూర్చుండి లేచుట, ప్రయత్నము, ముంగిలి, సైన్యము, సంతోషము.
ఉత్పలము - కలువ, చెంగల్వకోష్టు
ఉత్ఫుల్లము - విచ్చినది, బలిసినది.
ఉత్సంగము - ఒడి, తొడ.
ఉత్సర్గము - త్యాగము, న్యాయము, విడుపు
ఉత్సవము - పండగ, కోరిక, గర్వము, కోపము.
ఉత్సాహము — యత్నము, సంతోషము.
ఉత్సేకము - గర్వము, అతిశయము, పొంగు.
ఉదగ్రము - పొడవైనది, భయంకర మైనది
ఉదయము - పుట్టుక, ఉన్నది, పొడవు, తూర్పు కొండ.
ఉదరము - పొట్ట, యుద్ధము.
ఉదానము - పాము, బొడ్డు, ఒక వాయువు
ఉదాత్తుఁడు - గొప్పవాఁడు, ఇచ్చు వాఁడు
ఉదారుఁడు - ఇచ్చువాఁడు, గొప్ప వాఁడు.
ఉదితము - చెప్పబడినది, పుట్టినది.
ఉదుంబరము - రాగి, మేడి, గడప
ఉదూఖలము - తోలు, గుగ్గిలపు చెట్టు.
ఉద్ఘాతము - ఇనుపగద, దెబ్బ
ఉద్ధృతి - గర్వము, పైకెత్తుట.
ఉద్బోధము - తలఁపు, వికాసము, మేలుకొల్పు
ఉద్యానము - పూఁదోట, ప్రయోజనము.
ఉద్యాపనము - తొలగించుట వధించుట
ఉన్మంథనము — చంపుట, కదిలించుట

ఉన్మాదము — బోను, వధము
ఉపక్రమము - ప్రారంభించుట, విక్రమము, చికిత్స
ఉపగమము - అంగీకారము, సమాపించుట
ఉపగూహనము - కౌఁగిలింత, దాఁచుట
ఉపచయము - పొడవు, వృద్ధి
ఉపచారము - సమ్మానము, సేవ,లంచము
ఉపతాపము - సంతాపము, రోగము, త్వర
ఉపదంశము - ఊరుగాయ, కొఱుకు జాడ్యము
ఉపధానము - దిండు, విషము, మైత్రి
ఉపధి - కపటము, బండికల్లు
ఉపదానము - అరణము, కానుక
ఉపనిషత్తు - వేదోక్తము, ధర్మము, ఏకాంతము
ఉపపత్తి - కలిమి, అంతము, అర్హత, కారణము, పుట్టుక, దృష్టాంతము
ఉపప్లవము - ఉపద్రవము, ఉత్పాతము
ఉపరాగము - అన్యాయము, వ్యసనము
ఉపల - ఱాయి, రత్నము
ఉపసర్గము - ప్రాది, ఒక రోగము, ఉత్పాతము
ఉపాంతము - మూల, దాఁపు
ఉపాధానము - ఉంచుట, ధరించుట
ఉపాయము - వెరవు, పొందు
ఉపాసన - శరాభ్యాసము, పీఁట

ఉప్పరము - ఆకాశము, మీదు
ఉబ్బకము - ఆధిక్యము, ఉత్సాహము
ఉబ్బు - పొంగు, లేచు, సంతోషము
ఉమ - పార్వతి, కాంతి, పసుపు
ఉరవు - ఔచిత్యము, అధికము, ఉచితము
ఉరలు - కాఱు, దొర్లు, వీడు
ఉఱుకు - దాఁటు, దుముకు
ఉలియు - చలించు, మ్రోయు
ఉల్బణము - పొంగు, అతిశయము, స్పష్టమైనది
ఉల్లసిల్లు - ప్రకాశించు, సంతోషించు, వికసించు
ఉషణ - మిరియము, సొంటి
ఉష్ణీషము - తలపాగ, కిరీటము
ఉస్ర - ఎద్దు, ఆవు, కిరణము
ఉల్బము - పిండము, మావి

## ఊ

ఊచ - అరఁటిబోదె, ముండ్లదుబ్బు
ఊద - వాపు, ఈర్ష్య
ఊఁదు - వాచు, పట్టు, ఉంచు
ఊడు - రాలు, వదలు, జాఱు, పాఱు
ఊతి - కుట్టు, రక్షణము
ఊరు - గ్రామము, సాను, నీరువచ్చు, పుట్టు

ఊర్జము - పూనిక, కార్తికమాసము, బలము
ఊర్ణ - ఉన్ని, నూలు
ఊర్ణాయువు - పొట్టేలు, సాలెపురుగు
ఊర్ధ్వరేతస్కుఁడు - ఋషి, శివుఁడు
ఊర్మి - అల, ఉమ్మి, నొప్పి, ప్రకాశము, వంకర, తహతహ
ఊర్మిక - అల, ఉంగరము
ఊషము - చవుఁడులేకువ
ఊష్మము - ఉమ్మ, తేసంగి
ఊరట - ఆశ్వాసము, సహాయము
ఊసరము - కృశించినది, చవుటిది

## ఋ

ఋక్షము - నక్షత్రము, ఎలుగుబంటి
ఋతము - సత్యమైనది, పూజింపబడినవి, నీరు, శిలోంఛవృత్తి
ఋతి - త్రోవ, పోటి, రోఁత, శుభము
ఋతువు - వసంతము, లోతైనది, కాంతి, ఆర్తవము
ఋద్ధము - పెరిగినది, నూర్చినది
ఋషభము - ఎద్దు, ఓషధి, చెవిరంధ్రము, ఒకధ్వని
ఋషభి - దూలగొండి, విధవరాలు, మాచకమ్మ
ఋషి - ముని, వేదము, కాంతి

## ఎ

ఎంచు - లెక్కించు, తలఁచు, ప్రశంసించు
ఎకసక్కెము - అవమానము, వంచన, వికటము
ఎక్కెము - గనిమ, కొద్ది వంతెన, గుణకము, చిన్నగట్టు
ఎక్కు - అతిశయించు, వింటినారి, సిద్ధించు
ఎగచు - ఎగయజేయు, తఱుము
ఎగపిపడు - మండిపడు, గర్వించు
ఎగుదల - పై భాగము, వృద్ధి
ఎగువ - మీఁదు, ఆధిక్యము
ఎగ్గు - కీడు, అపరాధము, దోషము
ఎడ - స్థానము, అవకాశము, దూరము భేదము, సంధి, విఘ్నము
ఎడము - చోటు, స్థానము
ఎడరు - ఆపద, భంగము, ఎడారి
ఎత్తికొను - యత్నించు, ఉద్ధరించు
ఎత్తికోలు - ప్రయత్నము, సంకల్పము
ఎత్తు - కలుగు, గ్రహించు, తీయు, ఉన్నతి, తూనిక, ప్రస్తావనచేయు, [దండెత్తు, నోరెత్తు] మొదలగునవి
ఎత్తడి - దరిద్రము, ఏమిలేనిది
ఎర - ఆహారము, బలి, వ్యసనము
ఎరగు - దిగు, నమస్కరించు
ఎరవు - ఉచితము, భేదము

ఎఱక - ఱెక్క, భుజము
ఎఱుక - తెలివి, పరిచయము, సోదె
ఎఱ్ఱి - వానపాము, ఎఱ్ఱరంగు
ఎలయు - చేయు, కలుగు, పొందు
ఎల్లి - గొడుగు, రేపు
ఎసకము - అతిశయము, విధము, విజృంభణము

## ఏ

ఏకకుండలుఁడు - బలరాముఁడు, కుబేరుఁడు
ఏకము - అన్యము, ముఖ్యము, ఒక్కటి
ఏకావళి - ఒంటిపేట హారము, ఒక అలంకారము
ఏచు - అతిశయించు, పెరుగు
ఏతెంచు - వచ్చు, పోవు
ఏదు - ముండ్లపంది, నశించు
ఏధ - చిదుగు, వంటచెరకు
ఏనాళ్లు - ఐయ్యంకులు పంపుహొను సారె, ఐదుదినములు
ఏరాళము - అధికము, అసంఖ్యము
ఏరు - ఎద్దులుకట్టినకాడి, తలనొప్పి
ఏరుపడు - తేఁటపడు, సిద్ధపడు
ఏనస్సు - పాపము, అపరాధము
ఏమరుపాటు - అకస్మాత్తు, మోసము

## ఐ

ఐంద్రము - మాలకాకి, ఒక గ్రహయోగము
ఐపోవు - వెచ్చమైతీఱు, ముగియు
ఐరావతము - ఇంద్రుని ఏనుఁగు, ఒక పాము, నిమ్మ
ఐదుపదిచేయు - నమస్కరించుట, ఓడిపోవుట

## ఒ

ఒంటికాఁడు - ఏకాకి, పంది
ఒండు - అన్యము, ఏకము
ఒగ్గు - మొనయు, పరచు, ఒడ్డు
ఒచ్చెము - కొఱత, అవమానము
ఒజ్జ - ఉపాధ్యాయుఁడు, పురోహితుఁడు
ఒట్టు - కలుగు, ఉంచు, రగుల్చు
ఒడి - ఉత్సంగము, పశుయోని
ఒడికము - ఉపాయము, ఇంపు, యుక్తము
ఒడ్డగిల్లు - అడఁగు, ఒఱగు, చిప్పిల్లు
ఒడ్డనము - పందెము, కేడము, వ్యూహము
ఒడ్డు - తరము, పందెమిడు, విశాలము, చాచు
ఒత్తు - అదుము, పిసుఁగు, నొక్కు, తర్చు
ఒనరు - కలుఁగు, బల్పు
ఒప్పు - ఒప్పిదమగు, తగు, అందము

ఒఱ - గవుసెన, ఖడ్గాదికోశము, అనాదరము

ఒడయడు - రాజు, భర్త

ఒఱయు - వెదకు, పరీక్షించు, విచారించు

ఒఱపు - సౌందర్యము, ఉపాయము, ప్రతాపము

ఒఱలు - ఱోలు, విలపించు

ఒఱవ - వక్రము, వికృతము

ఒలయు - వ్యాపించు, కలుగు, ప్రవేశించు, చుట్టుకొను

ఒలుకు - చిందు, కాఱు, పోయు, చల్లు

ఒలుచు - తోలుతీయు, అపహరించు

ఒల్లఁబోవు - మూర్ఛిల్లు, వాడిపోవు

ఒసఁగు - ఈవి, త్యాగము, బహుమానము

ఒళవు - మర్మము, వీణాదండము

## ఓ

ఓకరింత - రోఁత, ఓకరించుట

ఓకస్సు - ఇల్లు, చోటు

ఓఘము - గుంపు, ప్రవాహము, ఉపదేశము

ఓజస్సు - తేజము, బలము, వెలుఁగు, ఎండ

ఓజ - క్రమము, ఆజ్ఞ స్వభావము,భయము

ఓటమి - భయము, భంగము

ఓడగిల్లు - పరుగెత్తు, కారు

ఓడు - అపజయపడు, పాఱు, సంకోచించు

ఓపిక - శక్తి, క్షమ

ఓర - అంచు, ఒఱిగినది

ఓరుపు - క్షమ, జయము

ఓల్లము - అల్లము, కంద

## ఔ

ఔగాములు - మంచివెడ్డలు, కలిమిలేములు, మేలుకీళ్లు

ఔచితి - ఉచితత్వము, సత్యము

ఔజు - కాలువ, పనివాఁడు

ఔదార్యము - ఉదారత్వము ఒక శబ్దగుణము

ఔశీరము - శయనము, ఆసనము, చామరదండము

## క

కంకణము - కడియము, నీటిబొట్టు

కంచుకము - ఱవిక, కవచము

కంటకము - ముల్లు, రోమాంచము

కంబువు - నత్తగుల్ల, శంఖము

కజ్జలము - చీఁకటి, కాటుక

కటకము - కడియము, ఒకపట్టణము

కటము _ చాఁప, మొల,ఏనుఁగు చెక్కిలి.

కరము-చెయ్యి, కిరణము, తొండము కప్పము

కర్కశము _ దయలేని, కఠినము

కర్ణము - చెవి, చుక్కాని

కర్బురము - నీరు, బంగారు, చిత్ర వర్ణము

కలకంఠము _ కోకిలము, హంస, పావురము

కలధౌతము _ బంగారు, వెండి

కల్కము _ కపటము, పాపము

కల్పము _ శాస్త్రము, ప్రళయము, బ్రమ్మ దినము

కల్లోలము _ పెద్ద అల, సంతోషము

కసిపువు _ వస్త్రము, ఆహారము

కళత్రము _ భార్య, పిరుదు

కర్కటము - అందము, ఎండ్రి, అద్దము, తెల్లనిది

కర్కోటకము - ఒకానొక పాము, మారేడు

కర్ణిక - చెవికమ్మ, తామరదుద్దు, బాణ విశేషము

కర్పరము - తలపుఱ్ఱె, శస్త్రభేదము

కర్బురము - నీరు, బంగారు, పాపము

కర్మణ్య - కూలి, జీతము

కఱ - నలుపు, మఱక

కఱచు - అభ్యసించు, కాటువేయు

కఱ్ఱ - కొయ్య, నలుపు

కందు - శిశువు, తపించుట

కడ - దూరము, దిక్కు, అంతరము

కనలు - జ్వలించుట, కోపగించుట

కన్ను - రథచక్రము, నేత్రము

కలకు - కల్లము, పోటు, యుద్ధము

కలమము - వ్రాయుకలము, వరిపైరు, లత్తుక

కలము - ఓడ, 12 తూములు, లేఖిని

కలాదుఁడు _ చంద్రుఁడు, అగసాలెవాఁడు

కలాపము _ నెమలిపురి, అమ్ములపొది, గుంపు, సొమ్ము

కలి _ పులికడుగతి, జగడము

కలుగు - అగు, ఉండు, కూడు, బొరియ

కల్య - మద్యము, వేకువ, నేర్పుకలది శుభమైనది

కల్లు - రాయి, మద్య (బండి) కన్ను

కవి - కల్లెము, కవిత్వము చెప్పువాఁడు శుక్రుఁడు, వాల్మీకి, పండితుఁడు

కషాయము - ఎఱ్ఱనిది, ఒగరు, వాసన గలది

కసి - కోపము, దురద

కసుగు - నలచు, పులుము, బాధించు

కళ - చంద్రునిలో 16 వ భాగము, మూర్ఛ, రెమ్మ, శిల్పము

కళావతి - నేర్పరాలగు స్త్రీ, తుంబురుని వీణ

కళుకు - కాంతి, పొడి

## కా

కాంచనము - బంగారు, ఉమ్మెత్త, పొన్న

కాంచు - చూచు, బిడ్డనుకను, పొందు

కాండము - కావ్యపరిచ్ఛేదము, సమూహము, గుంపు, నీరు, చెట్టుబోదె

గుజ్జము - సమయము

కాంత - స్త్రీ, ఇనుము,

కాంతి - జిగి, కోరిక

కాంభోజము - ఒక దేశము, పొన్న

కాంస్యము - కంచు, లోహపాత్ర

కాఁక - వేడి, జ్వరము, తాపము, కోపము

కాఁపు - రైతు, గృహస్థుఁడు, శూద్రుఁడు

కాక - ఆశీరాద్యర్థక ప్రత్యయము, కాకి, కాకిదొండ

కాకు - గాసి, వ్యర్థము, శూన్యము

కాచము - గాజు, నేత్రరోగము, ధనము

కాడు - శ్మశానము, అడవి

కాదంబరి - ఒక కావ్యము, మద్యము ఆడుకోయిల, సరస్వతి

కానీనుఁడు - వ్యాసుఁడు, కర్ణుఁడు

కాపు - ఫలించుట, రక్షించుట

కామల - మరుభూమి, వసంతఋతువు

కార - చెఱసాల, యత్నము, వధము, దూతిక

కారణ - కొఱముట్టు, వధము, హేతువు

కారు - అడవి, కాలము, నలుపు

కారువు - విశ్వకర్మ, శిల్పి

కాఱు - స్రవించు, రాలు, కట్టు

కాల - నీలి నలుపు, సమయము, మంజిడి

కాలకంఠము - కాటుకపిట్ట, నెమిలి, ఊర బిచ్చుక

కాలకంఠుఁడు - శివుఁడు, యముఁడు

కాలజ్ఞము - కోడి, కోయిల

కాలపృష్ఠము - కర్ణునివిల్లు, రాపులుగుపక్షి

కాళిక - పార్వతి, ద్రౌపది, నలుపు, చీకటి, బొగ్గు ఆడుకాకి, పొట్ల, మద్యము

కాలుఁడు - యముఁడు, శనైశ్చరుఁడు శివుఁడు

కావేరి - ఒకనది, పసుపు, వెలయాలు

కాశ్మీరము - ఒకదేశము, కుంకుమపువ్వు

కాశ్యపి - భూమి, అనూరుఁడు

కాష్ఠ - దిక్కు, మేర, అతిశయము

కాహళి - యౌవనస్త్రీ, వాద్యవిశేషము

కాహళ - వాద్య విశేషము, కోడి, ఎండి నది, సద్దు

కాళి - పార్వతి, బొగ్గు

కాళింగము - ఏనుఁగు, నేలగుమ్మడి

కింక - కోపము, పశువులరోగము
కింకరాతము - కోయిల, చిలుక
కింశారువు - బాణము, వరిముల్లు, రావులుగు
కిటుకు - మర్మము, కపటము
కింకిణి - గజ్జె, చిఱుగంట
కిరాతి - పార్వతి, గంగ, కిరాతస్త్రీ
కిల్బిషము - పాపము, తప్పు, రోగము
కిష్కువు - జేన, ముంజేయి

# కీ

కీకటము - ఒకదేశము, గుఱ్ఱము
కీడు - అశుభము, దోషము, పాపము, అపకారము
కీనాశుఁడు - యముఁడు, రాక్షసుడు, పేదవాఁడు
కీర్తి - యశము, విరివి, నేల, అడుసు
కీలము - మేకు, చిల్లకోల, మోచేయి, లేశము
కీలాలము - రక్తము, నీరు

# కు

కుంచె - కుచ్చు, చామరము
కుంజము - ఏనుఁగు దంతము, పొదరిల్లు
కుంట - కొలను, పల్లము, చెఱువు
కుండలి - పాము, నెమిలి, ఉప్పి
కుండలము - పోగులు, త్రాఁడు, గుండ్రన
కుంతలము - వెండ్రుక, నాగలి
కుంభసంభవుఁడు - ద్రోణుఁడు, అగస్త్యుఁడు
కుంభము - ఏనుఁగు కుంభస్థలము, ఒక రాశి, కుండ
కుక్కుటము - కోడి, కుక్క, కపటము
కుణపము - పీనుగు, దుర్గంధము
కుదిరిక - నెమ్మది, అమరిక
కుదురు - అనుకూలపడు, నెమ్మదిపడు, పాదు
కుమారి - కూతురు, పార్వతి, ఒకనది, చేమంతి, కలబంద
కుముద - గుమ్ముడు, ఎఱ్ఱతామర, ఒక పాము
కులము - వంశము, తెగ, శరీరము, ఇల్లు, గుంపు, చేదుపొట్ల
కులాయము - చోటు, పక్షిగూడు
కుల్య - కాలువ, మాంసము, ఎముక, తిప్పతీగ
కువలయము - భూవలయము, కలువ
కుశ - దర్భ, నీరు, ఒక ద్వీపము
కుసుంభము - బంగారు, కుసుమపువ్వు

కుసుమము - పువ్వు, ఒక రోగము, పండు

కుహనము - ఎలుక, పాము

కుహరము - గుహ, రంధ్రము

కుప్పసము - కంచుకము, కవచము

## కూ

కూటము - సభ, చావడి, అమ్ము, ఇల్లు, దుఃఖము

కూపము - చెలమ, నుయ్యి, ఓడకంబము

కూలము - గుంట, వరిదిబ్బ

కూళుఁడు - కుత్సితుఁడు, మూఢుఁడు

## కృ

కృకవాకువు - కోడి, నెమిలి

కృచ్ఛ్రము - పాపము, బాధ

కృతి - చేయుట, కావ్యము, నేర్పరి, నొప్పించుట

కృపీటము - నీరు, కడుపు

కృష్ణ - ద్రౌపది, నది, ద్రాక్ష, నీలి, కాకి, నలుపు, నల్లనిది, కోకిలము

కృష్ణుఁడు - విష్ణువు, అర్జునుఁడు, వ్యాసుఁడు

కృత్తి - చర్మము, ఒక దేవత, చెట్టు బెరడు

కృపణుఁడు - నీచుఁడు, లోభి

## కె

కెంపు - పద్మరాగపు మణి, ఎఱ్ఱనిది

కెడయిక - పడుట, చావు

కెలకు - కలపెట్టు, దిక్కు

## కే

కేకరము - కడకన్ను; మెల్లకన్ను

కేదారము - నారుమడి, పాదు

కేతనము - టెక్కెము, గుఱుతు, ఇల్లు

కేరడము - ఉపేక్ష, తిరస్కారము; వంకరమాట

కేలు - చేయి, తొండము

కేసరి - సింహము, గుఱ్ఱము

కేసరము _ ఇంగువ, జూలు, నాగకేసరము

## కై

కైకోలు - అంగీకారము; గ్రహణము

కైపు - లాహిరి, అందము; విధము

కైరవుఁడు - జూదరి, పగవాఁడు

కైతవము - జూదము; కపటము

కైవారము - చుట్టుకొలత, పొగడ్త

## కొ

కొంకు - భయపడు, సంకోచించు

కొనియాడు - కొనియాడు, ఆదరించు నుతించు

కొమ్మ - శాఖ; ఆడుది

కొమ్ము - చిమ్మనగ్రోవి; తీగకొనుము; శిఖరము, పందికోర, పశువులకొమ్ము

కొమ్ముకాడు - వరాహము, అగసాలె వాఁడు

కొప్పరము - అంసము; శిఖరము

కొసరు - విశ్రాంతించు; కోరిక, సంకోచము

# కో

కోకము - జక్కువ; తోడేలు, బల్లి, కప్ప

కోణము - మూల, దుడ్డుకోల, వాద్యవిశేషము

కోటి - చివరఁ అంచు, గుంపు

కోదండము - విల్లు, కనుబొమ

కోయిల - గుడి, కోకిల

కోల - దండము, బాణము

కోలము - పంది, తెప్ప; బడి, కౌగిలి

కోలపాటు - పోగొట్టుకొను, వేట

కోశము - కత్తియొఱ, గ్రుడ్డు, పుస్తకము, బొక్కసము, ముష్కము, మొగ్గ

కోశాతకి - ఉత్తరేను, పొట్ల

కోన - అడవి, మూల, ఒకదేశభేదము

కోపు - సమయము, వింటిచివఱ, విధము; నిమిత్తము, సుందరము

# కౌ

కౌతుకము - కోరిక, సంతోషము, పండుగ

కౌలీనము - గొప్పకులమునందు బుట్టుట, గుహ్యము, జగడము

కౌశికము - గుడ్లగూబ, ముంగిస, గుగ్గిలపుచెట్టు

కౌశికుఁడు - విశ్వామిత్రుఁడు, ఇంద్రుఁడు; పాములవాఁడు

కౌసీద్యము - ఆలస్యము, కునికిపాటు

# క్ర

క్రందనము - ఏడ్పు, పిలుపు

క్రందు - మ్రోఁత, సందడి

క్రమము - సొరిది, బలిమి, వడకు

క్రముకము - పోఁక, ప్రత్తిచెట్టు

# క్రా

క్రాలు - అల్లలాడు, సంచరించు, వర్తిల్లు

## క్రి

క్రిమి - పురుగు, లక్క

క్రియ - చేయుట; చేష్ట, పని, ఆరంభము, పూజ; ఉపాయము, శిక్ష, విధము

## క్రీ

క్రీడ - ఆట్లాట, పరిహాసము, దూఱు

## క్రూ

క్రూరము - భయంకరమైనట్టిది, గట్టిది

## క్రే

క్రేణి - ఉన్నతపదము పరిహాసము

క్రేపు - దూడ, శిఖరము

## క్రొ

క్రొవ్విదము - పరువము, దుష్కార్యము

## క్రో

క్రోడము - తొమ్ము; ఒడి; పంది

క్రోలు - అనుభవించు; త్రాగు, గ్రహించు

క్రోవి - గొట్టము, తుపాకి, మూస

క్రోష్టి - ఆడునక్క, లాంగలి

## క్రౌ

క్రౌంచము - ఒకానొక కొండ; ఒకానొక ద్వీపము, ఒకానొక పక్షి

## క్లే

క్లేశము - దుఃఖము, కోపము

## క్ష

క్షణము - ఘటికయందు ఆఱవభాగము; తిరుణాళ్ల, పండుగ, సమయము

క్షతి - గాయము, నాశము

క్షమ - ఓర్పు, నేల

క్షవథువు - తుమ్ము, దగ్గు

## క్షా

క్షారము - ఉప్పు, కారము, బూడిద

## క్షి

క్షితి - నేల, ఉనికి, నాశము

## క్షీ

క్షీరము - పాలు, నీరు

## క్షు

క్షుద్ర - ఈఁగ; తేనెటీగ, వేశ్య, వాకుఁడు
క్షుద్రుఁడు - లోభి, అధముఁడు, హింసకుఁడు
క్షురము - మంగలికత్తి, పల్లేరు
క్షేత్రము - వరిమడి, పెండ్లాము, శరీరము, గణితశాస్త్రవిశేషము
క్షేపము - చిమ్ముట, త్రుళ్లు, పూత, దూఱు
క్షోభము - కలఁత, దోపుడు
క్షౌద్రము - తేనె, నీరు
క్ష్మ - నేల, నిద్ర, స్థానము
క్ష్మభృత్తు - రాజు, పర్వతము
క్ష్వేడ - సింహనాదము, వెదురు, చెవుడు, మ్రోఁత, విషము

## ఖ

ఖండపరశువు - శివుఁడు, పరశురాముఁడు, రాహువు
ఖంబు - ఆకాశము, స్వర్గము, ఇంద్రియము; తెలివి, పట్టణము, వరిమడి, సుఖము, సున్న
ఖగము - బాణము, పక్షి; గ్రహము
ఖచరము - గాలి, మేఘము, పక్షి
ఖడ్గము - కత్తి, ఖడ్గమృగము
ఖరువు - గర్వము, గుఱ్ఱము
ఖలము - చోటు, నేల, పాపము; క్రూరము

## ఖా

ఖాదనము - తినుట, పల్లు
ఖాదకుఁడు - అప్పుతీసి తిరెగెడువాఁడు; తినువాఁడు

## ఖి

ఖిలము - దున్ననిది, చెడినది

## ఖే

ఖేటము - కాపుపల్లె, డాలువాలు, కఫము

## గ

గంగ - ఒకనది, పూజ్యము, పెద్ద
గంట - వాద్యవిశేషము, గడ్డిదుబ్బు, కాలవిశేషము
గంటి - గాయము, దుఃఖము
గంటు - గనుపు; ముడి

గంటు - గరిసె; సజ్జ
గండకము - ఖడ్గమృగము, జోస్యము, భేదము, విఘ్నము
గండము - చెక్కిలి, ఖడ్గమృగము, గుండ్రాయి, గుఱుతు, పుండు
గండి - బిలము, సందు
గంధమాదనము-మగతుమ్మెద, ఒకకొండ, మదపుటేనుఁగు
గంధము - వాసన, గర్వము, సంబంధము
గంధవతి - కల్లు, వ్యాసునితల్లి, నేల, ఒక నగరము
గండూషము - పుక్కిలింత, పుడిసిలి
గరువము - గర్వము, గారవము
గరువు - శర్కరిలము, గండభాగము
గడుసు - కాఠిన్యము, ధైర్యము, అసాధ్యము
గణము - సమూహము; ప్రమదులగుంపు
గణిక - వేశ్య, ఆడ ఏనుఁగు
గతము - పోయినది, తెలియఁబడినది
గతి - పోఁక, త్రోవ, ఉపాయము, విధము
గనయము - వింటికొప్పు, పోఁకముడి
గబ్బు - దుర్గంధము; గర్వము, మదము
గభస్తి - సూర్యకిరణము, అగ్నిభార్య; సూర్యుఁడు
గమనము - ప్రయాణము, తలఁపు
గర్దభము - తెల్లఁగలువ, గాడిద
గర్భము - కడుపు, కడుపులోని పిండము; నాటక సంధి
గవి - గుహ; పల్లము; ఆవు
గవ్య - ఆవులమంద, అల్లెత్రాఁడు, ఆవు; పాలు నొసగునది
గహనము - అడవి, దుఃఖము చొఱరానిది, గుహ
గర్జ - మేఘధ్వని; సింహనాదము
గసిక - బాణము, శలాక
గహ్వరము - అడవి; గుహ; పొదరిలు

## గా

గాంగేయుఁడు - భీష్ముడు, కుమారస్వామి
గాత్రము - స్థూలము, శరీరము, అవయవము
గాధ - చరిత్రము పద్యము, పాట
గాధము - మిట్ట; కోరిక
గాడుపుచూలి - భీముఁడు, హనుమంతుఁడు
గారుడము - గరుడపచ్చ, విషమంత్రము
గాసిల్లు - శ్రమపడు, కోపపడు
గాయకము - గూఢము, మర్మము

## గి

గిట్టు - అనుకూలించు, చచ్చు, నశించు
గిడంగి - సరకులమ్ము ఇల్లు, చెఱసాల
గిరిక - చిట్టెలుక; జలగ, వసురాజు పెండ్లాము, పార్వతి, బొంగరము; విధవ

గిరిజ - పార్వతి, అభ్రకము; లోహము; పిలాజిత్తు

గిరీశుఁడు - శివుఁడు, హిమవంతుఁడు, బృహస్పతి

గిలకొట్టు - కలఁచు, కుదిలించు

## గీ

గీటు - కొఱుకు, (కన్ను) గిఱుపు, చిమ్ము

గీఱు - గోకు; భేదించు

## గు

గుంజ - ఉప్పళము, తప్పెట

గుంజా - ఈడ్చు, ఉతుకు

గుండకము - దుమ్ము, నూనె పాత్రము

గుచ్ఛము (గుచ్ఛకము) - పూగుత్తి,నెమిలి పురి, పౌద, మణిహారము

గుజ్జు - ద్రవపదార్థము, పొట్టి

గుట్ట - కొండ; రాశి

గుడ - గుళిక, బెల్లము, జెముఁడు, గోలి

గుడాకేశుఁడు - శివుఁడు, అర్జునుఁడు

గుణము - జ్ఞానము మొదలైన గుణము; త్రాఁడు, వింటినారి, స్వభావము

గుప్తి - కాపాడుట, చెఱసాల, పాతఱ

గుప్పు - చల్లు, ఉంచు, విసరివైచు

గురువు - ఉపాధ్యాయుఁడు; తండ్రి, కులము పెద్ద, తాత, అన్న; రాజు, బృహస్పతి; శ్రేష్ఠము, లఘువు కానిది

గుఱి - లక్ష్యము, దృష్టాంతము, మితి

గుఱుతు - మేర, చిహ్నము

గులి - గోలి, తీఁటగుల్ల

గుల్మము - ఒకవ్యాధి, బోదెలేనిచెట్టు

గుల్ల - బొబ్బ, బోలు, (నత్తగుల్ల) గవ్వ

గుహ్యము - ఏకాంతము, తాఁబేలు, నెపము

## గూ

గూడు - పక్షిగూఁడు, పంజరము

గూటము - గుంజ, మేకు

## గృ

గృహపతి - మంత్రి, గృహస్థు

గృహము - ఇల్లు, పెండ్లాము

గృహిణి - ఇల్లాలు, ఎఱ్ఱ తుమ్మెద, కణుఁదురీగ

గృంజనము - వెల్లుల్లి, విషము తిన్న పశుమాంసము

## గే

గేయము - పాట, పాడఁదగినది

## గై

గైరికము - ధాతువులలో నొకటి, బంగారు

## గొ

గొంతు - కంఠము, కంఠధ్వని
గొట్టు - దుష్టము, కఠినము
గొడవ - ఆపద; తప్పు, కలఁత
గొడ్డు - పశువు, గొడ్రాలు
గొబ్బిళ్లు - బాలక్రీడా విశేషము, నమస్కృతి

## గో

గోటు - ఒయ్యారము; రేఖ, అంచున కుట్టు గుడ్డ
గోకర్ణము - కణితిమృగము, పాము, కంచరగాడిద
గోగ్రంథి - పసులకొట్టము, పెండ
గోణి - ఎద్దు, గోతము
గోతుంబ - పుచ్చ, బుడమ
గోత్ర - ఆలమంద, భూమి
గోత్రము - వంశము, పేరు, గొడుగు, అడవి, కొండ
గోపతి - ఆఁబోతు, రాజు, ఇంద్రుఁడు, శివుఁడు, సూర్యుఁడు
గోపుఁడు - రాజు, గొల్లవాఁడు
గోపురము - గవను, వాకిలి
గోముఖము - అలుకుట, వాద్యవిశేషము, మొసలి
గోరము - ఆపద, రోత
గోల - ముద్ద, కాఁగు, మణిసిల
గోలాంగూలము - కోతి; కొండముచ్చు
గోవు - ఆవు, కన్ను, బాణము; దిక్కు; భూమి ఎద్దు; కిరణము; [పుం] స్వర్గము, చంద్రుఁడు
గోసు - అపదూఱు; దోషము

## గౌ

గౌరము - ఎఱ్ఱనిది, తెల్లనిది, పసుపు పచ్చనిది

## గ్ర

గ్రంధి - కంతి, గనుపు, ముడి
గ్రంథము - కావ్యము, ధనము
గ్రహణము - గ్రహించుట, ఆదరించుట; చేయి, బుద్ధి
గ్రహము - అనుగ్రహము, చెఱ; రాహువు
గ్రామణి - ముఖ్యుఁడు, గ్రామాధిపతి
గ్రాహము - గ్రహించుట; చెఱ; నీటి పాము
గ్రుడ్డుకానుపు - బల్లి, చేఁప, పక్షి, పాము

## ఘ

ఘటము - కుండ; శిఖరము, పాదునుయ్యి; గుంపు
ఘటిక - గడెమ్రాను; బలపము
ఘనము - గొప్ప; విరివి; మబ్బు

ఘనరసము - నీరు; కర్పూరము, చెట్టు బంక; మజ్జిగ

ఘర్మము - ఎండ, చెమట, వేసఁగి

## ఘా

ఘాతము - దెబ్బ, బాణము

## ఘృ

ఘృణి - కిరణము, వెలుఁగు

ఘృతము - నెయ్యి, నీరు

ఘృష్టి - కిరణము; పంది, రాయిడి, పోటి పాఁచి, తీఁగ

## ఘో

ఘోషము - గొల్లపల్లె, ఆలమంద, కంచు

## చ

చంకరము - చెట్టు, తేరు

చంచల - మెఱుపు, లక్ష్మి, గాలి

చండి - పార్వతి, కోపముగల ఆఁడుది

చండిలుఁడు - మంగలి, శివుఁడు

చంద్రకి - నెమిలి, కవుఁజు

చంద్రము - కర్పూరము, నీరు, బంగారు

చంద్రశాల - పై మేడ, వెన్నెల

చంద్రిక - వెన్నెల, కుసుమపువ్వు

చక్రము - ఆయుధ విశేషము, గుంపు, బండికల్లు; రాష్ట్రము, కుమ్మరిసారె

చక్రి - విష్ణువు, పాము, రారాజు

చతుష్కము - చవికె, నాలుగు

చతుష్కి - దోమతెర, పెద్ద కోనేరు

చపల - మెఱుపు, లక్ష్మి, అంకుటాలు; కోఁతి, చేఁప, పాదరసము

చమరము - వింజామరము, సవరపు మెకము

చయము - సమూహము, సంగ్రహము

చరణము - తినుట, తిరుగుట, పాదము; వేరు, కులము

## చా

చాండాలిక - మాలచి కిన్నెర

చాంపేయము - బంగారు, నాగకేసరము

చామరము - చెఱ, నడ

## చి

చింత - చింతచెట్టు, తలఁపు, వగపు

చిందఱ - తూటు ఖండము

చిందు - రాలు, చెదరు

చికురము - వెంట్రుక, కొండ, పక్షి; పాము, ముంగిస

చిక్కు - కృశించు, తక్కు, దొరకు; మిగులు

చిచ్చు - అగ్ని, తాపము

చిత - సొద, ప్రోగు

చిత్ర - ఒకనక్షత్రము, మాయ, గుమ్మడి; నానావర్ణము, బొట్టు

చిత్రకము - చిఱుతపులి, చిత్రమూలము; గుమ్మడి

చిత్రభానువు - సూర్యుఁడు, అగ్ని

చిదుము - గిల్లు, త్రుంచు

చిన్ని - చిన్న, ఇంపు

చిమ్ము - మీటు, వైచు, ఊడ్చు

చిరంజీవి - కాకి, విష్ణువు

చిఱ్ఱు - కోపము, చింపిఱి

చిలుకు - చిందు, మథించు; చల్లు

చిహ్నము - గుఱుతు టెక్కెము

## చీ

చీకాకు - చివికిన ఆకు, శ్రమము

చీనము - బంగారు, నూలు

చీరు - చీలుచు, పిలుచు

చీరము - గోచి; నారచీర; రేఖ

## చు

చుంబకము - త్రాసుముల్లు, సూదంటు రాయి

చుక్రము - చింతపండు, పులుసు

చులుకము - చేర, పుడిసిలి, ముంత

## చూ

చూడ - నెమలిజుట్టు, చూరు, జుట్టు

చూర్ణము - గంధద్రవ్యముల పొడి; సున్నము, దుమ్ము

## చె

చెంగనాలు - గంతులు, నమస్కృతి

చెంగు - తొలఁగు, చెఱఁగు

చెండు - ఖండించు, బంతి

చెట్టు - వృక్షము, గుల్మము

చెన్ను - అందము, విధము

చెలఁగు - ఉత్సహించు; సంతోషించు; ఒప్పు

చెల్లు - అయిపోవు, చచ్చు, చేరు; తగు

చెవి - కర్ణము, తాళపు చెవి

చేపట్టు - అవలంబించు, పెండ్లాడు

చేరు - పొందు, సరము

చేవ - సారము, ధైర్యము

చేయి - హస్తము, కిరణము; పట్టు

## చై

చైతన్యము - ప్రాణము, తెలివి

చైత్యము - గుడి, కట్టడము; యజ్ఞశాల

చైత్రము - ఒకనెల; గుడి; గోరి

## చో

చోక్షము - తీక్ష్ణము, పరిశుద్ధము; ఇంపు

చోచము - టెంకాయ, లవంగపు పట్ట

చోద్యము - ఆశ్చర్యము, ప్రశ్నము

## చ్యు

చ్యుతి - జారుపు, విడుపు

## చ

చందు - చంద్రుఁడు, అందము, యోగ్యమైనది

చక్కటి - కార్యము, దిక్కు, స్థానము, న్యాయము

చక్కాడు - చంపు, ఖండించు

చక్కు - ఆఱు, ఖండము

చట్ట - చిన్నగోతము, కవచము, చొక్కాయ

చట్టము - న్యాయశాస్త్రము, కొయ్యల బిగింపు

చదరము - నాలుగువైపుల సమానము, కొఱఁతలేనిది

చనవు - అధికారము; కోరిక, చెల్లుఁబడి

చను - పోవు, చెల్లు, తగు, కడచు

## చా

చాదు - ఊచు; నల్లనిబొట్టుకు తగినవస్తువు

చాగు - పోవు, ప్రవర్తిల్లు

చామ - నలుపు, యౌవనముగల స్త్రీ

చాలు - చాలినంతది, ఓపు, వరుస

## చు

చుక్క - నక్షత్రము, నీరుమొదలైన వాని బొట్టు

చుఱుకు - వాఁడి, వేగము

## చూ

చూలు - గర్భము, బిడ్డ

## చొ

చొక్కు - పరవశమగు, మోహము, మూర్ఛ

చొరవ - ప్రవేశము; బుద్ధికుశలత

## చో

చోపు - కలఁచు, తోలు, తఱుము

## ఛ

ఛందము - అభిప్రాయము, వశము

ఛందస్సు - పద్యలక్షణము దెలుపుశాస్త్రము; వేదము, ఇచ్ఛ

ఛట - గుంపు; వరుస

ఛత్రభంగము - రాజ్య నాశనము; ముండ మోపితనము

ఛదనము - ఆకు; ఈక, ఱెక్క

ఛద్మము - నెపము; మోసము

ఛవి - కాంతి, కిరణము

## ఛా

ఛాయ - కాంతి, నీడ; శోభ, వర్ణము, ప్రతిబింబము; సూర్యుని భార్య, లంచము; వరుస

## ఛి

ఛిద్రము - రంధ్రము, తప్పు

ఛిన్న - భేదింపఁబడినది, తిప్పతీఁగ

## ఛే

ఛేదము - నఱకుఁడు, తునుక

## జం

జంబాలము - పాఁచి; బురద

జంబీరము - నిమ్మచెట్టు, మరువము మొలక

జంబుకుఁడు - నీచుఁడు, వరుణుఁడు

జంభము - నిమ్మ, పల్లు, తిండి

జగతి - లోకము; జనము, భూమి

జఘన్యము - వెనుకటిది, తోఁక

జట - జడ, ఊఁడ

జఠరము - కడుపు, కఠినమైనది

జడ - దురదగొండి; చల్లనిది, మూఁగది

జతుక - చివుకపెట్ట, లక్క; ఇంగువ

జనకుఁడు - తండ్రి, ఒకరాజు

జనత - తల్లి, దయ

జని - ఆడుది, పెండ్లాము, కోడలు

జన్యువు - అగ్ని, జంతువు

జయ - పార్వతి, ఒక సంవత్సరము; గెలుపు, నెల్లి, (ఉసిరిక)

జయంతి - ఇంద్రునికూతురు, పార్వతి; ఱెక్కెము

జయంతుఁడు - ఇంద్రుని కొడుకు; శివుఁడు భీముఁడు

జరాయువు - మావి, జటాయువు

జలజము - తామర కలువ శంఖము

జలధి - సముద్రము, నక్క

జలజము - నీరు, కురువేరు

జహ్నువు - విష్ణువు, ఒక రాజర్షి

## జా

జాంగలికుఁడు - విషవైద్యుఁడు, గారడీఁడు

జాంబూనదము - బంగారు, ఉమ్మెత్త

జాతము - సమూహము, పుట్టుక, సామాన్యము

జాతరూపము - బంగారము, ఉమ్మెత్త

జాతి - కులము; పద్యభేదము; ప్రౌయ్యి, జాజికాయ; ఉసిరిక
జానపదము - గ్రామము దేశము
జామాత - అల్లుఁడు పెనిమిటి
జాలకము - మొగ్గ: కసుగాయ, వల పక్షి గూడు
జాలపాదము - బాఁతు, హంస
జాలము - కిటికి; వల, సముదాయము కపటము; మాయ
జాలిక - వలవంటి వస్త్రము సాలెపురుగు, విధవ

## జి

జింకతాలుపరి - చంద్రుఁడు, శివుఁడు
జిగీష - గెలుచుకోరిక; ప్రయత్నము
జితపడు - స్థిరపడు; వాడుకపడు
జిష్ణుఁడు - జయశీలుఁడు; ముసలివాఁడు బుద్ధుఁడు, విష్ణువు
జియ్య - దేవుఁడు, రాజు
జిలుగు - అల్పము, మందము, సూక్ష్మము
జిష్ణువు - జయేచ్ఛగలవాఁడు; ఇంద్రుఁడు, అర్జునుఁడు

## జీ

జీమూతము - మబ్బు; కొండ
రవాఖు - జరుగు, తొలఁగు వ్యాపించు
జీర్ణము - అఱిగినది, చినిగినది, ప్రాఁతది; జిలకఱ్ఱ
జీవ - పాలకూర, వింటినారి, వసుభూమి, ప్రాణము, తత్వము, పరమాత్మ
జీవంతి - జమ్మి, పాలకూర, తిప్పతీగ
జీవదుఁడు - వైద్యుఁడు, శత్రువు
జీవాతువు - బ్రతుకు, వంటకము
జీవితేశుఁడు - యముఁడు, భర్త
జీవుఁడు - ప్రాణి, బృహస్పతి
జుగుప్స - రోఁత, దూఱు, దయ

## జూ

జూటము - శివుని జడల సమూహము, జడముడి

## జృ

జృంభ - ఆవులింత, వికాసము
జృంభితము - ఆవులింత; పెరిగినది, వికసించినది

## జె

జెట్టి - మల్లుఁడు, శూరుఁడు

## జే

జేజే - నమస్కారము, దేవుఁడు

## జై

జైవాతృకుఁడు - చంద్రుఁడు, వైద్యుఁడు, కాఁపు

## జ్ఞ

జ్ఞప్తి - తెలివి, తలఁపు

## జ్ఞా

జ్ఞాతి - తండ్రి, దాయాదుఁడు
జ్ఞాని - జోస్యుఁడు, కోడి

## జ్యా

జ్యా - వింటినారి, నేల, తల్లి
జ్యాని - ముదిమి చెడుపు, నది

## జ్యే

జ్యేష్ఠ - ఒక నక్షత్రము, ప్రేమింపఁబడిన నాయిక, పెద్దమ్మ, బల్లి, [ము] ఒకనెల, హంస

## జ్యో

జ్యోతి - వెలుఁగు, నక్షత్రము, కన్ను [పుం] అగ్ని, సూర్యుఁడు

## ఝ

ఝంకు - భయపడు, సంకోచపడు, భయము

ఝంపు - ఆలస్యము; నిడుపైనది
ఝడియు - భయపడు, తొలగు
ఝగముతల్లి; లక్ష్మి, పార్వతి
ఝరగు - జాఱు, పోవు; నడచు; కడచు
ఝలకము - ఉదకము, స్నానము
ఝల్లి - సవరము, జాలరు, అసత్యము

## ఝా

ఝాడ - కాళ్లగుఱుతు, త్రోవ, పోబడి
ఝాల - కిటికి, చేపలుపటు వల

## ఝూ

ఝూజము - జూదము, మోసము

## జో

జోక - సామ్యము, విధము
జోతి - దీపము, కాంతి

## ఝం

ఝరి - సెలయేఱు; తేళ్లపుట్ట

ఝష - చేప, మొసలి, అడవి

## ఝా

ఝాటము - సమూహము, కాఱడవి, చీపురుకట్ట

## ట

టంకము - వెలిగారము, కత్తి, గడ్డపాఱ, కోపము, పదియాఱుడబ్బుల బంగారు నాణెము

టంకారము - వింటినారిధ్వని, ఆశ్చర్యము, ప్రసిద్ధి

## టె

టెంకి - స్థానము, దబ్బనమువంటి సాధనము

## ఠ

ఠవణిల్లు - ప్రవర్తిల్లు; ఒప్పు

## ఠా

ఠాకురు - దేవత; అధిపతి, తండ్రి, గురువు

## ఠే

ఠేవ - ఒప్పిదము, విధము

## డ

డంబు - కపటము, కాంతి, అధికము

డబ్బు - బొంకు, నాలుగుదమ్మిడీలు; ధనము

## డా

డాఁక - విజృంభణ, శౌర్యము

డాలు - కాంతి, ఱెక్కెము

## డి

డింగరీడు - భక్తుఁడు, సేవకుఁడు

డిందు - ఇంకు, అడఁగు

డింబము - భయము, పక్షిగ్రుడ్డు

డింభము - పిల్ల, గ్రుడ్డు

## డీ

డీకొను - కవియు, పురికొను

## డుం

డుండుకము - దుండిగము, అల్పుఁడు, క్రూరుఁడు

డుల్లు - పడు, ఊడు

## డొ

డొంక - కాలిబాట, పొద, కోన

డొగరు - అపరాధము, నింద

డొల్లు - పొర్లు, పడు

## డో

డోల - డోలి, తొట్ల, నీలిచెట్టు

## త

తంట - కలహము, చాడి, శ్రమము, అప్పు, మోసము

తండురీణము - కడుగునీరు, పురుగు

తంత్రము - ఉపాయము, వ్యాకరణ శాస్త్రము, సిద్ధాంతము, హేతువు, పరివారము

తంపి - దాలిగుంట, కలహము

తక్షకుఁడు - సర్పరాజు, వడ్లవాఁడు

తగరము - లోహవిశేషము, పొట్టేలు

తగవు - తగుట, అరణము, న్యాయము, జగడము

తగులు - చిక్కు, తాకు, పొసఁగు, ఆసక్తి వెంటవచ్చుట

తగ్గు - తక్కువ అగు, వెనుదీయు, తెగిపడు

తచ్చన - కపటము, పరిహాసము

తటము - ఏటిదరి, కొండచరియ, ప్రదేశము, వరిమడి

తటి - ఏటిదరి, ప్రదేశము

తడ - అడ్డి, కడ

తడవు - వెదకు, నెమకు, విచారించు

తడి - తేమ, నీరు

తడుపు - గోచి, చిన్నగుడ్డ, తడిసినది

తనరు - అతిశయించు, ఒప్పు

తనుకు - దుఃఖించుట, పొందుట, ప్రకాశించుట

తనువు - తనివి, శైత్యము, తడి

తనువు - దేహము, తోలు, చిన్న

తనూరుహము - వెండ్రుక, ఱెక్క

తపము - తపస్సు, శిశిర ఋతువు

తమము - చీఁకటి, శోకము

తమాలము - కత్తి, బొట్టు, ఉలిమిరి

తమి - త్వర, ఉపేక్ష, కుతూహలము

తరండము - ఓడ, పుట్టి

తరణి - ఓడ, దాటుట, సూర్యుఁడు, సముద్రము

తరము - పురుషాంతరము, మానము, సామ్యము, వరుస

తరవాయి - సమయము, తడవ

తలరు - సంభ్రమించుట, చింతించుట

తరస్సు - బలిమి, వడి

తరుణము - యౌవనము, క్రొత్తది, ఆముదపుచెట్టు

తర్కము - ఊహ, అధ్యాహారము, కారణము, కోరిక, శాస్త్రము

తర్షము - దప్పి, ఇచ్ఛ

తఱలు - చలించు, సంభ్రమించు

తఱి - సమయము, సమీపము

**తల** - శిరస్సు, చివర, ఎడ, మొత్తము సమయము, ముందు భాగము

**తలకు** - చలనము; భయము

**తలఁపు** - హృదయము; జ్ఞప్తి, కోరిక, చింత

**తలకొను** - కలుగు; యత్నించు, తాల్చు

**తలము** - పీతము, అడవి కారణము, స్వరూపము

**తలరు** - చలించు; కలఁగు, ఒప్పు, చింతించు

**తలవంపు** - తలవంచుట, అవమానము

**తలిమము** - దూదిపఱుపు, మేలుకట్టు, కత్తి

**తల్పము** - దూదిపఱుపు, అట్టడి

**తల్లితల్లి** - తల్లియొక్క తల్లి-లక్ష్మి

**తల్లి** - మాత, ముఖ్యము; మొదటిది

**తసుకు** - ప్రేమ - టక్కు

**తళిగ** - భోజన పాత్ర, దైవ నివేదనమైన అన్నము

## తా

**తాండవము** - నృత్యము, తృణవిశేషము

**తాంత్రికుఁడు** - సిద్ధాంతము నెఱింగినవాఁడు, విషవైద్యుఁడు

**తాఁకు** - మార్కొను, అంటుకొను

**తాఁట** - చెట్టుబెరడు, మోసము

**తాచు** - చెక్కు, తొలుచు; అవలంబించు

**తాటిపడగవాఁడు** - బలరాముఁడు, భీష్ముఁడు

**తానము** - స్నానము, స్థానము

**తాప** - నిచ్చెన, మెట్టు

**తాపము** - బాధ, సంతాపము

**తాపి** - మర్మము, జాడ, బేలుదారి, పనిముట్టు

**తామరతంపర** - తామరల గుంపు, అభివృద్ధి

**తామరసము** - తామర, బంగారు, రాగి

**తామసి** - చీఁకటి, పార్వతి

**తామ్రచూడము** - కోడిపుంజు, అభినయ భేదము

**తామ్రము** - రాగి, ఎఱ్ఱనిది

**తార** - బృహస్పతి భార్య; వాలి భార్య; కనుగ్రుడ్డు, నక్షత్రము

**తారక** - కంటి నల్లగ్రుడ్డు, నక్షత్రము

**తారకుఁడు** - మాలిమికాఁడు, ఒక రాక్షసుఁడు, దాటించువాఁడు

**తారసము** - సమీపము, తలపాటు

**తారసిల్లు** - వ్యాపించు, సమీపించు

**తారాడు** - తిరుగులాడు, జీరాడు

**తారేయుఁడు** - అంగదుఁడు, బుధుఁడు

**తారు** - సంచరించు, పోవు, పారు; కదియు

**తాలధ్వజుఁడు** - బలరాముఁడు, భీష్ముఁడు

**తాలిమి** - క్షమ, ధైర్యము

**తాలుచు** - ధరించు; తిరికలుచేయు

**తావలము** - స్థానము, ఆధారము

తాళకము - హరిదళము, చిన్నబీగము
తాళము - బీగము, తాటిచెట్టు, వాద్యవిశేషము

## తి

తికమక - కలత, తొట్రుపాటు
తిక్తశాకము - ఉలిమిరి, చంద్ర
తిత్తి - కొలిమితిత్తులు సంచి
తిథి - పాడ్యమి లోనగునది, శ్రాద్ధదినము
తిన్న - మనోజ్ఞము, యుక్తము. ఋజువు
తిమిరము - చీఁకటి, నేత్రరోగము
తిమురు - త్వరపడు, తిమ్మిరి, గర్వపడు
తిరి - జట, సుడి
తిఱుగుడు - తిరుగుట, మాఱుపాటు
తిలకము - బొట్టు, పుట్టుమచ్చ, పొట్ల
తివురు - కోరు, త్వరపడు, యత్నించు
తిష్యము - పుష్యమాసము, కలియుగము

## తీ

తీంద్ర - ప్రకాశము తేజము
తీఁగ - లత, మొలనూలు, తంతి
తీక్ష్ణగంధ - ఓమము, మునగ, పెద్దతుమ్మి
తీక్ష్ణము - వేడిమి, విషము, ఘోరు, ఇనుము
తీపు - మాధుర్యము, బాధ
తీయు - తొలఁగు, తగ్గు, ఈడ్చు
తీరము - దరి, తగరము
తీర్చు - తీర్పుచేయు, చక్కఁబఱచు నాశనముచేయు
తీర్థము - పుణ్యనది, రేవు, పుణ్యక్షేత్రము ఉపాయము, శాస్త్రము, యజ్ఞము
తీవ్రము - కారముకలది, అధికము

## తు

తుంగము - కొండ, పొడవైనది
తుంట - తునుక, చెఱకు
తుండము - ఖండము, ముఖము, నోరు పక్షిముక్కు
తుచ్ఛము - దుఃఖము, శూన్యము
తుడుచు - సరిపోవనొత్తు, ఊడ్చు
తుత్థ - నీలివెట్టు, అగ్ని
తుద - చివఱ, అగ్రము, కడ
తురగము - గుఱ్ఱము, హృదయము
తుల - త్రాసు, దూలము, ఒకరాశి, సమానము, పోలిక
తుషము - ఉముక, తాఁద్ర
తుషారము - మంచు, చల్లనిది

## తూ

తూఁగు - ఊగు, చలించు, తూనిక, పడు
తూము - బండి, నడిమి రంధ్రము, నీటిగండి, నాలుగుకుంచములకొలత
తూర - వానబొట్టు. మత్స్యవిశేషము

తూలము - ఆకాశము, గంగరావి, దూది

తూలిక - చిన్న ఈఁక, కుంచె

## తృ

తృణరాజము - తాటిచెట్టు, టెంకాయచెట్టు

తృష్ణ - దప్పి, ఇచ్ఛ

## తె

తెక్కలి - దొంగతనము, వంచన, ప్రమాదము

తెగ - జాతి, సమూహము, విధము, నిడుపు

తెగుదల - అంతము, క్షయము

తెగుబడి - తెగుట, దుక్కి, అమ్మకము

తెర - మఱుఁగుచీర, అల

తెరలు - బయలుదేఱు, కలఁగు, తొలఁగు

తెఱఁగు - విధము, క్రమము, సంధి

తెలకువ - వివేకము, ఉపాయము

తెలప - తెలచుట, మఱుఁగులేనిది, ఉపశమనము

తెలి - తెల్లనిది, నిర్మలమైనది

తెలియు - గ్రహించు, ఎఱుఁగు, విశదపడు, మేలుకొను

తెలివి - వివేకము, కాంతి, తేఱుట

తెలుపు - తెల్లదనము, ఎఱిగించు, మేలుకొలుపు

తెల్ల - తెల్లనైనది, విశదము

## తే

తేకువ - భయము, ధైర్యము

తేజస్సు - ప్రకాశము, ప్రభావము

తేఁట - విశదము, మలినములేనిది

తేరు - రథము, బండి, కలుఁగు

తేలు - కొండిపురుగు, నీటిపై ఉండు, స్నానముచేయు

## తొ

తొంగలించు - అతిశయించు, వర్ధిల్లు, స్రవించు

తొంగు - వాలు, శయనించు

తొందర - సంభ్రమము, బాధ

తొగ - కలువ, సమూహము

తొట్టు - వ్యాపించు, స్రవించు, నాటు, జరుగు

తొడరు - కలుఁగు, యత్నించు, ఎదిరించు

తొడుకు - పట్టు, గ్రహించు, దొంగమేఁత

తొడుగు - ధరించు, సంధించు, ముండ్లకంప

తొలకు - చలించు, అతిశయించు, ప్రకాశించు

తొల్లి - ముందు, బిలము

## తో

తోక్కము - గులిమి, పచ్చన

తోపు - పెంపుడువనము, ఎఱుపు

తోయదము — నెయ్యి, మబ్బు, తుంగ

తోయము — నీరు, విషము, తెగ, సమయము

తోరము - వ్రతసూత్రము, స్థూలము, అధికము

## త్ర

త్రప - సిగ్గు, అంకుటాలు

త్రయి - మూఁడు వేదములు, ఏనుఁగు కాలి సంకెల, ఒక విద్య

త్రవ్వు - గుంటచేయు, పూర్వపుసంగతులు పైకితెచ్చు

త్రాడు - దారము, కిరణము

త్రికము - మూటి సమూహము, సొంటి, పిప్పిలి, మిరియాలు, మూఁడుదారులు కలియుచోటు

త్రిధాముఁడు - అగ్ని, విష్ణువు, శివుఁడు, యముడు

త్రిమ్మట - త్రిప్పట, ఆపద

త్రియామ - రాత్రి, పసుపు

త్రిరాత్ర - బహిష్ఠయైనది, యాగవిశేషము

త్రివర్గము - ధర్మార్థకామములు, క్షయస్థాన వృద్ధులు

త్రిశంకువు—ఒకరాజు, పిల్లి, మిడుత

## త్రు

త్రుంగుఁడు - నాశనము, ప్రళయము

త్రుటి - ఇంచుక, సంశయము

త్రుళ్లు - ఎగిరిపడు, గర్వించు

త్రుప్పు - ఇనుముపై మురికి, అరుచి

## త్రె

త్రెక్కొను - చెఱచు, కలఁచు, త్రాఁగు

## త్రొ

త్రొక్కుడు - త్రొక్కుట, ఆపద

## త్రో

త్రోచు - పూను, వడిగొను, త్రోయుట, మీఱు, చంపు

త్రోటి - చేపముక్కు, పక్షిముక్కు

త్రోపు - త్రోయుట, నిషేధము, నిరాకరణము

## త్వ

త్వక్కు - చెట్టు బెరడు, తోలు నార

త్వష్ట - విశ్వకర్మ, వడ్లవాఁడు

## త్వి

త్విట్టు - జిగి, వెలుఁగు, మంట

## ద

దంట - జంట, నేర్పరి

దండ - సమీపము, ప్రాపు, హారము

దండకము - వృత్తవిశేషము, ఒక అరణ్యము
దండధరుఁడు - రాజు, యముఁడు
దండము - దుడ్డుకఱ్ఱ, నమస్కారము, చతురుపాయములలో నొకటి, చెట్టుబోదె, రాజశిక్ష, కప్పము, గర్వము, కప్పము, ధార, జత, సమూహము, దండు
దండి - ప్రతాపము, శౌర్యము, గొప్ప, ఒక సంస్కృతకవి పేరు
దండిక - కిన్నెర, హారమునందలి ఒక పేట
దండు - సేన, సమూహము
దంతము - పొదరిల్లు, పల్లు
దంతశఠ - పులిచింత, నిమ్మ, వెలగ
దంభము - కపటము, తప్పు
దంశనము - పల్లు, కవచము
దంశము - కాటు, అడవి యీఁగ
దక్షిణ - ఋత్విజులకు ఇచ్చు ధనము, ఒక దిక్కు
దక్షిణుఁడు - పెక్కు నాయికలందు సమముగా ప్రవర్తించువాఁడు, నేర్పరి
దట్టము - తఱచు, విరళము
దడ - వణఁకు, కొయ్యత్రాపు
దడము - దట్టము, సేన, సమూహము
దత్తుఁడు - ఒక రాజు, దత్తాత్రేయుడు, ఒకజాతి పురుషుఁడు
దనుకు - తాఁకు, పొందు
దప్పి - నీరుపట్టు, శ్రమము
దబ్బ - నిమ్మజాతి, బద్ద
దబ్బఱ - బొంకు, మోసము, తప్పు
దమనుఁడు - ఒకముని, అణఁచువాఁడు
దమము - దుఃఖము నోర్చుట, అణచుట
దయిత - స్త్రీ, ప్రియురాలు
దయ్యము - దేవుఁడు, వేలుపు, పిశాచము
దరము - శంఖము, భయము
దరి - మేర, సమీపము, గట్టు
దర్దుర - మబ్బు, కప్ప
దర్పము - కస్తూరి, గర్వము
దర్వి - గరిటె, పాముపడగ
దర్శకుఁడు - చూపెడువాఁడు, నేర్పరి
దర్శనము - కన్ను, చూపు, అద్దము, బుద్ధి, శాస్త్రము, ధర్మము
దశ - అవస్థ, స్థితి, వత్తి
దశనము - పల్లు, శిఖరము
దశమాస్థుఁడు - వీర్యము లేనివాఁడు, ముసలివాఁడు
దస్యుఁడు - శత్రువు, చోరుఁడు
దహనము - కాల్పు, చిత్రమూలము, జీడి
దళము - ఎక్కువ, మందము, పూవుఱేకు, దండు, హరిదళము, మూఁడాకుల గుత్తి, భాగము
దళవరి - ధాన్యవిశేషము, సేనాధిపతి
దళితము - ఖండింపఁబడినది, వికసించినది

## దా

దాగురించు - దాఁచు, పంచించు
దాటు - లంఘించు, తరించు
దాక్షాయణి - పార్వతి, భూమి, ఒక నక్షత్రము
దాడి - దండెత్తు, గడ్డము
దాథ - కోఱలు, సమూహము
దానము - ఈవి, ఏనుఁగు చెక్కిళ్ల మదము, పాలనము, శుద్ధి, చతురుపాయము లలో నొకటి
దాపు - దగ్గఱ, భయము
దామము - తలుగు, హారము
దాయ - జ్ఞాతి, విరోధి
దాయము-గవ్వలాటలో పందెము, విపత్తు, ఈవి, అరణము
దార - నీటిచాలు, ఈవి, భార్య
దారకుఁడు - శ్రీకృష్ణుని సారధి, బాలుడు
దారదము - విషభేదము, పాదరసము, ఇంగువ
దారువు - కొయ్య, ఇత్తడి
దార్వి - మ్రానిపసుపు, వెంత
దావము - అడవి, కారుచిచ్చు
దాసి - పనికత్తె, కాకిదొండ
దాసుఁడు - పనికాడు, జాలరి, జ్ఞాని, శూద్రుఁడు
దాహము - కాలుట, దప్పి

## ది

దిక్కు - దిశ, శరణము
దిగంబరుఁడు - దిగంబరుఁడు, దిసమొలవాఁడు
దిద్దు - శిక్షించు, సవరించు
దినుసు - ప్రకారము, వస్తువు
దిమ్మ - దిబ్బ, భ్రమము
దిమ్మె - తామరపూవులోని దుద్దు, కొయ్య బిరడ
దివము - ఆకాశము, పగలు, స్వర్గము
దివాకీర్తి - మంగలవాఁడు, మాలవాఁడు
దివి - ఆకాశము, స్వర్గము
దివ్యచక్షువు - జ్ఞానదృష్టికలవాఁడు, గ్రుడ్డివాఁడు
దివ్యము - లవంగము, ఒప్పునది
దిసమొలవేల్పు - కాలభైరవుఁడు, శివుఁడు

## దీ

దీటుకొను - నిండుకొను, సవరించు
దీనుఁడు - దరిద్రుఁడు, భయపడినవాఁడు
దీపము - దీపిక, తీఁగ
దీప్తము - వెలిగినది, మండినది
దీప్యకము - ఓమము, నెమిలిజుట్టు
దీర్ఘదర్శి - విద్వాంసుఁడు, గ్రద్ద

దీర్ఘాయువు - కాకి, మార్కండేయుఁడు, బూరుగు

దీర్ణము - చీల్పఁబడినది, భయపడినది

## దు

దుండగము - దౌష్ట్యము, కీడు

దుందుభి - భేరి, వరుణుఁడు, ఒక సంవత్సరము, రాక్షసుఁడు

దుకూలము - తెల్లని వస్త్రము, సన్నని వస్త్రము

దుగ్ధము - పాలు, పిదుకఁబడినది

దుడుకు - దౌష్ట్యము, ఉద్ధతి

దుడ్డు - లావుకఱ్ఱ, డబ్బు

దుడ్డె - బాలకుఁడు, ధూర్తురాలు

దురద - కనరు, జిల

దురపిల్లు - శోకించు, తపించు

దురము - యుద్ధము, వేగము

దుర్గ - పార్వతి, నల్లపిచ్చుక, నీలిచెట్టు

దుర్గతి - నరకము, దారిద్ర్యము

దుర్వర్ణము - వెండి, నూగుదోస

దుర్విధుఁడు - దుర్జనుఁడు, దరిద్రుఁడు

దువ్వలువ - దుప్పటము, కట్టుకోక

దుస్తు - వస్త్రము, అందము

## దూ

దూయు - పాఱు, తీయు

దూరదర్శి - విద్వాంసుఁడు, గ్రద్ద

దూషిక - కంటిపుసి, సాలెపురుగు

## దృ

దృక్కు - కన్ను, చూపు, బుద్ధి

దృఢము - దిటవుగలది, అత్యంతము

దృషత్తు - సన్నెకల్లు, ఱాయి

దృష్టాంతము - ఉదాహరణము, ఒక అలంకారము, శాస్త్రము, చావు

దృష్టి - చూపు, కన్ను, బుద్ధి

## దె

దెప్పరము - ఆపద, అశక్యము

## దే

దేవదత్తము - ఒక ఉపవాయువు, అర్జునుని శంఖము

దేవనము - క్రీడ, జూదము, వ్యవహారము, పాచిక

## దొ

దొర - రాజు, సేనానాయకుఁడు, గొప్పవాఁడు

దొరయు - అంటు, కలుగు, జరుగు

దొరలు - దొర్లు, పడు, అనుభవించు
దొరువు - నడబావి, కొలను
దొసఁగు - ఆపద, విఘ్నము

## దో

దోపరి - దొంగ, కొల్లకాఁడు
దోగ్ధ - గొల్లవాఁడు, దూడ
దోని - దొన, అరిణ
దోనె - చిన్న యోడ, జలగడుగువాని సాధనము
దోరు - చచ్చు, వ్రాలు
దోష - భుజము, రాత్రితప్పు, పాపము
దోషజ్ఞుఁడు - విద్వాంసుఁడు, వైద్యుఁడు
దోషాచరుఁడు - చంద్రుడు, రాక్షసుఁడు
దోషము - పాపము, తప్పు
దోహదము - ఇచ్ఛ, వేవిళ్లు, అకాలమున తరులతాదులు పుష్పించుటకు, ఫలించుటకు, స్త్రీల పాదతాడనాది క్రియలు, (అశోకమునకు కాలితన్ను, పొగడకు ఉమ్మి, గోరంటునకు ఆలింగనము, బొట్టునకు వీక్షణము, మామిడికి కరస్పర్శనము, సంపెగకు ముఖరాగము, కొండగోగునకు సల్లాపము, వావిలికి ఊర్పు మోరటికి పాట, సురపొన్నకు నవ్వు)

## దౌ

దౌడు - బోదస, దండయాత్ర, పరుగు

## ద్యు

ద్యుమ్నము - ధనము, బలము

## ద్ర

ద్రవము - తడి, పరిహాసము, పరుగు
ద్రవిణము - ధనము, బంగారు, బలము.
ద్రవ్యము - ధనము, ఇత్తడి, పూఁత, మందు, లక్క

## ద్రు

ద్రుణము - కత్తి, విల్లు, తేలు
ద్రుతము - త్వరితము, వడిగలది, చీలినది

## ద్రో

ద్రోణము - ఒకానొకకొండ, తూము, తేలు, మాలకాకి
ద్రోణి - చిన్న యోడ, కొండపల్లము, దొన్నె

## ద్వం

ద్వంద్వము - స్త్రీ పురుషుల జంట, రహస్యము, శీతోష్ణాదులు

## ద్వా

ద్వాపరము - ఒకయుగము, సందేశము

## ద్వి

ద్విజ - పక్షి, పల్లు, పాము

ద్విజన్ముఁడు - బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు

ద్విజరాజు - చంద్రుఁడు, గరుత్మంతుఁడు, శేషుఁడు

ద్విజుఁడు - బ్రాహ్మణుఁడు, వైశ్యుఁడు, క్షత్రియుఁడు

## ద్వీ

ద్వీపి - పులి, సముద్రము

## ద్వై

ద్వైమాతురుఁడు - వినాయకుఁడు, జరాసంధుఁడు

## ధ

ధటి - ధట్టి, గోఁచి

ధనంజయుఁడు - అర్జునుఁడు, అగ్ని

ధనికుడు - ధనముకలవాఁడు, యోగ్యుఁడు

ధనువు - విల్లు, ఒకరాశి

ధన్వంతరి - దేవవైద్యుఁడు, సూర్యుఁడు మహేశ్వరుఁడు

ధన్వి - అర్జునుఁడు, విలుకాఁడు, నేర్పరి

ధమని - నరము, మెడ

ధర - నేల, వెల, మావి, మెదడు, కొండ

ధరణిధరుఁడు - విష్ణువు, శేషుఁడు, రాజు

ధరాధరము - కొండ, తాఁబేలు

ధర్మము - పుణ్యము, న్యాయము, సామ్యము, స్వభావము, ఆచారము, అహింస, యజ్ఞము

ధర్మరాజు - యుధిష్ఠిరుడు, యముడు, బుద్ధదేవుఁడు

ధర్ముఁడు - యముఁడు, సోమయాజి, ఒక వసువు

ధర్షణము - తిరస్కరించుట, ధర్షించుట

ధవళ - ఆవు, తెలుపు, ఆఁబోతు, చక్కనిది.

ధవుఁడు - పెనిమిటి, రాజు, మనుష్యుఁడు

## ధా

ధాత - బ్రహ్మ, ఒక సంవత్సరము, ధరించువాఁడు

ధాత్రి - నేల, దాది, తల్లి, ఉసిరిక

ధాన - దనియాలు, మొగ్గ

ధామము - ఇల్లు, చోటు, వెలుఁగు, కాంతి, ప్రభావము, మేను, పుట్టువు

ధార - నీటిచాలు, కుండ లోనగువాని చిల్లి, అశ్వగతి, ప్రవాహము, ఒకానొక పట్టణము

ధారాటము - గుఱ్ఱము, వానకోయిల

ధారాధరము - మేఘము, ఖడ్గము

ధార్మికుఁడు - విల్లుకలవాఁడు, పుణ్యాత్ముఁడు

ధావనము - పరుగు, శుద్ధి

## ధి

ధిష్ణ్యము - గృహము, స్థానము, బలము, నక్షత్రము

## ధీ

ధీమంతుఁడు - విద్వాంసుఁడు, బృహస్పతి

ధీరుఁడు - ధైర్యముకలవాఁడు, స్వాతంత్ర్యము కలవాఁడు

## ధు

ధుంధుమారము - కటమూపము, పట్టు పురుగు

ధుతము - కదల్పఁబడినది, విడువఁబడినది

## ధూ

ధూమకేతువు - ఉత్పాతము, అగ్ని

ధూసరము - గాడిద, బూడిదవర్ణము

## ధృ

ధృతరాష్ట్రుఁడు - దుర్యోధనుని తండ్రి, సర్పవిశేషము, రాజు

ధృతి - ధరించుట, ధైర్యము, సౌఖ్యము, ఒక ఛందస్సు

## ధే

ధేనుక - లేఁగటి యావు, ఆఁడేనుఁగు, చిన్నకత్తి, పార్వతి

## ధో

ధోరణి - పద్ధతి, పంక్తి

## ధ్యా

ధ్యామము - కామంచిగడ్డి, దవనము

## ధ్రు

ధ్రువ - గీతివిశేషము, గుఱ్ఱపుసుడి, తాళ విశేషము, నిశ్చయము, కదలనిది
ధ్రువుఁడు - నక్షత్రవిశేషము, ఒక వసువు, శివుడు, విష్ణువు
ధ్వజము - టెక్కెము, టెక్కెపుకంబము, గుఱుతు, గర్వము

## ధ్వ

ధ్వస్తము - జారినది, నశించినది

## న

నంద - తిధివిశేషము, ముంత, కలిమి
నందన - కూతురు, ఒక సంవత్సరము, ఇంద్రుని ఉద్యానవనము
నంది - శివునివాహనము, కలజువ్వి
నక్క - ఒదుగు, ప్రమాదియతుకు, నాగటి కఱ్ఱు
నక్తకము - చినిగిన వస్త్రము, మాసిన వస్త్రము, నల్లగూబ
నక్రము - మొసలి, అడ్డకమ్మి
నగ - సొమ్ము, బండి చాపు
నగము - కొండ, చెట్టు
నగరు - రాజగృహము, దేవగృహము
నగౌకసము - పక్షి, సింహము, శరభము
నచ్చు - నమ్ము, ఇష్టపడు, ఆలస్యము, బాధ
నచ్చుకాఁడు - అలసుఁడు, బాధకుఁడు
నటనము - నాట్యము, ప్రవర్తనము
నటించు - నాట్యముచేయు, కపటముగా ప్రవర్తించు
నట్టు - స్థానము, ఆలస్యము, ఆటంకము
నట్టువ - ఆట, నర్తనము
నడవ - ముంగిలి, మార్గము, సేతువు
నడుమంతరము - కౌను, మధ్యకాలము
నతము - వంగినది, లోతైనది
నదము - పశ్చిమముగా ప్రవహించెడు ఏఱు, నీటిమడుగు, సముద్రము
ననుచు - పూచు, చిగిరించు, మొగ్గయెత్తు, ఇంపగు
ననుపు - అనురాగము, అతిశయము, ఇంపు
నప్త - మనుమరాలు, [డు] మనుమఁడు
నభము - ఆకాశము, శ్రావణ మాసము, మేఘము, వర్షాకాలము, ముక్కు

నయము - లాభము, మనువు, అందము, చౌక, నీతి

నరుఁడు - మనుష్యుఁడు, అర్జునుఁడు, ఒకఋషి

నరేంద్రుఁడు - రాజు, పాములవాఁడు

నలఁకువ - వ్యాధి, బాధ, శ్రమము

నలదము - పట్టివేరు, పూఁదేనె

నలి - రోగము, పొడి

నలినము - తామర, నీరు

నలిని - తామర, తామరకొలను, మిన్నేఱు

నలుఁగు - నలిగిపోవు, స్నానమప్పుడు తనువునకు రాచుకొను పిండి

నలువు - ఒప్పిదము, సామర్థ్యము

నల్ల - రక్తము, నలుపు, బొగ్గు

నవఁత - దుఃఖము, నవయుట

నవ్వు - వికసించు, హసించు

నస - దురద, ఉపద్రవము, గోజు

## నా

నాకము - స్వర్గము, ఆకాశము

నాకువు - కొండ, పుట్ట, ముని

నాగము - తగరము, ఏనుఁగు, పాము, పొన్న, కొండ, గ్రహము, రథబంధ విశేషము

నాగవాసము - ఇనుపగొండ్లము, వేశ్యా సమూహము

నాడి - నరము, గడియకాలము, ఈనె, కాఁడ

నాణెము - వెండి, రాగి లోనగువాని బిళ్ల, యోగ్యత, నాగరికత

నాథుఁడు - భర్త, రాజు, ఇంద్రుఁడు

నాభి - కస్తూరి, బొడ్డు, తిలకము

నారంగము - నారింజ, అమడబిడ్డ

నారము - నరుల సమూహము, నీరు

నారాయణి - లక్ష్మి, పార్వతి, పిల్లిపీచర

నారాయణుఁడు - విష్ణువు, సూర్యుఁడు, చంద్రుఁడు, బ్రహ్మ, శివుఁడు, అగ్ని

నారి - నరము, స్త్రీ

నాలి - కుత్సితపుపని, మోసము, మందము

నాసీరము - సేనాముఖము, దర్పము

నాళము - తామరతూడు, క్రోవి

నాళీకము - తామర, బాణము

## ని

నికరము - మిగిలినది, సమూహము, నిధి

నికష - రాక్షసుల తల్లి, [ము] సాన

నికాయము - ఇల్లు, సమూహము, లక్ష్యము, ప్రోగు

నికృతి - బెదరుమాట, మోసము

నిక్కు - ఉన్నతమగు, గర్వించు
నిగమము - వేదము, మార్గము, పట్టణము
నిగుడు - నిక్కు, సాగు, పఱగు
నిగ్రహము - త్రోపాటు, వెలి, మేర
నిచ్చలము - నిశ్చయము, నిశ్చలము, నిరంతరము
నిజము - స్వభావము, తనది, స్థిరమైనది
నిట్ట - ప్రవాహము, స్థానము, నిక్కు, స్తంభము
నిట్టు - ఉపవాసము, కఱవు
నితంబము - పిఱుదు, మొల, కొండ, నడుము, దరి
నిదాఘము - వేసగి, చెమట
నిదేశము - పనుపు, చెప్పుట
నిధనము - కులము, చావు, చేటు
నిష్పచ్చరము - దారిద్ర్యము, శూన్యము
నిబంధనము - ఏర్పాటు, బంధము, కారణము
నిమిత్తము - కారణము, శకునము, గుఱుతు
నియతి - నియమము, [భాగ్యము]
నియమము - ఏర్పాటు, కట్టు, పనుపు, ప్రతిజ్ఞ
నిరంజనము - పున్నమ, కాటుకలేనిది, కల్మషములేనిది
నిరంతరము - దట్టము, ఎడతెగనిది
నిరసనము - తిరస్కారము, ఆక్షేపము, వధము
నిరాకారుడు-విష్ణువు, శివుడు, పరమాత్మ
నిరాతంకము - భయములేనిది, రోగము లేనిది
నిరూపణము-చూపు, తార్కాణము
నిరోధము-అడ్డు, చేటు
నిర్ఘాతము - పిడుగు, వజ్రము
నిర్దేశము-ఆజ్ఞ, చెప్పుట, సమీపము
నిర్నిద్రము - జాగరూకతకలది, నిద్రలేనిది
నిర్మలము - మలినములేనిది, అభ్రకము
నిర్మాణము - నిర్మితి, యోగ్యత, సారము
నిర్మోకము - కుబుసము, విడుపు, ఆకాశము
నిర్యాణము - ఏనుగు, కడకన్ను, చావు ముక్తి, వెడలుబాటు
నిర్యాతనము - పగతీర్చుట, చంపుట, ఈవి
నిర్యూహము - సిగబంతి, ప్రాని బంక, వాకిలి
నిర్వాణము - ముక్తి, నాశము, సుఖము, చల్లారినది
నిర్వాహము - శక్తి, జరుగుబాటు
నిర్వాపణము - కొల, ఈవి
నిర్వృతి - సుఖము, నాశము, ఊఱట
నిర్వేశము - కూలి, జీతము, భోగము

నిలింపుఁడు - బోయ, వేల్పు
నిలుకడ - ఉనికి, స్థైర్యము
నిలుచు - నిలఁబడు, ఉండు, శేషించు
నిలుపు - నిలువఁబెట్టు, స్థిరపఱచు
నివేదనము - ఎఱుక, సమర్పణము
నివేశము - ఇల్లు, చొఱవ, పెండ్లి, ఇల్లడ
నివ్వటిల్లు - నెఱవేఱు, కలుఁగు, వ్యాపించు
నివ్వెఱ - మిగుల భయము, పారవశ్యము, భ్రాంతి
నిశ - రాత్రి, పసుపు
నిశాంతము - ఇల్లు, వేకువ
నిశాచరి - రాక్షసి, అంకుటాలు
నిశ్శ్రేయసము - ముక్తి, మేలు
నిష్ఠ - ఉనికి, చేటు, తుది, వేఁడికోలు
నిష్ఠురము - కఠినము, పరుషమైనది
నిష్ప్రవము - అనుములు, చేటగాలి, పొల్లు
నిసర్గము - స్వభావము, ఈవి
నిస్తరణము - దాటుట, వెడలఁబాటు
నిస్సరణము - చావు, ముక్తి, వెడలఁబాటు
నిహ్నవము - కపటము, అపనమ్మిక తిరస్కారము

## నీ

నీకాశము - ప్రకాశము, సమూహము, నిశ్చయము
నీడ - చాయ, ఎండలేమి
నీతము - నియమము, ధనము, ధాన్యము, తేఁబడినది
నీతి - న్యాయము, పొందింపఁబడుట
నీరంధ్రము - అవకాశము, సందులేనిది
నీరజము - తామర, ముత్యము
నీరదము - తుంగ, మబ్బు
నీరుపాప - అగ్ని, నీచమనుష్యుఁడు
నీరుపుట్టువ - తామర, శంఖము, కౌస్తుభము
నీలంగువు - ఈఁగ, నక్క, పురుగు
నీలకంఠము - ముల్లంగి, నెమిలి, ఊరఁబిచ్చుక, పాము
నీలము - నల్లరాయి, నీలివెట్టు, నలుపు, కొండ, ఒకనిధి
నీలాంబరుఁడు - బలరాముఁడు, నైరృతి, శని
నీవి - సంచి మొదలు, పోకముడి, చెఱసాల
నీవృత్తులు - గ్రామము, దేశము
నీవ్రము - చూరు, అడవి

## ను

నుగ్గు - చూర్ణము, ఖండము, పిడక
నులి - చిక్కు, అల్పము

## నూ

నూకు - త్రోచు, త్రోలు

## నృ

నృపతి - రాజు, కుబేరుఁడు

## నె

నెట్టుకొను - పూనుకొను, నెలకొను, అతిశయించు

నెత్తము - పాచికలాట, పందెము, కొండ మీది విశాలప్రదేశము

నెనరు - కృతజ్ఞత, ప్రేమము

నెపము - వ్యాజము, కారణము, తప్పు

నెప్పు - స్థానము, స్థైర్యము, ఉపాయము

నెమ్మి - నెమిలి, క్షేమము, ప్రేమము, నెమ్మది, సంతోషము

నెయ్యము - స్నేహము, ఇంపు

నెరవు - పూర్తి, వ్యాపనము, మార్గము, యుక్తము, విశాలము

నెరసు - తప్పు, నలుసు, దోషము

నెఱి - అందము, ఆచారము, క్రమము, న్యాయము, పరాక్రమము, విధము, తెక్కు, ప్రజ్ఞ

నెల - మాసము, చంద్రుఁడు, పున్నమ, కర్పూరము

నెలకూన - బాలచంద్రుఁడు, నఖక్షతము

నెలవు - వాసస్థానము, స్థానము, పరిచయము

నెవ్వ - దారిద్ర్యము, ఆపద, వలపు

## నే

నేత్రము - కన్ను, తరిత్రాడు, ఏఱు, వలిపము, తేరు

నేలతాలుపు - పర్వతము, రాజు

నేలపట్టి - అంగారకుఁడు, నరకాసురుఁడు. సీత, భౌముఁడు

## నై

నైగముఁడు - నాగరుఁడు, వణిజుఁడు

నైజము - తనది, స్వాభావికము

నైపథ్యము - వస్త్రాద్యలంకారము, నాట్య స్థానము

## నొ

నొక్కు - అదుము, ముడుత

నొప్పి - బాధ, ఒప్పమి, ఆపద

## న్య

న్యంకువు - ముని, ఇఱ్ఱి

న్యక్షము - అధమము, సమస్తము

న్యగ్రోధము - మఱ్ఱి, జమ్మి

## న్యా

న్యాసము - ఉంచుట, వాడిక

## న్యూ

న్యూనము - తక్కువైనది, నిందింపఁ దగినది

## ప

పంకము - బురద, పాపము

పంచత్వము - పంచభావము, చావు

పంచదశి - అమావాస్య, పున్నమ

పంచమి - ఐదవతిథి, ద్రౌపది

పంచాంగము - తిథి వార నక్షత్ర యోగ కరణములు తెలుపు గ్రంథము, తాఁబేలు

పంజరము - పంజరము, శరీరము

పండు - ఫలించు, ఫలము

పంతము - పోటీ, విధము, పౌరుషము

పంపు - ఆజ్ఞాపించు, వరిమళ్లవరుస, పంపించు, మారణకర్మ తంత్రము

పక్షము - పదియైదు దినములు, ఱెక్క, ప్రక్క, పగ, బలము, చెలికాఁడు, సహాయుఁడు

పచ్చి - తడిగలది, ఉడుకనిది

పటము - వస్త్రము, చిత్తరువు

పటలము - నేత్రరోగము, ఇంటి కప్పు, పరివారము, సమూహము

పటువు - చొఱవకాఁడు, నేర్పరి

పట్టము - బిరుదు, రాజ్యము

పట్టు - వెల్లు, ఇంచు, గ్రహించు, మూర్కొను, గ్రహణము, పూఁత, స్థానము, వెడలుపు, కారణము, ఘట్టము

పట్టె - పలక, కుంచె

పడు - పతనమగు, చచ్చు, పొందు, అనుభవించు, అస్తమించు

పణము - పందెము, వెల, కూలి, ధనము, జూదము, వ్యవహారము, కొనుట

పతంగము - పక్షి, మిడుత, బాణము పిల్లి

పత్రము - ఆఁకు, ఱెక్క, వాహనము, బాణము

పత్రి - డేగ, పక్షి, బాణము, కొండ, మ్రాను

పదను - సమయము, పరిపాకము

పదము - పాదము, శబ్దము, వాక్యము, పద్యపాదము, ప్రయత్నము, చిహ్నము, కపటము, వస్తువు
పద్దు - అంకెల మొత్తము, ప్రతిజ్ఞ
పద్మ - లక్ష్మి, తామర, ఒకనిధి
పద్మిని - తామర తీఁగ, లక్ష్మి, ఆఁడ ఏనుఁగు, తామరకొలను
పని - వ్యాపారము, నియోగము, కర్మము, శిల్పము
పన్ను - సిద్ధపడు, దంతము, కలుగు, చేయు, ఏర్పఱచు
పయస్విని - ఆవు, ఏఱు
పయస్సు - పాలు, నీరు
పయోధరము - పాలిండ్లు, మబ్బు, టెంకాయ
పరంజము - గానుగ, నురుగు
పరంపర - వరుస, హింస, సంతానము
పరగు - ప్రవృత్తమగు, వర్తిల్లు, ప్రవహించు, విహరించు
పరమము - పరమాత్మ, ఆద్యము, ప్రధానము
పరము - కేవలము, మోక్షము, అన్యము, దూరము, శ్రేష్ఠము
పరమేశ్వరుఁడు - శివుఁడు, విష్ణువు
పరాక్రమము - వీర్యము, శౌర్యము, సామర్థ్యము
పరాగము - పుప్పొడి, దుమ్ము, నలుగు పిండి, చందనము, విఖ్యాతి
పరాభవ - ఒక సంవత్సరము- [ము] అవమానము, నాశము
పరాస్తము - అపజయమొందినది, నిరాకరింపఁబడినది
పరి - సేన, సమూహము, పంక్తి, ఆవృత్తి
పరికరము - ఒక అర్థాలంకారము, ఉపకరణము, సమూహము, మంచము, నడికట్టు
పరిక్షేపము - చుట్టుకొనియుండుట, విస్తృత,
పరిగతము - చుట్టబడినది, తెలియఁబడినది, పొందఁబడినది
పరిగ్రహము - ప్రియముతో పుచ్చుకొనుట, భార్య, శాపము, పరివారము
పరిఘము - బాణము, కోటగవను, గడియ మ్రాను, కుండ, దెబ్బ
పరిచ్ఛేదము - గ్రంథభాగము, మేర
పరిణామము - ఒకఅలంకారము, క్షేమము, మారు రూపు
పరితాపము - సంతాపము, నరకవిశేషము
పరిధి - కైవారము, సూర్యాదిపరివేషము
పరిపంథి - విరోధి, తెఱచాటుదొంగ
పరిభాషణము - ఆలాపము, నియమము
పరియు - తప్పు, చెడు
పరివాపము - కొలఁది, పాదు, తనివి

పరివారము - పరిజనము, సేన
పరివేషము- గాలిగుడి, పరివేష్ఠనము
పరిశ్రమము - అలవాటు, మిక్కిలి అలపు
పరిష్కారము - చక్కఁబెట్టుట, తొడవు
పరిసరము - చావు, సమీపము
పరిస్ఫోటించు - వీల్చు, ప్రకాశింపఁజేయు
పరిహారము - ఐడుపు, చేయి
పరుఁడు - విరోధి, పరమాత్ముఁడు, ఇతరుడు
పరువడి - పర్యాయము, క్రమము
పరువు - ధావనము, కోసుదూరము
పరుషము - నిష్ఠురము, చిత్రవర్ణము
పర్యస్తము - పడినది, కొట్టఁబడినది
పర్యాప్తము - యథేష్టము, తృప్తి, శక్తి, నివారణము
పర్యాయము - ఒక అలంకారము, అవసరము, క్రమము, ప్రకారము
పర్వము- గనుపు, పండుగ, సమూహము, ప్రస్తావము
పర్వరీణము - ఆకుల ఈనె, గనుపు
పఱ - బయలు, ఇతరము, సమూహము, మిక్కిలి, గొప్ప
పఱగడ - ఇతరస్థలము, పార్శ్వము
పఱచు - పడఁజేయు, పాటుపడు
పఱపు - పడక, వేగము, విరివి
పలక - వ్రాయు సాధనము, బిల్ల, జూడమాడు బిల్ల
పలపలన - వైరళ్యము, కార్శ్యము
పలము - మాంసము, బురద, నూవుపిండి
పలాశి - చెట్లు, కోకింప [రాక్షసుఁడు]
పలుకు - మాటాడు, నిందించు, విద్య, ఖండము, మాట
పలుచన - సన్నఁదనము, పెలితనము
పల్యంకము - మంచము, మంచె
పల్లవము - చిగురు, కొమ్మ, కోకచెఱఁగు
పల్లి - పల్లె, గుడిసె, బల్లి
పవనతనయుఁడు - [illegible]ుఁడు, హనుమంతుఁడు, అగ్ని
పవిత్రము - జందెము, పరిశుద్ధము, జలము, గోమయము
పశువు - నాలుగుకా[illegible] జంతువు, గొఱ్ఱె
పస - సారము, [illegible]
పసిఁడి - బంగారు, [illegible]

## పా

పాంచాలి - ద్రౌపది, బొమ్మ
పాండువు - ఒకరోగము, పేరీదు, తెలుపు, తెల్లనిది
పాంశువు - దుమ్ము, ఎరువు
పాంసుల - భూమి, అంకుటాలు

పాఁపమేపరి - గరుత్మంతుఁడు, నెమిలి
పాకము - పరిపాకము, పంట, పిల్ల
పాచకుఁడు - వంటవాఁడు, అగ్ని
పాట - సంగీతము, విధము
పాటకము - వాద్యము, పాడగము, సేనా నివేశము
పాటవము - ఆరోగ్యము, నైపుణ్యము, శక్తత
పాటి - సమము, కొలఁది, న్యాయము
పాటించు - ఆదరించు, విచారించు, ధరించు
పాటీరము - చందనము, వెదురుచేవ, జల్లెడ, వరిమడి, మబ్బు
పాటు - పడుట, శ్రమము, ఆపద
పాడి - ధర్మము, వ్యవహారము, న్యాయము, స్వభావము
పాడు - పాటినేల, పల్లె
పాణింధమము - కొలిమితిత్తి, చీఁకటి
పాతము - పతనము, పాటు, రాహువు
పాత్రము - మంత్రి, యోగ్యము, త్రిభాజనము
పాదము - జలము, అన్నము
పాదన్ను - అడుగు, కిరణము, వేరు, పాతిక, పద్యమందలి ఒకగీటు
పాదుకొను - నెలకొను, నిలచు
పానము - త్రాగుడు, త్రాగుడుగిన్నె

పాప - శిశువు, కంటిపాప
పాపుఁడు - అధముఁడు, హింసకుఁడు
పాయ - చీలిక, ఖండము
పాయవడు - చీలు, తొలఁగు, వెలివడు
పారాయణము - పారమును పొందుట, అంతయుఁ జదువుట
పారి - తడవ, మన్ను, గిండి, ఈడు, ముంత
పారిభద్రము - దేవదారువు, వేము
పార్థుడు - అర్జునుఁడు, రాజు
పార్వతి - గౌరి, ద్రౌపది
పాలివాఁడు - జ్ఞాతి, పాలేరువాఁడు
పాలు - భాగము, వంతు, వశము, సమీపము, క్షీరము
పావకము - చిత్రమూలము, నెల్లి
పావకుఁడు - అగ్ని, సూర్యుఁడు, మంచి ప్రవర్తనఁ గలవాఁడు
పావనము - గోమయము, రుద్రాక్షము, జలము
పావని - ఆవు, గంగ, తులసి, భీముఁడు, హనుమంతుఁడు
పాశి - వరుణుఁడు, యముఁడు, వ్యాధుఁడు
పాళము - విధము, సమయము, కొలఁది
పాళి - అంచు, గుఱుతు, చోటు, వరుస, కొండనెత్తము

## పి

పింగ - గోరోజనము, పార్వతి, ఇంగువ
పింగళ - ఒక సంవత్సరము, ఒక నాడి, వేశ్య, కోతి, ముంగిస, ఒకపాము
పింగళుఁడు - అగ్ని, శివుఁడు
పింజరము - బంగారు, హరిదళము, తామ్రము
పిండము - బ్రతుకు తెరువు, ఇనుము, గర్భము, శరీరము, బెండు, బలము, సమూహము, దట్టము
పిండితము - దట్టము, ఎంచఁబడినది, చేర్పఁబడినది
పిండు - పాలుపితుకు, గుంపు
పిక్కటిల్లు - అతిశయించు, విండు, పిదులు
పిక్కు - వంచించు, మర్మము, వంచన
పిచండము - కడుపు, పఱపు
పిచులము - నీరుకాకి, గన్నేరు
పిచుపు - దూది, కుష్ఠభేదము, మాడ
పిచ్ఛటము - తగరము, సత్తు
పిచ్ఛ - అరటి, ఒఱ, పోఁక, సమూహము, వరుస, బూరుగుబంక, తోఁక
పిడి - పిడికిలి, ఆఁడు మృగము
పిణ్యాకము - తెలికపిండి, ఇంగువ, కుంకుమపువ్వు
పితామహుఁడు - తాత, తండ్రి, బ్రహ్మ
పినద్ధము - కట్టఁబడినది, తొడుగఁబడినది
పినాకము - శివుని విల్లు, త్రిశూలము
పినాకిని - నదీవిశేషము, వీణావిశేషము
పిరి - మెలి, వెంటి
పిలుకుమారు-చచ్చు, నాశమొందు
పిశునుఁడు - కొండెకాఁడు, దుష్టుఁడు
పిష్టకము - పిండివంట, నేత్రరోగము
పిసాళి - ప్రకాశముకలది, వ్యాపనము కలది
పిసాళించు - ప్రకాశించు, పరిమళించు, వ్యాపించు

## పీ

పీడ - బాధ, కరుణ, సిగదండ
పీత - ఎండ్రకాయ, పసుపురంగు, త్రాగఁబడినది
పీతనము - కుంకుమ పువ్వు, హరిదళము, దేవదారువు
పీలువు - గొలుగుచెట్టు, ఏనుఁగు, పరమాణువు, పుష్పము- బాణము
పీవరము - బలిసినది, క్రొవ్వినది

## పు

పుంగవము-ఎద్దు, ఓషధీవిశేషము
పుండరీకము - తెల్ల దామర, తెల్ల గొడుగు

పుణ్యతీర్థము, ఆగ్నేయదిక్కునందలి ఏనుఁగు, పెద్దపులి, కప్ప [డు], ఒక నిఘంటుకర్త, ఒక ముని

పుండ్రము - నల్లని గణుపుగల చెఱకు, తెల్లదామర, పుసుగు, వంగదేశము, (డు) ఒకానొక రాక్షసుఁడు

పుచ్ఛము - తోఁక, వెనుకప్రక్క

పుట్ట - వల్మీకము, చిన్న పొద, జనస్థానము

పుడమితాలుపు - రాజు, శేషుఁడు, పర్వతము

పుడమిపట్టి - సీత, నరకాసురుఁడు, అంగారకుఁడు

పుడమిపుట్టు - సీత, వెట్టి

పుణ్యజనుఁడు - యక్షుఁడు, రాక్షసుఁడు, నైర్‌ఋతి, పుణ్యాత్ముఁడు

పుణ్యము - ధర్మము, సుకృతము, పవిత్రము, మనోజ్ఞము

పునర్భవ - గోరు, సంసారము

పున్నాగము - సురపొన్న, ఇంద్రుని ఏనుఁగు, పురుష శ్రేష్ఠుఁడు, తెల్లకలువ, జాజికాయ

పురము - పట్టణము, శరీరము, ఇల్లు, మేడ

పురస్కారము - ముందిడుట, పూజనము, సన్మానము, తడుపుట, పరిగ్రహించుట

పురి - మెలి, పట్టణము, నెమిలి పింఛము, ధాన్యముపోసిన కూటు

పురుడు - జాతాశౌచము, సమానము

పురుషుఁడు - మనుష్యుఁడు, సాంఖ్య జీవుఁడు, పరమాత్మ

పులకము - పులగము, పురుగు, మణిద్రవ్య విశేషము, హరిదళము

పులాకము - పొల్లు, మెతుకు, సంక్షేపము

పులుము - రుద్దు, కొట్టు, నలుపు, ఉసుము

పుల్కసుఁడు - బోయవాఁడు, అధముఁడు, మాలవాఁడు

పుల్ల - పుడక, పుల్లనిది

పుష్కరము - మెట్టతామర, ఆకాశము, ఉదకము, బాణము, తొండము, చివర, ఒక దీవి, ఒక తీర్థము, (డు) ఒక రాజు

పుష్కరిణి - కోనేఱు, ఆడ ఏనుగు

పుష్పకము - కుబేరుని విమానము, రత్నకంకణము, కుంపటి, కృష్ణుని గుఱ్ఱములలో నొకటి

పుష్యము - పుష్యమాసము, పుష్యరాగము, కలియుగము, ఒక నక్షత్రము

## పూ

పూగము - పోఁక, సమూహము

పూయము - జూదము, చీము, పీనుఁగు

పూర్ణము - నిండినది, శక్తి కలది, సమస్తము

పూర్వపక్షము - వాదము, శుక్లపక్షము

పూస - మణి, గాజు, పూస, వెన్నుకీలు

# పృ

పృధివీపతి - రాజు, యముఁడు

పృధుకము - పిల్ల, అడుకులు

పృధువు - అగ్ని, ఒక రాజు, గొప్ప, విరివియైనది

పృదాకువు - పాము, తేలు, పులి

పృషతము - చుక్క, నీటి బొట్టు

# పె

పెట్టు - ఇచ్చు, కలుగు, ధరించు, మోపు, నాటు, కొట్టు, దెబ్బ, పర్యాయము

పెత్తనము - అధికారము, ముసలితనము

పెద్ద - వృద్ధు, గొప్ప, జ్యేష్ఠుఁడు

పెనపు - కలపు, వివాదము, భేదము

# పే

పేటిక - సమూహము, పెట్టె

పేద - పిఱికి, దరిద్రుఁడు, అశక్తుఁడు

పేయము - నీరు, పాలు

పేరిమి - గౌరవము, అతిశయము

పేరు - నామము, కీర్తి, ఘనీభవించు, దండ, పెద్ద, అధికము

పేశలము - చక్కనిది, నేర్పుకలది,కోమలము, రోఁకలి

పేశి - గ్రుడ్డు, మాంసపుముద్ద

# పై

పైడి - ధనము, బంగారు

పైకము - ధనము, రెండు కాసుల నాణెము, పికముల సమూహము

పైకొను - కలియు, మీఁదు, యత్నించు, కలుఁగు

# పొ

పొంగారు - ఉబుకు, సంతోషించు, అతిశయించు, నిక్కు

పొంగు - సంతోషము, గర్వము

పొంత - దాపు, తీరము

పొందు - స్నేహము, అనుకూల్యము

పొక్కి - గుఱుతు, ఉపాయము

పొక్కు - దుఃఖము, బొబ్బ

పొచ్చెము - కపటము, న్యూనము

పొరలు - పొర్లు, ప్రవర్తిల్లు

పొలయిక - నాశము, మరణము

## పో

పోకడ - గమనము, నాశము
పోతము - పిల్ల, ఇంటి స్థలము, మనుష్యులు ఎక్కిపోవు పడవ
పోహణ - కూర్పు, నేర్పు

## పౌ

పౌజు - వరుస, దండు
పౌరుషము - పురుష ప్రయత్నము, పురుషభావము
పౌలస్త్యుఁడు - కుబేరుఁడు, రావణుఁడు

## ప్ర

ప్రకరణము - గ్రంధభాగము, నాటకభేదము
ప్రకీర్ణము - వింజామరము, విరివి
ప్రక్రియ - అధికారము, ప్రకరణము
ప్రతి - మాఱు, సమానము
ప్రతికృతి - మాఱు, రూపు, ప్రతిమ
ప్రతిక్రియ - ఔషధము, ప్రతీకారము
ప్రతిగ్రహము - దానముతీసికొనుట, గ్రహభేదము
ప్రతిఘము - కోపము, మూర్ఛ
ప్రతినిధి - మాఱు, ప్రతిమ
ప్రతిపక్షుఁడు - విరోధి, ప్రతివాది
ప్రతిపత్తి - గౌరవము, నేర్పు, తెలివి
ప్రతిపాదనము - ఇచ్చుట, కలిగించుట, తెలుపుట
ప్రతిబింబము - ప్రతిమ, ప్రతిఫలము
ప్రతియత్నము - ఇచ్ఛ, ప్రతీకారము
ప్రతిరోధము - ఎదిరించుట, దొంగతనము
ప్రతిశ్రయము - ఇల్లు, ప్రాఁపు, సభ
ప్రతిష్ఠ - గౌరవము, నేల, చోటు
ప్రతిసరము - కడియము, పూదండ, భూషణము
ప్రతీకారము - మాఱుసేత, ఔషధము
ప్రతీతి - ప్రసిద్ధి, సంతోషము
ప్రత్యవాయము - పాపము, దురదృష్టము
ప్రత్యర్థి - విరోధి, ప్రతివాది
ప్రధమము - మొదటిది, ముఖ్యము
ప్రదరము - బాణము, చీల్చుట
ప్రధానము - పరమాత్మ, బుద్ధి, ప్రకృతి
ప్రపంచము - భూలోకము, సంసారము, విరివి, రచన, మోసపుచ్చుట
ప్రపాతము - కొండచఱియ, కునికిపాటు
ప్రపితామహుఁడు - ముత్తాత, బ్రహ్మ
ప్రబోధము - మిక్కిలి తెలివి, మేలుకోలు
ప్రబ్బు - వ్యాపించు, నిండించు
ప్రభ - వెలుఁగు, సూర్యుని భార్య, దుర్గ
ప్రభవ - సంవత్సరము, పుట్టుక, పరాక్రమము

ప్రభువు - అధిపుడు, సమర్థుఁడు

ప్రభూతము - అధికము, ఉన్నతము

ప్రమాణము - అంగుళీమానము, మేర, సత్యము, శాస్త్రము

ప్రయాగము - తీర్థవిశేషము, యాగము, గుఱ్ఱము

ప్రయోగము - నడపుట, మంత్ర తంత్రాదులు, ప్రయత్నము

ప్రయోజనము - కార్యము, హేతువు

ప్రలంబము - హారవిశేషము, స్తనము, గిలుకతాఁడు, కొమ్మ

ప్రల్లదము - పారుష్యము, దుష్కృత్యము

ప్రవణుడు - ఆసక్తుఁడు, నమ్రుఁడు

ప్రవరము - పేరు, కులము

ప్రవహము - బహిర్గమనము, వాయువు

ప్రవాహము - వెల్లువ, పరంపర

ప్రవాళము - పగడము, చిగురు, వీణాదండము

ప్రవృత్తి - నడక, ప్రవేశము, బ్రతుకు తెఱువు, వృత్తాంతము

ప్రసంగము - విషయ విస్తరము, ప్రస్తావము

ప్రసన్న - నిర్మలము, సంతుష్టము

ప్రసరము - వ్యాపము, వినయము, వేగము

ప్రసవము - కానుపు, పువ్వు, పండు, పుట్టుక

ప్రసవ్యము - కుడి, ఎడమ, అనుకూలము

ప్రసాదనము - అన్నము, బహుమతి

ప్రసాదము - దైవభక్త పరిశిష్టమైన అన్నము, కావ్యగుణములలో నొకటి, స్వాస్థ్యము

ప్రసారణము - తిరుగుట, వేచుట

ప్రసిద్ధి - అలంకారము, విఖ్యాతి

ప్రసువు - తల్లి, ఆడుగుఱ్ఱము, అరటి

ప్రసూతి - కానుపు, పుట్టుక, బిడ్డ

ప్రసూనము - ఫలము

ప్రస్తరము - ఱాయి, రత్నము

ప్రస్తావము - అవసరము, చెప్పుట

ప్రస్థము - నాలుగు మానికల కొలఁది, కొండనెత్తము

ప్రస్ఫోటనము - చేట, ప్రకాశనము, దెబ్బ

ప్రస్రవణము - సెలయూట, చెమట

ప్రహరము - జాము, దెబ్బ

ప్రహసనము - నాటకభేదము, పెద్ద నవ్వు, పరిహాసము

ప్రళయము - కల్పాంతము, అపాయము, మృత్యువు, మూర్ఛ

## ప్రా

ప్రాంగణము - ముంగిలి, ప్రణవవాద్యము

ప్రాంతము - తీరము, సమీపము

ప్రాంతరము - అడవి, తొఱ్ఱ, పొలిమేర
ప్రాగ్రహారము - ముందు నడచునది, మొదటిది
ప్రాచి - తూర్పుదిశ, పచ్చాకు చెట్టు
ప్రాచీనబర్హి - ఒక రాజు, ఇంద్రుఁడు
ప్రాజ్ఞుఁడు - విద్వాంసుఁడు, సమర్థుఁడు
ప్రాణనాథుఁడు - ప్రియుఁడు, యమధర్మరాజు
ప్రాప్తరూపుఁడు - చక్కనివాఁడు, జ్ఞాని
ప్రామాణికుఁడు - నిజము తప్పనివాఁడు, శాస్త్రమెఱింగినవాఁడు
ప్రాము - తాచు, పుణము
ప్రాసాదము - దేవాలయము, నగరు

# ప్రి

ప్రిదులు - తొలఁగు, ఊడు
ప్రియంగువు - కొఱ్ఱలు, నల్లావాలు
ప్రియము - కుంకుమము, ప్రేంకణము స్నేహము, సంతోషము

# ప్రీ

ప్రీతి - సంతోషము, స్నేహము

# ప్రే

ప్రేంఖ - డోల, నృత్యము, అశ్వగతి
ప్రేక్ష - బుద్ధి, ఈక్షణము
ప్రేమ - హర్షము, స్నేహము

# ప్రై

ప్రైషము - ప్రేషణము, క్లేశము, ఉన్మాదము

# ప్రో

ప్రోద్దుగొడుగు - యముఁడు, శని, కర్ణుఁడు

# ప్రో

ప్రోక్షితము - చిలుకరింపఁబడినది, వధింపఁబడినది
ప్రోథము - గర్భ పిండము, పిఱుదు, జీర్ణ వస్త్రము
ప్రోహము - ఏనుఁగుకాలు, కూర్పు, నేర్పరితనము

# ప్రౌ

ప్రౌఢుఁడు - ప్రగల్భుఁడు, నిపుణుఁడు

## ప్ల

ప్లక్షము - జువ్వి, రావి, ఒక దీవి
ప్లవ - నీరుకాకి, కోతి, కప్ప, గొఱ్ఱె
ప్లవంగము - కోతి, కప్ప

## ఫ

ఫలము - పండు, పంట, లాభము, జాజికాయ, బాణము, ములికి, ప్రత్తికాయ
ఫలింమ - పండు, నేలవేము

## ఫా

ఫాల్గునము - ఒకమాసము, ఏఱుమద్ది, (డు) అర్జునుడు

## బ

బంక - జిగురు, వ్యాధివిశేషము
బంటు - సేవకుడు
బందె - పశువుల చెఱ, నిర్బంధము
బంధకము - చెఱ, మాఱుపు
బంధనము - కట్టు, కుదువ, కొలు, చెఱ, తొడిమ
బంధకి - జారిణి, ఆటకత్తె
బంధము - కట్టు, కుదువ, కొలు, చెఱు
బంధువు - పక్షి, కలహంస; ఆడగుఱి; మంకెన
బంధువు - చుట్టము, జ్ఞాతి, మిత్రుడు
బప్పెస - పూత, పిష్టము
బట్టికాడు - చిఱక, గోరువంక
బడబ - ఆడుగుఱ్ఱము, బ్రాహ్మణ స్త్రీ
బడవా - తార్పకత్తె, తార్పుకాడు
బడి - పాఠశాల, వెంబడి
బడుగు - కృశము, అశక్తుడు
బదర - పగులు, ప్రత్తివెట్టు, రేగుపండు
బభ్రువు - కపిలగోవు, విష్ణువు, శివుడు; అగ్ని
బయలు - బహిఃప్రదేశము, ఆకాశము
బర్కరము - ప్రాయపు పశువు, మేక; పరిహాసము
బర్హపుష్పము - గండివనము, పచ్చాకు; మాచిపత్రి
బర్హము - నెమలిపురి, ఆకు, మాచిపత్రి
బర్హి - నెమలి, దర్భ
బలము - అధికము, గంధము, రసము; సత్తువ, బలుపు, సైన్యము
బలాహకము - మేఘము, సర్పవిశేషము
బలి - కప్పము, కానుక, చామర దండము

బలిభుక్కు - కాకి, ఊరఁబిచ్చుక

బలుపు - పుష్టి, బలము

బవిసి - భాగ్యము; గౌరవము

బహులోపము - ఊసరవెల్లి, [డు]శివుఁడు, మన్మథుఁడు

బహుళ - ఆవు, పెద్దయేలకి, నీలిచెట్టు

## బా

బాగు - అందము, క్షేమము, మాదిరి

బానసము - వంటసాల, వంట

బాము - జన్మము; దుఃఖము

బారి - ఏనుఁగు కాలుగట్టెడు గొలుసు, హింస, నిర్బంధము

బాలిక - కన్యక, పిఁకె, కర్ణభూషణము

బాలిశుఁడు - మూర్ఖుఁడు; బాలుఁడు

బాష్పము - కన్నీరు, ఆవిరి

బాస - సంస్కృతాదిభాష, ప్రమాణము, వ్రతము, సంకేతము

బాసవాలు - దేవత, ఋషి

బాహ్లికము - ఇంగువ, కుంకుమ పువ్వు, ఒకానొక దేశము

## బి

బిందువు - నీటిబొట్టు, చుక్క, సున్న, శుక్రము

బింబము - ప్రతిబింబము, ప్రతిమ, సమానము, దొండపండు

బికారి - నిరుపయోగుఁడు, భిక్షగాఁడు

బిడారము - వాసస్థానము, విడిది

బిత్తరము - శృంగారచేష్ట, చంచలము; నరకము

బిత్తరించు - సరసమాడు, చలించు, ఊఁగాడు

బిమ్మిటి - వివశత, సంకోచము, వివశము

బిరుదు - శౌర్యచిహ్నము, ప్రతిజ్ఞ, సామర్థ్యచిహ్నము

బిల్ల - గుండ్రపు తలగడ, ఖండము

## బీ

బీజము - విత్తనము, ముష్కరము; రేతస్సు, హేతువు, బలము

## బు

బుక్కాము - పువ్వొడి, బుక్క

బుగ్గ - చెక్కిలి, నీటిబుగ్గ

బుడుత - పొట్టి; బాలుఁడు

బుడ్డ - నీటిబుగ్గ, అండవృద్ధి

బుద్ధుఁడు - విద్వాంసుఁడు, బుద్ధదేవుఁడు

బుధ్నము - వేరు, ఊఁడ,[డు] శంకరుఁడు

బుఱ్ఱ - ఎండిన కాయ, పాములవాని నాగస్వరము, తల పుఱ్ఱె

బుసము - బొల్లి, పిడక

## బూ

బూతి - తిండి, విభూతి

బూరటిల్లు - నిండు, ఉబ్బు

## బృ

బృందారకుఁడు - వేల్పు, మనోజ్ఞుఁడు, శ్రేష్ఠుఁడు

బృహతి - వాఁకుఁడు, ములక, ఒక ఛందస్సు, గొప్పది, విశ్వావసుని వీణ

## బె

బెగ్గిల్లు - భయపడు, చలించు

బెట్టు - గౌరవము. ఉద్ధతి, అత్యంతము

బెడగు - అందము, ఇంపు, మనోజ్ఞము, అధికము, భయంకరము కఠినము

బెరయు - వ్యాపించు, కలుఁగు, పొందు

బెరుకు - భేదము, ప్రయోజనము

## బే

బేడ - రూపాయలో ఎనిమిదవవంతు. కాయధాన్యముల పప్పు

బేరజము - కుత్సితపు నడక, పరుష వచనము

## బై

బైసి - భాగ్యము, గౌరవము

## బొ

బొగడ - బుడగ, చూచుకము, మంచపు గోడు, శిఖరము

బొట్టు - తిలకము, అనుస్వారము, బిందువు, తాళిలో గ్రుచ్చు ఒక సొమ్ము

బొట్టె - కూఁతురు, కొడుకు

బొడ్డు - నాభి, బావిచుట్టు గోడ

బొబ్బ - పొక్కు, సింహనాదము, పెద్ద ధ్వని

బొమ్మ - కనుబొమ, భ్రూవు, ప్రతిమ

బొఱియ - బిలము, గొయ్యి

## బో

బోడ - సన్యాసి, మ్రోడు

బోడిక - సేవకుఁడు, బాలకుఁడు

బోనము - భోజనము, అన్నము

## బ్ర

బ్రధ్నుఁడు - శంకరుఁడు, సూర్యుఁడు

బ్రహ్మ - సృష్టికర్త, విష్ణువు, బ్రాహ్మణుఁడు, పరమాత్మ

## బ్రా

బ్రాంతి - అధికము, దుర్లభము, ప్రియము

బ్రాహ్మణము - వేదభాగము; బ్రాహ్మణ సముదాయము

బ్రాహ్మణి - విప్రుని భార్య, నలికండ్లపాము

బ్రాహ్మి - మాతృక, పొన్నగంటికూర, సరస్వతి, బావన బీమ,

## భ

భంగము - అల, చేటు, చెఱుపు, రోగము, అవమానము

భంగురము - నశించునది, వంకరైనది

భండనము - యుద్ధము, కవచము

భంబు - నక్షత్రము, ఆకాశము, కిరణము

భక్తి - భయముతోఁగూడిన స్నేహము లేక ప్రేమ, సేవ, భాగము

భగము - శ్రీ, వీర్యము, కోరిక, జ్ఞానము, ఐశ్వర్యము, వైరాగ్యము, కీర్తి, ధర్మము, మోక్షము, యోని, ప్రయత్నము

భగవంతుఁడు - విష్ణువు, శివుఁడు, బుద్ధదేవుఁడు

భజనము - సేవించుట, భాగించుట

భట్టారకుఁడు - రాజు, ముని, సూర్యుఁడు

భద్ర - తిధి విశేషము, కృష్ణుని భార్యలలో నొక్కతె, గంగానది, బంగారు, శుభము, నాగముస్తె

భరటుఁడు - కూలివాఁడు, కుమ్మరవాఁడు

భరణము - భరించుట, కూలి, జీతము, ఇరువదితూముల కొలత

భరణ్యము - కూలి జీతము

భరద్వాజము - ఎట్రింత, ఒక ముని, ద్రోణుఁడు

భరము - బరువు, బారువ, అధికము

భర్త - పెనిమిటి, ప్రోచువాఁడు

భల్లుకము - ఎలుఁగుబంటి, కోఁతి

భవము - పుట్టుక, సంసారము, ప్రాప్తి, శుభము, సత్త

భవితవ్యము - భాగ్యము, శుభము

భవిష్యము - కాఁగలది, భాగ్యము, శుభము

భవ్య-పార్వతి, [ము] శుభము, ఎముక, యోగ్యమైనది

## భా

భాండము - మట్టిపాత్ర, తొడవు, వస్తువు, మొదలి సొమ్ము

భాగధేయము - భాగ్యము, కప్పము

భాగము - పాలు, భాగము

భాగ్యము - అదృష్టము సుకృతము, భాగింపఁదగినది

భాజనము - యోగ్యము, పాత్రము

భాతి - కాంతి, విధము

భారతి - సరస్వతి, వాక్కు, ఒక కావ్య వృత్తి

భార్గవి-లక్ష్మి, పార్వతి, గఱిక

భార్గవుఁడు-పరశురాముఁడు, శుక్రుఁడు

భావ - ఒక సంవత్సరము, [ము] మనో వికారము; అభిప్రాయము, ఆత్మ, పుట్టుక, విభూతి, స్వభావము

భాష - సంస్కృతాదిభాష, ప్రతిజ్ఞ, ప్రమాణము

భాస్కరుఁడు - అగ్ని, సూర్యుఁడు

## భి

భిక్ష - బిచ్చము, కడికోలది అన్నము, కూలి; సేవ

భిత్తి - భేదనము; గోడ

భిన్నము - అర్ధదోషములలో నొకటి, పగిలినది, చీలినది, వేఱుపడినది, కూడినది

## భీ

భీముఁడు - ఒకరాజు, శంకరుఁడు, ధర్మరాజు తమ్ముఁడు

భీష్ముఁడు - శాంతనవుఁడు, శంకరుఁడు

## భు

భుక్తి - అనుభవము, భోజనము

భుగ్నము - వంగినది, వంకరైనది

భువనము - ఆకాశము, నీరు, జగత్తు

## భూ

భూకము - బొక్క, కాలము

భూజాని - రాజు, పశువు

భూతము - పిశాచాది ప్రాణి, పొందఁబడినది, వెలసినది

భూతి - ఐశ్వర్యము, సంపద, భస్మము, సత్త, పుట్టుక

భూతికము - ఓమము, కర్పూరము, కామంచి కసవు, వీఁపురు కసవు

భూమిస్పృశుఁడు - కోమటి, మానవుఁడు

## భృ

భృగువు - కొండచఱియ, ఒకముని, శుక్రుఁడు, శివుఁడు

భృతి - మోయుట, కూలి, వెల

## భే

భేకము - మబ్బు, కప్ప

భేదిల్లు - పేలగు, చీలు

భేలుఁడు - మూర్ఖుఁడు, పిఱికి, కదలువాఁడు

## భై

భైరవి - పార్వతి, ఒకరాగము

## భో

భోగము - భోజనము, సుఖము, పాము పడగ, డబ్బు, పరిపాలన, వెలయాండ్ర కిచ్చు ధనము

భోగి - పాము, రాజు, మంగలి, సౌఖ్య మనుభవించు వాఁడు

భోగిని - ఆఁడుబాము, బోగముస్త్రీ

## భౌ

భౌముఁడు - అంగారకుఁడు, నరకాసురుఁడు

## భ్ర

భ్రంశము - చలించుట, జారుట

భ్రమము - తిరుగుడు, భ్రాంతి, బండికంటి తిరుగుడు

భ్రమరకము - తుమ్మెద, బొంగరము, ముంగురులు

## భ్రా

భ్రాంతి - మిధ్యామతి, తిరుగుడు, ఒక అలంకారము

భ్రాతృవ్యుఁడు - తోడఁబుట్టినవాని, కుమారుఁడు, విరోధి

## భ్రూ

భ్రూణ - బిడ్డ, గర్భము

## మ

మంగళ - పార్వతి, [ము] శుభము, క్షేమము

మంగళ్య - గోరోజనము, జమ్మి, తెల్లవస

మంచము - మంచె, మంచము

మంజులము - పొదరిల్లు, పాఁచి

మంట - కోపము, జ్వాల

మంటమారి - అగ్ని, కోపశీలుఁడు

మండ - శాఖ, చీలమండ

మండము - మీగడ, ఆముదపుచెట్టు, సొమ్ము

మండలము - దేశము, కుష్ఠము,పరివేషము, సముదాయము, కుక్క
మండలి - పాము, మండలేశ్వరుఁడు, సూర్యుఁడు, పిల్లి, శునకము
మండు - జ్వలించు, చుఱుకుమని నొచ్చు
మండూకపర్ణి - బెండ, పొన్నగంటి, మంజిష్ఠ
మంతనము - ఆలోచన, ఏకాంతము,రహస్యము
మంతువు - తెలివి, అపరాధము, మానవుఁడు, రాజు
మంత్రము - జాలవిద్య, గాయత్రి లోనగునది, రహస్యము, అధర్వవేదము
మంత్రి - బుద్ధి సహాయుఁడు, సహాయుఁడు
మంథము - కవ్వము, కంటినొప్పి, గంజి, చెంపుట
మంథరము - కవ్వము, చొఱవలేనిది, మెల్లగాఁబోవునది, వంకరైనది
మందము - దట్టము, స్థూలము, మెల్లనిది, చొరవలేనిది
మందరము - కవ్వపుఁగొండ, మందారము (కల్పవృక్షము), అలసనము
మందల - మేర; మనుదల, సమీపము
మందలించు - మనవిచేయు, చెప్పు, తలచు, హెచ్చరించు
మందాకిని - గంగ; ఆకాశగంగ; ఒకానొక వృత్తము
మంది - జనుల గుంపు, పరిజనము, కాలుబలము
మందిరము - ఇల్లు, పట్టణము,సముద్రము
మందుఁడు - శని, చొరవలేనివాఁడు; అల్పుఁడు
మందుర - పడక, లాయము
మందెమేలము - ఉపేక్ష,వెనవు,స్నేహము
మకరము - కుబేరుని నిధులలో నొకటి; పెద్దచేప, ఒక రాశి, మొసలి

## మ:-

ముకురము - అద్దము, పొగడ, మల్లెపువ్వు
ముక్కళించు - తిరుగుకొను, సరిపోలు సరిపోల్చు
మకుక్క - చచ్చు, నవయు, గీఱు
మగటిమి - మగతనము, పౌరుషము, శౌర్యము
మగడు - శూరుఁడు,భర్త,రాజు,పురుషుఁడు
మగపాడి - శూరత్వము, ఉపరతి
మగవాఁడు - శూరుఁడు, పురుషుఁడు.
మఘ - ఒకనక్షత్రము, మొక్కజొన్నలు

మచ్చిక - మోహము, ఆసక్తి.
మచ్చరికము - ద్వేషము, చలనము
మట్టము - కొలఁది, తక్కువ, సమము
మట్టు - త్రొక్కుఁడు, మితి, కుదుప
మడగు - వంగు, మరలు [మగు
మడవు - విముఖుఁడగు, నిరుపయోగ
మడి - మడుగు వస్త్రము, పరిపొలము, పరిశుభ్రము
మడుపు - మడత, ఆకు చుట్టలు, మడి వస్త్రము
మణి - ఛాయ, ముత్యములోనగునది. మణికట్టు, శ్రేష్ఠవాచకము, గొఱ్ఱెమెడ చివల [వాఁడు
మతంగుఁడు - ఒక ఋషి, మాదిగ
మతము - సమ్మతి, శాస్త్రము, అభిప్రాయము, పూజింపఁబడినది
మతి - జ్ఞానము, ఇచ్ఛ, తలంపు
మత్తవారణము - మదించిన ఏనుఁగు, ఒఱగు దిండు
మత్సరము - ఈర్ష్య, క్రోధము
మత్స్యాక్షి - స్త్రీ, పొన్నగంటికూర - సోమిదె కూర
మథితము - నీళ్లు కలియని మజ్జిగ, ఒరయఁబడినది
మదనము - ఆమని, మంగ, మైనము
మదము - క్రొవ్వు, ఏనుఁగు క్రొవ్వు, రేతస్సు, గర్వము, కస్తూరి, ముదము
మదోత్కటము - మదపుటేనుఁగు, కపోతము [నీలిచెట్టు
మధుక - తిప్పతీఁగ, అతిమధురము,
మధుకరము - భిక్షాన్నము, తుమ్మెద, జీవకము [నెమిలి
మధుపర్ణి - గుమ్మఁడు, తిప్ప తీఁగ,
మధుర - ఒక నగరము, తియ్యన, ఇంపైనది
మధురస - చాగ, ద్రాక్ష
మధువు - పాలకూర, నీరు, పాలు, కల్లు లేనె, చైత్రమాసము, వసంతఋతువు
మధూళి - కల్లు, పూదేనె
మధ్యమ - దుద్దు, వాగ్భేదము, నడిమి వ్రేలు, ఒక స్వరము
మనికి - జీవనము, నివాసస్థానము
మను - బ్రతుకు, నేల, మట్టి
మనువు - జీవనము, మగడు, వైవస్వతాది మనువు
మనోహరము - ఇంపైనది, బంగారము
మన్ను - నేల, మట్టి, ఋష్యమృగము
మన్యువు - క్రోధము, శోకము, దైన్యము
మబ్బు - చీఁకటి, మేఘము, అజ్ఞానము
మయము - ఒంటె, కంచరగాడిద
మయూఖము - కిరణము, కాంతి, జ్వాల
మయూరకము - నెమిలి, ఓమము, ఉత్తరేణు

మరుత్తు - వాయువు, వేలుపు
మర్కటము - కోఁతి, సాలెపురుగు
మర్దనము - పిసుకుట, నూఱుట, సంవాహనము
మర్యాద - తీరము, పొలిమేర, కట్టుబాటు, సమ్మానము
మఱఁది - చెల్లెలి మగడు, మేనమామ కొడుకు, మగని తమ్ముఁడు
మఱక - కఱ, మేకపడ్డ
మఱపు - అజ్ఞానము, విస్మృతి, ప్రమాదము
మఱుఁగు - చాటగు, సంతాపించు, చాటు
మలఁక - చిక్కు, చుట్టు, మెలిక
మలఁగు - తిరుగు, మరలు, సంకరగు
మలయము - ఒకకొండ, ఆరామము, ఒక దేశము
మలయు - తిరుగు, పెనగు, తప్పించు, ఉద్రేకించు
మలినము - మాసినది, నల్లనిది, దూషితమైనది
మలిమ్లుచము - దోమ, మలమానము
మలుగు - ఆఱు, నశించు
మల్లడి - పెనకువ, పరితాపము
మశకము - దోమ, చర్మరోగవిశేషము
మసలు - తడయు, విహరించు, వెనుకకు తిరుగు
మసి - నలుపు, బొగ్గు, మైల

మహస్సు - తేజము, ఉత్సవము
మహాధనము - బంగారు, బిల్లమస్తి, కృషి
మహాపథము - ప్రాకాంతము, రాజమార్గము
మహామాత్రుఁడు - కార్యసహాయుఁడు, మావటీడు, సంపన్నుఁడు.
మహారజనము - కుసుమపువ్వు, బంగారము [నౌసలు
మహాశంఖము - సంఖ్యావిశేషము,
మహి - భూమి, ఆవు
మహిమ - గొప్పతనము, ఐశ్వర్యము
మహిషి - పట్టపుదేవి, ఎనుము, ఒకానొక చెట్టు
మహీసుత - సీత, (డు) నరకాసురుఁడు, అంగారకుఁడు
మహేశ్వరుఁడు - శంకరుఁడు, గొప్పరాజు
మహోదయము - ఆధిపత్యము, అభివృద్ధి, మోక్షము
మహౌషధము - శొంటి, అతివస, వెల్లుల్లి

## మా

మాట - పదము, వచనము, నింద, వృత్తాంతము
మాటు - మఱుఁగు, తడవ,
మాత - తల్లి, లక్ష్మి, పార్వతి, నేల, ఆవు

మాతంగి - పార్వతి, వశిష్ఠుని భార్య

మాతుల - మేనమామ భార్య. (ము) ఉమ్మెత్త

మాతృక - తల్లి, దాది, పార్వతి, వర్ణమాల

మాత్ర - చిన్న మందుంట, వృత్తాంతము, కొంచెము, కొలఁది, పరివారము, ధనము

మాధవము - వైశాఖమాసము, వసంత ఋతువు

మాధవి - పువ్వుల గురివెంద, కల్లు, తేనె, చక్కెర, లక్ష్మి, కుంటెనకత్తె

మాధురి - కల్లు, తీపి

మాధ్వి - మద్యము, మకరందము

మానము - త్రాసు, కొలఁది, మానిక

మానసము - మనస్సు, ఒక సరస్సు

మాను - విడుచు, మనోజ్ఞత

మాపు - మాయఁజేయు, సాయంకాలము, మైల

మాయ - అవిద్య, ఒక పట్టణము, బుద్ధి, అసురుఁడు

మారణము - చంపుట, ఒక విద్య

మారి - మారణము, వర్షము, మసూరికా జాడ్యము, పార్వతి, జనక్షయము

మారుతి - స్వాతీనక్షత్రము, హనుమంతుఁడు, భీముఁడు

మార్గము - త్రోవ, మార్గశీర్షమాసము, అన్వేషణము, కస్తూరి

మాఱు - సహించు, ఎదురు, తడవ ప్రతి, అన్యము

మాలకము - దిబ్బ. వేము

మాలకరి - వనపాలకుఁడు, దండలుకట్టువాఁడు

మాల్యము - పుష్పమాలిక, పుష్పము

మాషము - మినుములు, ఐదు గురిగింజల ఎత్తు, మూఢత్వము

మాసము - నెల, రెండున్నర చిన్నము తూనిక

## మి

మించు - అతిశయించు, మెఱుపు

మిటారము - నిక్కు, అతిశయము

మిడుకు - బ్రతుకు, కదలు, ఎండు, సంచరించు

మిత్రుఁడు - స్నేహితుఁడు, సూర్యుఁడు

మిథునము - ఆలు మగలు, ఒకరాశి

మినుకు - వేదము, బంగారు చిన్న నాణెము, మినుకు మినుకుమను, వాక్కు

## మీ

మీఁదు - పరము, ఉపరిభాగము, జరుగఁబోవు కాలము

మీటు - ఎగఁజిమ్ము, పొడుచు, కుట్టు, పెంపు

మీనము - ఒకరాశి, చేఁప

మీలనము - కనుమూయుట, ఒక అలంకారము

## ము

ముండ - విధవ, వేశ్య

ముండనము - క్షౌరము, రక్షణము

ముండమోయు - వైధవ్యము నొందు, నిరుపయోగమగు

ముండి - మంగలవాఁడు, బోడతరము, ముండుఁడు

ముందు - ఎదురు, పూర్వకాలము

ముకుందము - ఎఱ్ఱతామర, ఒక నిధి, పాదరసము, మణివిశేషము

ముకురము-అద్దము, పొగడ, మల్లెపూవు

ముక్త - ముత్తెము, వ్యభిచారిణి, ముక్తి నొందినది, విడువఁబడినది

ముక్తి - విడుపు, మోక్షము

ముఖము - మొగము, మాట, నోరు, నాటకసంధి, ఉపాయము, ప్రయత్నము

ముగ్ధ - చక్కనిది, తెలివిలేనిది, క్రొత్తది

ముచ్చిరు - శోకించు, దుఃఖించు

ముచ్చట - సల్లాపము, వృత్తాంతము, కోరిక, ప్రేమము

ముట్టించు - తాకించు, రగుల్చు

ముట్టు - తాఁకు, ముట్టడించు, వెలిగు మాపు, కొలముట్టు

ముడి - గ్రంథి, వెండ్రుకల ముడి, కలహము, సంధి, వికసింపనిది, రాపిడి నొందనిది

ముడియ - మూట, పందెము, పెనఁగొను, కలుగు

ముత్తెపుఁజిప్ప - శుక్తి, భక్ష్యవిశేషము

ముదల - ఆజ్ఞ, లక్ష్యము

ముదురు - వర్ధిల్లు, పరిణమించు, వృద్ధము

ముద్ద - కబలము, పిండము

ముద్దు - ముద్ర, చుంబనము, ఆదరము, మనోజ్ఞత

మునీంద్రుఁడు - బుద్ధదేవుఁడు, ఋషిశ్రేష్ఠుఁడు

మునుఁగు - మునకవేయు, అడఁగు, నశించు, మఱుఁగుపడు

మునుము - వరుస, ఎదురు, సేనాముఖము, తలఅచుఁదనము

ముప్పు - వార్ధకము, ఐపత్తు
మురారి - శ్రీకృష్ణుఁడు, ఒకానొక సంస్కృతకవి
మురియు - గర్వించు, తిరుగు, ఓఁగు, తెగు
మురువు - సౌందర్యము, గర్వము
ముర్మురము - ఊక, సూర్యుని గుఱ్ఱము
ముష్కము - వృషణము, మొత్తము
ముసలి - వృద్ధుఁ, ఉడుము, బల్లి, బలరాముఁడు

## మూ

మూఁక - సేన, సమూహము
మూఁగ - మూఁగవాఁడు, దోమ
మూఁడు - కలుగు, రెండునొకటి, ముగియు
మూఢుఁడు - తెలివిలేనివాఁడు, బాలుఁడు
మూరిఁబోవు - అతిశయించు, వర్ధిల్లు, నశించు, సఫలమగు
మూర్తి - శరీరము, కఠినత్వము, ప్రతిమ
మూర్ధాభిషిక్తుఁడు - రాజు, మంత్రి
మూల - ఒక నక్షత్రము, గొంది, కోణము, కొప్పు
మూలము - వేరు, ఊఁడ, మొదలు, దాపు
మూల్యము - వెల, జీతము
మూషికము - ఎలుక, పందికొక్కు

## మృ

మృగదంశకము - కుక్క, ఎలుగుబంటు
మృగము - పశువు, జింక
మృగయుఁడు - బోయ, బ్రహ్మ
మృణాళము - వట్టివేరు, తామరతూఁడు
మృదంగము - మద్దెల, సద్దు, వెదురు
మృదువు - మెత్తనిది, మందము

## మెం

మెండు - ఆధిక్యము, అతిశయము
మెతుక - మెత్తనిది, మందము
మెత్త - గుఱ్ఱపు పల్లము, పఱుపు
మెత్తఁబాటు - మృదుత్వము, ఆలస్యము
మెదలు - సంచరించు, కదలు
మెఱమెఱ - మనోవ్యథ, సంశయము, భేదము
మెఱయు - ప్రకాశించు, బయలుపడు
మెఱవడి - ఉద్రేకము, ఆధిక్యము, నేర్పు, ధైర్యము, గౌరవము
మెఱుఁగురిక్క - పగడము, కాంతిఁగల నక్షత్రము
మెలకువ - మేలుకొను, వర్తనము, జీవనము, సంచారము
మెలఁగు - వర్తించు, జరుగు

మెలపు - జాగరూకత, భ్రమణము
మెల్లన - తిన్నన, అల్లన

## మే

మే - శరీరము, మాదిరి, పార్శ్వము
మేకొను - సమ్మతించు, పూను, పొందు
మేఖల - కొండనడుము, మొలనూలు
మేఘపుష్పము - నీరు, శ్రీకృష్ణుని గుఱ్ఱములలో నొకటి
మేఘము - మబ్బు, ఏనుఁగు పాదమందలి మదము, తుంగముస్తె
మేచకము - చీఁకటి, నెమిలిపురి కన్ను, నల్లనిది
మేదము - యుద్ధము, కూడిక
మేను - శరీరము, జన్మము, పార్శ్వము
మేర - ఎల్ల, మర్యాద, క్రమము, ఏర్పాటు
మేలిమి - గౌరవము, ఆధిక్యము
మేలు - శుభము, ఉపకారము, పుణ్యము, విశేషము, మదము, ప్రశంసనార్థకము
మేలుబంతి - ఒరవడి వ్రాయుటకు పై అక్షరముల పంక్తి, శ్రేష్ఠము
మేవడి - నమ్రత, ఉపాయము
మేషము - పొట్టేలు, ఒకరాశి
మేహనము - మేఢ్రము, మూత్రము
మేళము - వాద్యముల జత, కూడిక, వేశ్యల సమూహము

## మై

మై - శరీరము, విధము, తడవ, పార్శ్వము
మైదు - మాయ, మత్తు, మైకము
మైవడి - అంగీకారము, అనుకూల్యము, విధము

## మొ

మొండి - చేతులు కాళ్లు లేని వాఁడు, మూర్ఖుఁడు, పదనులేని, వట్టిది
మొక్కవోవు - మొనపోయినదగు, భంగపడు
మొక్కలము - మూర్ఖత్వము, శౌర్యము, ధైర్యము, ఉత్సాహము
మొక్కు - దండము పెట్టు, ముడుఁగు
మొగదల - ఎదుట, ముందటి భాగము
మొగి - పూనిక, మొత్తము, విధము
మొగియు - పూను, కవియు
మొటిక - మొటిక, తునుక
మొత్తము - సమూహము, తఱచు, అంతకము
మొదలు - పూర్వము, మూలము, ప్రభృతి
మొన - అగ్రము, వ్యూహము, సైన్యము, ముందు
మొనకాఁడు - శూరుఁడు, ముఖ్యుఁడు
మొనయు - కలుగు, పూను

మొప్పె - కలుకు, మూర్ఖుడు
మొలుకు - పరుషము, మూర్ఖము
మొల - చీల, కటిప్రదేశము
మొలకట్టు - కట్టుకోక, మొలనూలు

## మో

మోక్షము - విడుపు, కైవల్యము
మోడు - మొక్క, స్థాణువు
మోపు - గడ్డిలోనగువానికట్ట, ఆరోపించు, భారము, వింటినారి
మోయిను - రీతి, బత్తెము
మోరట - చాల, చెఱకువేలు, మజ్జిగ
మోసము - దొంగతనము, ప్రమాదము
మోహన - ఒక రాగము, మూర్ఛ, ఆఱు విద్యలలో నొకటి

## మౌ

మౌర్వి - అల్లెత్రాడు, వస
మౌళి - నేల, సిగ, కొప్పు, కిరీటము

## మ్రం

మ్రందు - చనిపోవు, చదియు, నొచ్చు, సోలు

## మ్రు

మ్రుచ్చు - అరటిపువ్వులోనుండు వస్తువు; దొంగ

## మ్రే

మ్రేగు - పూయు, ఆవరించు

## మ్లి

మ్లిష్టము - వాడినది, అస్పష్టమైనది

## య

యంత్రణము - బంధనము, రక్షణము
యక్షిణి - మంత్రవిద్య, యక్షుని భార్య, కుబేరుని భార్య
యజమానుడు - యజ్ఞకర్త, గేస్తు
యతి - పద్య విరామస్థానము, నియమము, సన్న్యాసి
యమి - ముని, హంస
యముడు - కాలుడు, శని
యమున - ఒకనది, పార్వతి
యష్టి - హారముపేట; అతిమధురము; చేతికఱ్ఱ

## యా

యాతువు - రాక్షసుఁడు, యముఁడు, వాయువు
యాదఃపతి - సముద్రుఁడు, వరుణుఁడు
యాదోనాథుఁడు - సముద్రుఁడు, వరుణుఁడు
యాపనము - కాలక్షేపము, వర్తనము
యామము - నియమము, సంయమము
యామిని - రాత్రి, పసుపు
యామ్య - దక్షిణ దిక్కు, రాత్రి

## యు

యుక్తము - కూడుకొన్నది, తగినది
యుగము - కృతాదియుగము, రెండు, బార
యుతకము - అరణము, జత, సంశయము
యువరాజు - చిన్నరాజు, కర్ణుఁడు

## యో

యోగము - ధాన్యము, ఉపాయము,కూడిక, ప్రయత్నము, ద్రవ్యము, ఔషధము
యోగ్యము - తగినది, నేర్పుగలది, శక్తి గలఁది
యోని - ఆఁడుగుఱి, కారణము, గని

## ర

రంగము - యుద్ధభూమి; నాట్యస్థానము; రంగు
రంగాజీవుఁడు - నటకుఁడు, చిత్రలేఖకుఁడు
రంజనము - ఇంగిలీకము, ఎఱ్ఱగంధము; రంజించునది
రంభ - అప్సరస్త్రీ, అరటిచెట్టు
రకము - శ్రేష్ఠము, సుందరము
రక్కొఁము - వర్ధిల్లు, తేఱుకొను
రక్తము - నెత్తురు, కుంకుమ, రాగి, అను రాగము కలది, ఎఱ్ఱనిది
రక్తాంగము - పగడము, కుంకుమము
రచ్చ - రాజమార్గము, మండపము, గోష్ఠి: సభ
రజతము - వెండి, హారము
రజని - రాత్రి, పసుపు, నీలిచెట్టు
రజస్సు - ఒకగుణము, దుమ్ము, ముట్టు నెత్తురు, పుప్పొడి
రతము - సురతము,ఆఁడుగుఱి,ఆసక్తము
రతి - సురతము, మన్మధుని భార్య, ఆఁడు గుఱి; ప్రేమ, రత్నముల తూనిక యందొక ఎత్తు
రత్నగర్భుఁడు - కుబేరుఁడు, సముద్రుఁడు
రథాంగము - రధ చక్రము, చక్రవాకము
రభసము - వేగము; సంతోషము

రమణుఁడు - భర్త; మన్మథుఁడు, మనోజ్ఞుఁడు

రవ - వజ్రము, అణువు, ఖండము

రశ్మి - వెలుఁగు, పగ్గము, ఱెప్ప

రస - నాలుక, భూమి, రసాతలము, చిఱుబొద్ది

రసము - శృంగారాదిరసము పాదరసము, అనురాగము, వీర్యము, ద్రవము, విషము

రసాల - మామిడి, చక్కెర, నాలుక, చెఱకు

రసిక - చెఱకుపాలు, రసికురాలు

రహి - ఆనందము, ఆసక్తి, విధము, తెలివి, శక్తి

రహించు - ఒప్పు, వర్ధిల్లు

## రా

రాక - ఆగమనము, పున్నమ, తీఁట, ఒక యేఱు

రాగము - అనురాగము, మాత్సర్యము, రంగు

రాగి - తమిదపైరు, తామ్రము, అనురాగము

రాచు - ఒరసికొను, ఒరయు; చెఱచు

రాజరాజు - చక్రవర్తి, కుబేరుఁడు, దుర్యోధనుఁడు, చంద్రుఁడు

రాజిక - నల్లావాలు, వరిమడి, పంక్తి

రాజ్ఞి - రాజుభార్య, సూర్యునిభార్య

రాజు - ఱేడు, పుడమిఱేడు; యక్షుఁడు; చంద్రుఁడు, ఇంద్రుఁడు

రాణి - రాజు భార్య, భార్య

రాధ - గోపిక, కర్ణుని పెంపుడు తల్లి; విశాఖానక్షత్రము; మెఱపు, (ము) వైశాఖమాసము

రాపడు - స్తంభించు, దృఢపడు

రామ - స్త్రీ, ఒప్పిదమైనది

రాముఁడు - పరశురాముఁడు, రఘురాముఁడు, బలరాముఁడు

రాయిడి - రాపిడి, ఉపద్రవము

రాయు - ఒరయు, కలహించు

రారాజు - చక్రవర్తి, కుబేరుఁడు; దుర్యోధనుఁడు

రాసము - గోపకుల క్రీడావిశేషము, రసము; పరిహాసము, సల్లాపము, ధ్వని

## రి

రింఖ - అశ్వఖురము; నృత్యము; దురదగొండి

రిష్టము - క్షేమము, అశుభము; అభావము

## రీ

రీతి - తెఱఁగు, మేర, ఇత్తడి; వైదర్భ్యాది

## రు

రుక్కు - సూర్యకిరణము, కాంతి, కోరిక

రుక్మము - బంగారు, లోహము

రుచకము - సౌవర్చలవణము; అశ్వాభరణ విశేషము, మాల్యము, మంగళ ద్రవ్యము; దంతము, లవంగపట్ట, ఆముదపుచెట్టు

రుచి - కాంతి, చవి, కోరిక, సూర్యకిరణము

రుటము - రూఢము, దృఢము

రుమ - ఉప్పళము, సుగ్రీవుని భార్య

## రూ

రూక్షము - కఱకైనది, ప్రేమలేనిది

రూపకము - ఒక అలంకారము, నాటకము, ఆకారము, తాళభేదము

రూపము - ఆకారము, చక్కదనము, అగ్నిగుణము, నాటకము, స్వభావము

## రె

రెక్కొను - వర్ధిల్లు, తేఱుకొను

రెట్ట - పక్షిమలము, భుజము

## రే

రేఁగు - ఎగయు, విజృంభించు

రేక - గీర, జాబు; పంక్తి

రేణుక - గంధద్రవ్యవిశేషము; జమదగ్ని పెండ్లాము

రేతస్సు - ఇంద్రియము, పాదరసము

రేవతి - ఒక నక్షత్రము; బలరామునిభార్య

## రొ

రొప్పు - కూయు, కోపించు, తఱుము

## రో

రోకము - ఓడ, బెజ్జము

రోదసి - మన్ను, మిన్ను

రోపము - బాణము, రోపణము

రోమశము - గొఱ్ఱె, పంది

రోహము - ఎక్కుట, మొలక

రోహిణి - ఒక నక్షత్రము అంగిటిముల్లు, ఆవు, బలరాముని తల్లి

రోహితము - కొరడు, కుంకుమ పువ్వు: నెత్తురు

## రౌ

రౌద్రము - తొమ్మిది రసములలో నొకటి: ఎండ భయంకరము

## అ

అంకె - వృషధ్వని, కేక

అంపిల్లు - వ్యాపించు, వర్ధిల్లు, అతిశయించు

## త్రే

త్రేఁడు - రాజు; మగఁడు

త్రేకు - పుష్పదళము, తగడు, ఈఁక, అంచులేని వస్త్రము

## త్రో

త్రోచ్చు - సందడి, తిరస్కారము, దురద, అపవాదము

## ల

లంక - దీవి, రావణుని పట్టణము, జారిణి, ఒకానొక రాక్షసి

లంఘనము - దాటు, దూకుఁడు, లంకణము

లక్షణము - వ్యాకరణాది శాస్త్రము, గుఱుతు

లక్షణము - గుఱుతు, ఆడబెగ్గురు, వ్యాకరణాది శాస్త్రము, పేరు

లక్ష్మి - రమాదేవి, సంపద, బుద్ధియను వాసనద్రవ్యము, ప్రేంకణము

లత - తీఁగ, పూల గురివెంద, ముత్యాల హారపు పేట, పిక్క, చీమ, సాలెపురుగు, కస్తూరి

లవణము - ముఖము, నోరు; మాట

లలి - క్రమము, వికాసము, ప్రేమ, సంతోషము

లవము - లేశము, చేటు

## లా

లాఁగు - దాటు, చల్లడము

లాగు - విధము, సమ్మతి

లాభము - క్రయ విక్రయముల వచ్చిన ధనము, ప్రాప్తి, వడ్డి

లాలస - అధికేచ్ఛ, యాచన

లావు - బలము, అతిశయము, అశక్యము, ఆధిక్యము

## లి

లింగము - పానవట్టముమీఁది శివుఁడు, గుఱుతు, అనుమానము

లిబ్బి - ధనము, రాశి, నిధి

## లీ

లీల - క్రీడ, శృంగారచేష్ట; మాదిరి, క్రియ

## లు

లుబ్ధకుఁడు - లోభి, బోయ

## లూ

లూత - సాలీడు, పీమ, ఒకరోగము

## లే

లేత - తరుణము; సుకుమారము
లేక - జాబు, సమూహము
లేఖనము - వ్రాత, వాంతి
లేపనము - పూఁత, అలుకుట, లేచుట

## లో

లోగు - అడగు; చొచ్చు
లోకమాత - గంగ, లక్ష్మి
లోకము - జగము, జనులు
లోను - లోపల, మొదలు
లోల - నాలుక, లక్ష్మి, కదలునది, మిగుల కోరికగలది
లోహితము - రక్తచందనము, పరిమళ చందనము; చెందిరము, నెత్తురు

## వ

వంక - దిక్కు, పక్షము, వంపు, వాఁగు
వంగము - తగరము, సత్తు; నూలిచీర, ఒక దేశము
వంచకము - నక్క; ఊరముంగిస
వంట - పాకము, ఏరుడు పిడక
వంత - సంతాపము; బాధ, ఏఱు
వంతు - భాగము, వరుస, సామ్యము, పోటి
వంశము - ఒక పురాణ లక్షణము; కులము; వెదురు, పిల్లంగ్రోవి, వెన్నెముక; వెన్నుఁగాడి, సమూహము.
వక్త్రము - నోరు, ముఖము
వక్రుఁడు - అంగారకుఁడు, శని
వగ - దుఃఖము, ఆలోచన, గతి, విలాసము
వజ్రము - రవ, కులిశము
వజ్రి - ఇంద్రుఁడు, జిగుఁడు
వటము - త్రాడు, దండ; మఱ్ఱి, గవ్వ
వట్టు - ఇంకు, కృశించు
వడ - గారె, తాపము, శ్రమము
వడి - వేగము, శౌర్యము, కాలము
వడువు - విధము, బ్రహ్మచారి, ఉపనయనము
వధువు - స్త్రీ, పెండ్లాము, కోడలు
వనము - అడవి, నీరు, సెలయూట; ఇల్లు; గుంపు
వపనము - గొఱుగుట విత్తుట
వప్రము - కోట, వరిమడి, తీరము, కొండ నెత్తము
వరము - దేవతాదులవలన పొందుకోరిక; కుంకుమపూవు, విధి

దుగినుఁడు, నలువ, చదువుల ముదుకఁడు, చదువులవేల్పు, పెద్దవేల్పు, వేలుపుఁబెద్ద, మొదటివేల్పు, పొక్కిలిచూలి, తమ్మిచూలి, ముళ్లతబిసితండ్రి, నిక్కపు జగమేలు నేర్పరి

## బ్రా

బ్రాహ్మణుఁడు - ద్విజాతి, అగ్రజన్ముఁడు, భూదేవుఁడు, బాడబుడు, విప్రుఁడు, బ్రాహ్మణుఁడు; బాపనివాఁడు, ఇరుపుట్టువు, బాపనుఁడు, నేలవేల్పు; పాఱుఁడు; బాపనయ్య, పాఱువాఁడు, బాపఁడు, బొమ్మఁడు

## బా

బాలెంతరాలు - జాతాపత్యా, ప్రజాతా, ప్రసూతా, ప్రసూతికా, ప్రసూతకా, బాలెంత, బాలెంతరాలు, పురుటాలు, చూలాలు

బాణము - వృషత్కము, బాణము, విశిఖము, అజిహ్మగము; ఖగము, ఆశుగము, కలంబము, మార్గణము, శరము, సరము, ప్రతీ, రోపము, ఇషువు; శిలీముఖము, నారాచము

బావి - అంధువు, ప్రహి, కూపము, ఉదపానము, నుయ్యి, బావి, నూయి, నుయ్య, వాపి

బాటసారి - అధ్వనీనుఁడు, అధ్వగుఁడు, అధ్వన్యుఁడు; పాంథుడు, పథికుఁడు; బాటసారి, తెరువరి, తెర్వరి

## బి

బిలము - గుహ, గహ్వరము, దేవఖాతము, దరీ, కందరము, కలుఁగు, గవి, బొరియ, గొబ, బెలము, సొరంగము, వడకు

## బు

బుద్ధి - బుద్ధి మనీషా, ధిషణా, ధీ, ప్రజ్ఞా, శేముషీ, మతి, ప్రేక్షా, ఉపలబ్ధి, చిత్; సంవిత్తి, ప్రతిపత్తి, జ్ఞప్తి, చేతన; మది, నెడి, కఱద, పగ్గె, నెఱ

## బూ

బూరుగుచెట్టు - పిచ్ఛా, శాల్మలీ, పిచ్ఛిలా; పూరణీ, మోచా, బిరాయు, శల్మలీ, అయిటి, బూరుగు

## బృ

బృహస్పతి - బృహస్పతి, సురాచార్యుఁడు, గీష్పతి, ధిషణుఁడు, గురువు, జీవుఁడు, ఆంగీరసుఁడు, వాచస్పతి, చిత్రుఁడు, శిఖండిజుఁడు, వేల్పుటొజ్జ, సుడుగు జేఁడు

## బె

బెబ్బులి - శార్దూలము, ద్వీపి, వ్యాఘ్రము, పులి, మువ్వన్నె మెకము, బెబ్బులి, పసితిండి, కోలుపులి, వాలము, చాఱల మెకము, వేఁగి, దువ్వి

బెగ్గురుపక్షి - పుష్కరాహ్వము, సారసము, పెగ్గురు, బెగ్గురు, వలికి, వాన కోయిల

## బో

బోయ - వ్యాధుఁడు, మృగవధాజీవుఁడు, లుబ్ధకుఁడు, కిరాతుఁడు; శబరుఁడు, పుళిందుఁడు; బోయ, చెంచు

## భ

భర్త - ధవుఁడు, ప్రియుఁడు, పతి, భర్త, మగడు, పెనిమిటి, సామి, పెన్మిటి, జేడు, ఒడయడు, ఒడయుఁడు

భస్మము - భూతి, భసితము, భస్మము, క్షారము, రక్ష

## భా

భారద్వాజము - వ్యాఘ్రాటము; భరద్వాజము, ఏటి రింత, ఏట్రింత, మంగల పిట్ట; నల్లచ్చిగాడు

భార్య - పతిపత్నీ, సభర్తృకా, పాణిగృహీతి, ద్వితీయా, భార్యా, దారా, ఆలు, పెండ్లాము, పెండ్లము, రాణి, ఇల్లాలు, ప్రోయాలు

## భూ

భూమి - భూ, భూమి; అచల; అనంతము; రసా, విశ్వంభరా, ధరా, ధరిత్రి; ధరణి, క్షోణి, కాశ్యపి, క్షితి; సర్వంసహా, వసుమతీ; వసుధా; ఉర్వి; వసుంధరా, పృథివి; క్ష్మా, అవని; మేదినీ, మహీ, విపుల, గహ్వరి; ధాత్రీ, ఇల, కుంభినీ, క్షమా; జగతీ; రత్నగర్భ, అబ్ధి, మేఖలా, పంట వలఁతి, నేల, పైఁడిచూలాలు, పుడమి; మన్ను, మను

# భో

భోజనము - జగ్ధి, భోజనము, జేమనము, వేపము, లేహము, ఆహారము, నిఘసనము; నిఘానము, న్యాదము, తిండి: ఎర, సాపాటు, బోనము, బూతి, ఆరోగిణము

# మ

మంగలి - క్షురీ, ముండీ, దివాకీర్తి, నాపితుఁడు, అంతావసాయి, అంబష్ఠుఁడు, క్షౌరకుఁడు, మంగలి, మంగలవాఁడు

మనోహరము - సుందరము, రుచిరము, చారు, సుషమము, సాధువు, శోభనము, కాంతము, మనోహరము, మనోరమము, రుచ్యము, మనోజ్ఞము, మంజు, మంజులము, హారి, ఆరజము, కొమరు, ఒడికము, ఇంపు, ఇమ్ము: ఇంచు, అనుఁగు, కలికి, అనువు, చిన్నారిపొన్నారి, పొన్నరి, చిన్ని, మాను, చిన్నారి, పొన్నారి, తిన్న, సజ్జగము, సొగు, ఇంబు, నెయ్యము, సొనటు, హరువు, గోవ, ప్రన్నన చిన్నరి, పొన్నరి, చిని, ఒప్పిదము, తీపు, బెడఁగు

మనుష్యుఁడు - మనుష్యుఁడు, మానుషుఁడు, మర్త్యుఁడు, మనుజుఁడు, మానవుఁడు, నరుఁడు, పుమాను, పంచజనుఁడు, పురుషుఁడు, పూరుషుఁడు, మగఁడు, మొగ, మగవాఁడు, మానిసి, మాని, మొగపుట్టువు, మనిషి

మజ్జిగ - దండాహతము, కాలశేయము, అరిష్టము, గోరసము, తక్రము, మజ్జిగ, చల్ల

మంత్రి - సచివుఁడు, అమాత్యుఁడు, పెగడ, మంతిరి, ప్రెగడ, హేజీబు, ప్రెగ్గడ, మంతు, ప్రెవడ

మన్మథుఁడు - మదనుఁడు, మన్మథుఁడు, మారుఁడు, ప్రద్యుమ్నుఁడు, మీనకేతుఁడు, కందర్పుఁడు, దర్పకుఁడు, అనంగుఁడు, కాముఁడు, పంచశరుఁడు, స్మరుఁడు, శంబరారి, మనసిజుఁడు, కుసుమేషుఁడు, అనన్యజుఁడు, పుష్పధన్వుఁడు, రతిపతి, మకరధ్వజుఁడు, ఆత్మభూ, ఇక్షుచాపుఁడు, పుష్పబాణుఁడు, కంతుఁడు, కాయజుఁడు, అలరువిల్తుఁడు, కమ్మవిలుకాఁడు, చక్కెరవిలుకాఁడు, మరుఁడు, పూవింటిజోదు, వలదొర, పిరిచూలి, వాలుగడాలు, ఇంచువిలుతుఁడు, వలవు

వేటకాఁడు, తుంటవిల్తుఁడు, వెడవింటి నెయ్యపురేఁడు, తామర తూపరి, తలఁపుచూలి, వలపు రాయఁడు, తావి విల్కాఁడు, బేసికైదువుజోదు, నన విలుతుఁడు, తీఁగెవిలుతుఁడు, ఇగురుల విల్కాఁడు, చిలుకరౌతు, పచ్చవార్వపు జోదు, లచ్చికొడుకు, పచ్చవిల్దాలుపు, మొసలి పడగదారి

మన్ను - మృత్తు, మృత్తికా, మన్ను, మను, మిత్తి

మల్లె - తృణశూల్యము, తృణశూన్యము, మల్లికా, భూపదీ, శీతభీరువు, మల్లె, మల్లియ

మంచు - అవశ్యాయము, నీహారము; తుషారము, తుహినము, హిమము, ప్రాలేయము, మిహికా, ఇగము, ఇవము, మంచు, మనుచు, ఈము

# మా

మామిడిచెట్టు - ఆమ్రము, చూతము, రసాలము, మావి, మామిడి, మావిడి

మారేడుచెట్టు - బిల్వము; శాండిల్యము; శైలూరము, మాలూరము, శ్రీఫలము, మారెడు, మారేఁడు

మాయ - మాయా; శాంబరీ, బూటకము; టక్కు, బూక, బూమియ, బూమె, బేడిజము, బేలు, వేడబము, మైదు మురకము

మాలికుఁడు - మాలాకారుఁడు; మాలికుఁడు, మాకరి, మాలకరి

మావటివాఁడు - ఆధోరణుఁడు, హస్తిపకుఁడు; మావటీడు, మావతు, మావటివాఁడు, బరికాడు, మావంతు, మావటి

# మి

మిణుగురు పురుగు - ఖద్యోతము; జ్యోతిరింగణము, మిడుగురు, మిణుఁగుఁబురువు, మిణుఁగురు

# ము

ముత్యము - మౌక్తికము, ముక్తా, ఆణిపూస, ముత్తెము, సుప్పాణి, ముత్తియము, చినుకుఁబూస, ముత్యము; సుపాణి

ముత్తైదువ - చిరంటి, సువాసినీ, అయిదువరాలు, ఐదువ, ముత్తైదువ, ముత్తో

ముసలితనము - స్థావిరము, వృద్ధత్వము; వార్ధకము, వార్ధక్యము, ముదిమి; కారు;

ముదుసలి, ముసలి; ముదుక, ముది

ముక్కు - ఘ్రాణము, గంధవహా, ఘోణా, నాసా, నస్యా, నాసిక

## మూ

మూఢుఁడు - అజ్ఞుఁడు, మూఢుఁడు, యథాజాతుఁడు, మూర్ఖుఁడు, వైధేయుఁడు, బాలిశుఁడు, వెంగలి, కూళఁడు, వెర్రివాలి, మడియఁడు, ముచ్చ, ముల్కి, వెంగళి, వెకలి, ఏదురు, అబ్బకాఁడు, వెంగలివిత్తు, బొప్పడు, బేల, ఉక్కిడు కాఁడు

మూషికము - ఉందురువు, మూషకము, ఆఖువు, అధోగన్తా, ఖనకము, వృకము, పుంధ్వజము, ఉందురము, కొక్కు, గరిమిడి కొక్కు, పందికొక్కు

## మె

మెఱుము - శంపా, శతహ్రదా, హ్రాదినీ, ఐరావతి, క్షణప్రభా, తటిత్తు, సౌదామినీ, విద్యుత్తు; చంచలా, చపలా; మించు, మెఱుపు, మించుమించు, మెఱుము, తళుక్కు

మెట్లు - ఆరోహణము, సోపానము, మెట్టు, మేటిక, పావంచము, మేలుకట్టు, మెట్టిక, సోపనము

## మే

మేఁక - అజా, ఛాగీ, మేఁక, వేఁట, చింబు

మేఁకపోతు - తుభము, ఛాగము, బస్తము, ఛలగ, అజము; వేఁట, చింబోతు, వేఁటపోతు

మేఘము - అభ్రము, మేఘము, వారివాహము, స్తనయిత్నుు, బలాహకము, ధారాధరము, జలధరము, తటిత్వాను, వారిదము, అంబుభృత్తు, ఘనము, జీమూతము, ముదిరము, జలముక్, ధూమయోని, నీరుమోపరి, మబ్బు, నీరురాల్పరి, మ్రబ్బు, మొగులు, వీటిబాగి.

## మొ

మొలనూలు - మేఖలా, కాంచీ, కాంచి, సప్తకీ, రశనా, రసనా, సారసము, ఒడ్డాణము, కమరు, ఒడిదారము, తీఁగ

మొలనూలు, కమ్మరు, మొలకట్టు, ఒడికట్టు

మొరపనేల - శర్కరా, శర్కరిల, శార్కరము, శర్కదవాజ్, గరుము, గరుపనేల, గరుసు, గులకరాతినేల, గడువు, మొరపనేల

మొల్ల - మాగధి, గణికా, యూధికా, అంబష్ఠా, కుందము, మొల్ల

మొగ్గ - క్షారకము, జాలకము, కలికా, గోరకము, మొగ, నన, అరవిరి, మొగడు, మొగ్గ

## మో

మోడు - స్థాణువు, ధ్రువము, శంకువు, మోటు, మోడు, మ్రోడు

మోఁకాలు - జాను, జానువు, ఊరు పర్వము, అష్ఠీవత్, ముడుము, మోఁకాలు

## య

యముఁడు - ధర్మరాజు, పితృపతి, సమవర్తి, పరేతరాట్టు, కృతాంతుఁడు, యమునాభ్రాత, శమనుఁడు, యమరాట్టు, యముఁడు, కాలుఁడు, దండధరుఁడు, శ్రాద్ధదేవుఁడు, వైవస్వతుఁడు, అంతకుఁడు, జమునసైదోఁడు, పితరులసామి, గుదియతాల్పరి, జముఁడు, ప్రొద్దుచూలి, దక్షిణంపుఱేఁడు, దుంతరౌతు

యమునానది - కాళింది, సూర్యతనయ, యమున, శమనస్వసా, జమునసైదోడు

యజ్ఞము - యజ్ఞము, సవనము, అధ్వరము, యాగము, సప్తతంతువు, మఘము, మఖము, క్రతువు, జన్నము, గంగి

యుద్ధము - యుద్ధము, ఆయోధనము, జన్నము, ప్రధనము, ప్రవిదారణము, మృధము, ఆస్కందనము, సఙ్ఖ్యము, సమీకము, సాంపరాయికము, సంపరాయికము, సమరము, అనీకము, రణము, కలహము, విగ్రహము, సంప్రహారము, అభిసంపాతము, కలి, సంస్ఫోటము, సంయుగము, అభ్యామర్దము, సమాఘాతము, సంగ్రామము, అభ్యాగమము, ఆహవము, సముదాయము, సంయుత్, సమితి, ఆజి, యుత్, పోరాటము, తురము, కలఁకు,

పోట్లాట, అన్ని, పోరాట, పెనంటున పోట్లు, ఆలము, కంగారు, కలను‘ కయ్యము, అని, పోరు, కంగిస, జగడము, చివ్వ

# యౌ

యౌవనము ,- తారుణ్యము, కౌమరు౯దనము, కౌమరు, తఱపి, పాయము, నీరుపాయము, జవ్వనము, సరిపాయము, గోవ

# ర

రంధ్రము - కుహరము, సుషిరము, వివరము, బిలము, ఛిద్రము, నిర్వ్యథనము, రోకము, రంధ్రము, శ్వభ్రము, వపాసుషి, తొలి, దొండి, క్రంత, దుంకము, తొలిత, ఒడిపి, గొయ్యి, బొక్క, తూటు, బొరియ, బిలము, లాఁగ, బొజ్జ

రజస్వల - రజస్వలా, స్త్రీధర్మిణీ, అవి, ఆత్రేయా, మలినీ, పుష్పవతీ, ఋతుమతీ, ఉదక్యా, తలగు, ముట్టు, చెలగుమాయు

రవికె - చోలము, కూర్పాసకము, కంచుకము, కుప్పసము, చన్నుగట్టు, కుపసము, చనుగప్పు, చన్మఱుపు, స్త్రైకం, రవిక

రథము - శతాంగము, స్యందనము, అరదము, తేరు

# రా

రాజు - రాజా, రాట్టు, పార్థివుఁడు, క్ష్మాభృత్, నృపుఁడు, భూపుఁడు, మహీపతి, క్షత్రియుఁడు, బాహుజుఁడు, అరుసు, దేవర, ఒడయడు, సామి, ఏలిక, జియ్య, ఱేఁడు, రాయఁడు, ఎకిమీడు, పాదుసా, ఏలినవాఁడు, మన్నియఁడు, రావు, మన్నీడు, మన్నెడు, మన్నెకాఁడు, దొర, నేలతాల్పు, దణి, నేలఱేఁడు

రావిచెట్టు - అశ్వత్థము, వైణవము, ప్లాక్ష్మము, వైయగ్రోధము, బంగుదము, బార్హతము, రావి, రాగి

రాత్రి - శర్వరీ, నిశా, నిశీథినీ, రాత్రి, త్రియామా, క్షణదా, క్షపా, విభావరీ, తమస్వినీ, రజనీ, యామినీ, తమీ, రేయి, రెయి, రే, రాతిరి, నిసి, మాపు, రేతిరి

రాహువు - తమము, రాహువు, స్వర్భానుడు, సైంహికేయుఁడు, విధుంతుద, చీఁకటి గాము, తలగాము, నెలతిండి, మొండెపుగాము

రాక్షసులు - అసురులు, దైత్యులు, దైతేయులు, దనుజులు, ఇంద్రారులు, దానవులు, శుక్రశిష్యులు, దితిసుతులు, పూర్వదేవులు, సురద్విషులు, రాక్షసులు, క్రవ్యాదులు, అస్రపులు, ఆశరులు, అసురులు, రాత్రించరులు, కర్బురులు, నికషాత్మజులు, యాతుధానులు, పుణ్యజనులు, నైరృతులు, రక్కసులు, రాకాసులు, రక్కసీడులు, రక్కసీండ్రు, రేద్రిమ్మరులు, సోకులు, నల్లద్రావుఁడులు, వేలుపుదాయలు, తొలువేలుపులు, ప్రావేల్పులు, పొలసుదిండ్లు, రేద్రిమ్మరులు, మానిసిదిండ్లు, ఎఱచిమేపరులు, పొలమేపరులు

# రే

రేఁగుచెట్టు - కర్కంధువు, బదరీ, కోలీ, ఘోణ్టా, రేఁగు, రేను, రేవు

# ఱ

ఱంకులాడి - పుంశ్చలీ, ధర్షణీ, చర్షణీ; బంధకీ, అసతీ, కులటా ఇత్వరీ; స్వైరిణీ, పాంసులా, జారిణీ; చెడిపదిచ్చరి, నఁగూతు, చెడుగు; బసివి; ఱంకులాడి, ఱంకెత, ఱాఁగ, నునుపుకత్తె, విటుకులాఁడి, విటకత్తె, రంకుటాలు, మిండత

# ఱా

ఱాయి - పాషాణము, ప్రస్తరము, గ్రావము, ఉపలము, అశ్మా, శిల; దృషత్; కలు, చలువ; రాయి, ఱాయి, ఱా; కల్లు, చట్టు

# ఱె

ఱెక్క - గరుత్, పక్షము, ఛదము; పత్త్రము, పతత్రము, తనూరుహము; ఱెక్క, చెట్టుప, రెక్కచెట్టుప, రేకు; గఱి, నెఱి, ఎరక

## ల

లక్ష్మీదేవి - లక్ష్మీ, పద్మాలయ, పద్మా, కమలా, శ్రీ, హరిప్రియా, ఇందిర, లోకమాత, మా, రమా, మంగళ దేవతా, భార్గవీ, లోకజననీ, క్షీర సాగర కన్యకా, కలిమినెలంత, లచ్చి చెలి, కల్మలపొల్తుక, తమ్మియింటి పైదలి, సిరి, తల్లితల్లి, తామరనట్టువ, పైడిచాన; లిబ్బిపడఁతి, పూవిల్తుని తల్లి, లచ్చి, కరివేల్పుటాలు, జగము తల్లి, తమ్ములకైచాన, కడలిపుట్టువు, లక్కిమి

## లా

లావు - పీనము, పీవము, పీవరము, స్థూలము, వలుద, తోరము, లావు, బలితము, వల్ల, దొడ్డు, బంటు, వలము, బూర

## లే

లేడి - మృగము, కురంగము, వాతాయువు, హరిణము, అజినయోని, సారంగము; కృష్ణసారము, ఏణి న్యంకువు; లేడి, లేటి, ఇఱ్ఱి; జింక, మెకము

లేఖకుఁడు - లిపికారుఁడు, లిపింకరుడు, అక్షరదణుఁడు, అక్షరచుంచుండు, లేఖకుఁడు వ్రాఁతసాకిరి, వ్రాఁతకాఁడు; వ్రాయసకాఁడు

## లో

లోహకారకుఁడు - వ్యోకారుఁడు, లోహకారకుఁడు, కమ్మరీడు, కమ్మరి, కమరవాఁడు

## వ

వజ్రాయుధము - హ్రాదినీ, వజ్రము, కులిశము, భిదురము, పవి, శతకోటిస్వరు, శంబము, దంభోళి, అశని, నూఅంచులవాలు, జాతివాలు, మగజాతి వాలు

వరుణుఁడు - ప్రచేతసుఁడు; వరుణుఁడు పాశీ, యాదసాంపతి, అప్పతి, కడలి ఱేఁడు, వల్లెతాల్పరి, నీటిఱేఁడుఁ, తాడు తాల్పు

వర్షము - వృష్టి, వరము, వాన; జడి, సోన, చినుకులు, తుపర

వరుస - వీధీ, పఙ్క్తి, ఆలి, ఆవలి, శ్రేణి; దొంతి, పరి, అంచె; చాలు, బంతి, వరుస, ఓలి, బారు, పౌజు

వంశము - సంతతి, గోత్రము, జననము, కులము, అభిజనము, అన్వయము, సంతానము, వంగడము, కాలము వంగసము, సంతు

వస్త్రము - వస్త్రము, ఆచ్ఛాదనము వాసము, చేలము, పరిధానము, వసనము అంశుకము, పావడ, బట్ట, కప్పడము, వల్యము, పుట్టము, దుస్తు, పాత, హేరావళి, ప్రాప, వీణాము, కోక, వల్వ, సేలా, వలువము, కవళము, సుగ్గాడితము

వడ్డి - అర్థప్రయోగము, వృద్ధిజీవికా, వృద్ధి, కుసీదము, వడ్డి, తమానము,

వర్తకము - వాణిజ్యము, వాణిజ్యా, బేరము, బేహారము, బేహరము వర్తకము

వడ్రంగి - తక్షా, వర్ధకినుఁడు, త్వష్టా, రథకారుఁడు, వడ్లొజు; వడ్లంగి, వడివాఁడు, వడ్రంగి

వంటవాఁడు - సూపకారకుఁడు, వల్లవుఁడు, ఆరాళికుఁడు, ఆనస్థికుఁడు సూదనుఁడు, ఔదనికుఁడు, పాచనకుఁడు, ఆడబాల, బోనకాఁడు; వంటది, వంటవాఁడు, కుండగోకరి

వాయువు - శ్వసనుఁడు, స్పర్శనుఁడు వాయువు, మాతరిశ్వుఁడు, సదాగతి వృషదశ్వుఁడు, గన్ధవహుఁడు, అనిలుఁడు, ఆశుగము, సమీరుఁడు, మారుతుఁడు, మరుత్తు, జగత్ప్రాణుఁడు, సమీరణుఁడు, నభస్వాను, వాతము, పవనుఁడు, పవమానుఁడు, ప్రభంజనుఁడు, ఈఁదర, తెమ్మెర, ఈఁద; కవ్వలి, గాలి; కరువలి, పయ్యెర; గాడ్పు, పైర, వలపుమోపరి, సుర; చలినట్టు, సుడిగొట్టు, ఏనుమాలి, చలియిక్క, వీపరి, తావిమోపరి; సోకుదయ్యము, మబ్బుమేపరి, జింకరౌతు; పయర, నీటితాత

# వి

విష్ణువు - విష్ణుఁడు- నారాయణుఁడు- కృష్ణుఁడు- వైకుంఠుఁడు- విష్టరశ్రవుఁడు- దామోదరుఁడు- హృషీకేశుఁడు- కేశవుఁడు- మాధవుఁడు- దైత్యారి- పుండరీకాక్షుఁడు- గోవిందుఁడు- గరుడధ్వజుఁడు- పీతాంబరుఁడు- అచ్యుతుఁడు- శార్ఙ్గి- విష్వక్సేనుఁడు- జనార్దనుఁడు- ఉపేం

ద్రుఁడు- ఇంద్రావరజుఁడు- చక్రపాణి- చతుర్భుజుఁడు- పద్మనాభుఁడు- మధురిపుఁడు- వాసుదేవుఁడు- త్రివిక్రముఁడు- దేవకీనందనుఁడు- శౌరి- పురుషోత్తముఁడు- వనమాలి- బలిధ్వంసి- కంసారాతి- అధోక్షజుఁడు- విశ్వంభరుఁడు- విధు-విశ్వరూపుఁడు- ముకుందుఁడు- హరి- వెన్నుఁడు- నల్లమేనిదొర- పచ్చవలువదాల్పు- గబ్బుతాలుపు- కలివేల్పు- తమ్మికంటి- గరుడిరౌతు- ఆలకాపరి- వలమురితాలుపు- పక్కిడాలువేలుపు- పసిఁడివల్వదారి- రక్కసిగొంగ- తమ్మిపొక్కిలి- లచ్చిమగఁడు-మామమామ- చుట్టువాలుజోదు- ఉడ్డసకేల్వేల్పు- ముజ్జగంబుల బొజ్జదేవర- నలువతండ్రి- మరువిగన్నయ్య- వెన్నదొంగ- కన్నయ్య

నాయకుఁడు - వినాయకుఁడు- విఘ్నరాజు- ద్వైమాతురుఁడు- గణాధిపుఁడు- ఏకదంతుఁడు- హేరంబుఁడు- లంబోదరుఁడు- గజాననుఁడు- చెఱుపుతేఁడు- గుజువేల్పు- పిల్లారి- కొక్కురౌతు- బొజ్జదేవర- ఏనుఁగుమోము వేల్పు- ఒంటికొమ్మయ్య- వెనకయ్య- జంటతల్లుల బిడఁడు- కుడుములతిండి

విషము - క్ష్వేళము- గరళము- విషము- నంజు- విసము- చిలుము

వికసించుట - ప్రఫుల్లము- ఉత్ఫుల్లము- సంపుల్లము- వ్యాకోచము- వ్యాకోషము- వికచము-స్ఫుటము- ఫుల్లము- వికసితము- అలరు- ఎలర్చు- మొగవిచ్చు- ఎలరుచు- విచ్చు- తొంగలించు- నవ్వు- విప్పు- విరియు- విరియఁబారు- విడంగును- విక్కు- విరియు- చెలఁగు

విరజాజి - సుమనా- మాలతీ- జాతి- సప్తలా- నవమాలిక- విరజాజి- జాజి జాది- విరజాజి- విరవాది

విటుఁడు - విటుఁడు- జారుఁడు- ఉపపతి- కోడెకాఁడు - బోజుఁడు- కోడె- జుమ్మఁడు- మబ్బకాఁడు- జుమ్మకాఁడు- చెలువుఁడు- మిండఁడు - వెచ్చకాఁడు- విటకాఁడు

వింజామరము - చామరము- ప్రకర్ణకము- వింజామర

విరివి - విశంకటము- పృథు - బృహత్- విశాలము- పృథులము - మహత్- రుంద్రము- వద్రము- ఉరు- విపులము నెరవు- పఱపు- విరళి- వెడల్పు-

విరివి- వలము- వెణఁద- గరువము- వెడఁద- ఇమ్ము- వింగడము

## వీ

వీధి - అయనము- వర్త్మము-మార్గము- పన్థా- పదవీ- సరణి- పద్యా- వర్తినీ- ఏకపదీ- వీధి- క్రంత- సందు- సంది- గొంది

## వృ

వృక్షమూలము - మూలము - బధ్నము- బ్రధ్నము - అఙ్ఘ్రినామకము - వేరు- మొదలు

## వె

వెన్నెల - చంద్రిక- కౌముది - జ్యోత్స్న- నెలవెలుఁగు - వెల్లనెల - రేయెండ- వెన్నెల- చందిరిక

వెదురు - వంశము - త్వక్సారము - కర్మారము - త్వచిసారము - తృణ ధ్వజము-శతపర్వము - యవఫలము- వేణువు - మస్కరము - తేజనము - వెదురు

వెన్న - నవనీతము - నవోద్ధృతము - వెన్న- మిసిమి

వెండి - దుర్వర్ణము-రజతము-రూప్యము- ఖర్జూరము - ఖర్జురము - శ్వేతము- వెండి- మడికాసు

## వే

వేదము - శ్రుతి - వేదము -ఆమ్నాయము- నిగమము - త్రయీ ధర్మము - తొలి చదువు - ప్రామిన్కులు - తొలుఁ బల్కులు - ప్రాఁజదువులు - తొల్చ దువులు- ప్రాఁబల్కులు - పెనుమి న్కులు - మినుకులు - పాఁగబ్బము- తొలుమిన్కులు

వేదన - కారణము - యాతనము - వేద నము - అలఁత - త్రిక్కు - కుతిల- బెడద- త్రిమ్మట - నొవ్వు - నెగులు- వంత- గొడ్డగము- ఏపు

వేశ్య - వారస్త్రీ - గణికా - వేశ్య- రూపాజీవా - తొత్తు - వెలయాలు- వేడుకకత్తె - లంజె - ఆఁటవెలఁది- ఆటకత్తె - గడనకత్తె - గణకత్తె- పడుపుగత్తె, పడుపుఁగొమ్మ - వేల్పు బొనిస-లంజెత

వేపచెట్టు - అరిష్టము - సర్వతోభద్రము- హింగునిర్యాసము - మాలకము- పిచు మందము - పిచుమర్దము - నింబము- వేఁప- వేము

## వై

వైశ్యుఁడు - ఊరవ్యుఁడు - ఊరుజుడు- ఆర్యుఁడు- వైశ్యుఁడు - భూమిస్పృక్, బేరి-తొడపుట్టు - బేహారి - బేహారి - కోమటి-బమ్మ- సంపాపారి- సెట్టి

## శ

శచీదేవి - పులోమజా - శచీ - సచి- ఇంద్రాణి - మలపగురునిరాణి - సుర తాణి

శని - సౌరి- శనైశ్చరుఁడు - శని- మందుఁడు - పంగుఁడు - కాలుఁడు- ఛాయాపుత్రుఁడు- అసితుఁడు - అర్కజుఁడు - సని - కుప్పమేనిగాము- కుంటిగాము- ఛాయపట్టి

శంఖము :- శంఖము - కంబువు - చుట్టుగుల్ల- బిందము - నీటిపుట్టువు - వెలిగుల్ల- సంకు- కూఁతకైదువు

## శి

శివుఁడు - శంభుఁడు - ఈశుఁడు - ఈశ్వరుఁడు- పశుపతి- శివుఁడు - శూలి- మహేశ్వరుఁడు - శర్వుఁడు - ఈశానుఁడు- శంకరుఁడు- చంద్రశేఖరుఁడు- భూతేశుఁడు- ఖండపరశువు -గిరీశుఁడు- గిరిశుఁడు- మృడుఁడు- మృత్యుంజయుఁడు - కృత్తివాసుఁడు - పినాకి ప్రమదాధిపతి- ఉగ్రుఁడు -కపర్ది-శ్రీకంఠుఁడు - శితికంఠుఁడు - వామదేవుడు- మహాదేవుఁడు - విరూపాక్షుఁడు- త్రిలోచనుఁడు - కృశానుఁడు - సర్వజ్ఞుఁడు - ధూర్జటి - నీలలోహితుఁడు- హరుఁడు - స్మరహరుఁడు- భర్గుఁడు త్ర్యంబకుఁడు-త్రిపురాంతకుఁడు- గంగాధరుఁడు - క్రతుధ్వంసి- వ్యోమకేశుఁడు - భవుఁడు - భీముఁడు- స్థాణుఁడు -రుద్రుఁడు- ఉమాపతి-మహానటుఁడు - మహాకాలుఁడు - కాలకాలుఁడు - మేరుధన్వుఁడు - వృషభవాహనుఁడు- ఐదుమోములవేల్పు- ఆబోతురౌతు - అంగములవేల్పు -నెలతాల్పు - చిలువతాల్పు - తిగకంటి- ముక్కంటి - దిసమొలవేల్పు - మినుసిగదేవర - మిత్తిగొంగ - కాౘ్రేడు- మిక్కిలికంటి దేవర - అగ్గికంటి- పునుకతాల్పు - కాటిఱేఁడు - గట్టువిల్తుఁడు - వేఁడికంటి - తెల్లని సామి- విసపుమేతరి- మిత్తివేఁటకాఁడు- జింక

తాల్పరి - నింగిసిగ - కఅకంఠుఁడు- కొండయల్లుఁడు- వెండి కొండవిడిది- మిన్వాకతాలుపు-వలదొరసూడు-జన్నపు దొంగ- కోడెరౌతు- జడముడి జంగము- కుడుములతిండిదేవరతండ్రి - ముక్కంటి వాలుదారి - తోలుదాల్పరి - వాకిదాల్ప- బిచ్చదకంటి- దేవర - బేసికంటిసామి- వలిమలల్లుఁడు- గంగికై యలుగు వాఁడు- బూచులయేకిమీఁడు

శిఖరము - కూటము - శిఖరము- శృంగము- కొప్పరము- క్రేపు- కొప్రము- కొమ్ము- సిగరము-కొపురము పేటు- మోరు

శిశువు - శిశువు- డింభకా - ఉత్తానశయా- స్తనపా- బాల- పాప - బుడుత- బిడ్డ- పట్టి - బురుక - కందు - కుఱ్ఱ,కున్న- పిసువు- కూన- నిసువు- నిసుగు

శిష్యుఁడు - శిష్యుఁడు- అంతేవాసి- ఛాత్రుఁడు- చట్టు

## శ

శత్రువు - రిపు- వైరి- సపత్నుఁడు- అరి- ద్విషత్ - ద్వేషణుఁడు - దుహృదము- విపకుఁడు- అహితుఁడు- అమిత్రుఁడు- దస్యుఁడు - శాత్రవుఁడు - శత్రువు- అభిఘాతి- అరాతీ - ప్రత్యర్థి - పరివ- పగవాఁడు- గొట్టుమార్తుఁడు - పగతు- పవతు - దాయ - దొంగ - ఒరుడు - మారుతుఁడు- పగదారి-సూడు-వెట్టము- పగతుఁడు

శిల్పి - కారుఁడు- శిల్పి- పంచాణము వాఁడు - కుంచెవాఁడు - అంచుల వాఁడు

## శీ

శీతము - సుషిమము- సుషితము-శిశిరము- జడము - తుషారము - శీతలము- శితము- హిమము- చలిమిరి- సీతువు- ఈరము- వలి- చల్మిరి- సీతు- సిరము- ఇగము- చలువడి- చల్వడి - చలువ- చల్లన- చల్వ- ఇవము- వలిపిరి- ఇవక- చలి

## శు

శుక్రుఁడు - శుక్రుఁడు - దైత్యగురువు- కావ్యుఁడు- ఉశన- భార్గవుఁడు - కవి- చుక్క - తెలిగాము - వేగురుచుక్క- సోకుటొజ్జ, సుకరుఁడు - వాలు జుక్క-ఒంటికంటి- వేగుజుక్క

శుభము - స్వ శ్రేయసము- శివము- భద్రము - కల్యాణము - మంగళము- శుభము- భావుకము- భవ్యము- కుశలము- క్షేమము- శస్తము- పంతు- వావిరి - మేలు - సోబనము - లగ్గు- మంచి

## శూ

శూరుఁడు - శూరుఁడు- వీరుఁడు- విక్రాంతుఁడు - ఉక్కటీఁడు - బంటు- నెక్కటీఁడు - బంటు - మాసపె- మాసటీఁడు -మగడు- పోటరి-పోటుమగఁడు - దునేదారి - వాడిమగఁడు- మొక్కలి - గండడు - మొనగాఁడు- నెఱసరి - సజ్జి(ఁ)డు - సరదారు- ప్రాయకాఁడు - వజ్జీరుఁడు - జోదు- ప్రాయిూఁడు- వజీరు

శూద్రుఁడు - శూద్రుఁడు- అవరవర్ణుఁడు- వృషలుఁడు - జఘన్యజుఁడు - కాలి పుట్టువు - బలిజె - కాఁపు - కలప తాల్పు- నాలవవాఁడు

## స

సరస్వతి - బ్రాహ్మి - భారతీ - భాషా- వాక్సతీ- వాణీ- మంజువాణీ- పల్కు- పల్కుచెలియ - పొత్తువు - చదువుల చేడియ - పలుకువెలఁది - మినుకుగు బ్బెత- చదువులమిన్న- అన్ను- నలువ పడఁతి - నలువరాణి - తలవాఁకిట మెలఁగెడి పొలఁతుక

సత్యము - సత్యము-తధ్యము-నృతృము- సమ్యక్కు - నిక్కువము - నికము- నిజము - నిక్కము - సత్తు - నిబద్ధి నిబ్బద్ధి

సంతోషము ,- ప్రీతి - ప్రమదము- హర్షము - ప్రమోదము - ఆమోదము సమ్మదము - ఆనందము - శర్మము- శాతము - సుఖము - సంతసము- అరుసము-రహి-సంబరము-సంబ్రము అలరు - ఎలర్పు -ఎలరుపు - సంతోసము - వెంటము - ఎలమి - వేడుక, అరుసము, కొండాటము, హరుసము, సొంపు, నెమ్మి

సముద్రము - సముద్రము, అబ్ధి, కూపారము, పారావారము, సరస్పతి, ఉదన్వాన్, ఉదధి, సింధు, సరస్వాన్, సాగరము, అర్ణవము, రత్నాకరము, జలనిధి, యాదఃపతి- అపాంపతి

సరస్సు - పద్మాకరము, తటాకము, సరోవరము, సరసి, సరస్సు, జలాకరము, కాసారము, కెళకుళి, కేళాకూలి, కొలకువ, కేళికుళి, కొలంకు, దొరవి, దొరువు, కొల్కు, కొలను, మడుంగు, చెఱువు.

సభ - సమజ్యా, పరిషత్తు, గోష్ఠి, సభా, సమితి, సంసత్, ఆస్థానీ, ఆస్థానము, సదము, కొలువు, కూటాము, అజారము, కూటము, ఓలగము, హాజారము, అంగడి, క్రంత, రచ్చ, దివాణము, హజారము, కొలువు కూటము

సన్న్యాసి -భిక్షువు,పరివ్రాజకుఁడు, కర్మంది, పారాశరి, మస్కరి, కావితాల్పు, బోడ, సన్న్యాసి, విన్నాణి

సకిలింపు - హేషా, హ్రేషా, కరాళించు, సకిలించు,

సమానము - సమము, తుల్యము, సదృక్షము, సదృశము, నిభము, సంకాశము, నీకాశము, ప్రతీకాశము,ఉపమా, తరము, సవతు, సాటిక, ఎన, సరి, ఉద్ది, ఈడు, జోడు, సాటు, సాటి, దీటు, పురుఁడు, అనుగలము

సమీపము - సమీపము, నికటము, ఆసన్నము, సన్నికృష్టము, సనీడము, సదేశము, అభ్యాసము, సవిధము, సమర్యాదము, సవేశము, ఉపకంఠము అంతకము, అభ్యర్ణము, అభ్యగ్రము అభితము, అండ, ఆందిక, తెడ, అఱుత, ఒలయు, చెంత, కడ, కుఱంగలి, అఱు, గఱిడి, దండ, అందు బాఱు, చేర్వ, అండుబడి,తఱి, సంగడి, దగ్గఱ, సంగడము, జంట, చేయలంతి, సరస, వద్ద, మ్రోల, తామరసము, దరి, ముందట, పొరుగు, మందల, దాఁపు, చేరువ, పజ్జ, చెంగలి, చేరుగడ, ఒద్ద, చేరిక, పొంత, అరుత,

సంపద - సంపత్, సంపత్తి, శ్రీ, లక్ష్మి, కలిమి, పొమిఁడి, సిరి, కల్మి, లచ్చి.

# స్ర

స్రవించుట - శ్చ్యోతము, ప్రాఘారము, స్రావము, ఉట్టు, తొంగలించు, ఉరలు, తొరగు, గీలు, తొట్టు, చినుకు, దిగువారు, జల్లించు, కాఱు, జొబ్బిలు, జొబ్బిల్లు.

# స్వ

స్వర్గము - స్వః, స్వర్గము, నాకము, త్రిదివము, త్రివిష్టపము, వినుప్రోలు, జేజే

పట్టు, విస్వలను, జేజేయండ, విను వీఁడు, మినువలను

## సా

సాయంకాలము - దినాంతము, సాయము, అస్తమయము, సాయంతనము, పూఁట, పుంట, సంజ, పురటనెత్తురు, బొద్దు, క్రుంకు, క్రుంకుడు, నింగిపడు,

## సి

సింహము - సింహము, మృగేంద్రము, పంచాస్యము, హర్యక్షము, కేసరి, హరి, కంఠీరవము, గజరిపువు, పింగ దృష్టి, మృగాధిపము, తెలివాయి మెకము, తెలిమెకము, పచ్చకన్నుల సింగము, బొబ్బమెకము, వెడఁదమో ముమెకము, మెకముల ఱేఁడు, ఏని కలగొంగ, బకినోటిమెకము, బకినోటి, రెంటఁత్రాగుడుతిండి, జడలమెకము

సివంగి -తరక్షువు, మృగాదనము, సివఁగి, మెకములతిండి, చివఁగి, సివ్వంగి, చివ్వంగి.

సింహాసనము -నృపాసనము,భద్రాసనము, సింహాసనము, గద్దె, సింగపు పీఁట, గద్దియ.

స్త్రీ -స్త్రీ, యోషి; యోషితా, అబలా యోషా, జోషా, నారీ, సీమంతినీ, వధూ, ప్రతీపదర్శనీ, వామా, వనితా; మహిళా, మహిళా, అంగనా, భామినీ, ప్రమదా, కామినీ, లలనా, రమణీ; రమా, అతివ, పొలంతుక, ఆఁడది, ఆఁటది, ఉగ్మలిక, అన్ను, ఇంతి, ఉవిద, ఎలనాఁగ, పైదలి, కొమ్మ, కొమిరె, ఎమ్మెలాఁడి; వెలియ, గుబ్బెత; చెలి, చేడియ, వాన, కలికి, చామ, చెలువ, తొయ్యలి, నెలఁతుక,తోయలి, పడతుక, పొలతుక, నెలఁత, పొలఁతి, మగువ, మెల్తుక, మెలంతుక, వలఁతి, బిత్తరి, లేమ, వెలఁది, జోటి, ముదిత, మడతుక, ముదియ, మడతి, పడఁతి, సకియ, వెలఁదుక, జోటిక, సకి, మడంతి.

## సూ

సూర్యుఁడు - సూరఁడు, సూర్యుఁడు, అర్యవాన్, ఆదిత్యుఁడు, ద్వాదశాత్ముఁడు, దివాకరుఁడు, భాస్కరుఁడు; అహస్కరుఁడు, బ్రధ్న; ప్రభాకరుఁడు, విభాకరుఁడు, భాస్వాన్, వివశ్వాన్; సప్తాశ్వుఁడు, హరిదశ్వుడు; ఉష్ణరశ్మి,

వికర్తనుఁడు, అర్కుఁడు; మార్తాండుఁడు; మిహిరుఁడు, అరుణుఁడు, ద్యుమణి, తరణి, మిత్రుడు; చిత్రభానుఁడు, విరోచనుఁడు, విభావసుఁడు; గ్రహపతి, త్విషాంపతి, అహర్పతి; భానుఁడు, హంస, సహస్రాంశుఁడు, తపనుఁడు, సవిత, రవి, కర్మసాక్షి; అంశుమాలి, ప్రద్యోతనుఁడు, ఖద్యోతనుఁడు; దినమణి, లోకబాంధవుఁడు, ఇనుఁడు, ధామనిధి, పద్మినీవల్లభుఁడు, హరి; గాములతేఁడు, రేకంటు, కాఁకవెలుఁగు, పచ్చవార్వపుజోఁదు, పగటివేల్పు, తామరచెలి, ప్రొద్దు; తమ్మివిందు, ఇవముఁలమేపరి, వినుకెంపు మింటిదారి, ఒమునయ్య, చెయ్యుల సాకరి, మనుకులయిక్క, ఇరులగొంగ, ఇగముసూఁడు, చాయమగఁడు, తమ్మిసామి, జక్కవతేఁడు, కలువదాయ; వేవెలుఁగు, వేఁడివెలుఁగు, మిన్కులబరణి; వేఁడివేల్పు; సెగవెలుఁగు వెలుగులతేఁడు, జగముకన్ను; చదలుమానికము, ఎండసామి;

## శూ

శూరుఁడు - శూరుఁడు; వీరుఁడు; విక్రాంతుఁడు, ఉక్కుడీడు; బంటు; నెక్కటీడు, ఒంకుమాసటి, మాసటీఁడు; మగడు, పోడరి, పోటుమగడు, దునేదారి; వాడిమగఁడు, మొక్కలి; గండఁడు, మొనగాఁడు, నెఱసరి, వజ్జీఁడు; సరదారు, ప్రాయికాఁడు, వజ్జిరుఁడు, జోదు; ప్రాయీడు; వజీరు

## సూ

సూక్ష్మము - స్తోకము, అల్పము, క్షుల్లకము సూక్ష్మము, శ్లక్ష్ణము, దభ్రము కృశము, తను, మాత్రా; త్రుటి, వియతము, లవము, లేశము, కణము, అణువు, నలికము, దడిమము, దలిమము; వలిపెలు, రవ, జరిజు, వల్ప, నవల్పము, జిలుఁగు, గిటగిటన, గిటగిటబి, జిల్గు; అలఁది; ఇంచుక, కొంచెము; అసదు; ఇసుమంత, చిలిపి, తోడెము

## సె

సెలయేరు - వారిప్రవాహము, నిర్ఝరము; ఝరము, ఝరీ, సెల, మలకాలువ; వాఁగు, సెలజాలు, మలయేఱు

## సే

సేవకుఁడు - సేవకుఁడు, అర్థి, అనుజీవి వేఁక, గుండుఁడు, బోడిక, వెంక, బంటు; వరవుఁడు, డింగరీఁడు, బాని సీఁడు, పడిగాపు

స్నేహము - సఖ్యము; సాప్తపదీనము, సౌహార్దము, మైత్రి, సౌహృదము, స్నేహము, కూర్మి, చెలిమి, నేయము, అంటు; నేస్తము, చెల్మి, చెలికారము, సంగాతము, సంగడి, అంటు, ప్రేముడి, నెయ్యము, సంగ డము

స్నేహితుఁడు - మిత్రుఁడు, స్నేహితుఁడు, స్నిగ్ధుఁడు, వయస్యుఁడు, చెమరి, నెయ్యరి, నెయ్యుఁడు, చెలి, సకుండు, అంటుకాఁడు, చెలిమీఁడు, ఉద్దీఁడు, ఉద్దికాఁడు, మిత్త, చెలికాఁడు, పొందు కాఁడు

సేనాధిపతి - పరిదస్తుఁడు, పరిచరుఁడు, సేనాని, వాహినీపతి, సేనాధిపతి, దణాపెద్ద, దళవాయి, దళసరి, గుమి కాఁడు, దడవాయి, చెరుపకాఁడు, పడవాయి, మొనకాఁడు, దొర, పడాలు, దబవరి, దళాయదు

సేద్యగాఁడు - క్షేత్రాజీవరుఁడు, కర్ష కుఁడు, కార్షకుఁడు, కృషికుఁడు, కృషీ వలుఁడు, హాలికుఁడు, సైరికుఁడు, కమ్మతీఁడు, అరకాఁడు, కమతకాఁడు, కరసవీఁడు

## సై

సైన్యము - బలము, సైన్యము, చక్రము, అనీకము, వాహిని, పముజు, దడము, రాణువ, పాళియము, చదలము, దండు, బల్గము, పరి, ఎట్టిపోగు, బలగము, సంగకము, దణా, పటా లము, దుముదారు, తొమ్ము, దళము, వెల్లువ, మూఁక, వాఁగు, పాళెము, మొన, పంజు, తత్త ఒడ

## సొ

సొమ్ము - అలంకారము, ఆభరణము, పరి ష్కారము, మండనము, తొడవు, నగ, సొమ్ము, తొడుపు, రవణము, తొడ్వు, తొడ్గు, తొగుడు

## సౌ

సౌధము - సౌధము, హర్మ్యము, ప్రాసాదము, రాజసదనము, ఉప

కార్యము, మేవిల్లు, మేక, మాశిగ, ఉప్పరిగ, మాడువ, మాలె, మాడుగు, ఓవరి

## హ

హంస - హంసము, శ్వేతగరుత్, చక్రాంగము, మానసౌకా, తూఁడుతిండి, తెలిపిట్ట, తొలకరిసూడు, తెలినెఱిపులుఁగు, వానజాలి పురుగు, అంచ

## హి

హిమాలయము - హిమాచలము, హిమాద్రి, హిమాలయము, అద్రిరాజు, మిహికాద్రి, చలికొండ, ఈముదరి, వలిమల, తెలికొండ, గట్లుఱేఁడు

## క్షే

క్షేత్రము - వప్రము, కేదారము, క్షేత్రము మడి, పొలము, మాగాణి

## క్షౌ

క్షౌరము - క్షౌరము, భద్రాకరణము, ముండనము, వపనము, కొఱుఁగు, చెఱుఁగు, కోఁగు

## క్ష

క్షమ - క్షితి, క్షాంతి, తాలిమి, సైరణ, ఓర్పుట, ఓరిమి, తాళుకొనుట

# 5. రూపాంతరపరిచ్ఛేదము.



## అ

అలక, అలకము

అభిలాష, అభిలాషము

అక్షత, అక్షతము

అమృతవిష్ణు, అమృతవిభుఁడు

అలది, హాలది

అణిమ, అణిమము

అర్చి, అర్చిస్సు

అర్చి, అంగిరసుఁడు

అక్షజుఁడు, అక్షజము

అందలు, అందోలు

అవి. అవ్వి, ఆయవి, అయ్యవి

అతను, అతఁడు, ఆతఁడు

అనెను, అనియెను, అనె

అగును, అవును, ఔను

అంటివి, అనితివి

అగుము, అవుము, కమ్ము, ఔను

అగుఁడు, అవుఁడు, ఔడు, కండు

అనడు, నండు, నాఁడు

అనుదురు, అందురు, అండురు

అపుడు, అప్పుడు, అప్డు

అగుట, కావుట

అగుదును, కావుదును

అపుడుకా, అనవుడుకా, నావుడుకా

అవుడు, ఔడు

అరుదెంచు, అరుగుదెంచు

అజు, అజ్జు

అయారె, అయారె

అవ్వారి, అవారి

అక్కట, అకట, కటా, కట్టా, కట్ట, కటకట

అట్టిక, అటిక

అట్టుక, అటుక

అట్టె, అటె, ఆటె

అయ్యో, అయ్యో

అట్టు, అటు

అమ్మ, అమ

అక్క, ఆక
అయ్య, అయ
అవ్వ, అవ
అచ్చట, అచట
అచ్చటు, అచటు
అన్ని, అని
అడఁగు, అణంగు
అడుగు, అడ్గు
అబ్బురము - అబ్రము
అదురుచు, అద్రుచు
అదె, అదే, అదుగో, అదిగో
అడుగో, వాఁడుగో
అల్ల, అల, ఆ
అవల, అవ్వల, ఆవల, అవతల, ఆతల

## ఆ

ఆవుడు, ఆవుజు
ఆరాటము, ఆరటము
ఆడేలు, ఆడెలు
ఆయె, అయ్యె, ఆయెను
అఱుగురు, ఆర్గురు, ఆఱువురు, ఆర్వురు
ఆమె, ఆపె, ఆవిడ, ఆబిడ
ఆయువు, ఆయుస్సు
ఆత్మ, ఆత్మము, ఆత్ముఁడు
ఆపత్తు, ఆపద

## ఇ

ఇంద్రజి, ఇంద్రజిత్తు, ఇంద్రజిత్తుఁడు
ఇది, ఇద్ది, ఈయది, ఇయ్యది,
ఇతఁడు, ఈతఁడు
ఇద్దఱు, ఇరువురు, ఇర్వురు, ఇరుగురు, ఇర్గురు
ఇగురు, ఇవురు
ఇవము, ఇగము
ఇడెను, ఇడియెను, ఇడె
ఇడ్డ, ఇడిన
ఇపుడు, ఇప్పుడు, ఇప్డు
ఇల్లు, ఇలు
ఇట్టిక, ఇటిక
ఇట్టు, ఇటు
ఇచ్చట, ఇచొటు, ఇచట, ఇచ్చోట, ఇచ్చట
ఇన్ని, ఇని
ఇదిగో, వీడుగో
ఇదే, ఇదుగో, ఇదిగో

## ఈ

ఈరు, ఈరలు, మీరలు, మీరు
ఈతఁడు, ఇతఁడు
ఈలుగు, నీలుగు
ఈమె, ఈపె, ఈకె

## ఉ

ఉల్కము, ఉల్క
ఉగ్రశ్రవుఁడు, ఉగ్రశ్రవసుఁడు

ఉరము, ఉరస్సు, ఉరసు

ఉయ్యేల, ఊయేల, ఊయెల, ఊయాల, ఊయల, ఉయ్యేల, ఉయ్యాల

ఉప్పవడము, ఉప్పడము

ఉమ్మి, ఉమి

ఉందురు, ఉండుదుడు, ఉండురు

## ఊ

ఊర్ధ్వరేతుఁడు, ఊర్ధ్వరేతసుఁడు

## ఋ

ఋత్విజుఁడు, ఋత్విక్కు

## ఎ

ఎది, ఏది, ఎద్ది, ఏయది, ఎయ్యది

ఎవి, ఏవి, ఎవ్వి, ఏయవి, ఎయ్యవి

ఎవ్వరిత, ఎవర్త, ఎవ్వత, ఎవరిత, ఎవత, ఎవ్వరితి, ఎవ్వర్తి, ఎవ్వత, ఎవర్తి, ఎవతి, ఎవ్వరితె, ఎవతె, ఎవ్వర్తుక, ఎవతుక, ఎవ్వతుక

ఎతఁడు, ఏతడు, ఏడు

ఎపుడు, ఎప్పుడు, ఎప్డు

ఎక్కసక్కెయము, ఎకసక్కెయము, ఎకసక్కెము

ఎక్కిరింత, ఎకిరింత

ఎడ్డ, ఎడ

ఎగురు, ఎవురు

ఎన్నిక, ఎనిక

ఎమ్మిక, ఎముక

ఎచ్చట, ఎచట, ఎచ్చోటు, ఏచ్చోటు, ఎచోటు

ఎగయు, నెగయు

ఎట్టు, ఎటు

ఎదురుచు, ఎద్రుచు

## ఏ

ఏతెంచు, ఏగుదెంచు

ఏతము, ఏతాము

ఏడుగురు, ఏడ్గురు, ఏడ్వురు

ఏమె, ఏపె, ఏకె

ఏను, నేను

ఏము, మేము, నేము

ఏడు, ఏవాడు, ఎవ్వాడు, ఎవడు, ఎవ్వడు,

ఏరు, ఏవారు, ఏవారలు, ఏవాండ్రు, ఎవ్వారు, ఎవ్వారలు, ఎవ్వాండ్రు, ఎవ్వరు, ఎవ్వండ్రు, ఎవరు, ఎవండ్రు

## ఐ

ఐదుగురు, అయిదుగురు

## ఒ

ఒకటి, ఒకొటి, ఒక్కటి, ఒక్కొటి, ఎక్కటి, ఒకడు, ఒకండు, ఒక్కడు ఒకొండు, ఒక్కొడు, ఒండు

ఒకడు, ఒక్కొరుడు, ఒకొరుఁడు, ఒక్కొరుఁడు, ఒకరువుఁడు, ఒడ్లు

ఒకతె, ఒకరిత, ఒకర్త, ఒకర్తు, ఒకర్తుక, ఒకత, ఒకతుక, ఒకరిత, ఒకొర్త, ఒకొర్తు, ఒకొత, ఒకొతుక, ఒక్కరిత, ఒక్కర్త, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కత, ఒక్కతుక, ఒక్కొరిత, ఒక్కొర్త, ఒక్కొరు, ఒక్కొతుక, ఒకొతి, ఒక్కర్తి, ఒక్కర్తె, ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక

ఒనరు, పొనరు

ఒనరించెను, పొనరించెను

ఒదవు, పొదవు

## ఓ

ఓయారము, ఒయారము

## ఔ

ఔడు, అవుము

## క

కంధరము, కంధర

కకుప్పు, కకుభము

క్రసిమ, క్రసిమము

కలను, కలఁకు

కన్నియ, కన్నె

కడెము, కడియము, కడ్యము

కనియెను, కనెను, కనె

కనుక, కన్క

కంపిలి, కంపిల్లి

కనఁడు, కానడు, కనండు

కల్లి, కలి

కజ్జాయము, కజాయము

కట్టిక, కటిక

కప్పురము, కపురము

కమ్మటము, కమటము

కమ్మతము, కమతము

కడంగు, కణంగు

కక్కూరుతి, కక్కురుతి

కళ్లము, కళ్లాము

కడుపు, కడ్పు

కలికి, కల్కి

కప్పురము, కప్రము

కన్య, కన్యక

కారుకొనె, కార్కొనె

కద, కదా, కాద

## కా

కాలువ, కాల్వ

కానుక, కాన్క

కానను, కావునను

కావుతను, కాతను, కాక

కాంచె, కాంచెను

కావలుఁడు, కావలము

కాళిమ, కాళిమము

## కి

కినుక, కింక, కిన్క

## కు

కుందేలు, కుందెలు

కువ్వాడము, కువాడము

## కూ

కూరుకు, కూర్కు

## కె

కెలమ, కెలఁకు

## కే

కేళాకూళి, కేళకూళి, కేళాకుళి

## కొ

కొంచెము, కొంచియము

కొండెము, కొండియము

కొలను, కొలఁకు

కొలను, కొలఁకు

కొనియెను, కొనెను

కొమ్ము, కొనుము, కొను, కొండు, కొనుఁడు

కొంద్రు, కొందురు, కొంద్రు, కొండురు

కొట్టిక, కొటిక

కొమ్మ, కొమ

కొయఁగూర, కొయుగూర

కొమారుఁడు, కొమరుఁడు

కొమారిత, కొమరిత

## కో

కోవె, కొవె

## కౌ

కౌఁజు, కంజు

## గ

గంబూరము, గంబురము, గంబురా

గయ్యాళము, గళాయము

గవుసెన, గౌసెన

గవను, గవకు

గరిమ, గరిమము

## గా

గాలము, గాలాము

## గి

గిజిగాడు, గిజ్జిగాడు

## గ్రీ

గ్రీవ, గ్రీవము

## గు

గుడ్డము, గుడ్డాము
గురువు, గురుఁడు
గుడ్డి, గ్రుడ్డి
గుజ్జరాతి, గుజరాతి

## గృ

గృహస్థు, గృహస్థుఁడు

## గౌ

గౌఱియా, గౌత్తె, గౌఱియ

## గో

గోణము, గోణాము
గోతము, గోతాము
గోరువంక, గొరువంక
గోను, గోగు

## చ

చరిత్ర, చరిత్రము, చరిత, చరితము
చనియెను, చనెను, చనె

## చా

చాక, చావక
చార్వాకు, చార్వాకుఁడు

## చి

చిట్టి, చిటి
చిన్ని, చిన
చిమ్మట, చిమట
చిలుక, చిల్క

## చూ

చూడు, చూడుము

## చె

చెప్పుము, చెపుము
చెప్పుడు, చెపుడు
చెప్పఁగఁ, చెప్పఁగాఁ
చెమ్మట, చెమట
చెల్లియలు, చెలియలు
చెన్నటి, చెనటి
చెల్లాడము, చెల్లాణము

## జ

జవాది, జవాజ
జన్నియ, జన్నె
జగము, జగత్తు
జలముక్కు, జలముజము

## జా

జాబిల్లి, జాబిలి
జాది, జాజి

జాదు, జాజు
జాగ్రత, జాగ్రత్త

## ఝం

ఝంజము, ఝంఝాము

## ఝూ

ఝూదము, ఝూజము

## ఝో

ఝోతము, ఝోతాము
ఝోహారు, ఝోహరు

## ట

టక్కరి, డక్కరి
టక్కు, పక్కు

## త

తగణము, తగణాము
తడగము, తగణము
తరంగము, తరగ
తటిత్తు, తటితము
తపము, తపస్సు, తపసు
తమము, తమస్సు, తమము
తగులు, తపులు
తంగెడు, తంగేడు
తమ్మటము, తమటము
తమ్ములము, తములము
తల్లి, తలి
తమ్ము, తము

## త్వ

త్వక్కు, త్వచము

## తా

తాము, తారు, తమరు

## తి

తినియెను, తినె, తినెను
తిగియు, తివియు

## త్వి

త్విట్టు, త్విష

## తీ

తీఁగ, తీవ

## తు

తుమ్మెరి, తుమిరి
తువ్వర, తువ్వ, తుప్పర

## తృ

తృట్టు, తృష

## తె

తెగులు, తెవులు
తెల్ల, తెల

## తొ

తొగ, తొవ
తొగరు, తొవరు

## తో

తో, తోడేలు, తోడెలు

## ద

దప్పి, డప్పి
దవ్వు, దవు
దక్కు, డక్కు
దగ్గఱ, డగ్గఱ

## దా

దాయు, డాయు
దాకలి, డాకలి
దాగు, డాగు

## ది

దివియ, దివ్వియ
దిగు, డిగు
దిక్కు, దిశ

## దూ

దూయు, డూయు

## దృ

దృక్కు, దృశ

## ద్ర

ద్రఢిమ, ద్రఢిమము

## దె

దెందము, డెందము
దెప్ప, డెప్ప
దెప్పరము, డెప్పరము

## దొ

దొప్ప, డొప్ప

## ధ

ధవళిమ, ధవళిమము

## న

నగియించు, నగించు
నలురు, నలువురు, నల్వురు
నల్లేరు, నల్లెరు
నగు, నవ్వు, నవు

## నా

నాసిక, నాసికము

నాడు, అనఁడు, అనండు

నాగేలు, నాగెలు

నాడెము, నాణెము

## ని

నిను, నిన్ను

నిలు, నిల్వు

నిలుపు, నిల్పు

నిక్కము, నిక్కువము

నిదుర, నిద్దుర

నివ్వరి, నివరి

## నీ

నీచు, నీచుఁడు

నీలిమ, నీలిమము

నీవు, ఈవు

నీలుగు, నిలుగు, ఈలుగు

## ను

నువ్వు, నువు

## నె

నెఱలు, నెఱకు

నెట్టిక, నెటిక

నెమ్మలి, నెమలి, నెమిలి, నెమ్మి

నెగయు, ఎగయు

## నే

నేర్చు, నేరుచు

నేరుపు, నేర్పు

నేను, ఏను

నేత, నేత్రుఁడు

నేరేడు, నేరెడు

## నో

నోక, నోవక

## ప

పటిమ, పటిమము

పలుగురు, పలుగుండ్రు

పదుగురు, పదురు, పదుగుండ్రు, పదుండ్రు, పదువురు

పలుగురు, పలువురు

పడియెను, పడెను, పడె

పల్లు, పలు

పడ్డ, పడిన

పల్లేరు, పల్లెరు

పవ్వళించు, పవళించు

పదురుచు, ప్రదుచు

పంపు, పనుపు, పన్పు, పనుచు, పంచు, అంపు, అనుచు, అనుచు, అంచు

పగలు, పవలు

## ప్ర

ప్రథిమ, ప్రథిమము

ప్రక్కన, ప్రక్క

ప్రచేతసుఁడు, ప్రచేతుఁడు

## పా

పాత్రుఁడు, పాత్రము

పాదుక, పాదుకము

పాలిత కకుప్పు, పాలిత కకుభుఁడు

పాండిమ, పాండిమము

పాకెన్న, ప్రాకెన

## పి

పిలడు, పిలవడు

పిలుము, పిలువుము

పిల్లు, పిలు

## పు

పుల్లియ, పులియ

పుష్పముక్కు, పుష్పముచుడు

## పూ

పూవు, పువ్వు, పువు, పూ

పూను, ఊను

## పె

పెండారము, పెండేరము, పెండెరము, పెండరము

పెద, పెద్ద

పెన్నర, పెన్నెరు

పెరుగు, పెర్గు

పెక్కండ్రు, పెక్కురు

## ప్రా

ప్రావృట్టు, ప్రావృషము

## ప్రీ

ప్రీతిమ, ప్రీతిమము

## ప్రె

ప్రెగ్గడ, ప్రెగడ

## ప్రే

ప్రేమ, ప్రేమము

## ప్రో

ప్రోగు, ప్రోవు

## పొ

పొలతి, పొల్తి
పొదవు, ఒదవు
పొనరు, ఒనరు
పొందు, ఒందు
పొదము, ఒదవు
పొగరు, పొవరు
పొగ, పొవ

## పో

పోడిమి, పోణిమి
పోడు, పోవడు
పోదురు, పోవుదురు
పోయెను, ఓయెను

## బ

బల్లిదుఁడు, బల్లిదము
బత్తెము, బత్యము, బత్తియము
బంగారు, బంగరము

## బా

బాహువు, బాహు

## బు

బుడిపి, బుడ్పి

## బృ

బృందిమ, బృందిమము

## బె

బెగ్గడు, బెగడు
బెట్టిదము బెడిదము

## బే

బేహారము, బేహరము, బెహారము

## బొ

బొండ్లము, బొండ్లాము
బొమ్మ, బొమ
బొమ్మిడీకము, బొమడీకము
బొమ్మిడికము, బొమిడికము

## బ్ర

బ్రహ్మ, బ్రహ్మము

## భ

భగవానుడు, భగవంతుడు

## భా

భాజనము, భాజనుఁడు
భాసిలు, భాసిల్లు

## భి

భిక్ష, భిక్షము

## భు

భుజియించు, భుజించు

## భే

భేదిలు, భేదిల్లు

## భ్ర

భ్రమము, భ్రమ

## మ

మడుగు, మణుగు

మధువిట్టు, మధు విహాము

మనము, మనస్సు, మనసు

మనియెను, మనెను, మనె

మమ్ము, మము

మజ్జ, మజ

మత్తాబు, మతాబు

మల్లారము, మలారము

మండము, మండాము

మహిమ, మహిమము

## మా

మానేరు, మానెరు

మారు, మరు

మారెడు, మారేడు

## మ్ర

మ్రదిమ, మ్రదిమము

## మ్రా

మ్రాన్పడె, మ్రానుపడె

మ్రాను, మ్రాకు

## మి

మిత్రుఁడు, మిత్రము, మిత్రమ్ము, మిత్రంబు

మిసిమింతము, మిసిమింతుఁడు

మిగులు, మివులు

మినువడె, మివ్వడె

మిడుఁగురు, మిణుంగురు

మిమ్ము, మిము

## మీ

మీరు, మీరలు, ఈరు, ఈరలు

## ము

ములికి, ముల్కి

ముందు, ముఞా, మునుపు, మున్ను

ముల్లు, ములు

ముగ్గురు, మూగురు, ముగురు, మూవురు,
ముగ్వురు

ముద్దియ, ముదియ

ముత్తు, ముదము

ముక్కు, ముకు

## మూ

మూలుగు, మూల్గు, ములుగు

మూర్ఖుఁడు, మూర్ఖ

## మె

మెట్టిక, మెటిక

## మే

మేము, ఏము, సేము

## మొ

మొక్కరము, మొకరము

మొగ్గరము, మొగరము

మొల్లాము, మొలాము

మొగము, మొకము

మొక్క, మోక, మోసు

మొగిలు, మొయిలు

## మో

మోఱకు, మొఱకు

## య

యశము, యశస్సు

## యో

యోధ, యోధుఁడు

## ర

రక్తిమ, రక్తిమము

రచియించు, రచించు

రగులు, రవులు

రంజిలు, రంజిల్లు

రడ్డి, రడి

## రా

రాహువు, రాహు

రాములు, రాముల్

రాజిలు, రాజిల్లు

## రు

రుట్టు, రుష

## రే

రేను, రేఁగు

## రా

రాక్ష్యము, రాకము

## రో

రోలంబ, లోలంబ
రోచి, రోచిస్సు

## రౌ

రౌతు, రవుతు

## ల

లఘిమము, లఘిమ

## లా

లాతము, లాతాము

## లె

లెమ్మ, లెండు

## లొ

లొంగు, లొగు
లొట్టిపిట్ట, లొటిపిట, లొటియ

## వ

వసువు, వసుఁడు
వధము, వధ
వణిక్కు, వణిజు



వరిమ, వరిమము
వక్షము, వక్షస్సు
వఱను, వఱకు
వలను, వలకు
వన్నియ, వన్నె
వచియించు, వచించు
వర్ధిల్లు, వర్ధిలు
వట్టి, వటి
వడఁకు, వణఁకు
వనములు, వనముల్
వయ్యారి, వయారి
వత్తురు, వచ్చెదరు

## వా

వారు, వారలు, వాండ్రు

## వి

విధము, వితము
విరవాది, విరజాజి
విల్లు, విలు
వినియెను, వినెను, వినె
విడెము, విడియము, విడ్యము, వీడియము
విలసిల్లు, విలసిలు
విశదిమ, విశదిమము

విధాత, విధాతృఁడు

విష్ణువు, విష్ణుఁడు

విభ్రమము, విభ్రమ

విజృంభణము, విజృంభణ

## వి

వీటతాటము, వీటతటము, విటతటము

వీణము, వీణాము

## వృ

వృశ్చికము, వృశ్చకము

వృద్ధు - వద్ధుఁడు

## వే

వేగము, వేఁగ

వేగురు, వేవురు

వేఁగు, వేవు

వేదవిత్తు, వేదవిదుఁడు

## శ

శరణుఁడు, శరణము

శంభువు, శంభుఁడు

## శి

శిరము, శిరస్సు, శిరసు

## శం

శంకర, శంకరుఁడు

## శ్వే

శ్వేతిమ, శ్వేతిమము

## శో

శోణిమ, శోణిమము

## స

సవిత, సవితృఁడు

సంపత్తు, సంపద

సదసు, సదస్సు, సదము

సగము, సాము, సవము

సంధిలు, సంధిల్లు

సన్నియ, సనియ

సవ్వడి, సవడి

సంతోసము, సంతొసము, సంతసము

## సి

సివ్వంగి, సివంగి

## సు

సుమీ, సుమి, సుమ్మీ, సుమ్మి

సువ్వే, సూవె, సూ

సురద్విట్టు, సురద్విషు

## స్థై

స్థేమ, స్థేమము

## స్ఫు

స్ఫురణము, స్ఫురణ

## స్ఫే

స్ఫేమ, స్ఫేమము

## హ

హలది, అలది

హడపము, అడపము

హరిదళము, అరిదళము

హంసము, హంస

హనుమంతుఁడు, హనుమానుఁడు హనుమ

## హె

హెచ్చు, ఎచ్చు

## క్షు

క్షుత్తు, క్షుధ



# 6. ఉద్ధిత పరిచ్ఛేదము

## అ

అగ్గలము, అగ్గలికము
అతిధి, ఆతిధ్యము
అగ్ని, ఆగ్నేయము
అసురుఁడు, ఆసురము

## ఆ

ఆదిత్యుఁడు, అదితి
ఆర్షభము, ఋషభసముదాయము
అర్చిష్మంతుఁడు, అర్చిస్

## ఈ

ఈశ్వరుఁడు, ఐశ్వర్యము

## ఉ

ఉద్ధతి, ఔద్ధత్యము
ఉచితము, ఔచిత్యము
ఉదారత, ఔదార్యము

## ఐ

ఐంద్రి, ఇంద్రుఁడు

## క

కరుణ, కారుణ్యము
కవి, కావ్యము

## కు

కుతుకము, కౌతుకము

## కౌ

కౌంతేయుడు, కుంతి
కౌసుమము, కుసుమము

## క్రూ

క్రూరుఁడు, క్రౌర్యము

## గ

గరుడ, గారుడము
గంధర్వుడు, గాంధర్వము
గరిమ, గురు
గంభీరము, గాంభీర్యము

## గా

గార్గ్యుఁడు, గర్గి

గాంగేయుఁడు, గంగ
గాంగము, గంగ

## గి

గిరి, గైరిక

## ఘౌ

ఘౌకము, ఘూకము

## చ

చక్రము, చక్రి

## చు

చుట్టము, చుట్టరికము

## చె

చెలి, చెలిమి

## జా

జానకి, జనకుఁడు

## జ్వా

జ్వలనము, జ్వాల

## తా

తపస్సు, తాపసము, తాపసి, తపస్వి
తమస్సు, తామసము

## ధ

ధనవంతుఁడు, ధని

## ద

దనువు, దానవులు
దంతము, దంతి

## ది

దివి, దివ్యము
దితి, దైత్యులు

## దీ

దీనము, దైన్యము

## దు

దుష్టము, దౌష్ట్యము
దుహిత, దౌహిత్రుఁడు

## దృ

దృఢము, దార్ఢ్యము

## దా

దాండము, దండ
దాశరధి, దశరధుఁడు

## దై

దైత్యుఁడు, దితి

## ద్రో

ద్రోహి, ద్రోహము

## ద్రౌ

ద్రౌపది, ద్రుపద
ద్రౌణి, ద్రోణ

## ధు

ధురంధరుఁడు, ధౌరంధర్యము

## ధీ

ధీరుఁడు, ధైర్యము

## ధూ

ధూమ్యా, ధూమ

## న

నడ్వంతము, నడ
నగరము, నాగర, నాగరక

## నా

నాతి, నాతుక

## ని

నిజము, నైజము

## ప

పటువు, పాటవము
పరనము, పారము, పారకుఁడు

## ప్ర

ప్రణీతము, ప్రణేత
ప్రకటము, ప్రాకటము
ప్రవీణము, ప్రావీణ్యము

## పా

పార్వతి, పర్వతము
పాకశాసని, పాకశాసన
పారాశరుఁడు, పరాశర
పాత్రము, పత్ర
పాశ్యా, పాశ

## ప్రౌ

ప్రౌఢ, ప్రౌఢి, ప్రౌఢిమ

## పు

పురము, పౌరులు

## పూ

పూర్ణిమ, పౌర్ణిమ

## పై

పైకము, పికము

## పౌ

పౌస్తికము, పుస్తకము

పౌష్పము, పుష్పము
పౌలస్త్యము, పుంస్

భ

భవదీయము, భవత్

బ

బంధువు, బాంధవము
బలము, బలిమి

భృ

భృతి, భృత్యుఁడు. భర్త
భృగు, భార్గవుఁడు

భో

భోజనము, భోజ్యము, భోక్త

బ్రా

బ్రాహ్మణ్యము, బ్రాహ్మణ
భ్రామరము, భ్రమర

బా

బాణము, బాణ
బాకము, బకము
బాదరాయణి, బాదరాయణ

మ

మనుష్యత్వము, మనుష్య
మధురము, మధురిమ, మాధుర్యము
మనువు, మానవులు
మహిమ, మహత్తు
మహేశ్వరుఁడు, మాహేశ్వరము

మృ

మృత్యువు, మర్త్యుఁడు

మి

మిత్రుఁడు, మైత్రి
మిత్రము, మైత్రి

మా

మారుతి, మారుత
మాధుకరము, మధుకరము
మాయూరము, మయూర
మానోజ్ఞ, మనోజ్ఞ

ము

ముని, మౌనము

య

యశస్వి, యశస్సు

యో

యోగి, యోగము

## ర

రమణీయకము, రమణీయ
రజతము, రాజితము
రథము, రథికుఁడు, రథ్యము, సారథి
రమణ, రమణుఁడు, రామణీయము

## రా

రాఘవుఁడు, రఘువు
రావణి, రావణ

## రు

రుద్రుఁడు, రౌద్రము

## ల

లబ్ధము, లబ్ధి
లఘువు, లాఘవము

## వా

వాస్త్రము, వస్త్రము
వాసిష్ఠుఁడు, వసిష్ఠ
వార్షము, వృక్ష
వానము, వన
వాత్యా, వాత

## వి

విభుఁడు, వైభవము
విరళము, వైరళ్యము
విమానికము, వైమానికము
విద్యావంతుఁడు, విద్యా

## వీ

వీరము, వైరము

## వృ

వృత్తి, వార్తికము, వర్తనము
వృత్తము, వార్త

## వే

వేతస్వంతము, వేతసా

## వై

వైనతేయుఁడు, వినత
వైణము, వీణ

## శ

శత్రువు, శాత్రవము
శత్రువు, శాత్రవుఁడు
శరత్తు, శారదము
శంకరుఁడు, శాంకరము

## శ్ర

శ్రవము, శ్రవ్యము, శ్రావ్యము

## శా

శార్కరము, శర్కర

శి

శిల, శైలము

స్థి

స్థిరము, స్థైర్యము

శూ

శూలి, శూలము

శృ

శృంగము, శార్ఙము

శౌ

శౌకము, శుకము
శౌనకుఁడు, శునక

స

సమము, సామ్యము
సమానము, సామ్యము, సామాన్యము
సన్నిధి, సాన్నిధ్యము
సదృశము, సాదృశ్యము
సంగతి, సాంగత్యము
సహాయము, సాహాయ్యకము
సభ, సభ్యము

సా

సారస్వతము, సరస్వతి
సారసము, సరస్

సు

సుహృత్తు, సౌహృదము
సుఖము, సౌఖ్యము
సుభగము, సౌభాగ్యము
సుందరము, సౌందర్యము

సౌ

సౌకుమార్యము, సుకుమారము

సై

సైకతము, సికతా
స్త్రైణము, స్త్రీ

హా

హారము, హారి

హృ

హృదయము, హృద్యము

# 7. కృదంత పరిచ్ఛేదము.



## అ

అడఁగు, అడంకువ

అలుగు - అలక

అమ్ము - అమ్మకము

అల్లు - అల్లుడు, అల్లకము

## ఆ

ఆరు - ఆరుడు

ఆడు - ఆట

ఆవులించు - ఆవులింత

## ఇ

ఇగిలించు - ఇగిలింత

ఇచ్చు - ఈవి, యీగి

## ఉ

ఉబ్బు - ఉబ్బు

ఉత్సహించు - ఉత్సాహము

ఉద్యమించు - ఉద్యమము

## ఊ

ఊదు, ఊద

ఊడు - ఊట

## ఎ

ఎదురుకొను - ఎదురుకోలు

ఎండు - ఎండ

ఎక్కు - ఎక్కుడు

ఎఱుగు - ఎఱుక

ఎఱుఁగు - ఎఱుకువ

## ఏ

ఏలు - ఏలుబడి

## ఓ

ఓడు - ఓటమి

ఓర్చు - ఓపిక, ఓడ్పు

## క

కడఁగు - కడక

కలఁగు - కలఁత, కలగుండు
కలఁగు - కలక
కలుగు - కలిమి
కను - కానుక
కను - కాన్పు, కానుపు
కఱచు - కాటు
కలియు - కలపము
కట్టు - కట్టుఁబడి

క్రా

క్రాలు - క్రాక

కి

కినుయు - కినుక

కు

కుళ్ళగించు - కుళ్ళగింత

కూ

కూయు - కూఁత
కూర్చు - కూర్మి

క్రొ

క్రొను - క్రొనుగోలు

కో

కోరు - కోరిక, కోర్కె

గి

గిట్టు - గిట్టుబడి

గీ

గీఱు - గీఱ
గీయు - గీత

గె

గెలుచు - గెలుపు

చ

చచ్చు - చావు

చూ

చూచు - చూపు

చె

చెడు - చేటు, చెట్ట

చే

చేయు - చేఁత
చేరు - చేరుగడ
చేరు - చేరిక

డ

డయ్యు - డప్పి

త

తలఁచు - తలఁపు
తగు - తగవు
తక్కు - తక్కువ
తలపోయు - తలపోఁత
తడుపు - తడి

తడయు - తడవు
తలఁచు - తలపు
తరలు - తరలిక

తి

తిరియు - తిరిపెము

తీ

తీఱు - తీఱుబడి
తీయు - తీఁత
తీఱు - తీరుగడ
తీరుచు - తీర్పు

తే

తేలు - తేలిక
తేరు - తేఁగ

తు

తునుగు - తునక

త్రి

త్రిప్పు - త్రిప్పటము

త్రో

త్రోయు - త్రోపు

న

నమ్ము - నమ్మకము, నమ్మిక
నడచు - నడక
నటియించు - నటన, నాట్యము

ని

నిలుచు - నిలుకడ

నే

నేరుచు - నేరిమి

నొ

నొచ్చు - నొప్పి

ప

పడు - పాటు
పన్ను - పన్నిక

పా

పాడు - పాట
పాఱు - పఱుగు
పారు - పారుదల
పాఱు - పాఱుదల
ప్రాకు - ప్రాకుఁడు

పూ

పూను - పూనిక
పూచు - పూవు

పె

పెంచు - పెంపకము
పెనగు - పెనకువ

పొ

పొందు - పొందిక
పొలయు - పొలపము

## ఫో

ఫో - ఫోబడి

ఫోవు - పంపు

ఫోయు - ఫోత

## బ్ర

బ్రతుకు - బ్రదిమి

## మ

మను - మనుగడ

మను - మనికి, మన్కి

మను - మనువు

మఱచు - మఱపు

మండు - మంట

## మా

మాఱు - మాఱకము

మాయు - మాపు

## ము

మునుగు - మునక

ముదియు - ముదుక

## మే

మేయు - మేత

మేయు - మేపు

## రా

రా - రాబడి

రాచు, రాయు - రాపిడి

## రో

రోయు - రోత

## వ

వండు - వంట

వలచు - వలపు

వంగు - వంక

వచ్చు - వచ్చుబడి

వలియు - వలిపము

## వ్ర

వ్రయ్యు - వ్రప్పు, వ్రక్క

## వ్రా

వ్రాయు - వ్రాత

## వీ

వీడు - వీడ్కోలు, వీడ్కొను

## వే

వేయు - వ్రేటు

## వై

వైచు - వాటు

## సై

సైచు - సైరణ

## హ

హత్తు - హత్తుగడ

# 8. ప్రకృతి - వికృతి పరిచ్ఛేదము



| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| అంకము | అంకె | అప్సరస | అచ్చర |
| అంకుశము | అంకుసము | అష్టకము | అట్టము |
| అంగుష్ఠము | అంగుటము, అంగుళము | అన్యాయము | అన్నెము |
| | | అపూర్వము | అపురూపము |
| అంచలము | అంచు | అంభకుఁడు | అబ్బ |
| అంకము | అక్కు | అపూర్వము | అబ్బురము, అబ్రము |
| అధ | అంత | | |
| ఆంతరము | అంతరువు | అంబ | అమ్మ |
| అంతఃపురము | అంతిపురము | అంబిక | అమ్మిక |
| అన్ద్రము | అందము | అంబ | అవ్వ |
| అందుకము | అందము | అమావాస్య | అమవస, అమాస |
| అటవి | అడవి | అభ్యాసము | అబ్బెసము |
| అధికము | అదనము | అర్ధము | అర |
| అధఃకరణము | అతికరించుట | అఖాతము | అగడిత, అగడ్త |
| అక్షతలు | అక్షింతలు | | |
| అగరు | అగలు | అర్హుఁడు | అరుహుఁడు |
| అగ్ని | అగ్గి | అలసు | అలుచు |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| అవన్యాయము | అవనాయము |
| అపారము | అవ్వారి, అవారి |
| అశ్రద్ధ | అసడ్డ |
| అరుంధతి | ఆరంజోతి |
| అభ్రము | ఉప్పరము |
| అసువులు | ఉసురులు |
| అనేకపము | ఏనుఁగు, ఏనిక |
| అహో | హో, ఓ |
| అహంకారము | హంకారము |
| అహమహమిక | హామిక |
| ఆందోళకము | అందలము |
| ఆర్యుఁడు | అయ్య |
| ఆగ్రహాము | ఆకరము |
| ఆజ్ఞ | ఆన |
| ఆకాశము | ఆకసము |
| ఆజ్ఞప్తి | ఆనతి |
| ఆపోశనము | ఆపోసనము |
| ఆమంత్రణము | ఆమతి |
| ఆమందము | ఆముదము |
| ఆరామము | ఆరెము |
| ఆహారము | ఆరోగిణము, ఓగిరము, ఓయిరము, ఓరెము |
| ఆలస్యము | ఆలసము |
| ఆశ | ఆస |
| ఆశక్తి | ఆసక్తి |
| ఆరాత్రికము | హారతి |
| ఆశ్చర్యము | అచ్చెరువు |
| ఇత్తళము | ఇత్తడి, ఇత్తళి |
| ఇచ్ఛ | ఇచ్చ, ఇచ్చకము |
| ఇష్టిక | ఇటిక, ఇట్టిక |
| ఇక్షువు | ఇంచు |
| ఈర్ష్య | ఈరసము, ఎరుము |
| ఉత్తరము | ఉత్తరువు |
| ఉపాయము | ఉపము |
| ఉపవాసము | ఉపాసము |
| ఉపకారిక | ఉప్పరగ |
| ఉద్యోగము | ఉదియ, ఉద్దియ |
| ఉద్ఘాటనము | ఉగ్గడించు |
| ఉత్పత్తి | ఉప్పతిల్లు |
| ఉల్బణము | ఉప్పన, ఉబ్బు |
| ఉష్ట్రము | ఒంటె |
| ఉచ్ఛ్వాసము | ఉబ్బసము, ఉసివాసము |
| ఊర్మి | ఉమి, ఉమ్మి |
| ఉపాధ్యాయుఁడు | ఒజ్జ |
| ఉండము | గుట్ట |
| ఉద్దాలము | గుద్దలి |
| ఉన్మాదము | ఉమ్మాదము, ఉమాదము |
| ఉరము | రొమ్ము, రొమ్ము |
| ఊషరము | ఊషలము |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| ఋక్షము | రిక్క |
| ఏకము | ఒక |
| ఏకాకి | ఎక్కటి, ఒంటరి |
| ఏకాంతము | ఏకతము |
| ఒడ్యాణము | ఒడ్డాణము |
| కంసము | కంచము |
| కపింజలము | కౌజు, కముజు, కంజు |
| కంబళము | కంబడి, కంబళి |
| కక్షపాల | కకపాల, కక్కపాల |
| కర్కశము | కక్కసము |
| కచ్ఛూరము | కచోరము |
| కచ్ఛ | కచ్చ |
| కచ్ఛటి | కచ్ఛడము |
| కరారము | కటారి కటారు |
| కటాహము | కడవ |
| కదంబము | కడిమి |
| కటకము | కడెము, కడియము |
| కథ | కత |
| కర్తరి | కత్తెర |
| కన్యక | కన్నియ, కన్నె |
| కర్పూరము | కపురము, కప్పురము |
| కర్పరము | కప్పెర |
| కవిత | కైత, కయిత |
| కరవాలము | కరవాలు |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| కరకంఠుఁడు | కఱకంఠుఁడు |
| కర్కరము | కఱకు |
| కమలము | కలము |
| కల్మషము | కలుమసము |
| కల్య | కల్లు |
| కశ్మలము | కసుమాలము |
| కస్తూరి | కస్తురి |
| కటము | కాడు |
| కచ్ఛ | కాసె |
| కల | గంబోయి |
| కర్పూరము | గంబురము, గంబూర, గగబూరము |
| కటువు | కాటు |
| కచ్ఛము | చంక |
| కక్షము | చక్కిలి |
| క్రవ్యాసి | గరాసు |
| కాష్ఠము | కట్టియ |
| కావ్యము | కబ్బము |
| కార్యము | కర్జము |
| కాచము | గాజు |
| కాల | కరి |
| కాకము | కాకి |
| కాననము | కాన |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| కాలము | కారు | కుటీరము | గుడిసె |
| కామలము | కామాల | కుంభకారుఁడు | కుమ్మరి |
| కావటి | కావిడి | కుంభము | గుబ్బ |
| కార్పాటకుఁడు | కోమటి | కుశ్మాండము, కూశ్మాండము | గుమ్మడి |
| కాండము | గడ, కాడ | | |
| కీలకము | కీలు | కుంతి | గొంతి |
| కీర్తి | కీరితి | కురారము | గొడ్డలి |
| కులి | కేలు | కుడ్యము | గోడ |
| కుంకుమము | కుంకము | కురంటకము | గోరంట |
| కుండము | కుండ | కుల్య | కాలువ |
| కుర్కురము | కుక్క | కూటము | కూడిక |
| కుత్సితము | కచ్చితము | కూలము | కొలను |
| కురుళము | కురులు | కూటకము | కుంకటి |
| కుణక | కూన | కృష్ణుఁడు | కన్నడు |
| కుటజము | కొడిసె | కృత్తిక | కార్తె |
| కునష్ఠము | కొనటి | క్రూరుఁడు | కూళ |
| కుమారస్వామి | కొమరసామి | కేలి | గేలి |
| కుమారి | కొమరిత, కొమారి, కొమాఁత | కేతకి | గేదఁగి |
| | | కైవారము | కయివారము |
| | | కైరవము | కలువ |
| కుక్కుటము | కోడి | కోష్ఠము | కొట్టడి, కొట్టు |
| కుండణము | గుండము | కోమల | కోమలి |
| కుండలము | గుండ్రము | కోకిల | కోయిల |
| కుబ్జుఁడు | గుజ్జు, గుజ్జారి | కోకిలము | కోవెల |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| కౌపీనము | గోచి, గోణాము, గోణము |
| క్రాంతి | కాత్తె |
| క్రోశము | కోసు |
| క్రౌంచ | కొంచ |
| ఖండము | కండ |
| ఖడము | కగ్గము |
| ఖండ శర్కర | ఖండచక్కెర |
| ఖచితము | కచ్చితము |
| ఖడ్గమృగము | కటికమెకము |
| ఖర్జూరము | కజురము, కజూరము |
| ఖర్పము | కప్పెఱ |
| ఖరువు | కోఱ |
| ఖట్టిక | గద్దియ, గద్దె |
| ఖని | గని |
| ఖరళి | గరడీ |
| ఖురము | గుఱ్ఱము |
| అపూపము | అప్పము |
| ఖరము | గోరు |
| ఖాదనము | కవణము |
| ఖారము | కాణము |
| ఖాదనము | ఖానము |
| ఖాంతము | గాతము |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| గంధము | గందము |
| గహనము | గగనము |
| గరుత్మంతుఁడు | గరుటామంతుఁడు, గరటాలమంతుఁడు |
| గంజము | గాదె |
| గంధోళి | కణుదురు, కడుదురు |
| గర్భము | కడుపు |
| గదము | కతము |
| గారుడము | గరుఁడు |
| గ్రహము | గాము |
| గ్రంథి | కంతి |
| గ్రామణి | గామిడి |
| గార్దభము | గాడిద |
| గాయని | గాసి |
| గ్రాసము | గాసము |
| గ్రావము | ఱాయి |
| గాయనుఁడు, గాయని | గాన |
| గురువు | గరువ |
| గుగ్గులము | గుగ్గిలము |
| గుడాలయము | గుడారము, గుడారు |
| గుచ్ఛము | గుత్తి |
| గృహము | గీము |
| గృహిణి | గృహిత |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| గృధ్రము | గద్ద |
| గుణము | గౌనము |
| గుళిక | గుళిగ |
| గుణము | గౌనము |
| గృహస్థుఁడు | గేస్తుఁడు |
| గోష్ఠము | కొట్టము<br>కొటాము |
| గోరంకువు | గోరువంక |
| గోధుమము | గోధుమ |
| గోపాలుఁడు | గొల్ల |
| గోలకము | గోలి<br>గోలెము |
| గోరోజన | గోరోజనము<br>గోరజము |
| గోహింసకుఁడు | గోసంగి |
| గౌరవము | గారావము<br>గారాము<br>గారాబము |
| ఘట్టము | గట్టు |
| ఘట్టన | గట్టన |
| ఘటిక | గడియ |
| ఘటికారము | గడియారము |
| ఘటన | గడన |
| ఘాటము | గాటము |
| ఘారిక | గారె |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| ఘాఢము | గట్టి |
| ఘాసము | కసవు |
| ఘూకము | గూబ |
| ఘీంకారము | గీక |
| ఘురము | గొరిజ<br>గొరిసె |
| ఘోటము | గోడా |
| ఘోణి | గూటి |
| ఘోటిక | గోడిగ |
| చతుర | చతురు |
| చతురము | చతురు |
| చతురుఁడు | చదురుఁడు |
| చమృకము | చన్ను |
| చమరము | సవరము |
| చతుష్కము | చతుకము |
| చతురంగము | చదరంగము |
| చతురస్రము | చదరము |
| చతుర్థి | చవితి |
| చంద్రముఁడు | చందమామ |
| ఛందస్సు | చందము |
| చంద్రిక | చందిరిక |
| చణకము | సెనగ |
| చతుర్దంతము | చవుదంతి |
| చతుర్దము | చవుదరి |
| చతుష్షి | చవుష్షి |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| చక్రవాకము | జక్కువ |
| ఛాయ | చాయ |
| ఛాందసుఁడు | చాదస్తుఁడు |
| ఛాత్రుఁడు | చట్టు |
| చిరి | చిలుక |
| చిధ్రము | చీఁదర |
| చిద్రము | చిందఱ |
| చిత్ర | చిత్త |
| చిత్రము | చిత్తరువు |
| చీరము | చీర |
| ఛురిక | సురి, సురియ |
| చుచుందరి | చుంచు |
| చూర్ణము | సున్ని, సున్నము |
| చేలము | చేల |
| చోక్షము | చొక్కము |
| చోద్యము | సోదె, సోదెము |
| జంగముఁడు | జంగము |
| జట | జడ |
| జగత్తు | జగము |
| జలము | జలకము |
| జలూక | జలగ |
| ఝకటము | జగడము |
| డోల | డోలి |
| తంద్రి | తంతి, తంతె |

| ప్రకృతి | వికృతి |
|---|---|
| తంత్రము | తంతు |
| తంద్ర | తందర |
| తర్కారి | తక్కెడ |
| తమ్మటము | తప్పెట |
| తపస్సు | తపము |
| తపము | తబిసు |
| తపసి | తబిసి |
| తరంగము | తరగ |
| తరవారి | తరవరి, తరవలి |
| తరళము | తల్లడము |
| తమతము | తవరము |
| తస్కరుఁడు | తెక్కలికాఁడు |
| తామరసము | తమ్మి, తామర |
| తాంబూలము | తమలము, తమ్మలము |
| త్యాగము | తేగము |
| త్యాగి | తేగి |
| తాళము | తాడు |
| త్వర | తొందర |
| త్వర | దురము |
| తృక్క | తొక్క |
| తిలలు | తెలికలు |
| తిత్తిరి | తీతువు |

103. ఆ పప్పు ఈ నీళ్ళ ఉడుకదు
104. ఆమడలు దూరమైతే అంతఃకరణలు దూరమా?
105. ఆలూలేదూ చూలూలేదు కొడుకుపేరు సోమలింగము
106. ఆచారమునకు అంతములేదు అనాచారమునకు ఆదీలేదు
107. ఆశకు అంతములేదు నిద్రకు సుఖములేదు
108. ఆశ బొంధిస్తున్నది అవమానము బాధిస్తున్నది
109. ఆచార్యుని తలచి నిప్పులో చెయిపెట్టితే కాలదా
110. ఆవతిన్న అమ్మకు ఏవపారినద
111. ఆవుల మళ్లించినవాఁడు అర్జునుఁడు
112. ఆహారమందు, వ్యవహారమందు సిగ్గుపడరాదు
113. ఆడి తప్పరాదు పలికి బొంకరాదు
114. ఇల్లు కట్టిచూడు పెండ్లి చేసిచూడు
115. ఇంటికి జ్యేష్ఠాదేవి పొరుగునకు లక్ష్మీదేవి
116. ఇంటి దీపమని ముద్దుపెట్టుకొంటె మూతి మీసాలు కాలినవట
117. ఇంటి దొంగను ఈశ్వరుఁడైన పట్టలేడు
118. ఇంట్లో ఈగపులి బైట పెద్దపులి
119. ఇంట గెలువనివాఁడు రచ్చ గెలుచునా
120. ఇంటిపేరు కస్తూరివారు ఇంట్లో గబ్బిలాల వాసన
121. ఇంటివారు వేలుచూపితే బైటివారు కాలుచూపుతారు
122. ఇంటిసొమ్ము ఇప్పపిండి పొరుగింటి సొమ్ము పొడిబెల్లము
123. ఇచ్చేవానికి పత్రము రద్దూ చచ్చేవానికి మందువద్దు
124. ఇచ్చినవాడు దాత, ఇవ్వనివాఁడు పాత
125. ఇంట్లో ఈగలమోత బైట సవారీలమోత
126. ఇనుము విఱిగితే అతకవచ్చుగాని, మనసు విఱిగితే అతకరాదు
127. ఇల్లాలు గ్రుడ్డిదైతే ఇంటికుండలచేటు

128. ఇష్టరముంటే ఇల్లు కొన్నట్టు
129. ఇరుపోటీల ఇల్లుచెడు, వాతనొప్పుల ఒళ్లుచెడు
130. ఇదుగో పులిఅంటే అదిగో తోక అన్నట్టు
131. ఇస్తే చెడేదిలేదు చస్తే వచ్చేదిలేదు
132. ఇస్తివాయనం, పుచ్చుకొంటివాయనం
133. ఇల్లు మింగే అత్తగారికి యుగముమింగే కోడలు
134. ఇల్లు ఇరకాటం ఆలు మరకాటం
135. ఈచేతచేసి, ఆచేత అనుభవించినట్టు
136. ఈతగింజ ఇచ్చి తాటిగింజ లాగేవాడు
137. ఈతచెట్టుక్రింద పాలుత్రాగినా కల్లు అంటారు
138. ఈ పిల్లి ఆ పాలు త్రాగునా!
139. ఉంగరాలచేతితో మొట్టితే నొప్పి ఉండదు
140. ఉండనిస్తే పండుతుంది, ఊడదీస్తే యెండుతుంది
141. ఉట్టికి యెక్కలేనమ్మ స్వర్గాని కెక్కెక్కుతుంది
142 ఉత్తచేతుల మూరవేసినట్టు
143. ఉడుతకేలరా ఊళ్లో పెత్తనము
144. ఉద్యోగము పురుషలక్షణము అదిపోతే అవలక్షణం
145. ఉన్నమాట చెప్పిన ఉండూరు అచ్చిరాదు
146. ఉల్లిపాయంత బలిజ ఉంటే ఊరంత చెడుస్తాడు
147. ఉయ్యాలలో బిడ్డను ఉంచి ఊరంతా వెదకినట్టు
148. ఊపిరిపట్టితే బొజ్జ నిండునా?
149. ఊరు పొమ్మంటుంది కాడు రమ్మంటుంది
150. ఉల్లిచేసిన మేలు తల్లి చేయదు
151 ఉన్నవాడు ఊరికిపెద్ద చచ్చినవాడు కాటికిపెద్ద
152. ఉభయభ్రష్టుత్వము ఉప్పరసన్యాసము

153. ఊరంత ఒకదోవ ఉలిపికట్టె ఒకదోవ
154. ఊరంతా వడ్లు ఎండబెట్టుకొంటే నక్కతోక ఎండ బెట్టుకొన్నదట
155. ఊరుమీద ఊరుపడినా, కరణముమీద కాస్తపడదు
156. ఎంచబోతే మంచమంతా కంతలు.
157. ఎంతమంచి గొల్లకయినా నిమ్మకాయంత వెఱ్ఱిఉండకపోదు
158. ఎంతమంచిది పందియైనా అమేధ్యము తినకమానదు
159. ఎక్కడ కట్టితేనేమి మనమందలో ఈనితేసరి
160. ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య
161. ఎద్దు ఈనిందంటే, గాటకట్టెయ్యమన్నట్టు
162. ఎద్దు ఎండకు దున్న నీడకు.
163. ఎలుకమీది కోపానఇంటికి చిచ్చుపెట్టుకొన్నట్లు
164. ఎతి అంటే ప్రతి.
165. ఎక్కిరించబోయి వెల్లికిలబడ్డాడట.
166. ఎక్కమంటే ఎద్దుకు కోపం, దిగమంటే కుంటివానికి కోపము
167. ఎద్దుపుండు కాకికి ముద్దా
168. ఎలుకకు పిల్లిసాక్ష్యము
169. ఎరువుల సొమ్ములు బరువులచేటు, తియ్యాపెట్ట తీపులచేటు, అందుల ఒకటిపోతే అప్పులచేటు
170. ఎవరి ప్రాణము వారికితీపి
171. ఎఱనువేసి, చేపనుబట్టినట్టు
172. ఎవరి నీళ్ళలో వారే మునుగవలెను
173. ఎవరి వెఱ్ఱి వారికి ఆనందము
174. ఏకాలు జారినా పిల్లికేమోసము
175. ఏటోవేసినా ఎంచివెయ్యవలెను
176. ఏపాటుతప్పినా సాపాటుతప్పదు

177. ఏపుట్టలో ఏపామున్నదో తెలియదు
178. ఏగాలి కాచాప ఎ త్తినట్లు.
179. ఏలేవాని ఎద్దుపోతే నేమి కాచేవాని కన్నుబోతేనేమి?
180. ఐతే అల్లిసాహెబ్, కాకుంటే కాపింసాహెబ్
181. ఒకయొరలో రెండుకత్తు లిముడవు
182. ఒక కన్నుకన్నుగాదు ఒక కొడుకు కొడుకుగాదు
183. ఒకనాడు ధారణ ఒకనాడు పారణ
184. ఒక్కొక్కరాయి తీస్తుంటే కొండైనా కరుగుతుంది
185. ఒకవేదెబ్బ రెండేముక్కలు.
186. ఓబీ ఓబీ నీవువద్లుదంచు, నేను పక్కలు ఎగురవేస్తాను
187. ఓపనివాడు కోరనిదీ ఒంటనివాడు ఆడనిదిలేదు
188. ఔషధానకు అపపత్యానకు చెల్లు రోగముపై పెచ్చు
189. కంచుమ్రోగినట్లు కనకంబు మ్రోగునా
190. కండ్లుపోయిన తర్వాత సూర్యునకు నమస్కారములా
191. కడి, గండముగాచును
192. కడుపుతో ఉన్నమ్మ కనకమానునా, వండినమ్మతినక మానునా
193. క త్తిపోటుతప్పినా కలంపోటు తప్పదు
194. కధకు కాళ్ళులేవు ముంతకు చెవులులేవు
195. కన్నుపొయ్యేటంత కాటుకెందుకు
196. కన్ను ఎఱుగకున్నను, కడుపు ఎఱుగుతుంది
197. కమ్మర వీధిలో సూదులు అమ్మనట్లు
198. కడవంత గుమ్మడికాయ, క త్తిపీటకులోకువే
199. కడిఅంటే నోరుతెఱచి, కళ్లెమంటే నోరుమూయుట
200. కండ్లకు దూరమైతే చెవులకు దూరమా
201. కందకులేని దురదబచ్చలికెందుకు

202. కనిగుడ్డి వినిచెవుడు.
203. కన్నతల్లికైనా కనుమరుగుండవలె
204. కలిగినవారికి అందఱు చుట్టములే
205. కాకిపిల్ల కాకికి ముద్దు
206. కాచిన చెట్టునకే రాళ్ళదెబ్బలు.
207. కాలికివేస్తే మెడకు మెడకు వేస్తే కాలికి
208. కాకిపుట్టి నలుపే, పెరిగీ నలుపే
209. కాకులనుకొట్టి గద్దలకు వేసినట్లు
210. కారణములేక కార్యముపుట్టదు
211. కాలముపోవును మాటనిలుచును
212 కార్తెముందు ఉఱిమినా కార్యముముందు పదరినా చెడుతుంది:
213. కాలుజారితే తీసికోవచ్చుగాని, నోరుజారితే తీసికోఁగూడదు
214. కాలేకడుపునకు మండేగంజి
215. కావడి ఎన్నివంకలు తిరిగినా ఇల్లుచేరితేసరి
216. కాశికిపోతే కట్టికుక్క గంగగోవగునా.
217 కుండలో కూడు కదలకుండాల, పిల్లలు మొద్దులాగుండాల
218. కుండల్లో గుఱ్ఱాలు తోలినటులు
219. కుక్క కాటుకు చెప్పుదెబ్బ
220. కుక్కతోకపట్టుకొని గోదావరి ఈదవచ్చునా ?
221. కుక్కనుగొట్ట బచ్చెన కోలకావలయునా
222. కురూపి ఏమిచేస్తున్నాడంటే సురూపాలన్నీ లెక్కపడుతున్నాడు
223. కుక్కనుముద్దు పెట్టుకొంటె మూతినాకినటులు
224. కుంటికులాసం ఇంటికిమోసం
225. కులమెఱిగిన చుట్టము, స్థలమెఱినవాసము
226. కులహీనమైనవరహీనము కారాదు

227. కూచమ్మ కూడబెట్టితే మాచమ్మ మాయంజేసింది
228. కూటికిపేదైతే కులానికి పేదకాదు
229. కూలికివచ్చి పాలికి మ్మాట్లాడినటులు
230. కూసేగాడిదవచ్చి, మేసేగాడిదను చెడిపినటులు
231. కూర్చుండి పడుకోవలె.
232. కొండంత దూదికి కొండంత నిప్పేల ?
233. కొండతదేవునకు కొండంత పత్రియా.
234. కొండనుత్రవ్వి యెలుకను బట్టినటులు.
235. కొండమ్రింగేవానికి గోపురము అడ్డమా.
236. కొడుకుబాగుండవలె కోడలు ముండమొయ్యవలె.
237. కొత్తఅప్పుకు బోతే పాతఅప్పు బైటబడినటులు
238. కొత్తరవింత పాతొకరోత
239. కొన్నవాడే తిన్నవాడు
240. కొత్తనీళ్ళకు చేపలు ఎదురెక్కినటులు
241. కోడలు గృహప్రవేశము అత్తఅగ్నిప్రవేశము
242. కోతికి కొబ్బరికాయ అచ్చినటులు
243. కోపం, పాపకారణము
244. కోలఆడితే, కోతి ఆడినటులు
245. కోడలు నలుపైతే, కులమంతా నలుపు
246. కోలలేనిపెట్టు, తాడులేనికట్టు
247. గంగలో మునిగినా, కాకిహంస అవుతుందా
248 గంతకు దగిన బొంత
249. గతిలేనమ్మకు గంజేపానకము
250. గతులకుపోతే బతుకులుపోయినవి
251. గరుడాయ లెస్సఅంటే శేషాయలెస్సఅన్నటులు

252. గాజులబేరం భోజనానికిసరి
253. గాడిదె పుండుకు బూడిదెమందు
254. గుడ్డికన్ను మూసినా తెఱచినా। ఒకటియే
255. గురువుమాట మీరరాదు, గడ్డపార మ్రింగరాదు
256. గుఱ్ఱముగ్రుడ్డిదైనా దాణాలో తక్కువుండదు
257. గ్రుడ్డికన్నా మెల్లమేలు
258. గ్రుడ్డివాడెఱుఁగునా? కుందనపుచాయ
259. గుమ్మడికాయ పోవుదారి గానక, ఆవగింజ పోవుదారి అడ్డెపట్టిచూస్తాడు
260 గుమ్మిడి కాయలదొంగ అంటే తనభుజాసుతాను తడువుకొన్నటులు
261. గురువునకుతగిన శిష్యుఁడు
262. గుంట్రా దాచిన కూతురిపెండ్లి నిలుచునా?
263. గ్రుడ్డియెద్దు చేనిలో బడ్డటులు
264. గ్రుడ్డివచ్చి పిల్లను ఎక్కిరించినటులు
265. గురువిందగింజ తనక్రింది నలుపు ఎఱుగదు
266. గొడ్డుపోతేమియెఱుగురా? బిడ్డలరుచి
267. గొఱ్ఱెకొవ్వితే గొల్లవానికే లాభము
268. గొడ్రాలికి ఏమితెలుసురా బిడ్డనొప్పులు
269. గొఱ్ఱెనుతినేవాడు పోతే బఱ్ఱెను తినేవాడువచ్చినటులు
270. గోవులేని యూరగొడ్డు గేదే శ్రీమహాలక్ష్మి
271. గొఱుగఁగా మిగిలినదే జుట్టు
272. గొఱ్ఱె యేడిస్తే తోడేలుకు విచారమా।
273. గోచికిపెద్ద అంగవస్త్రమునకు జిన్న
274. గోచిపాతరాయుడు దొంగలకు మిండడు
275. గోరంతఉంటే కొండంత చేసినటులు
276. గోరుచుట్టు పైరోకటిపోటులు అన్నట్లు

277. గోవులనుజంపి, చెప్పులను దానముచేసినటులు
278. గోడసున్నము విడియముకు బనికిరాదు
279. గొల్లవారింటె పెండ్లి తెల్లవారింది
280. గొడ్డువాడు గొడ్డుకు ఏడిస్తే గొడారితోలుకు ఏడ్పాటడ
281 చంద్రునిజూచి కుక్కలు మొఱిగినటులు
282. చచ్చేవానికి మోకాలిలోతు
283. చదువవేస్తే ఉన్నమతి పోయినట్టు
284. చద్దికూడు తిన్నమ్మ మొగుడి ఆకలి యెఱుఁగదు
285. చల్లకువచ్చి ముంతదాచినట్టు
286. చిత్తము శివునిమీద భక్తిచెప్పులమీద
287. చీకటి కొన్నాళ్ళు వెన్నెలకొన్నాళ్ళు
288. చీపురు కట్టకు పట్టుకుచ్చు కట్టినటులు
289 చూచినది పాడు కరచినది మామిడిటెంక
290. చూస్తే సీది, చూడకుంటే నాది
291. చాపు తప్పి కన్ను లొట్టబోయినటులు
292. చూడ చుంచెలుక గోడలుత్రవ్వ పందికొక్కు
293. చెట్టు ముందా గింజ ముందా అన్నట్టు
294. చెప్పేవానికి సిగ్గులేకపోతే వినేవాడికి వివేకములేదా
295. చేపపిల్లకు ఈత నేర్పవలెనా!
296. చేసిన పాపం చెపితేపోవును
297. చేసేవి శివపూజలు దూరేవి దొమ్మరి గుడిసెలు
298. జయముఉండే వఱకు భయము ఉండదు
299. జిల్లేడుచెట్టున పారిజాతపు పుట్టునా!
300. డబ్బుకువచ్చిన చెయ్యి వరహాకువస్తుంది

301. తంటాలమారి గుఱ్ఱానికి తాటిపట్టే గౌరవం
302. తగిలిన కాలికే తగులుతుంది
303. తడిగుడ్డతో గొంతు తెగగోస్తొన్నటులు
304. తనకంపు, తనకింపు, పరులకంపు తనకు ఓకళింపు
305. తనకాళ్ళకు బందాలుతానే తెచ్చుకొన్నటులు
306. తనకుమాలిన ధర్మము మొదలు చెడ్డబేరము
307. తప్పులేనివారు ధరణిలోలేరు
308. తప్పులెన్నువారు తమతప్పు లెఱుగరు
309. తలలుబోడులైన తలుపులు బోడులా
310. తల్లి ఐనా అడుగనిది పెట్టదు
311. తాఁజెడ్డకోతి వనమెల్లఁ జెఱచె
312. తాటాకు చప్పుళ్ళకు కుందేళ్లు బెదరునా
313 తావలచినది రంభ తాముణిగినది గంగ
314. తిన్నయింట వాసాలు ఎన్నినటులు
315. తిమ్మని బ్రహ్మి, బ్రహ్మినితిమ్మి చేసినటులు
316 తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు
317. తీగెకు కాయబరువా
318. తీఁటపట్టినవాఁడు గోకుకొంటాడు
319. తెలిసేవఱకు బ్రహ్మవిద్య, తెలిస్తే కూసువిద్య
320. తెల్లగానుంటెపాలు, నల్లగానుంటె నీళ్లు
321. తేలుకుపెత్తనమిస్తే తెల్లవార్లు ఆంటబొడిచినటులు
322. దయలేని అత్తకు దండము పెట్టినాతప్పే
323. దయలేనివారికి దేవుడేదిక్కు
324. దినదినగండం నూరేండ్లు ఆయుస్సు
325. దీపము ఉండఁగనే ఇల్లుచక్క బెట్టుకొనవలెను

326. దుష్టుని జూచి దూరంగా తొలగాలి
327. దూరపుకొండలు నునుపు దగ్గఱకుబోతే రాళ్ళుగుండ్లు
328. దెబ్బకు దయ్యము పాఱినటులు
329. దేవుడు ఇచ్చునేగాని తినిపించునా!
330. దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు
331. ధైర్యములేని రాజు, యోచనలేని మంత్రి
332. దొంగ దొంగను ఎఱుగు
333. నవ్వు నాలుగందాల నష్టకారి
334. నాలుకా, నాలుకా, వీపునకు దెబ్బలుతేకు
335. నాచేతి మాత్ర వైకుంఠ యాత్ర
336 నిండుకుండ తొణకదు
337. నిజమాడితే నిష్ఠూరము
338 నిజము నిలకడమీద తెలియును
339. నిలకడలేనిమాట నీళ్లమూట
340. నీళ్లు మూటకట్టినటులు
341. నోరుకలిగితే బ్రతుకుతాడు
342. పండుజారి పాలలో బడ్డట్టు
343. పందికియేలరా పన్నీరు గిండి
344. పంచాంగములుపోతే నక్షత్రాలు పోవునా?
345. పగటిమాటలు పనికిచేటు, రాత్రిమాటలు నిద్రకు చేటు
346. పడుచుల కాపరం చిటుకులమంట
347. పనిలేని మంగలి పిల్లితల గొరిగినాడట
348. పప్పులేని పెండ్లి, ఉప్పులేని కూర
349. పాడిందే పాడరా! పాచిపండ్ల దాసరి

350. పాములలో మెలఁగవచ్చు కాని స్వాములలో మెలగఁరాదు
351. పాలుపోసి పెంచివా పాము కరవకమానదు
352. పాము కాళ్లు పామునకే ఎఱుక
353. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా?
354. పిట్ట కొంచెము కూత ఘనము
355. పిలువని పేరంటమునకు చెప్పని వక్కప్రొద్దు
356. పిల్లకాయలకు పీటకోళ్లకు చలిలేదు
357. పిల్లికి చెరలాటము ఎలుకకు ప్రాణసంకటము
358. పుట్టిననాటిబుద్ధి పుడకలతోగాని పోదు
359. పిల్లి కండ్లుమూసికొని పాలుత్రాగిన ఎవ్వరు చూడలేదనుకొన్నటులు
360. పులినిజూచి నక్క వాతపెట్టికొన్నటులు
361. పులిమీసాలుపట్టుకొని ఉయ్యాలలూగినటులు
362. పూటకూళ్లమ్మ పుణ్యమెఱుగదు
363 పెట్టితే తింటారుగాని, తిడితే పడరు
364. పెట్టినవారికి పుట్టినదే సాక్షి, పెట్టనివారికి పుట్టనిదే నిజము
365. పెదవికిమించిన పల్లు, ప్రమిదెకుమించిన వత్తి
366. పెదవిదాటితే పెన్న దాటుతుంది
357. పెరటిచెట్టు ముందునకురాదు
368. పెఱుగుట విఱుగుటకొఱకే
369. పేదవాని కోపము, పెదవికిచేటు
370. పేరు గంగానమ్మ త్రాగబోతే నీళ్లులేవు
371. పొయ్యి అరిస్తే చుట్టాలు, కుక్కలుకూస్తే కరువు
372. పొరుగింటచూడరా నా పెద్దచెయ్యి
373. పోయిన కన్నుకు మందువేస్తే ఉన్న కన్ను ఊడ్చుకపోయినటులు
374. పోరానిచోట్లకుపోతే రారాని నిందలు వచ్చును

375. ప్రాణముపోయినా మానము దక్కించుకోవలె
376. ప్రీతితో బెట్టినది పిడికెడేచాలు
377. పోరు నష్టము పొందు లాభము
378. పొరుగు పచ్చగా ఉంటే, పొయ్యిలో నీళ్లుపోసినటులు
379. బాధకు ఒకకాలము, భాగ్యానికి ఒకకాలము
380. బావిలోతు చూడవచ్చుగాని మనసులోతు చూడరాదు
381. బెల్లము ఉండేచోట ఈగలు ముసరుతాయి
382 బ్రతుకనిబిడ్డ తెగబారెడు
383. భోజునివంటి రాజు ఉంటే, కాళిదాసువంటి కవి అప్పుడే కలుగుతాడు.
384. మంచివానికి మరణమే సాక్షి
885. మనుష్యునకు ఒక మాట, గొడ్డునకు ఒక దెబ్బ
386. మంది ఎక్కువైతే మజ్జిగ పలుచన
387. మంత్రాలకు మామిడికాయలు రాలునా?
388. మనుష్యులుండరు కాని, మాటలుంటాయి
389. మనోవ్యాధికి మందులేదు
390. మాటకు మాటలు, నీటికి పాచి తెగులు
391. మాటలు తేటలు మాయింట, మాపటిభోజనము మీయింట
392. భక్తిలేని పూజ పత్రిచేటు
393. మంగలి పాత చాకలి కొత్త
394. మంత్రసానిముందు మర్మము దాచరాదు
395. మ్రింగ మెతుకులేదు మీసాలకి సంపెంగనూనె
396. ముగ్గురు ఆడంగులు కూడితే పట్టపగలే చుక్కలు పొడిపిస్తారు
397 ముంజేతికంకణానికి అద్దమేల?
398 ముంతెడు పాలకు ముత్తెమంత చేమిరి
399. ముందరికి వస్తే గొయ్యి వెనుకకుపోతే నుయ్యి

400. మూర్తి కొంచెము కీర్తి ఘనము
401. మొదట మోసము లాభానికి గ్రుద్దులాట
402. మోసేవానికి తెలుసు కావడి బరువు
403. రాతికుండకు ఇనుపతెడ్డు
404. రూకలేనివాఁడు పోకచెయ్యలేడు
405. లేనిబావకంటె గ్రుడ్డిబావ మేలు
406. లోన లొటారం బైట పింగారం
407 లోభికి మాటనష్టము
408. వండలేనమ్మకు ఒప్పులు మెండు, తేలేని అయ్యకు తిండి మెండు
409. వచ్చిన వాదు చచ్చినా పోదు
410. వానరాకడ ప్రాణము పోకడ ఎవరికి దెలియదు
411 విందూ, మందూ మూడుపూటలు
412 విడువుమంటే పాముకు కోపము, పట్టుకుంటే కప్పకు కోపము
413. వినయము లోకవశ్యము, విద్య రాజవశ్యము
414. విన్నన్న చెప్పింది వేదము
415. వెన్నపెడితే మ్రింగలేడు, వ్రేలుపెడితే కొఱకలేడు
416. వ్రాసేవాణ్ణి, కోసేవాణ్ణి, గీసేవాణ్ణి నమ్మరాదు
417. శాస్త్రిలవారింట జన్మించి, సోమయాజులవారింట చొచ్చి లవణమంటే దూడరేణమని ఎఱుఁగనా?
418. శివుని ఆజ్ఞలేక చీమ అయినా కఱువదు
419. శుష్కప్రియములు శూన్యహస్తములు
420. సెట్టి సింగారించేలోగా పట్నం కొల్లబోయినట్టు
421. సముద్రానికి ఏతముచేసినట్టు
422. సరసము విరసము కొఱకే
423. సొమ్ముపోయి దిమ్ము పట్టినటులు

424. హనుమంతునిముందర కుప్పిగంతులా
425. క్షేత్రమెఱిఁగి విత్తనము, పాత్రమెఱిఁగి దానము

---

## వ్యవసాయ సామెతలు

1. దారలు ఇచ్చినపాలుకంటె ధరణి ఇచ్చిన పాలుమేలు
2. తల్లిని నమ్మినవాఁడు. ధరణిని నమ్మినవాడు చెడడు
3. చేనికుదురు ఆవికుదురు ఉండవలెను
4 పొలములో పొలము దొఱికినా స్థలముదొఱకినా పోఁగొట్టగూడదు
5. వడిలేని చదువు, వెంబడిలేని సేద్యము పనికిరాదు
6. కూటికి గింజలులేక కొరముట్టులు లేక సేద్యము చేసేదిరోఁత
7. ఎద్దులేని సేద్యము, చద్దిలేని పయనము
8. బాపన సేద్యము బత్తెముచేటు
9. వానరాకఁడ, ప్రాణపోఁకడ తెలియదు
10. భరణి ఎండకు బండలు పగులును
11. కృత్తికలో కుతికెపిసుగుడు
12. రోహిణియెండలకు ఱోళ్ళు పగులును
13. మృగశిరకార్తెలో ముంగిళ్ళుచల్లఁబడు
14. ఆరుద్రవాన, అదునువాన
15. ఆశ్లేషవాన అరికాలుతేమ
16. వానలకు ఋతువుమఖ
17. పుబ్బకెరలితే భూతము కెరలినట్లు
18. ఉత్తరచూచి ఎత్తరగంప
19. విశాఖచూచుకొని విడువురకొంప

20. వృష్టికి ప్రమాణము, ఉత్తరహస్తలు
21. చిత్తస్వాతి వర్షించకపోతే చిగురుటాకులుమండు
22. స్వాతివానకు ముత్తెపు చిప్పలు
23. విశాఖలోవర్షము వ్యాధులకు హర్షము
24. మూలవాన ముంచక తీరదు
25. మూలముఱుఁగ గురియు, జ్యేష్ఠ చెడగురియు
26. రోహిణిలో విత్తనము తోలునిండనిపంట
27. ఆరుద్రతో అదనుసరి
28. ఆశ్లేషలో అడ్డెడు చల్లుటమేలు
29. హస్తకు ఆఱుపాళ్ళు, చిత్తకు మూఁడుపాళ్లు
30. చంద్రపరివేషము వర్షయోగము
31 వట్టిగొడ్డుకు అఱుపులెక్కువ
32. వర్షములేని మబ్బుకు ఉరుములెక్కువ
33. పడమట మెఱసిన పదిగడియలకు వర్షము
34 గట్టుమీద మేఘము మెఱిపితే, కండముందఱ వాన
35. ఓటికుండలో వఱడువలికితే వచ్చేదేవాన
36. తూనీగలాడితే తూమెడవర్షము
37. నేరేళ్ళుపండితే నేలలు పండును
38. కవిలిపండ్లు పండితే కఱువులువచ్చు
39. చింతపండితే చీడపండదు
40. తెగనిచేను తేమనోర్చును
41. దుక్కిగలభూమి, దిక్కుగలమనుజుఁడు చెడడు
42. అరక అరగితే గరిసె విరుగును
43. కలుపుతీయనిమడి, దేవుడులేనిగుడి
44. దుక్కిచలువేచలువ, తల్లిపాలేపాలు

45. పాపటము పదిసేద్యాలపెటు
46. పుట్టమన్ను వేస్తే భూములు పండును
47. వేళ్ళతో వెంపలివేసినారాః కొయ్యలతోఁగానుగలువేసినారా
48. వేపపిండి యెరువుతో సమానము
49. ప్రతికిపదిచాళ్లు జొన్నకు ఏడుచాళ్లు
50. పచ్చజొన్నపైరు గోంగూర
51. అయితే ఆరిగ, కాకుంటే కంది, దున్నిచల్లితే సెనగ
52. స్వాతివాన చేనుకు హర్షము
53. ఉత్తరపదును, ఉలవకు అదును
54. వంగముదురు, వరిలేత
55. మామిళ్ళకు మంచు చెఱుపు, కొబ్బరికుడితిచెఱుపు
56 తొలియేకాదశి తొలిపండు
57. ఎక్కువవెలపెట్టి గుడ్డను, తక్కువ వెలపెట్టి గొడ్డును కొనరాదు
58. మనుష్యునకు ఉన్నదిపుష్టి, పసరమునకు తిన్నదిపుష్టి
59. పాడిపసరమును, పసిబిడ్డను ఒకటగా జూడవలయును
60. గొఱ్ఱుగ్రుచ్చిననేల కరవుండదు

---

# దోష పరిచ్ఛేదము

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ఏలనన | ఏలయన | వకటి | ఒకటి |
| వాడున్నూ | వాఁడును | యెవ్వరు | ఎవ్వరు |
| నిన్నున్నూ | నిన్నునూ | వద్ద | ఒద్ద |
| అభీష్టం | అభీష్టము | వుప్పు | ఉప్పు |
| క్షేమం | క్షేమము | వూరు | ఊరు |
| దండకం | దండకము | నుంచి | నుండి |
| శెలవు | సెలవు | కొందరికి | కొందఱకు |
| దెగ్గర | దగ్గఱ | పాదుకు | నాదునకు |
| పీటిని | వీనిని | రాజుకు | రాజునకు |
| కోర్కెలు | కోర్కులు | నడుముకు | నడుమునకు |
| అందుకు | అందునకు | అతను | అతఁడు |
| ఇందుకు | ఇందునకు | ఇతను | ఇతఁడు |
| ఎందుకు | ఎందునకు | ఎతను | ఎతఁడు |
| తేవడము | తెచ్చుట | దాన్ని | దానిని |
| రావడము | వచ్చుట | ఇప్పటికిని యున్నారు | ఇప్పటికి మన్నారు |
| చెయ్యడము | చేయుట | మేసెడు యెద్దు | మేసెడు నెద్దు |

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వచ్చుయేనుఁగు | వచ్చు నేనుఁగు | దోదూయ మాన సుందు | దోదూయమాన మానసుడు |
| కడుచిన్న | కడుఁజిన్న | మాతాపితరులు | మాతాపితలు |
| దురితపుపగ్గములు | దురితపుఁబగ్గములు | ప్రశామము | ప్రశమకము |
| వానింభద్రపఱచు | వానిన్ భద్రపఱచు | ఇవ్వరా | ఈయరా |
| తోడంతెప్పల | తోడఁ తెప్పల | అవశ్యకంబు | ఆవశ్యకంబు |
| ఘటింబతిది | ఘటించితిని | దుర్నడత | దుష్టమైన నడత<br>చెడ్డనడత |
| ఒనరించితీశ | ఒనరించితినీశ | మృత్తువనైతి | మృత్యువనైతి |
| ఈఁదీది | ఈదియాది | నూతన యేర్పాటులు | నూతనమైన ఏర్పాటులు |
| అద్రిరాజల్లుని | అద్రిరాజునల్లుని | సంశయించక | సంశయింపక |
| పత్త్రిరిడి | పత్త్రియిడి | రిత్తసేతులు | రిత్తచేతులు |
| దాసోహంబని | దాసోహమ్మని<br>దాసోహమని | బెదరింపుచు | బెదరించుచు |
| కూర్చొని | కూర్చుండి | కులభూపణ | కులభూషణము |
| వద్దు | వలదు | పాటలాధరి | పాటలాధర |
| కద్దు | కలద | దాహంబు | దప్పి |
| బాగా | బాగుగ | అనేకమ్మ | అనుకమ్మ |
| తెలుసును | తెలియును | అనేవాడు | అనువాఁడు |
| అంశములు | విషయములు | సిఖ | శిఖ |
| మ్లేచ్ఛపాటలు | మ్లెచ్ఛులపాటలు | శింధూరము | సిందూరము |
| అనేకమంది | పెక్కుమంది | సదృుశులు | సదృశులు |
| యావన్మంది | యావజ్జనము | బాహ్వాంఘ్రులు | బాహ్వాంఘ్రులు |
| పరివారసురలఁ | పరివారసురులన్ | దంపతీపుంజము | దంపతిపుంజము |
| అధికగారాబము | మిగులగారాబము | ఉద్ధత నేతెంచి | ఉద్ధతి నేతెంచి |
| పలుమనుష్యులు | పలువురుమనుష్యులు | పిల్చుక | పిల్చుకొని |
| బహుకొద్ది | మిక్కిలికొలది | కప్పుక | కప్పుకొని |
| బహుగొప్ప | మిక్కిలి గొప్ప | విదుల్చుక | పుచ్చుకొని |
| అనుకూలవతులు | అనుకూల్యవతులు | తోడుకపొమ్ము | తోడుకొనిపొమ్ము |
| స్వతంత్రంబుచేకూరె | స్వాతంత్ర్యంబు చేకూరె | ప్రకటింపుచు | ప్రకటించుచు |
| | | ప్రార్థింపుచుఁ | ప్రార్థించుచుఁ |

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| దర్శింపుచుఁ | దర్శించుచుఁ | కాచుక | కాచుకొని |
| చెల్లింపుచుఁ | చెల్లించుచుఁ | పంచుక | పంచుకొని |
| అంకురింపుచు | అంకురించుచు | తన్నుక | తన్నుకొని |
| సేవింపుచు | సేవించుచు | చించుక | చించుకొని |
| భజింపుచు | భజించుచు | కట్టుకపోవునా | కట్టుకొనిపోవునా |
| వికసింపుచు | వికసించుచు | పెట్టుక | పెట్టుకొని |
| విలోకింపుచు | విలోకించుచు | కూడుక | కూడుకొని |
| ఆవహింపుచు | ఆవహించుచు | భాద | బాధ |
| చింతింపుచుఁ | చింతించుచుఁ | చెదవేఱు | చదవేఱు |
| పరియింపుచుఁ | పరియించుచుఁ | చమరించుట | చెమరించుట |
| పల్గుణుఁడు | ఫల్గునుఁడు | కుష్టువ్యాధి | కుష్ఠవ్యాధి |
| నిర్ణిద్రత | నిర్నిద్రత | అర్ధరాత్రి | అర్ధరాత్రము |
| త్రిణయమునకు | త్రినయనునకు | మహర్నవమి | మహార్నవమి |
| దస్వప్నము [లు | దుస్స్వప్నము [లు | మహర్దశ | మహార్దశ |
| చతుష్పాదజంతువు | చతుష్పాజ్జంతువు | ఝుమ్మఝుమ్మ | జుమ్మజుమ్మ |
| అంబోధి | అంభోధి | ఝళిపించు | జళిపించు |
| ఉచ్ఛాటన | ఉచ్చాటన | పూర్వీకులు | పూర్వులు |
| భేతాళుఁడు | బేతాళుఁడు | దృష్టాంతరము | దృష్టాంతము |
| సద్రుశులు | సదృశులు | ఆధిక్యతము | ఆధిక్యము |
| ధృవ | ధ్రువ | నిముషము | నిమిషము |
| చాలా | చాల | చత్రము | ఛత్రము |
| కూడా | కూడ | తద్యోత | తద్ద్యోత |
| చెప్పేది | చెప్పునది | సముజ్వల | సముజ్జ్వల |
| వ్రాసేది | వ్రాయునది | తద్రవ్యముఁ | తద్ద్రవ్యముల్ |
| చూసేది | చూచునది | క్రమేణ | క్రమముగా |
| మళ్ళా | మఱలఁ | ప్రకాసించు | ప్రకాశించు |
| తిరుగా | తిరుగఁ | అకస్మాత్తుగ | అకస్మికముగ |
| రావాలి | రావలెను | వర్ణాశ్రమ | వర్ణాశ్రమ |
| పోవాలి | పోవలెను | వర్నింప | వర్ణింప |
| స్వంతము | సొంతము | జగత్పూర్ణు | జగత్పూరు |

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ధట్టి | దట్టి | శాశ్వితము | శాశ్వతము |
| తునకలు | తునుకలు | పుస్తుకము | పుస్తకము |
| తలగని | తలుగని | తలముళ్ళు | తలముండ్లు |
| గండగొడ్డలి | గండ్రగొడ్డలి | తతిమ్మా | తక్కిన |
| పిరము | శిరము | శరణ | శరణు |
| ఉద్ధవిడి | ఉద్దవిడి | వరహావతారము | వరాహావతారము |
| పూజ్యాతుడు | పూజితుడు | చెముడు | చెవుడు |
| కురువింద | గురువెంద | దేముడు | దేవుడు |
| భ్రమయించు | భ్రమియించి | చెలచు | చెలుచు |
| లెఖ్ఖ | లెక్క | తరాలున | తటాలున |
| అవలంఫించు | అవలంబించు | ఎగర | ఎగుర |
| దరిద్రము | దారిద్ర్యము | ప్రాముఖ్యుడు | ప్రముఖుడు |
| కృంక | క్రుంకు | దురాదృష్టము | దురదృష్టము |
| వెంట్రుకలు | వెండ్రుకలు | అబద్దము | అబద్ధము |
| తిరగలి | తిరుగలి | మరిగింపక | మఱగింపక |
| కరేపాకు | కరివేపాకు | తెలిసి | తెలిపి |
| అయిష్టము | అనిష్టము | రాయభారము | రాయబారము |
| మధ్యాన్నము | మధ్యాహ్నము | ఎలిక | ఎలుక |
| చూట్కు | చూండ్కు | వెలుపలికి | వెలుపలికి |
| వేట్కు | వేడ్కు | ఫలహారము | ఫలాహారము |
| మాట్కి | మాడ్కి | పరియవసానము | పర్యవసానము |
| సూర్యరస్మి | సూర్యరశ్మి | పందొమ్మిది | పది తొమ్మిది |
| మచ్చకంటి | మచ్చెకంటి | ఇరవై | ఇరువది |
| పశిడి | పసిడి | ముప్పై | ముప్పది |
| కృష్ణాజినము | కృష్ణాజినము | సాయంత్రము | సాయంకాలము |
| కృష్ణమూర్తి | కృష్ణమూర్తి | | సాయంతనము |
| ఇవ్వగా | ఇయ్యగా | యోచించి | యోజించి |
| చేశిరి | చేసిరి | చతురశ్రమము | చతురశ్రము |
| నివశించి | నివసించిరి | అస్తమానము | అస్తమయము |
| అగుపడు | అగపడు | తోచె | తోడి |

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| విండా | విండ | బాలులు | బాలురు |
| ఓమాట | ఒకమాట | అద్దాన్నము | అధ్వానము |
| కంసాలి | కమసాలి | సామర్థులు | సమర్థులు |
| సింహ్మము | సింహము | అభ్యంగనము | అభ్యగము |
| అంమ్మ | అమ్మ | | అభ్యంజనము |
| బ్రాంహ్మణుఁడు | బ్రాహ్మణుఁడు | సామితె | సామెత |
| అక్షింతము | అక్షతలు | రొండు | రెండు |
| పౌర్ణిమి | పూర్ణిమ | ద్రుఢ | దృఢ |
| సౌహార్ద్రము | సౌహార్దము | పదకొండు | పదనొకండు |
| వయిద్యము | వైద్యము | పన్నెండు | పండ్రెండు |
| ద్రౌపతి | ద్రౌపది | పదమూడు | పదుమూఁడు |
| అర్జ్జనుఁడు | అర్జునుఁడు | పదహేను | పదునేను |
| దణ్ణము | దండము | పత్రము | పత్త్రము |
| బాష | భాష | మహాత్వము | మహాత్త్వము |
| ఆదందభాష్పములు | ఆనందబాష్పములు | జాగ్రత | జాగ్రత్త |
| వ్రయము | వ్యయము | సన్యాసి | సన్న్యాసి |
| బాలింత | బావెంత | కండ్లు | కన్నులు |
| నిఘంటు | నిఘంటువు | యవ్వనము | యౌవనము |
| పద్మనేత్రి | పద్మనేత్ర | తక్షణము | తత్క్షణము |
| గుణమంతుఁడు | గుణవంతుఁడు | క్రృషి | కృషి |
| శీత | సీత | బ్రంహ్మ | బ్రహ్మ |
| సీతము | శీతము | వాకృచ్చు | వాక్రుచ్చు |
| శీతాఫలము | సీతాఫలము | శ్రీశ్రూష | శుశ్రూష |
| సన్నెకల్లు | సానకల్లు | నాయకి | నాయిక |
| కొయ్యకూర | కోయగూర | శ్వీయము | స్వీయము |
| తిరగమాత | తిరుగవోత | దారుఢ్యము | దార్ఢ్యము |
| సున్నిపిండి | మెఱుగుపిండి | నాగరికత | నాగరికత |
| సమారాజన | సమారాధన | నాగరీకత (ము) | నాగరకత |
| చలివెందల | చలిపందిరి | చేతు | చేయుదును |
| వశిషుఁడు | వశిష్ఠుఁడు | చేతురు | చేయుదురు |

| తప్పు | ఒప్పు |
|---|---|
| వాదన | వాదము |
| రజీతము | రజతము |
| ధయిర్యము | ధైర్యము |
| వ్రాశి | వ్రాసి |
| అభ్యశించు | అభ్యసించు |
| చేశిశాయంగల | చేసిచేయంగల |
| రాయుఁడు | రాయఁడు |
| కృష్ణదేవరాయులు | కృష్ణదేవరాయలు |
| కొంచము | కొంచెము |
| శేవకుఁడు | సేవకుఁడు |
| శేన | సేన |
| శనగలు | సెనగలు |
| అవిశనూనె | అవిసెనూనె |
| ద్వారా | వలన |
| గుండా | |
| యడల | ఎవల |
| చెంద్రుఁడు | చంద్రుఁడు |
| ఏనుగ | ఏనుఁగు |
| ఏనిక | |
| పీనిగ | పీనుఁగు |
| పీనుగ | |
| వణ్ణము | అన్నము |
| బేధము | భేదము |
| శనేచ్చరుఁడు | శనైశ్చరుఁడు |
| బహూశా | అనేకవిధములు |
| సభికుఁడు | సభ్యుఁడు |
| పాటకుఁడు | గాయకుఁడు |
| తత్వము | తత్త్వము |
| సత్త్వగుణము | సత్త్వగుణము |
| బయ్యము | భయము |

| తప్పు | ఒప్పు |
|---|---|
| రావడము | వచ్చుట |
| వేటవాలు | ఏపినాలు |
| వడలు | ఒడలు |
| ఒంతెన | వంతెన |
| మిరపకాయ | మిరెపకాయ |
| భంధువులు | బంధువులు |
| గుర్రము | గుఱ్ఱము |
| చేరెడు | చారెడు |
| స్తానము | స్నానము |
| రతము | వ్రతము |
| ముసిలి | ముసలి |
| రాత | వ్రాత |
| రూపాయి | రూపాయ |
| వెలుగుబంటి | ఎలుగుబంటి |
| తడిపి | తడపి |
| భావి | బావి |
| చాప | చేఁప |
| పానము | ప్రాణము |
| ద్రేహాము | దేహాము |
| నీల్లు | నీరు, నీళ్లు |
| క్లుప్తము | క్లప్తము |
| ములుగు | మునుఁగు |
| ప్రశక్తి | ప్రసక్తి |
| కర్నము | కరణము |
| నిర్నయము | నిర్ణయము |
| దక్షణాయణము | దక్షిణాయనము |
| త్రిణయన | త్రినయన |
| ఫల్గుణుఁడు | ఫల్గునుఁడు |
| ఆశ్వీజము | ఆశ్వీయుజము |
| వద్ద | ఒద్ద |

| తప్పు | ఒప్పు |
|---|---|
| అస్తులు | అస్థులు |
| ఆస్థి | ఆస్తి |
| గ్రామస్తులు | గ్రామస్థులు |
| శ్రేష్టము | శ్రేష్ఠము |
| రాగిచెట్టు | రావిచెట్టు |
| సొజ్జలు | సజ్జలు |
| దృతప్రకృతికము | ద్రత ప్రకృతికము |
| ఆస్తానము | ఆస్థానము |
| చిలక | చిలుక |
| వెధవ | విధవ |
| కారెము | కారము |
| ఎమిక | ఎముక |
| విధ్య. నిజ్జ | విద్య |
| విద్యుశ్చక్తి | విద్యుచ్ఛక్తి |
| చీర | చీరె |
| నాలిక | నాలుక |
| ప్రసంశ | ప్రశంస |
| శిశ్రూష | శుశ్రూష |
| సిష్యులు | శిష్యులు |
| ఈకెలు | ఈకలు |
| యడారి | ఎడారి |
| కుంకుమ | కుంకుమము |
| నిలహారము | నిరాహారము |
| ముగ్గు | మ్రుగ్గు |
| చామంతి | చేమంతి |
| పశ్చమము | పశ్చిమము |
| దక్షిణము | దక్షిణము |
| ప్రపంచకము | ప్రపంచము |
| మూలకము | మూలకము |

| తప్పు | ఒప్పు |
|---|---|
| మనిషి | మనుష్యుఁడు |
| గోరెంట | గోరంటు |
| రుతువు | ఋతువు |
| మాధవకరము | మాధుకరము |
| చతురోపాయములు | చతురుపాయములు |
| పాశ్చాతులు | పాశ్చాత్యులు |
| అధనము | అధికము |
| కంఠత | కంఠస్థముగ |
| చికిచ్చ | చికిత్స |
| పుష్యము | పుష్పము |
| ఉచ్చదశ | ఉచ్చదశ |
| వస్తువ | వస్తువు |
| పెళ్లాము | పెండ్లాము |
| మొగవాఁడు | మగవాఁడు |
| చెవుట | చెవిటి |
| ఇడములు | ఇడుములు |
| చూస్తూ | చూచుచు |
| పోతూ | పోవుచూ |
| అట్లాటి | అటువంటి |
| పమిట | పైట, పయిట |
| తెలపక | తెలియక |
| అస్తమానము | అస్తమయము |
| ఎగిర | ఎగుర |
| ఫలహారము | ఫలాహా |
| వేడుక | వేడుకా |
| పోతారు | పోవుదురు |
| | పోయెదరు |
| | పోదురు |
| రాండి | రండు |
| పొండి | పొండు |

| తప్పు | ఒప్పు |
|---|---|
| లెండి | లెండు |
| శుభ్రంగా | శుభ్రముగా |
| తలంబ్రాలు | తలబ్రాలు |
| చాచుక్క | చాదుచుక్క |
| గెలవండి | గెలువుఁడు |
| అల్లాగె | ఆలాగుననే |
| అయింది | ఐనది |
| | అయినది |
| మాత్రుసేవ | మాతృసేవ |

## ష

దృష్టి
అష్టము
స్పష్టము
ముకుష్టము
ఉత్కృష్టము
కష్టము
సృష్టి
అనిష్టము
జ్యేష్టము
ఇష్టము
అభీష్టము
దృష్టాంతము

దృష్టి
త్వష్ట
క్రోష్టవు
ద్విష్టము
అరిష్టము
అదేష్టము
ఉపవిష్టుఁడు
నష్టము
వేష్టితము
ముష్టి
ముష్టము
షాప్లుష్టము
విష్టపము
పిష్టము
భ్రాష్టము
మ్లిష్టము
శిష్టుఁడు
తుష్టము

ఆవిష్టము
రుష్టము
పేష్ట
పుష్టి
స్పృష్టము
హృష్టము
జుష్టము
భ్రష్టుఁడు

ఠ

శ్రేష్ఠము
భూయిష్ఠము
బంహిష్ఠము
గరిష్ఠము
లఘిష్ఠము
ఆర్ద్రిష్ఠము
పరిష్ఠము
ప్రేష్ఠము
ద్రాఘిష్ఠము
పటిష్ఠము
మహిష్ఠము
అణిష్ఠము
హ్రాపిష్ఠము
ప్రసిష్ఠము
జ్యేష్ఠుఁడు
కనిష్ఠుఁడు
ప్రతిష్ఠ
విష్ఠ
విష్ఠ
అంగుష్ఠము
కుష్ఠము
బహిష్ఠ

అంబష్ఠుఁడు
అధిష్ఠాత
అధిష్ఠానము
అధిష్ఠితము
నిష్ఠురము
అనుష్ఠానము
పృష్ఠము
అష్ఠివత్తు
అప్రతిష్ఠ
యుధిష్ఠిరుఁడు
వసిష్ఠుడు
షష్ఠి
గోష్ఠము
సవ్యేష్ఠుఁడు
వ్యేష్ఠుఁడు
త్రిష్ఠుఁడు
మంజిషము
అపష్ఠము
పుంజిష్ఠము
భూమిష్ఠము
పరమేష్ఠి
అగ్నిష్ఠుఁడు
కాష్ఠము
నిష్ఠ
నైష్ఠుర్యము
నిష్ఠురము
ప్రష్ఠుఁడు
సుష్ఠు
హరాత్తు
ప్రకోష్ఠము

థ

చతుర్థి
సార్థుఁడు
అర్థము
వ్యర్థము
అశ్వత్థ
అశ్వత్థామ
తీర్థము
పార్థివుఁడు
అర్థి
రుక్థము
రిక్థము
స్థానము
స్థితము
ప్రస్థము
ప్రస్థానము
స్థిరము
వ్యవస్థ
స్థూలము
అస్థి
ఉత్థానము
అస్థిరము

థ

కథ
ప్రథ
ప్రథమము
తిథి
పథము
మంథము
గ్రంథ
ఉద్గీథము
సోమపీథిని
వ్యథ
వృథ
యథా
తథా
పృథివి
పృథువు
పృథ
రథము
కథంచితు
అథ
నాథుఁడు
శిథిలము
శ్లథము
శైథిల్యము
మథుర
రథ్య
భగీరథుఁడు
భాగీరథి
దాశరథి
దశరథుఁడు
పరిపరిథి
గ్రథితము
మిథునము
మిథిల
మైథిలి
సౌథి
పథ్యము
ప్రమథుఁడు
మన్మథుఁడు

ధ

యుద్ధము
బుద్ధి
విద్ధము
అనిరుద్ధుఁడు
ఉద్ధూతము
సన్నద్ధము
అబద్ధము
విరుద్ధము
బద్ధము
సిద్ధుఁడు
సిద్ధము
వృద్ధుఁ
వార్ధి
లుబ్ధుఁడు
రుద్ధము
క్రుద్ధము
సంబద్ధము

ధ

అంబుధి
బధిరము
వధ
సుధ
బుధుఁడు
క్రోధము
వ్యాధి
బాధ
నాధుఁడు
ప్రధానము
విధి
బోధ
శోధనము
మేధ
రాధ
సాధనము
ఆధారము
అధరము
మధువు
విధవ
విరోధము
క్రోధనము
క్రోధి
కృధ
విరోధి
సంధానము
విధానము
విధాత
విధానము
ఆధానము
మధుర
మధురము
గంధము
కంధి
గృధము
నిధనము

నైధనము
నిషధము
ధనము

## ఋ

ఋక్కు
ఋజీషము
ఋతువు
ఋణము
ఋషి
ఋజువు
ఋతము
ఋతి
ఋతీయ
ఋతిమతి
ఋతుధ్వజుఁడు
ఋత్విజుఁడు
ఋదము
ఋద్ధి
ఋభుక్షుఁడు
ఋశ్యమూక
ఋశ్యకేతువు
ఋభువు
ఋశ్యప్రోక్త
ఋశ్యము
రుండము
రుంద్రము
రుక్కు
రుక్మకోకుఁడు
రుగ్ణము
రుచకము
రుచిరము
రుజ
రుటము
రుట్టు
రుతము
రుతి
రుత్త
రుత్తము
రుదితము
రుదురిక్కు
రుగ్గు
రుద్రజట
రుద్రభూమి
రుద్రాక్షము
రుద్రాణి
రుద్రాక్షి
రుధిరము
రుధిరోద్గారి
రుద్ధము
రుబ్బు
రుబ్బుగుండు
రుము
రుమాలు
రురువు
రువాణము
రువారము
రువ్వ
రువ్వము
రువ్వు
రుశతి
రుష
రుషి
రుహా
రుక్మము

## ్ర (క్రావడి)

క్రుధ
క్రుష్టము
త్రుటనము
త్రుట్యము
త్రుటితము
క్రుద్ధుడు
క్రూరుఁడు
గ్రుక్కు
త్రుటి
బ్రువాణము
బ్రువత్
భ్రుకుటి
భ్రుకుంసుఁడు
ద్రుపదము
ద్రుమము
ద్రుహిణుడు
ద్రుహి
ద్రువు
ద్రుతము
ద్రుపదుఁడు
ద్రుణము
ద్రుఘణము
ధ్రువయము
ధ్రువుఁడు
ధ్రువము
భ్రూలత
భ్రూణము
శ్రుతి
శ్రుతము
స్రుక్కు
స్రువము
గ్రుడ్డి
త్రుంచెను
మ్రుక్కుడి
స్రువావృక్షము
విశ్రుతి
శుశ్రూష
క్రుమ్మరు
ద్రూణము
కద్రువ
విద్రుమము
అక్రూరుఁడు
వత్రువ

## ృ ఋత్వము

కృప
కృష్ణుఁడు
కృష్ణ
కృషి
కృషీవలుఁడు
గృహము

| | | | |
|---|---|---|---|
| గృహీతము | తృష్ణ | బృహస్పతి | మాతృ |
| ఘృణము | దృష్టి | భృతము | భాతృ |
| ఘృతము | దృప్తము | భృతుఁడు | సంస్కృతి |
| ధృతము | తృప్తి | మృగము | అమృతము |
| ధృష్టుఁడు | మృదువు | శృంగము | వికృతి |
| నృపుఁడు | వృకము | సృంగాలము | ఉజ్జృంభణము |
| నృత్యము | వృత్తి | శృతి | నిష్కృతి |
| పృధివి | శృంఖలము | హృదయము | ప్రకృతి |
| జృంభణము | మృత్యువు | హృతము | కృత్రిమము |
| జృంభ | పృషతము | హృషీకేశుఁడు | భృతి |
| తృణము | బృంద | పితృ | |

---

# 15. సంఖ్యా పరిచ్ఛేదము

అంబాత్రయము.—(1) మూకాంబ, (2) జ్ఞానాంబ, (3) భ్రమరాంబ.

అక్షిత్రయము — (1) కంచి కామాక్షి. (2) మధుర మీనాక్షి, (3) కాశీ విశాలాక్షి.

అవస్థాత్రయము:—(1) జాగ్రదవస్థ, (2) స్వప్నావస్థ, (3) సుషుప్త్యవస్థ

అగ్నిపంచకము·—(1) బుద్ధి, (2) ఉదానము, (3) చక్షువు, (4) రూపము, (5) పాతము.

ఆయనములు —(1) ఉత్తరాయనము, (2) దక్షిణాయనము

అంతఃకరణ చతుష్టయము — (1) మనస్సు, (2) బుద్ధి, (3) చిత్తము, (4) అహంకారము.

అధోలోకములు;—(1) అతల, (2) వితల, (3) సుతల. (4) తలాతల, (5) రసాతల, (6) మహాతల, (7) పాతాళములు.

అరిషడ్వర్గములు·—(1) కామము, (2) క్రోధము, (3) లోభము, (4) మోహము, (5) మదము, (6) మాత్సర్యము.

అష్టకర్మములు,—(1) దాస్యము, (2) దారిద్ర్యము, (3) భార్యాపీడనము (4) స్వయంకృషి (5) చేజాచి అడుగుట (6) అడిగిన లేదనుట (7) అప్పుబడుట (8) త్రోవనడచుట.

సప్తద్వీపములు,— 1. జంబూ. 2. ప్లక్ష, 3. శల్మలీ, 4. కుశ, 5. క్రౌంచ. 6. శాక, 7. పుష్కరద్వీపములు.

సప్తనదులు:—1. అశ్వ, 2. మంజుళ, 3. కంప, 4. హరిద్ర, 5. విరజ, 6. క్షర. 7. వేగవతి.

సప్త పుణ్యక్షేత్రములు:-1. అయోధ్య, 2. మధుర, 3. మాయా, 4. కాశీ, 5. కంచి, 6. అవంతిక, 7. ద్వారవతీ.

సప్త మహర్షులు.—1. వశిష్ఠ, 2. అత్రి, 3. గౌతమి, 4. కశ్యప, 5. భరద్వాజ, 6. జమదగ్ని, 7. విశ్వామిత్ర.

సప్త సముద్రములు —1 లవణ, 2. ఇక్షు, 3. సురా, 4. సర్పి. 5. దధి, 6. క్షీర, 7 జలసముద్రము.

సప్త మాతృకలుః—1. బ్రాహ్మి, 2. మహేశ్వరి, 3. కౌమారి, 4. వైష్ణవీ 5. వారాహి, 6. ఇంద్రాణి, 7 చాముండి.

సేనాంగములు —1. రథ, 2. గజ, 3. తురంగ, 4. పదాతులు.

స్త్రీజాతులు (1) — 1. పద్మిని, 2. హస్తిని, 3. శంఖిని.

స్త్రీపాతులు (2):— 1. హరిణి, 2. అశ్వని, 3. హస్తిని.

హితులుః—1. మాతా, 2. పిత. 3. మిత్రులు.

అష్టార్ఘ్యములుః—1. పెరుగు, 2. తేనె, 3. నెయ్యి, 4. అక్షతలు. 5. గరిక. 6. నువ్వులు. 7. దర్భ, 8. పుష్పములు.

ద్వాదశ మలములుః— 1 వస, 2. శుక్లము, 3. రక్తము, 4. మజ్జము, 5. మూత్రము, 6. విష్ఠ, 7. పింజూషము, 8. నఖము, 9. శ్లేష్మము, 10. దూవిక, 11. అశ్రువు, 12 స్వేదము,

అష్ట మదములు.—1. అన్నమదము, 2 అర్ధమదము, 3. స్త్రీ మదము. 4. విద్యామదము, 5 కులమదము, 6. రూప మదము, 7. ఉద్యోగ మదము, 8. యౌవన మదము.

---

# 16. ప్రకీర్ణ పరిచ్ఛేదము

## (1) జంటపదములు

తలు
పొన్నారి
చెట్టు చేమలు
పులి పుట్ర
కాయగూరలు
చేటుపాటు
అద్దు ఆపు
వేళపాళ
మడి మట్ర
కాయ గసురులు
చదువు సంధ్యలు
బ్రతుకు బండారములు
మనవి సనలు
చుట్టపక్కాలు
చెటు గట్లు
సందు గొందులు
వేళ్లు వెళ్లంకులు
పెండ్లి పేరంటము
పేరు పెంపు
ఈడు జోడు
ఇంపు సొంపు
ఏటు పోటు
రూక రుట
పండువపబ్బము
పైరుపచ్చట
పొచ్చెము నొచ్చెము
గెంటు గుంటు
అంటు సంటు
బంటు పైద
మోదము సాదము
అనఁగి పెనఁగి
శూడి మూడి
కలసి మెలసి
మంచి సెబ్ర
కీడు మేలు
కలిమి లేములు
గడ్డి గాదము
విధివిరామము
తగ్గు మొగ్గులు
లగువు బిగువు
ఎచ్చు తగ్గులు
మడి మాన్యములు
చావు బ్రతుకులు
ముందువెనుకలు
పూజా పురస్కారము
లంచ పంచము
అదఁగి మదగి
కొద్ది గొప్పలు
ఒడుకు దుడుకులు
రాయి రప్ప
ఆకలి దప్పులు
గొడ్డు గోదలు
ఒంటు జానిస
వండుకొని వార్చుకొని
వనలు కొనలు
అచ్చుమర
మచ్చుసచ్చములు
వెంత వంతలు
మురువు మూట
కొడుకు కొమ్మలు
అడ్డదిడ్డము
ఆటు పోటు

## (2) ధ్వన్యనుకరణములు

కరకర ప్రొద్దు
కల కల, కిల కిల, పక పక, కికాకిక, పకాపక } నవ్వుట
రొటరొట రొప్పుట
సురసుర స్రుక్కుట
మలమల మాడుట
చిటపట వేగుట
భగ్గున మంట
గణగణ గంట
పాము జరజర
తేలు గునగున
హోరున, బోరున, గొల్లున, వెక్కివెక్కి } ఏడ్చుట
జొట జొట నీరు
అన్నము కళపెళ
చిటచట చినుకులు
తుకతుక, తెకతెక } ఉడుకుట
కలకల రవము
భళ్లున } తెల, తెలవారు
బిలబిల } తెల్లవారు

పటపట కొఱికె
పెట పెట పండ్లు
గుభాలునపడె
గుబ్బున త్రేచుట
జండా పటపట
మద్దెల ధణంధణ ధింధిం
ధగధగ మెఱయుట
గాజులు ఘల్లున
గుండె ఝల్లుమనుట
తుమ్మెదల ఝుంకారము
భేరీ భాంకారము
రథనేమిక్రేంకారము
శింజినీ టంకారము
వీరభట హుంకారము
ఏనుగు ఘీంకారము
నెమళ్ల క్రేంకారము
వీణా కలకలము
చీమ చిటుకుమనుట
చక్రము గిరగిర
గడియారము టిక్కుటిక్కు
పూలు జల్లున
పాలు బుసబుస
పాము బుసకొట్టుట
నిప్పు భగభగ
నెయ్యి, నూనె } సలసల

చుక్కలు మినుకుమినుకు
మనసు కళవళ
బుడి బుడి యేడుపు
వెల వెలవెల
కన్నీరు వలవల
కస్తుర ఘుమఘుమలు
బంగరు నిగనిగ
మెఱుపు తళతళ
బంగారు గాజులు మిసమిసలు
నడక } చక్కచక, హుటాహుట
ముసిముసి నవ్వులు
పెద్దపులి గాండ్రించుట
మిడిమిడి యెండ
చిలుక పలుకు
కోయిల కువు, కువు
సింహము గర్జన
గుఱ్ఱము సకిలింపు
గాడిద ఓండ్ర
ఎద్దు అంకె
ఆవు అంబా
గువ్వ గుబాళింపు
నక్క ఊళ
ఘూకము కుహూంకుహూ

## (3) ఉపసర్గలు

[ప్ర, మొదలైనవి ప్రాదులు అనఁబడును ఇవి 22. ప్ర, పరా, అప, అవ, సం, అను, నిర్, నిస్, ఆ, దుర్, దుస్, అధి, అపి, వి, ని, అతి, సు, అభి, పరి, ప్రతి, ఉత్—అనునవి.
ఇవి, సంస్కృత ధాతువులకు, మఱికొన్ని శబ్దములకుఁ బూర్వమందు ప చేర్చఁబడిన "ఉపసర్గలు" అనఁబడును,]

### ప్ర

ప్రకరము, ప్రకరణము, ప్రకటనము, ప్రకంపనము, ప్రకంపనుఁడు, ప్రక ప్రకాండము, ప్రకారము, ప్రకామము, ప్రకాశము, ప్రకీర్ణము, ప్రకృతి, ప్రకృష్టము, ప్రకోపము.

### పరా

పరాక్రమము, పరాధీనము, బరాజయము, పరాభవము, పరాయణము.

### అప

అపకారము, అపకర్షము, అపకీర్తి, అపకృష్టము, అపగతను, అపరోధము అపజయము.

### అవ

అవజ్ఞ, అవభిన్నము, అవతంసము, అవతమసము, అవతరణము.

### సం

సంకటము, సంకరము, పంకలనము, సంకల్పము, సంహారము, సంకావము, సంరక్షణ, సందర్భము, సంరంభము.

### అను

అనుకంప, అనుకూలము, అనుక్షణము, అనుగమనము. అనుగ్రహము, అను మానము, అనుమతి.

### నిర్

నిర్జితము, నిర్జనము, నిర్జలము, నిర్దయుఁడు, నిర్దగ్ధము. నిర్దళితము, నిర్దేశము నిరరకము.

### నిస్

నిస్పృహ, నిస్పక్షపాతము, నిస్తులము.

### ఆ

ఆహారము, ఆరామము, ఆక్రమణము, ఆగతము, ఆక్రోశము, ఆఘోష.

దుర్

దుర్బలుఁడు, దుర్మార్గుఁడు, దుర్వ్యూహము, దుర్దినము, దుర్ఘటనము.

దుస్

దుశ్చరితుఁడు, దుశ్చరితము, దుస్తరము.

అధి

అధికారము, అధికరణము, అధికము, అధిక్షేపము, అధిగమము, అధ్యయనము.

అపి

అపినద్ధము, అపిధానము

వి

వికచము, విశాలము, విశంకటము, వికత్థనము, వికారము, వికిరము, వికృతి, విహారము. వినాశము, వినూతన, వినోదము, విశాలము.

ని

నిలయము. నిశ్చయము, నికషము, నివాదము, నికృంతనము, నికారము నికర్షణము, నికాశము.

అతి

అతిక్రమము, అతివృష్టి, అతిరేకము, అతిశయము, అతిహసితము.

సు

సులభము, సుగమము, సుగుణుఁడు, సులోచనములు, సుచరిత, సురుచిరము, సునీతి, సుమతి

అభి

అభిభావము, అభివాదము, అభిషేకము, అభివృద్ధి, అభిమానము, అభినయము, అభిమంత్రము, అభినవము.

ఉప

ఉపహారము, ఉపకృతి, ఉపగూహము, ఉపయమము, ఉపమాత, ఉపపవము, ఉపమానము, ఉపకారము, ఉపయోగము, ఉపయుక్తము.

పరి

పరిధానము పరిదానము, పరిభవము, పరిశుద్ధుఁడు, పరిభూతము, పరిభ్రమణము.

ప్రతి

ప్రతికారము, ప్రతికూపము, ప్రతిఘటనము, ప్రతిజ్ఞ, ప్రతిదానము.

ఉత్

ఉచ్ఛ్రయ, ఉచ్చారణము, ఉచ్ఛిష్టము, ఉజ్జీవము, ఉల్లాసము.

## (4) లింగము

| పుం. లిం. | స్త్రీ. లిం. | పుం. లిం. | స్త్రీ. లిం. |
|---|---|---|---|
| అయ్య | అమ్మ | గజము | గజి |
| పిత | మాత | అశ్వము | అశ్వ, ఒడబ |
| భ్రాత | స్వస | అజము | అజ |
| వరుఁడు | వధువు | కాకము | కాకి |
| అన్న | వదినె | చక్రవాకము | చక్రవాకి |
| అల్లుఁడు | కోడలు | వామనుఁడు | వామని |
| తండ్రి | తల్లి | మాతులుఁడు | మాతులాని |
| పురుషుడు | స్త్రీ | పద్మనేత్రుఁడు | పద్మనేత్ర |
| తాత | అవ్వ | ఆచార్యుఁడు | ఆచార్యాణి |
| రాజు | రాణి | రాక్షసుఁడు | రాక్షసి |
| దేవుఁడు | దేవి | గంధర్వుఁడు | గంధర్వి |
| స్నుష | జామాత | పతత్రి | పతత్రిణి |
| భావుకుఁడు | ప్రజావతీ | పతంగము | పతగి |
| మగడు | పెండ్లము | పన్నగము | పన్నగి |
| శ్వశురుఁడు | శ్వశురువు | మశకము | మశకి |
| ఇంద్రుఁడు | ఇంద్రాణి | క్షత్రియుఁడు | క్షత్రియ |
| వరుణుఁడు | వరుణాని | శూద్రుఁడు | శూద్ర |
| భవుఁడు | భవాని | అభీరుఁడు | అభీరి |
| శర్వుఁడు | శర్వాణి | నాయకుఁడు | నాయకి |
| రుద్రుఁడు | రుద్రాణి. | గాయకుఁడు | గాయకి |
| బ్రాహ్మణుఁడు | బ్రాహ్మణి | నర్తకుఁడు | నర్తకీ |
| పతి | పత్ని | ఎద్దు | ఆవు |
| వృద్ధుఁడు | వృద్ధ | దున్న | గేదె |
| జరత్తు | జరతి | పుంజు | పెట్ట |
| భగవంతుడు | భగవతి | పోతు | పెంట |
| నరుఁడు | నారి | బకము | బకి |
| కామి | కామిని | పక్షి | పక్షిణి |
| కరి | కరిణి | ఉలూకము | ఉలూకి |

| పుం. లిం. | స్త్రీ. లిం. | పుం. లి. | స్త్రీ. లి. |
|---|---|---|---|
| సఖుఁడు | సఖి | కన్నరుఁడు | కిన్నరి |
| మృగము | మృగి | ప్రభువు | ప్రభి |
| ఏణము | ఏణి | సుర | సురి |
| చమరము | చమరి | విద్యాధరుఁడు | విద్యాధరి |
| శశము | శశి | గురువు | గుర్వి |
| యువ | యువతి | సాధువు | సాధ్వి |
| ఉరగము | ఉరగి | పృధుము | పృధ్వి |
| హంస | హంసి | పద్మి | పద్మిని |
| మహిషము | మహిషి | శునకము | శుని |
| శుకము | శుకి | మార్జాలము | మర్జాలి |
| కోకిలము | కోకిలా | బిడాలము | బిడాలి |
| కపోతము | కపోతి | హస్తి | హస్తిని |
| హర్యక్షము | హర్యక్ష | సోమయాజి | సోమపీథిని |
| మూషకము | మూషిక | దాత | దాత్రి |
| మరాళము | మరాళి | వగలాడు | వగలాడి |
| దౌహిత్రుఁడు | దౌహిత్రి | మేధావి | మేధావిని |
| హిత్రుఁడు | హిత్రి | మాయావి | మాయావిని |
| నారాయణుఁడు | నారాయణీ | విద్వాంసుఁడు | విదుషి |
| ఉపాధ్యాయుఁడు | ఉపాధ్యాయిని | మిండఁడు | మిండకత్తె |
| కవి | కవయిత్రి | వ్రేఁడు | వ్రేత |
| గుణి | గుణిని | చెంచు | చెంచెత |
| చక్రవర్తి | చక్రవర్తిని | మగబిడ్డ | ఆడుబిడ్డ |
| శంబరము | శంబరి | చెలువుఁడు | చెలువ |

(5) వచనములు

| ఏ. వ | బ. వ. | ఏ వ. | బ. వ. |
|---|---|---|---|
| గురువు | గురువులు | కత్తి | కత్తులు |
| మగడు | మగలు | గది | గదులు |
| తేఁడు | తేండ్లు | వాహిని | వాహినులు |

| ఏ. వ. | బ. వ. |
|---|---|
| కలికి | కమికులు |
| జిగి | జిగులు |
| పందిరి | పందిళ్లు, పందిరులు |
| పిడికిలి | పిడికిళ్లు పిడికిళులు |
| చేను | చేలు |
| పేను | పేలు |
| రేయి | రేలు |
| వేయి | వేలు |
| ఆవు | ఆవులు, ఆలు |
| జాము | జాములు, జాలు |
| చుట్టము | చుట్టలు, చుట్టాలు చుట్టములు |
| మ్రాను | మ్రాకులు |
| కొలఁకు | మ్రాకులు |
| కొలఁకు | కొలను, కొలకులు |
| కెలను | కెలకులు |
| గవను | గవఁకులు |
| గోరు | గోళ్లు, గోరులు |
| వేఁటకాఁడు | వేఁటకారు వేఁటకాండ్రు |
| చెయువు | చెయువులు |
| అనఁటి | అనట్లు, అంట్లు |
| పగడము | పగడాలు |

| ఏ. వ. | బ. వ |
|---|---|
| పేరు | పేరులు. పేర్లు పేళ్లు |
| కొడవలి | కొడవళ్లు కొడవండ్లు |
| ఊరు | ఊళ్లు, ఊరులు ఊర్లు |
| మీసము | మీసాలు, మీసలు |
| అల్లుఁడు | అల్లురు |
| తరువులు | తరులు |
| పెండ్లి | పెండ్లిండ్లు |
| చెవయలు | చెవయండ్రు |
| విల్లు | విల్లులు, విందులు |
| తడి | తడులు, తళ్లు |
| ఆలు | ఆండ్రు |
| కోడలు | కోడండ్రు |
| గండడు | గండండ్రు |
| జాణ | జాణలు |
| అసుర | అసురులు |
| నాసిక | నాసికలు |
| ధర్మము | ధర్మములు |
| కర్మము | కర్మములు |
| మొగిలు | మొగిళ్లు, మొగిళులు, మొగిలులు |
| గరిమ | గరిమలు |
| మహిమ | మహిమలు |
| వజ్రము | వజ్రాలు, వజ్రములు |
| గుండు | గుండ్లు, గుండ్లులు |

## (6) ఉపమేయోపమేయములు

### (అవయవములు)

| (ఉపమేయములు) | (ఉపమానములు) |
|---|---|
| కొప్పు | నెమలిపింఛము, వింజామరము |
| జడ | నల్లత్రాచు |
| ముఖము | పద్మము, చంద్రుఁడు |
| నొసలు (నుదురు) | అర్ధచంద్రుఁడు |
| కనుబొమలు | విండ్లు |
| కన్నులు | కలువ,తామరఱేకులు లేఁడికన్నులు, తుమ్మెద కలువ చేపలు |
| చూపు | బాణము, తుమ్మెదలు |
| నాసికము | నూగుపూవు. సంపెంగ పూవు, కోశేరు |
| అధరము | విద్రుమము, దొండపండు, మంకెనపూవు, అమృతము, పంచదార తేనె, చెఱకు, మామిడి చిగురు, పద్మరాగమణి |
| ముంగురులు | తుమ్మెదలు, నాచు, నీలమేఘము, ఇంద్ర నీల మణులు |
| మగవానిపక్షము | తలుపు, పీఠము |
| గడ్డము | మఱ్ఱిపండు |
| చెవులు | శ్రీకారములు, తొమ్ముదులు, చక్కిలములు |
| చెక్కిళ్లు | కర్పూరము, అద్దము, చంద్ర ఖండము |
| పలుకులు | చిలుక పలుకులు, కోకిల వాక్కులు, తేనె, చక్కెర, చెఱకు, అమృతము, మామిడిపండు |
| దంతములు | ముత్యాలు, మొల్లలు, వజ్రశకలములు, దాడిమీ బీజములు, నక్షత్రములు |
| గొంతు | పోక కుత్తుక, శంఖము |
| వళలు | అలలు, నిచ్చెనమెట్లు, మేడ మెట్లు, ఇసుక అలలు |
| నాభీ | [పూవు, చక్రము సుడి, జడుగు, పొన్నపుష్పము, నూయి పొన్న |

| (ఉపమేయములు) | (ఉపమానములు) |
|---|---|
| నూగారు | తుమ్మెదచాలు, చీమలబాద, సలాకు, కత్తి, నల్లత్రాచు, ఇంద్రనీలమణులవరుస, పొగ, మబ్బు |
| భుజములు | తామర తూండ్లు, పూవుల దండలు, తీగెలు |
| పురుషుని భుజము | |
| కరములు | చిగురు, పద్మము |
| వ్రేళ్లు | చిగుళ్లు, పెసరకాయలు, పద్మపు రేకులు, పగడపు తీగెలు |
| నఖములు | నక్షత్రములు, ముత్యాలు, వజ్రపు ముక్కలు, మొగలి రేకులు |
| నడుము | ఆకాశము, సింహము, నడుము, పిడికిలి, పేదతనము |
| పిరుదులు | ఇసుకతిన్నెలు, బండిచక్రములు, భూమి |
| తొడలు | అరటికంబములు, ఏనుఁగు తొండములు |
| పిక్కలు | మొసళ్లు, పరిపొట్టలు, అంబులపొది, ఆవుతోక, బాకాలు, తాబేళ్లు |
| మీగాళ్లు | చెంగలువలు, కెంపులు, పగడములు, మెట్టతామర, చిగురు |
| పాదతలము | మఱ్ఱిపండ్లు |
| మడమలు | మెఱుపుతీఁగ, కుందనము, బంగరువు, పచ్చి, పసుపు కొమ్ము |
| కనులకాంతి | ఉత్పలము, కర్పూరము, పద్మము, మంచిగంధము, మొగలిపువ్వు |
| తనుగంధము | తీఁగమెఱుపు |
| శరీరము | వెన్నెల, పాలు, చంద్రకాంతమణులు, నుదుగు |
| నవ్వు | మల్లెపూవులు, వజ్రాలు |
| నడక స్త్రీ | హంస, ఏనుఁగు |
| నడక (పురుషుడు) | ఏనుఁగు, సింహము, ఎద్దు |
| కంఠధ్వని | కోకిల, వీణ |

—.:—

## గుణములు

| (ఉపమేయములు) | (ఉపమానములు) |
|---|---|
| ఓర్పు | భూమి |
| శాంతము | ధర్మరాజు |
| ధర్మము | ధర్మరాజు, యముఁడు |
| సౌందర్యము | జయంత, వసంత, నలకూబర, చంద్రనలులు |
| గాంభీర్యము | సముద్రము |
| ధైర్యము | పర్వతము |
| పరాక్రమము | శ్రీరాముఁడు, కుమారస్వామి, అర్జునుఁడు, పరశురాముఁడు, బలరాముఁడు |
| దానము | బలి, కర్ణుఁడు, దధీచి, శిబి, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, మేఘము |
| సత్యము | హరిశ్చంద్రుఁడు |
| | బ్రహ్మ, బృహస్పతి |
| భాష | బృహస్పతి, శేషుఁడు, బ్రహ్మ |
| భోగము | ఇంద్రుఁడు |
| ధనము | కుబేరుఁడు |
| ఐశ్వర్యము | శంకరుఁడు |
| విద్యలు | బ్రహ్మ |
| విద్య | సరస్వతి |
| దయ (కరుణ) | బుద్ధుఁడు, విష్ణువు |
| సాత్వికము | ఋషులు |
| మాయ | రాక్షసులు |
| మోసము | నక్క |
| శుచి | అగ్ని |
| పాతివ్రత్యము | అరుంధతి, సీత, దమయంతి, సావిత్రి, పార్వతి, సరస్వతి, లక్ష్మి. |
| నీతి | చాణక్యుఁడు |
| వైరాగ్యము | మహర్షులు |

| (ఉపమేయములు) | (ఉపమానములు) |
| --- | --- |
| కీ_ర్తి | హంస, వెన్నెల, నురుగు, ముత్యము, చంద్రుడు, వెండి, వెండికొండ, హిమాద్రి, మంచు, సరస్వతి, శివుఁడు, శంఖము, అమృతము, కల్పతరువు, కామధేనువు, ఉశ్చైశ్రవము, ఐరావతము, సింగము, ఏనుఁగు దంతము, పాలు, మంచిగంధము, నారదుఁడు, సరస్వతి, రెల్లుపూవు, నక్షత్రము, కర్పూరము, వజ్రము, బలరాముఁడు |
| ప్రతాపము | అగ్ని, సూర్యుఁడు, పద్మరాగము, కురువిందము. |

## (7) వర్ణములు

తెలుపు.—చంద్రుఁడు, ఇంద్రుఁడు, ఉశ్చైశ్రవము, కల్పవృక్షము, హిమాద్రి, మంచు, ముత్యము, నవ్వు, తామరతూళ్లు, గంగానది, ఏనుఁగు దంతము, అభ్రకము, అమృతము, పటిక, పథ, శివుఁడు, సింహము, నారదుఁడు, ఆదిశేషుఁడు, చంద్ర కాంతము, గంధము, కర్పూరము, చక్కెర, లొద్దుగు, పాముకుబుసము, పుణ్యము

నలుపు —కృష్ణుఁడు, వ్యాసుఁడు, కాటుక, విషము, పాము, ద్రౌపద, కాళి, విదూరజము, ఆకాశము, అర్జునుఁడు చంద్రుని మచ్చ, శ్రీరాముఁడు, శని, అమావాస్య, చీకఁటి, రాహువు, యముఁడు, మదము, శృంగారరసము, కాటుక, పిట్ట మెడ, నెమిలి మెడ, నీడ, దుర్మార్గుని మనస్సు.

ఎఱుపు.—క్షేత్రము, కోతి ముఖము, పగడము, దొండపండు, చిగురుటాకు, మాణిక్యము, అస్తమయము, అంగారక గ్రహము, కుంకుమ, ఇంద్రగోపము, ఖద్యోదము, జిహ్వ, తక్షకుఁడు, తేజస్సు, కోపము.

పసుపుపచ్చ:—దీపము, ఇంద్రుఁడు, బంగారము, గరుత్మంతుఁడు, శివుని నేత్రములు, బ్రహ్మ, పీరరసము, కోఁతి, గోరోజనము, కింజలచములు, పసుపు, చక్రవాకి, హరిదళము, మణిశిల.

ఆకుపచ్చ—ధూళి, సాలెపురుగు, గృహగోధిక, కపోతము, మూషకము, కాళి, కాకికండము, సూర్యుని గుఱ్ఱములు, బుధగ్రహము, మరకతము.

---